# భైరవకవి - శ్రీరంగమహాత్త్వము

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి
డాక్టరేట్ పట్టమునందిన
సిద్ధాంత గ్రంథము



డా॥ బుదారపు రవీంద్రబాబు
ఎమ్.ఏ., పి.హెచ్.డి.

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయముచే ముద్రితము.

# BHIRAVAKAVI
# Sri Ranga Mahathvamu

## (A Doctorol Thesis from Sri Venkateswara University)

**By: Dr. BUDARAPU RAVINDRABABU**
M.A., Ph.d.,

---

ప్రథమ ముద్రణ : 1995

ప్రతులు : 1000



Copy Right Reserved : బి. తులసమ్మ



వెల : రూ॥ 95/-

ప్రతులకు : B. తులశమ్మ
43/114ఎ, నరసింగరావుపేట
కర్నూలు-518 004.

ముద్రణ :
భార్గవ ప్రింటర్స్
చిన్నమార్కెట్,
కర్నూలు-1.

**Prof. J. Suryanarayana**
Emeritus fellow
University of Hyderabad,
HYDERABAD-500 134.



# ముందుమాట

సంస్కృతాంధ్ర వాఙ్మయాలను తులనాత్మకంగా అధ్యయనం గావించే పరిశోధకులు ఈనడుమ అతితక్కువ. ప్రాచీన వాఙ్మయాలను సమగ్రంగా చదివే వారి సంఖ్య తగ్గుముఖంగా ఉంది. వీటికి కాలదోషం పట్టినట్లు కొందరంటారు. తగిన సత్తాగల ఆంధ్రభాషోపాధ్యాయుల్లో గణుతికెక్కినవాడు రవీంద్రబాబు. ఈతని సిద్ధాంతవ్యాసము సర్వజనాదరణమును పొందుతుందని నాకనిపిస్తుంది.

ఈ పరిశోధకుని దక్షతను ఈ పుస్తకమునందలి ప్రత్యక్షరము స్ఫుటము గావింపజాలియున్నది. నాపర్యవేక్షణలో నిర్మితములయిన సిద్ధాంతవ్యాసములలో ఈరచన నియతము గణుతికెక్కునని నాయాశంస.

జె. సూర్యనారాయణ

Camp : Tirupathi.

# * అభినందన *

దక్షిణ భారత మందలి అతి ప్రాచీనములైన పుణ్యక్షేత్రములలో అగ్రగణ్యమైనది శ్రీరంగము. కావేరీ నదీ తీరమున వెలసిన శ్రీరంగధామము శ్రీవైష్ణవులు సేవించు ముఖ్యక్షేత్రముగ ప్రసిద్ధమైనది.

శ్రీరంగ మహత్త్యమునకు మూలము గరుడపురాణము. శ్రీరంగమహత్త్వ కృతికర్త భైరవకవి. క్షేత్ర ప్రాశస్త్యం, దైవ ప్రాశస్త్యంతోపాటు తీర్థ ప్రాశస్త్యమునుకూడా భైరవకవి పేర్కొన్నారు.

భైరవకవి కాలమును గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ప్రస్తుత సిద్ధాంత గ్రంథకర్త డా. రవీంద్రబాబు, భైరవకవి క్రీ.శ. **1405–1485** నాటివాడన్నారు. "తెలుగు సాహిత్య సమీక్ష" కర్త డా॥ జి. నాగయ్యగారు కవి క్రీ.శ. **1420–1475**గా పేర్కొన్నారు. తెలుగులో వైష్ణవ క్షేత్ర మాహాత్మ్య కావ్యములు అన్న సిద్ధాంత గ్రంథములో డా॥ వి. కళావతి గారు భైరవకవి క్రీ.శ. **1530** నాటివాడన్నారు.

ఈ కృతిని భైరవకవి చాగయరామ దేవ పండిత మహాప్రధానికి అంకిత మొనర్చినాడు.

ఈ కావ్యమున పోతన భాగవత ఛాయలు ఎక్కువగా ఉన్నవని నిరూపిస్తూ డా॥ రవీంద్రబాబు కొన్ని పద్యములను చూపారు, మరికొందరు పూర్వ కవులను అనుకరించినట్లు సోదాహరణంగా పేర్కొన్నారు.

భైరవకవి బంధ కవితా రచనలో సిద్ధహస్తుడని నిరూపించు పద్యములను సచిత్రముగా చూపించినారు.

ఈనాడువస్తున్న సిద్ధాంత గ్రంథాలెక్కువగ ఆధునిక కవితా ప్రక్రియలకు సంబంధించినవే. డా॥ రవీంద్రబాబు సంప్రదాయబద్ధమైన క్షేత్ర మాహాత్మ్యమును అధ్యయనమొనర్చి కావ్య వైశిష్ట్యమును వివరించిన తీరు అభినందనీయము.

ఉత్తమ పరిశోధకునకుండవలసిన లక్షణములన్నీ కలిగిన డా॥ రవీంద్రబాబు శ్రమఫలించి చక్కని సిద్ధాంత గ్రంథము వెలువడినందుకు సంతోషిస్తున్నాను.

కడప —జానమద్ది హనుమచ్ఛాస్త్రి

**28–11–94**

**Dr. Sreerangacharya**
Reader / Principal.
S.V. Govt. Oriental College, PALEM-509 215.
Mahaboob Nagar (Dist.)

# సేవా ప్రస్తుతి

శ్రీరంగ మంగళ మణిం కరుణా నివాసం
శ్రీవేంకటాద్రి శిఖరాలయ కాలమేఘం
శ్రీహస్తిశైల శిఖరోజ్జ్వల పారిజాతం
శ్రీశం నమామి మనసా యదుశైల దీపం

ఆళ్వారాదుల - ద్రవిడ వేద దివ్యసాహితీ జన్మభూమియై ఆచార్య వరుల సూక్తినిలయమై - అద్యతన కాలమున అహోబిల స్వామి పాదుల వారు దీక్షతో నిర్మాణము చేయించిన ప్రపంచ ప్రఖ్యాత శిఖరాభిమానమైన శ్రీరంగ క్షేత్రమును గూర్చి వచ్చిన ప్రత్యేక రచనలలో భైరవకవి శ్రీరంగమహాత్మ్యము ప్రఖ్యాతమైనది,

మిత్రులు శ్రీ రవీంద్రబాబుగారు Ph.D పట్టమునకై ఎంతగానో శ్రమించి ఈ శ్రీరంగ మహత్త్వ పరిశీలనమొనర్చినారు. దీనియందు వీరి పరిశీలనా ప్రావీణ్యము వ్యక్తమగుచున్నది.

ఏదేని ఒక విషయమును గూర్చి పరిశోధన చేయుటకును ఏదో ఒక ప్రబంధ/కావ్యమును గైకొని బహుముఖీనముగా నందలి విషయములను వివేచించుటకును భేదముగలదు. ఈ రెండవ పద్ధతి పరిశ్రమ చేయువారు ప్రాచీన సాహిత్యము నందు అభిరుచిగలవారై-వ్యాకరణ చ్ఛందోఽలంకార విషయ పరిజ్ఞాతృతా నైపుణీజనిత ధిషణా వైభవులు కావలెను. అప్పుడే తద్విషయ ప్రవచనమునకు విలువ కలుగును.

రవీంద్రబాబుగారు ఈ పద్ధతి పరిశోధకులని వీరి సిద్ధాంత రచన వల్ల వ్యక్తమగుచున్నది. విశ్వవిద్యాలయములయందు జరుగుచున్న పరిశోధనలలో ప్రాచీన గ్రంథముల గూర్చి అందున అముద్రిత రచనలగూర్చి-లేదా చాల కాలమునాడు ముద్రితమై ఈనాడు అనభిజ్ఞమగుచున్న కృతులగూర్చి "రీసర్చి" చేయువారు తక్కువైనారు. దీనికిగల కారణాలను త్రవ్వుట అప్రస్తుతము.

ఒక విలువైన-సంప్రదాయబద్ధమైన-దివ్యక్షేత్ర మహిమా కథాముఖ్యమైన యీ శ్రీరంగ మహత్త్వములోని అనేక విషయములను వీరు పంచప్రకరణ పరిమితిలో వివరించి ఆ క్షేత్ర పాంచరాత్రా పద్ధతికి ప్రతీక మొనర్చినారు అనుక్రమముగా ప్రతిప్రకరణ విశేష విషయ వివేచనా పరిపుష్టమేయైనను 3 4 5 ప్రకరణములు మాత్రము గుండెకాయ వంటివి. మామూలుగా కవిత్వమును గూర్చి-కవి దేశకాల రచనాదుల గూర్చి తెల్పుట శ్రమైక సాధ్య విషయమేయైనను-తాను గ్రహించిన గ్రంథము యొక్క మూలప్రతిని సంపాదించి-దానితో ఆంధ్రీకృత కృతిపరిశీలన మొనర్చి-మూల విధేయ-మూలాతిక్రమ-అమూలక-విషయాలను త్రైపారువేసి చూపుట సామాన్య విషయము గాదు. ప్రాచీన గ్రంథ పరిష్కరణమునందు చేతులు కాల్చుకున్న వారికే ఈ శ్రమ అనుభవైక వేద్యము (శ్రీనాథ మహాకవి యంతటివాడే అనువాద విషయమున గల శ్రమను నైషధాను సందర్భమున వివరించినాడు.)

రవీంద్రబాబుగారు శ్రీరంగ మహత్త్వమును మూలప్రతితో నిశితముగా పరిశీలించుట 3 అధ్యాయ ప్రత్యేకత. 4 అధ్యాయమున కవితా వైభవమును విశ్లేషించి చిత్రకవితా ప్రౌఢిమను తెల్పినారు. చక్రబంధములోని మర్మచ్ఛేదనమొనర్చి కృతి-కృతికర్త-కృతిపతులను బయటకు తెచ్చినారు. ఇట్టి ఘనములన్నియు "కళ్లములో ఊడ్పువంటివి" ఎంత చకురంకర వీక్షణ-పరిశోధనా పాటవము-బహు గ్రంథావలోకనము కల్గియున్నచో మాత్రమే ఈ విధమైన పరిశ్రమ జరుగును. ఛందో విషయము-విశేషించి చిత్రకవితా విషయము ఈ అధ్యాయమునకు పుష్టిగూర్చినవి.

చివరి విభాగము విశిష్టాద్వైత విషయము-భైరవకవి కృతిభర్త తృప్తికై ఈ శ్రీరంగ మహత్త్వమును చెప్పినాడు. తాను శివుడై చెప్పదలచినది శ్రీవైష్ణవ క్షేత్రకథ. దీనియందు ఆయన "శ్రీ సంప్రదాయము"ను పైపైన మాత్రమే చెప్పదలచినట్లు గ్రంథమే సాక్ష్యమిచ్చుచున్నది. ఇట్టి దీనిలోని విశిష్టాద్వైత విషయములగూర్చి రవీంద్రబాబుగారు కాసింత లోతుకుదిగి కొంతమేర సఫల శ్రములైనారు. ఐనాచెప్పవలసిన విషయములు మరికొన్ని మిగిలియేయున్నవి.

చాలకాలం క్రితము-ప్రాతః స్మరణీయులు మానవల్లివారు ప్రకటించిన శ్రీరంగ మహత్త్వమును 1979లో నేను కొంతమేర పరిష్కరించి నాకు తోచిన విషయములతో పీఠిక గూర్చగా ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు ప్రక

టించి దీనికి పునః సూర్యాలోక భాగ్యమును కల్గించినారు, ఈపరిశోధక మిత్రునకు ఈ రెండు ప్రతులు ముఖ్యాధారములైనవి. సిద్ధాంత వ్యాస గ్రంథమున కృతజ్ఞతా పూర్వకముగా నిందలి విషయముల పేర్కొనినారు. పీఠిక యందు దొరలిన నాపొరపాట్లను కూడా తెల్పినారు. ఇది ఉత్తమ పరిశోధకుని పద్ధతి. నేను మూలప్రతిని సంపాదించి దానితో భైరవు కృతిని పరిచూడలేక పోయి నాను. ఆ కొరతను పరిశోధన ద్వారా రవీంద్రబాబుగారు తీర్చి కృతజ్ఞతా పాత్రులై-అస్మాదృశులకు అమూల్య విషయముల నందించగలిగినారు. పరిశోధన యనునది ఎవ్వరికీ ఎచ్చటా సమగ్రముగాదు. మరికొంత మిగిలియే యుండును. రవీంద్రబాబు గారొనర్చిన శ్రమ శ్రీరంగనాథ కృపా పాత్రమై సాహితీలోక సమాదరణీయమగునని విశ్వసింతును.

విధి గృహాక్షయ విత్త సేవధికి శరణు
చిరకృతేక్ష్వాకు పుణ్యరాశికిని బ్రణుతి
ధనపతి భ్రాతృకుల దేవతకు జొహారు
నతమృడాదిక సుమనస్సునకు మనస్సు. (ఆముక్త ...6-99)

భాషా సేవకుడు.
శ్రీరంగాచార్య



**Vaidyam Venkateswaracharyulu**
Joint Secretary: Kurnool Dt. Telugu Writers Association, Kurnool
Executive Member: Kurnool Dt. History Reserch Association, Kurnool.
Secretary : Sri Ramanujacharya Sevaa Samstha, Kurnool Dt.
Office Address :
Silver Jubilee Govt. College,
B, Camp, KURNOOL-518 002.
Res. Address :
H. No. 50/348-M 21,
Arora Nagar,
KURNOOL-518 002.

# * అక్షరార్చన *

విశ్వవిద్యాలయాలు ప్రదానంచేసే డాక్టరేట్ కోసం పరిశోధనలు జరిపే వర్తమాన పరిశోధకుల్లో-అధికశాతం-సునాయసంగా పూర్తిచేయగలిగే "టాపిక్"నే ఎంపిక చేసుకోవటం సగటుగా అగుపిస్తుంది. (అందుకుగల కారణాలు అనేకం వాటిని ఎత్తిచూపటం అప్రస్తుతం) అయితే మిత్రులు శ్రీ బి. రవీంద్రబాబు గారు పరిశోధనకు ఎంపిక చేసుకున్న "టాపిక్" కష్టసాధ్యమైనది. పురాణ కావ్యాలను గురించి పరిశోధన చేయాలంటే... పరిశోధకునికి సాంప్రదాయాభి జ్ఞత, సంస్కృతాంధ్రోభయ భాషలపై సమధికాధికారం, వ్యాకరణ చ్ఛందో లంకారాది విషయ పరిజ్ఞానం సమృద్ధిగా ఉండాలి. వీటన్నిటితోపాటు సామగ్రి సేకరణ, విశ్లేషణ, సమన్వయం, నిర్దిష్ట ఫలితాంశ నిరూపణం ఈ నాల్గింటినీ సక్రమమైన పంథాలో సాగించే శక్తిసామర్థ్య నైపుణ్యాలు ఉండాలి. అప్పుడే సిద్ధాంత గ్రంథ రచనలో పరిశోధకుడు కృతకృత్యుడౌతాడు. ఈ సిద్ధాంత గ్రంథాన్ని సంతరించటంలో రవీంద్రబాబు కృతకృత్యుడయ్యాడని అను కుంటున్నాను.

దాదాపు 23 విశ్వవిద్యాలయాల (విద్యాసంస్థల)లో తెలుగుకు సంబం ధించి ఇప్పటివరకూ సిద్ధాంత గ్రంథాలు సహస్రాధికంగా వచ్చాయి. అయితే వాటిలో ప్రామాణిక లాక్షణికుడూ ప్రౌఢకావ్యప్రణేత అయిన భైరవకవి రచన లను గురించిన సిద్ధాంత గ్రంథం నిన్నటిదాకా రాలేదు. నేడీగ్రంథం వచ్చింది కనుక ఇది భైరవకవి శ్రీరంగ మహత్త్వాన్ని గురించి వెలువడిన తొలితెలుగు సిద్ధాంత గ్రంథం.

ఈసిద్ధాంత గ్రంథం ఐదు అధ్యాయాలుగ ఇరవై తొమ్మిది శీర్షికలుగా నలవై ఉపశీర్షికలలో విషయ విశేషణ జరిగి అంతరంగ బహిరంగ పరిశీలనత తలస్పర్శిగా చేయబడింది. బహిరంగ పరిశీలనకు ప్రథమ పంచమాధ్యాయాలు అంతరంగ పరిశీలనకు ద్వితీయ–తృతీయ–చతుర్థాధ్యాయాలు దర్పణం పడు తున్నాయి.

ఈ రచనలో పండితులు మెచ్చుఒప్పులు ఉన్నాయి. అందుకు సందేహంలేదు. అయితే ఈ ప్రచురణలో పండితుల మనస్సును నొప్పించే అచ్చు తప్పులూ ఉన్నాయి. ముద్రణ వ్యవహార పర్యవేక్షణలో జాగ్రత్త వహించి ఉంటే బాగుండేది. ఏది ఎలాఉన్నా ఈ సిద్ధాంత గ్రంథరచన అటు శ్రీరంగ పతికి ఇటు ఆంధ్ర భారతికి గ్రంథకర్త తనవంతుగా చేసిన "అక్షరార్చన"

మ. కృతవిద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీ విలాసుండు సం
స్కృత సౌపర్ణపురాణ మాంధ్ర మొనరించెన్ భైరవాఖ్యుండు, తత్
కృతివిద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీ విలాసుండు ప్ర
స్తుత సిద్ధాంత కృతిన్ రచించెను రవీంద్రుం "డక్షరార్చా"విధిన్

సాహిత్యారాధకుడు
వైద్యమ్ వేంకటేశాచార్యులు



# కృతజ్ఞతాంజలి

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ స్నాతకోత్తర కేంద్రం-కర్నూలులో డాక్టరేట్ పట్టంకోసం పరిశోధన చేసే అవకాశాన్ని కల్పించి, పర్యవేక్షించి, ఈ ప్రచురణకు “ముందుమాట” వ్రాసి, అపారవాత్సల్యాన్ని చూపించిన ఆచార్య జాస్తి సూర్యనారాయణ గారికి.........

నాకు ఉద్యోగమునిచ్చి, నా పురోభివృద్ధికి సహకరించిన యస్.టి.బి.సి మేనేజిమెంటుకు, కోల్స్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీబి. దేవప్రకాశరాజు గారి అధ్యాపకులకు, విద్యార్థులకు...

ఎంతో ఆత్మీయతతో నన్నొక తమ్మునిగా సంభావించి, పరిశోధనలో నాకు కలిగిన సందేహాలను తీర్చి, ఈ గ్రంథాన్ని తీర్చిదిద్దుటలో సముచిత సలహా లొసగి, ఈ గ్రంథానికి “అక్షరార్చన” అందించిన సాహిత్య పరిశోధకులు శ్రీవైద్యం వేంకటేశ్వరాచార్యులు గారికి.........

సంస్కృత సౌపర్ణ పురాణ అధ్యయనంలో నాకు కలిగిన సందేహాలను నివృత్తిచేసిన నా శ్రేయోభిలాషులు అవధాన రత్నాలు శ్రీతాటిచర్ల కృష్ణశర్మ గారికి, శ్రీగండ్లూరి దత్తాత్రేయశర్మ గారికి.........

పరిశోధన ప్రారంభించినది మొదలు పరిపూర్తి అయ్యేవరకు హార్దికంగా సహకరించిన ఆత్మీయులు డా. జి. దామోదరనాయుడు గారికి......... ...

నన్ను అన్నివేళల వెన్నుతట్టి, ఆశీర్వదించి ప్రోత్సహిస్తున్న పూజ్యులు శ్రీ హీరాలాల్ గారికి

ఈసిద్ధాంత గ్రంథానికి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన పూజ్యులు ఆచార్య దేవుళ్ళ చిన్నకృష్ణయ్య (మద్రాసు విశ్వవిద్యాలయం), ఆచార్య వి. రామచంద్రచౌదరి (మద్రాసు విశ్వవిద్యాలయం), ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు (బెంగుళూరు విశ్వవిద్యాలయం) గార్లకు.........

అడిగిన వెంటనే నామీద దయవుంచి ఈ గ్రంథానికి “సేవాప్రస్తుతి” చేసినవారు, సాహిత్య అకాడమివారు ప్రచురించిన "శ్రీరంగ మహత్త్వము"నకు సంపాదకత్వంవహించిన ప్రముఖ పరిశోధక పండితులు అయిన శ్రీరంగాచార్య గారికి.........

ఆదరంతో "అభినందనలు" అందించిన పూజ్యులు-సహృదయ సాహితీ వేత్తలైన శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారికి.........

పరిశోధనార్థం తమ గ్రంథాలయాలను పరిశీలించుటకు అనుమతించిన అక్షరార్చన గ్రంథాలయాధిపతి వైద్యం వారికి, కర్నూలుజిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులకు, శ్రీవివేకానంద సంస్కృత పాఠశాల గ్రంథాలయాధిపతులకు, స్నాతకోత్తర కేంద్రం, కర్నూలు గ్రంథాలయాధికారులకు, శ్రీ చొక్కపు వారి సరస్వతీ నిలయ గ్రంథాలయం కర్నూలు, శ్రీవేంకటేశ్వర ఓరియంటల్ రీసర్చి ఇన్‌స్టూట్ శ్రీ ముదివేడు ప్రభాకరరావు గారికి.........

గ్రంథ ముద్రణ భారమును స్వీకరించి, నాపై ప్రేమాభిమానములు గల శ్రీ పులిపాటి కేశన్న గారికి, పులిపాటి గిరిధర్‌కు (భార్గవ ప్రింటర్స్-కర్నూలు) శ్రీ రాచమడుగు సత్యనారాయణశెట్టిగారికి, శ్రీ ఎక్కల్ల పెద్దపుల్లయ్య గారికి, శివపురం వెంకటరామయ్యశెట్టి గారికి......

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయమునందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు.........

ఇంకా ఎందరెందరికో నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు

నాకు సహాయ సహకారము లందిస్తున్న నా శ్రీమతి తులసమ్మకు, చిరంజీవులు వాసవి, లావణ్య, మల్లికార్జునలకు నా ఆశీస్సులు.

గ్రంథముద్రణ సమయంలో సెకండ్ ప్రూఫ్ చూసే అవకాశం లేకపోవటం మొదలైన అనివార్య కారణాలవల్ల ఈగ్రంథంలో ముద్రణాస్ఖాలిత్యాలు చోటుచేసుకున్నాయి. అందుకు సహృదయ పాఠకులు ఎలాగూ క్షమిస్తారు.

— గ్రంథకర్త



# అంకితం



తండ్రి
శ్రీ. బుదారపు మల్లి శెట్టిగారు.

తల్లి
కీ.శే. శ్రీమతి బుదారపు కమలమ్మ గారు.

నా ఉన్నతిని చూడాలనే కోరికతో జీవిస్తున్న త్యాగమూర్తులైన
నా తండ్రిగారికి,
నా అభివృద్ధిని చూడకయే మరణించిన కరుణామూర్తియైన
నా తల్లిగారి పాదపద్మములకు నమస్కరించి,

పెద్ద కుమారుడు
డా. బుదారపు రవీంద్రబాబు.



తల్లి గారు : కీ॥ శే॥ శ్రీమతి పులిపాటి కేశమ్మ గారు

వీరి జ్ఞాపకార్థం కుమారుడు

శ్రీ పులిపాటి కేశన్న గారు

ఈ గ్రంథమునకు ఆర్థిక సహాయము చేసినారు.

# అంకితం



తండ్రి
శ్రీ . బుదారపు మల్లి శెట్టిగారు.

తల్లి
కీ.శే. శ్రీమతి బుదారపు కమలమ్మ గారు.

నా ఉన్నతిని చూడాలనే కోరికతో జీవిస్తున్న త్యాగమూర్త్తులైన
నా తండ్రిగారికి,
నా అభివృద్ధిని చూడకయే మరణించిన కరుణామూర్త్తియైన
నా తల్లిగారి పాదపద్మములకు నమస్కరించి,

పెద్ద కుమారుడు
డా. బుదారపు రవీంద్రబాబు.



తల్లి గారు : కీ॥ శే॥ శ్రీమతి పులిపాటి కేశమ్మ గారు

పీరి జ్ఞాపకార్థం కుమారుడు

శ్రీ పులిపాటి కేశన్న గారు

ఈ గ్రంథమునకు ఆర్థిక సహాయము చేసినారు.



తండ్రి
కీ॥ శే॥ శ్రీరాచమడుగు నారాయణస్వామి శెట్టి

తల్లి
శ్రీమతి రాచమడుగు అనంతమ్మ

వీరి జ్ఞాపకార్థం కుమారుడు

శ్రీ రాచమడుగు సత్యనారాయణ శెట్టి గారు

ఈ గ్రంథమునకు ఆర్థిక సహాయము చేసినారు.



తల్లి : కీ॥ శే॥ శ్రీమతి శివపురం నారాయణమ్మ

వీరి జ్ఞాపకార్థం కుమారుడు

**శ్రీ శివపురం సాంబయ్య శెట్టి**

ఈ గ్రంథమునకు ఆర్థిక సహాయము చేసినారు.



తండ్రి :- కీ॥శే॥ శ్రీ ఎక్కల రామలక్ష్మయ్య
తల్లి :- శ్రీమతి ఎక్కల సుబ్బలక్ష్మమ్మ

వీరి జ్ఞాపకార్థం కుమారులు

శ్రీ ఎక్కల పెద్ద పుల్లయ్య

శ్రీ ఎక్కల చిన్న పుల్లయ్య

ఈ గ్రంథమునకు ఆర్థిక సహాయము చేసినారు.

# విషయ సూచిక

## అభిప్రాయాలు

## కృతజ్ఞతలు

# ప్రవేశిక

ఆంధ్ర సాహిత్యంలో మాహాత్మ్య కావ్య రచన కవిత్రయంలో ఒకరైన ఎర్రాప్రగడ కాలం నుంచీ సాగుతూ వచ్చింది. పురాణాలలోని మాహాత్మ్య ప్రతిపాదకాలైన భాగాలను ఎందరో కవులు ప్రత్యేక గ్రంథాలుగా ఆంధ్రీకరించారు. వాటిలో స్థల/క్షేత్ర-దైవ-తీర్థ మొదలైన మాహాత్మ్యాలను గురించి చెప్పబడుతుంది. అష్టాదశ పురాణాలలో గారుడం ఒకటి. గరుడ పురాణంలో శ్రీరంగమహత్త్వం చెప్పబడింది. దానిని 'ఉభయ భాషాపారీణుడు' "కల్యాణకవిత్వ లక్షణ సమర్థుడు" అయిన భైరవకవి ప్రౌఢకావ్యంగా ఆంధ్రీకరించాడు. "శ్రీనాథుని కాశీఖండ భీమఖండములకుపిదప క్షేత్రమాహాత్మ్యముల నింత ప్రౌఢముగ వెలిగించిన కవి యన్యుడెవ్వడు గానరా"డని మానవల్లి రామకృష్ణకవి (శ్రీరంగ మహత్త్వ పీఠికలో) చెప్పాడు. ఇతని రచనలనుగురించి ప్రత్యేకంగా పరిశోధన జరగవలసి ఉందని నిడుదవోలు వేంకటరావు (ప్రబంధ మణిభూషణము-పీఠికలో) సూచించారు. భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని గురించి ప్రత్యేకంగా ఒక విమర్శ గ్రంథం కానీ/సిద్ధాంత గ్రంథంకానీ ఇంతవరకూ వెలువడలేదు. కనుక భైరవప్రడి శ్రీరంగమహత్త్వాన్ని పరిశోధనాంశంగా స్వీకరించి ఈ సిద్ధాంత గ్రంథంలో సంబంధిత వివిధాంశాలను సోపపత్తికంగా సోదాహరణంగా నిర్ధారించడమైనది.

శ్రీరంగం శ్రీ వైష్ణవ క్షేత్రం.ఆక్షేత్రంశ్రీవైష్ణవం పాంచరాత్రాగమానికి సంబంధించినది. కనుక భైరవకవి శ్రీరంగమహత్త్వమును పంచాశ్వాస పరిమితంగా రచించి ఉంటాడనటం యుక్తియుక్తం. కనుక ప్రస్తుతం ఆ సంప్రదాయాను గుణంగా భైరవకవి శ్రీరంగమహత్త్వమును గురించిన ప్రస్తుత పరిశోధన ఫలితాలనుకూడా పంచాధ్యాయాలలో వక్ష్యమాన క్రమాన నిరూపించబడ్డాయి.

## ప్రథమాధ్యాయం : భైరవకవి వృత్తాంతం :

ఇందులో భైరవకవి వంశం, ఆ వంశీయుల్లో అతడికి ముందు మూడు తరాల్లో ఉండిన పెద్దనమంత్రి, పోతరాజు, అయ్యలుమంత్రి, ధరణిమంత్రి గౌరనలను గురించి శాసనాధారాలను మరియు గౌరన భైరవపుడూ రచించిన గ్రంథాధారాలను స్వీకరించి ఆయా వ్యక్తులకు సంబంధించిన విషయాలనూ చర్చించి, సమన్వయించి వాటిని వివరించటం జరిగింది. భైరవుడి వంశీయు

లుగ ఇతర ఆధారాలవల్ల తెలుస్తున్న రామయమంత్రి, త్రిలోకభేది, వేం టప్పయ్య మంత్రుల్ని గురించి కూడా తెలియజేయబడింది.

భైరవకవి కృతులైన "కవిగజాంకుశం" "రత్నపరీక్ష" "శ్రీరం మహత్త్వం" అనే వాటిని గురించి వాటి కృతిపతుల్ని గురించీ ఆ గ్రంథా రచనకు హేతువుల్నీ, ఆ గ్రంథాల ప్రాశస్త్యాల్నీ గురించి చర్చించబడింది.

శాసనాలలోని అంశాలు, గౌరన-భైరవులు వ్రాసిన గ్రంథాలలోని అ రాలు. ఇతర గ్రంథాలలోని ఆధారాలు, పూర్వ కవిస్తుతులు, కవితానుక ణలు, సమకాలీనులు మొదలైన అంశాల్ని పరిశీలించి అన్నింటినీ చర్చిం ఇతర అంశాలకు నిర్బాధకంగా ఉండేటట్లు సమన్వయించి భైరవకవి కా నిరూపించబడింది,

భైరవకవి నివాసం, మతం, సమకాలీనులు, బహుముఖ ప్రజ్ఞా వై ష్యాలు, తెలుగు సాహిత్యంలో భైరవకవి స్థానం అనే అంశాలుకూడా పరా ర్శింప బడ్డాయి.

## ద్వితీయాధ్యాయం : శ్రీరంగం-మహత్త్వ ప్రాశస్త్యాలు :

ఇందులో మాహాత్మ్య కావ్య నిర్వచనం, శ్రీరంగమహత్త్వ ప్రాశస్త్య చర్చించబడ్డాయి. ఆ తర్వాత శ్రీరంగ క్షేత్ర ప్రాశస్త్యం, క్షేత్రావిర్భావ క్షేత్ర వర్ణనం. క్షేత్ర మాహాత్మ్యాలను గురించి చర్చింపబడింది.

తర్వాత శ్రీరంగమహత్త్వం-తీర్థ ప్రాశస్త్యాలను గురించితెలుపుతూ కా నదీ ప్రాశస్త్యం అందుకు సంబంధించిన ఉపాఖ్యానం, చంద్రపుష్కరి మహత్త్వ ప్రాశస్త్యాలు, కేసరతీర్థం, కదంబ తీర్థం, ఆమ్రతీర్థం, బిల్వతీర్థ జంబూతీర్థం, పలాశ తీర్థం, అశ్వత్థ తీర్థం, పున్నాగ తీర్థం, వకుళ తీర్థాల గురించిన మహత్త్వ ప్రాశస్త్య ఉపాఖ్యానాలు పరామర్శింపబడ్డాయి.

## తృతీయాధ్యాయం : శ్రీరంగమహత్త్వం ఆంధ్రీకరణ విధానం :

శ్రీరంగమహత్త్వ కావ్యానికి సంస్కృత మూలమైన "గారుడ పురాణ తెలుగు సాహిత్య లోకానికి అధికశాతం అంతగా పరిచయం లేదు. ఎంద

పరిశోధకులు సైతం గారుడ పురాణం కేవలం పితృ కార్యాలప్పుడు పఠించే పురాణంగానే తలంచారు. కనుక గారుడాన్ని గురించి "సంస్కృత మూలం" అనే ఉపశీర్షికలో వివరించి తర్వాత దాని తెనుగు సేతను గురించి వివరింప బడింది. తర్వాత శ్రీరంగమహత్త్వం ఆంధ్రీకరణ విధాన పరిశీలనను యథా మూలకత, మూలకుంచనం, మూలప్రపంచనం, అన్యథా ప్రకల్పనం, మూల త్యాగం, అమూలకత అనే ఉపశీర్షికల్లో చర్చించి ఆయా విషయాల్ని సోదా హరణంగా సోపపత్తికంగా నిరూపింపబడ్డాయి.

కథా కథనం, పాత్రచిత్రణం, వర్ణనలు, అలంకారాలు, రసాలు ఆంధ్రీ కరణంలో ఏ విధంగా రచింపబడ్డయో సోదాహరణంగా నిరూపింపబడ్డాయి.

## చతుర్థాధ్యాయం : శ్రీరంగమహత్త్వం- కవితా వైభవం - లాక్షణికత

ఇందులో భైరవకవి కవిత్వ లక్షణ సామర్థ్యం, శ్రీరంగమహత్త్వంలోని శబ్దార్థరూఢి, రసస్థితి. వ్యంగ్యస్థితి, భావాలు, గతులు, శయ్య, అలంకార సరణులు, రీతులు, పాకాలు, దశప్రాణాలు, వృత్తులు, వస్తు వివేకం, గుణాలు, కవి సమయాలు, చమత్కారాలు, చిత్ర రచనలు, వర్ణనలు, పూర్వకవి అనుకరణలు, సోపపత్తికంగా సోదాహరణంగా ప్రదర్శింపబడ్డాయి. ఆ తర్వాత భైరవకవి లాక్షణికతను చర్చించి శ్రీరంగమహత్త్వంలోని ఛందః ప్రయోగ విశేషాలు, భాషా ప్రయోగ విశేషాలు చర్చింపబడ్డాయి.

## పంచమాధ్యాయం : శ్రీరంగమహత్త్వం - విశిష్టాద్వైత సమన్వయం :

ఇందులో విశిష్టాద్వైతం, శ్రీరంగమహత్త్వ రచనాహేతువు-విశిష్టాద్వైత ప్రభావం, శ్రీరంగ మహత్త్వ కృతిభర్త-కృతికర్తలపై వైష్ణవ మత ప్రభావం శ్రీరంగమహత్త్వ ఆశ్వాస సంఖ్య, కృతిలోని స్తుతులు, శ్రీరంగమహత్త్వంలోని తిరుమంత్ర-ద్వయమంత్ర-చరమ శ్లోకార్థ భాగాలకు వాటిచే సమన్వయం, ఆచార్య శిష్య సంబంధాలు, దివ్య ప్రబంధాను సంధానం హరివాసరోపవాసం అర్చాస్వరూపం, పాంచరాత్రాగమ ప్రశంస, సాత్త్వికధర్మ ప్రశంస, శ్రీరంగ మహత్త్వ కథలు మొదలైన వాటిని విశిష్టాద్వైత మత సిద్ధాంత సంప్రదాయా లతో సమన్వయించి ఆయా విషయాలు విశిష్టాద్వైత మత సంబంధమైనవని నిరూపింపబడ్డాయి.



# ప్రథమాధ్యాయం

## 1. భైరవకవి వృత్తాంతం

1.0 శ్రీరంగ మహత్త్వాన్ని రచించినది భైరవకవి. ఇంత వరకూ లభించిన ప్రామాణికమైన ఆధారాలనుబట్టి భైరవకవి వంశం రచనలు, కాలం మొదలైన వాటిని గురించి ఈ శీర్షికలో చర్చించి నిరూపింపబడును.

## 1.1 భైరవకవి వంశం :

భైరవకవి రచించిన మూడుకృతుల్లో శ్రీరంగ మహత్త్వంలోని ఒక పద్యంలో మాత్రమే తన గోత్రం పేరును తెలియజేశాడు. తనను గురించి కృతిపతి పలికినట్లు వ్రాసుకున్న ఆ పద్యం ఇది –

 మ. కృతవిద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీ విలాసుం జన
స్తుత చారిత్రుని గౌతమాన్వయ పవిత్రుం గౌరనామాత్యస
త్సుతుఁ గల్యాణ కవిత్వలక్షణ సమర్థున్ సూక్తి ముక్తాఫలా
తత కాంతిస్ఫుట చంద్రికోల్లసిత విద్వద్భైరవున్ భైరవున్

శ్రీరంగ 1–21

భైరవకవిది గౌతమ గోత్రమని పై పద్యం తెలియజేస్తుంది. భైరవుడు గౌరనామాత్యుని కొడుకు అనికూడా పైపద్యం తెలియజేస్తుంది. భైరవకవి కృతుల్లో అతడి తండ్రిపేరును తెలిపే పద్యగద్యాలు మరికొన్నికూడా ఉన్నాయి. అలాంటి పద్యగద్యాలు ఇవి–

కం. భ్రమరాంబికా మహావర–సముదిత నిరవద్యహృద్య సాహిత్యకళా
శ్రమ విమలప్రతిభా చం–క్రమణక్రమ శాలియైన గౌరనసుతుడన్

— కవిగజాంకుశము – 6

మ. గణ వర్ణాదుల మేలు ( గీడు వెలయంగా ( జెప్పె సాహిత్యల
క్షణ దీక్షాగురుఁడైన గౌరన సుధీ సత్పుత్రు ( డత్యుల్లస
ద్గుణ రత్నాభరణుండు భైరవ కవీంద్రుండెందు (ద్దదజ్జ్వల్ దనుం
ప్రణుతింపం గవిరాడ్గజాంకుశము భూ ప్రఖ్యాతమై మించఁగన్
— కవిజాంకుశము–85

కం, భ్రమరాంబాదేవి కృపన్–సముచిత నిరవద్యహృద్య సాహిత్యకళా
క్రమ విమల ప్రతిభామణి–క్రమవైభవ శాలియైన గౌరనసుతుఁడన్.
— రత్నపరీక్ష–4

గద్యం : "ఇది శ్రీమద్భ్రమరాంబికా వరప్రసాదలబ్ధ సిద్ధసారస్వత విలాస గౌరనామాత్య పుత్ర సుధీజన విధేయ భైరవనామధేయ ప్రణీతంబైన శ్రీరంగ మహత్త్వంబను పురాణ కథయందు......"
—శ్రీరంగ మహత్త్వం (అన్ని ఆశ్వాసాల చివరనగలగద్య)

పై పద్యాల్లోనూ గద్యంలోనూ క్రింద గీతలు గీచిన భాగాలు భైరవకవి గౌరనామాత్యుని పుత్రుడని స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

తెలుగు సాహిత్యంలో భ్రమరాంబా వర ప్రసాదుడూ, గౌతమగోత్రుడూ, సారస్వత విలాసుడూ, లాక్షణికుడూ అయిన గౌరన సుప్రసిద్ధుడు. అతడు హరిశ్చంద్రోపాఖ్యాన, నవనాథ చరిత్ర, లక్షణదీపిక అనే కృతుల్ని రచించాడు. పైన ఉదాహరించిన భైరవకవి పద్యాల్లో గౌరనకు వాడిన విశేషణాలనుబట్టి భైరవకవి తండ్రి హరిశ్చంద్రోపాఖ్యానాదుల్ని రచించిన గౌరనకవే అనటం తెల్లం. గౌతమ గోత్రుడూ సారస్వత విలాసుడూ, భ్రమరాంబా వర ప్రసాదుడూ అయిన గౌరన అనే పేరుగలవాడు తెలుగు సాహిత్యంలో ఒక్కడే ఉన్నాడు. కనుక సుప్రసిద్ధుడైన గౌరనామాత్యుడే భైరవకవి తండ్రి అనటం స్పష్టం.

ఇక గౌరన రచించిన కృతుల్లో అతడి వంశ వివరాలు కొన్ని లభిస్తున్నాయి. ఆ వివరాలివి.–

ద్విపద : సింగన మాధవ క్షితపాలమణికి
మంగళమూర్తికి మంత్రియై జగతిఁ

బొగడొందు పెద్దన పోతరాజునకుఁ
దగిన తమ్ముఁడు యశోధనుఁడెల్లమంత్రి*
చెట్టబట్టంగ నోఁచిన భాగ్యవతికిఁ
జుట్టాల సురభికి సుందరీమణికి
ఘనుఁడు వల్లభమంత్రి గంగాంబగోరీ
కనిన పోచాంబకు గారాబు సుతుఁడ
ధరణి నమాత్య రత్నంబనఁ బరఁగు
ధరణి మంత్రికిఁ గూర్మి తమ్ముఁడ ఘనుడ
భూతనాయక పాద పూజాభిరతుండ
గౌతమ గోత్రుండ గౌరనాహ్వయుఁడ
— హరిశ్చంద్రో పాఖ్యానము (కృత్యారంభద్విపదలు)

మతిమంతుఁ డయ్యల మంత్రి పుంగవుని
సుతుఁడు గౌరన మంత్రి సుకవి శేఖరుఁడ
— హరిశ్చంద్రోపాఖ్యానము (కృత్యంత ద్విపదలు)

సింగయ మాధవ క్షితిపాలమంత్రి
పుంగవుఁడై యొప్పు పోతరాజునకు

ననుజాతుఁడగు నయ్యలామాత్య కూర్మి
తనయుఁడుత్తముఁడు గౌతమ గోత్రజుండు
భ్రమరాంబికా వరప్రాప్త విచిత్ర
విమల సాహిత్య ప్రవీణాధికుండు
సనఘ చిత్తుఁడు గౌరనాహ్వయ ఖ్యాతు
— నవనాథ చరిత్ర

శ్లో, అస్తి ప్రశస్తావనిపాల మౌళి-రత్నావళి రంజిత పాదపీఠ
రేచర్ల వంశాన్వయ పూర్ణచంద్రో-మహాబలో సింగయ మాధవేంద్రః॥

శ్లో॥ ఆసీత్తస్య మహామాత్యః-స్వామికార్య ధురంధరః।
పోతరాజ ఇతిఖ్యాతో-రాజనీతి యుగంధరః॥

---

* కవి తండ్రి పేరును ఎక్కడ వ్రాసినా అయ్యలమంత్రి అనే చెప్పాడు ఇదొక్క చోటమాత్రం ఎల్ల మంత్రి అనివుంది. కనుక ఇది వ్రాయసకాండ్ల పొరపాటు అయి ఉండవచ్చు.

శ్లో. మంత్రిచూడా మణేస్తస్య సోదరస్యాయ్యలు ప్రభోః।
గౌరనార్య ఇతిఖ్యాత-స్తనయోనయ కోవిదః॥

శ్లో. సోఽహం సోమకళామౌళి-ప్రాసాదాద్గత కల్మషః।
ప్రణమ్య పింగళం నామా-కవిపుంగవ ముత్తమమ్॥

శ్లో. ఉదాహరణ రత్నాని-లక్షణ గ్రంధ సింధుషు।
సమాకృష్య సతాం భూత్యై-ప్రక్ష్యే లక్షణ దీపికామ్॥

— లక్షణదీపికా

పైన ఉదాహరించిన గౌరన, భైరవుల కృతులలోని పద్య, గద్య ద్విపద శ్లోకాలవల్ల తెలిసే భైరవకవి వంశవృక్షం ఈ క్రింది విధంగా ఉంటుంది—




పై వంశ వృక్షంలో పేర్కొన్న వ్యక్తుల వివరాలు నేటివరకూ తెలిసినంతలో ఈ క్రింద వరసగా వివరింపబడును.

## పెద్దన :

గౌతమ గోత్రీయుడు. భైరవకవి వంశంలోని పూర్వీకుల్లో తెలియవస్తున్న మొదటివ్యక్తి. ఈయనకు పెద్దిరాజు, పెద్దనమంత్రి అనికూడా నామాంతరాలున్నట్టు ఉమామహేశ్వర శాసనంలో కన్పిస్తుంది. ఈయన రేచర్ల వంశీయుల దగ్గర మంత్రిగా ఉండి ఉంటాడు.

ఈ శాసన భాగంపోతరాజును గురించి వ్రాసేటపుడు ఉటంకింపబడుతుంది.

## పోతరాజు :

ఈయన పెద్దనమంత్రి కొడుకు. 'సింగయ మాధవ క్షితపాలమణికి' మంత్రి పుంగవుడు. స్వామికార్యధురంధరుడు. రాజనీతి యుగంధరుడు. ఈ వివరాలు ఇతడి తమ్ముడి కొడుకైన గౌరన తాను రచించిన కృతుల్లో (ఇందాక ఉదాహరించిన ద్విపదలు, శ్లోకాలలో) తెలిపాడు.

పోతరాజు పెద్దనమంత్రివర్యుని తనయుడనీ, సింగయమాధవ భూపాలుని మంత్రివర్యుడనీ ధృఢీకరించే మరో సాక్ష్యం ఉమామహేశ్వర శాసనం. ఇతడు ఆ శాసనంలో సర్వశాస్త్ర విశారదుడనీ. కవివర స్తోత్ర పాత్రుడనీ పేర్కొనబడ్డాడు. ఆ శాసనం పోతరాజు కాలాన్ని సైతం తెలియజేస్తోంది. ఈ వివరాలను తెలిపే ఆ శాసనంలో భాగాలు ఇవి...

"..........దాచయ సింగభూపతి సుతుండైన మేదినీరూప నారాయణ సింగమాంబా గర్భ పుణ్యోదయ రేచర్ల వంశ దుగ్ధాబ్ధి సుధాకరుండైన శ్రీమాధవ దేవేంద్రుండు దేవనగర దక్షిణప్రాంత మందుల స్వనామాంకిత మాధవపుర మందు స్వరాజ్యోపవిష్టుండై శ్రీ పర్వతోత్తర ద్వారమైన మహేశ్వరదేవ మంటపము మహచ్ఛిలా సమూహనను రమ్యముగా రచియింపించి ... ... ...

శ్లో. దంత్యం కార్క శకాబ్దిశాలిని శివే వర్షే నవే ఫాల్గునే
మాసే దాచయ సింగభూపతి సుతః శ్రీ మాధవో భూధవః
శ్రీశైలోత్తర తోరణో భువి మహేశ స్యాలయం నూతనం
పాషాణై స్సుదృఢం సురాసురనుతం గమ్యమ్ముదాచీ కరోత్

... ... ... ...

శ్లో. శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైక ధురంధరః
సన్మంత్రి పోతనామాసిత్ సర్వశాస్త్ర విశారదః

శ్లో. యస్యామాత్య శిఖామణేః కవివర స్తోత్రైక పాత్రీకృతాం
మత్వా వాక్పతి రిద్ధనీతి సుభగాం వాగ్వైఖరీం లజ్జతే
సోయం పెద్దనమంత్రివర్య తనయః శ్రీపోతరాజోన్వహం
దేవస్యాస్య మహోపకార రచనాం సమ్య ఙ్ముదాచీ కరోత్

— ఉమామహేశ్వర శాసనం

పై శాసనంలో సింగయ మాధవనాయకుడు శా.శ. 1298 (క్రీ.శ.1376)లో శ్రీశైలోత్తర ద్వారాన మహేశ్వరాలయాన్ని కట్టించినట్లు స్పష్టంగా చెప్పబడింది శాసనంలో పోతరాజు వ్రాలు కూడ ఉంది. కనుక పోతరాజు క్రీ.శ. 1376లో సింగయ మాధవునికి మంత్రిగా ఉండినాడనటం సుస్పష్టం.

సింగయ మాధవుడు దేవనగర దక్షిణ ప్రాంతాన (నేటి దేవరకొండ దక్షిణాన ఉండే) "మాధవపురము"లో నివాసంగా ఉన్నట్లు పై శాసనభాగం తెల్పుతోంది. రాజులు ఉండే చోటనే మంత్రులుకూడా ఉండటం సహజం. కనుక పోతరాజు కూడ మాధవపుర నివాసి అయివుంటాడనటం సత్య దూరం కాదు.

## అయ్యలుమంత్రి :

ఇతడు పెద్దనమంత్రి తనూజుడు. పోతరాజుకు అనుజుడు. వల్లభ మంత్రి గంగాంబల కూతురగు పోచమాంబ ఇతని భార్య. ఆమె చుట్టాల సురభి, సుందరీమణి. అయ్యలుమంత్రి–పోచమాంబల తనయులు ధరణి మంత్రి, గౌరనమంత్రి.

## దరణిమంత్రి :

ఇతడు అమాత్యరత్నంగా పేరు పొందాడు. ఇతని కూర్మి తమ్ముడు గౌరన.*

## గౌరన :

ఈయన అయ్యలుమంత్రి–పోచమాంబలకు కుమారుడు, ధరణిమంత్రికి తమ్ముడు. "సరస సాహిత్య లక్షణ విచక్షణ బిరుద విఖ్యాతుడు" (హరిశ్చంద్రోపాఖ్యానం–కృత్యాది 47, 48 ద్విపదలు) "భ్రమరాం ప్రసాద సంప్రాద కవిత్వ సుహిత సామ్రాజ్య సుఖపరాయణుడు" "చతుర సాహిత్య

---

* గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం.

1. ఈ (శ్రీగిరి) కవి క్రీ.శ. 1300 నుండి 1353 దాకా జీవించి ఉండేవాడనికూడా భావించవచ్చు. సమగ్రాంధ్ర సాహిత్యం–3వ సంపుటం–పుట 56 (పునర్ముద్రణ) 1990 మార్చి – ప్రజాశక్తి బుక్ హౌస్ - విజయవాడ.

లక్షణ చక్రవర్తి'' "ప్రతివాది మదగజ పంచాననుడు" "సుకవి శేఖరుడు" ( హరిశ్చంద్రోపాఖ్యాన కావ్యాంత ద్విపదలు ) "విమల సాహిత్య ప్రవీణా ధికుడు" (నవనాథ చరిత్ర)

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానం, నవనాథచరిత్ర,, లక్షణదీపిక అనే గ్రంథాలను రచించాడు.

శ్రీగిరికవి (క్రీ.శ. 1300–1353) పద్యకావ్యంగ రచించిన నవనాథ చరిత్రను గౌరన ద్విపద కావ్యంగ రచించాడు. ఈ విషయం గౌరన నవనాథ చరిత్రలోని—

పరగ శ్రీగిరికవి పద్యబంధముల
విరచించినాడది ద్విపద కావ్యంబు
జెప్పింపవలయుఁ బ్రసిద్ధి పెంపలర

— (నవనాథ చరిత్ర; ప్రథమాశ్వాసం)

అనే ద్విపద పాదాలు తెలియజేస్తున్నాయి. దీనినిబట్టి గౌరన క్రీ.శ. 135? కు తర్వాతివాడని స్పష్టమౌతోంది.

'శ్రీనాథుని చేత ఏ శాంత భిక్షావృత్తిరాయడు శివరాత్రి మహాత్మ్యం చెప్పించాడో అతడే గౌరనచేత నవనాథచరిత్ర ద్విపదలో వ్రాయించాడు." అనికూడా పరిశోధకులు అభిప్రాయపడ్డారు. 'ఈ శాంత భిక్షావృత్తి శాసనం ఒకటి శా.శ. 1371 (క్రీ.శ. 1449) నాటిది కానవచ్చుచున్నది. (మెకంజీ సంపుటము 15-3-6) కావున నవనాథ చరిత్రకారుడైన గౌరన శ్రీనాథుడును (దాదాపు)సమకాలమువారగుచున్నారు.1

గౌరన పెదతండ్రి పోతరాజు సింగయ మాధవుని దగ్గర మంత్రిగా ఉన్నట్లు ఉమామహేశ్వర శాసనం, గౌరన కృతులు తెలుపుతున్నాయి. శాసన కాలం క్రీ.శ. 1376. శాసనకాలాన పోతరాజు మంత్రిగా ఉన్నాడు. కనుక అతని తమ్ముడి కొడుకు గౌరన కాలాన్ని రమారమిగ అంచనా వేయవచ్చు.

---

1. హరిశ్చంద్రోపాఖ్యానం–పీఠిక-పుట-7 ఆం:ప్ర. సాహిత్య అకాడమి 1967 పి. యశోదారెడ్డి

శాసనకాలం నాటికి పోతరాజు వయస్సు దాదాపు నలవై సంవత్సరాలని భావిస్తే అతడి తమ్ముడు అయ్యలుమంత్రి వయస్సు ముప్పై అయిదు సంవత్సరాలని భావించటంలో విప్రతిపత్తి ఉండదు. ఈ లెక్కన అయ్యలు మంత్రి (1376 లో 35 తీసివేస్తే) 1341 ప్రాంతాన జన్మించి ఉంటాడు. అయ్యలుమంత్రి దాదాపు 80 సంవత్సరాలు జీవించిఉంటే అతడి జీవితకాలం క్రీ.శ. 1341–1421 అవుతుంది. శ్రీగిరికవి కాలం, ముక్తిశాంతభిక్షావృత్తి కాలం, పోత రాజు శాసన కాలం వీటిని పరిశీలిస్తే అయ్యలుని రెండో కొడుకైన గౌరన క్రీ.శ. 1375 ప్రాంతాన జన్మించి 80 సంవత్సరాలు జీవించి ఉంటే క్రీ.శ. 1375–1455 లలో ఉన్నట్లు చెప్పవచ్చు. కనుక గౌరన కాలం క్రీ.శ. 1375–1455. ఈ కాల నిర్ణయానికి ఇతర విషయాలు బాధకాలు కావు.

## భైరవకవి :

ఇతనిని గురించి తరువాతి పుటల్లో చర్చింపబడుతుంది.

## ఇతరత్ర గ్రంథాధారాల వల్ల తెలిసే భైరవకవి వంశీయులు

"త్రిలోకభేది" అనేకవి "సకల ధర్మసారం" అనే నాల్గు ఆశ్వాసాల గ్రంథాన్ని రచించాడు. 1 ఈ గ్రంథం అవతారిక లుప్తం కావటంచే ఆశ్వాసాంత పద్యగద్యాల వల్ల కొంత సమాచారం తెలుస్తోంది. ఆశ్వాసాంత గద్య ఈ విధంగా ఉంది—

ఇది శ్రీ మద్భ్రమరాంబా వరప్రసాద నవరసానుబంధ బంధుర ప్రబంధ నిబంధ చాతురీధురీణ సకల విద్యా ప్రవీణ గౌతమ గోత్ర పవిత్ర చారిత్ర

---

1. ఈ తాళపత్ర గ్రంథం ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత అకాడమీ గ్రంథాలయాన శిథిలావస్థలో ఉంది. ఈ కవిని గురించి మొట్ట మొదట పరిచయం చేసినవారు డా॥బి. రామరాజుగారు. "ఉదయభాను" అనే పత్రిక (జనవరి 1962)లోని "త్రిలోకభేది"అనే వ్యాసం. ఈ వ్యాసం 'చరిత్ర కెక్కని చరితార్థులు' అనే పుస్తకంలో (పుటలు 91–104) పునర్ముద్రితం. ప్రచురణ : ఆచార్యబిరుదురాజు రామరాజుగారి షష్ట్యబ్దిపూర్తి సన్మాన సంఘం 1985.

గౌరనామాత్య పౌత్ర రామయమంత్రిపుత్ర సకలజన స్తోత్ర సంభావిత త్రిలోకభేది..."

గౌరన, భైరవుడు, త్రిలోకభేది ఈ ముగ్గురూ గౌతమ గోత్రీయులే. భ్రమరాంబా వరప్రసన్న కవితా సంపన్నులే. కనుక వీరు ఒకే వంశీయులు. అంతేగాక త్రిలోకభేది తాను గౌరనామాత్యుని పౌత్రుడిగా చెప్పికోవటం గమనింపదగిన అంశం. వీటి పూర్వాపరాలన్ని పరిశీలించి త్రిలోకభేదిని సాహిత్యలోకానికి పరిచయం చేసిన డా॥ బి. రామరాజుగారు కూడా హరిశ్చంద్రోపాఖ్యాన నవనాథచరిత్ర లక్షణదీపికలను రచించిన గౌరనామాత్యుడికి త్రిలోకభేది మనుమడని తెలియజేశారు.1వారు ఆవిధంగా తెలియజేసేందుకు ప్రధానమైన కారణాలు ఇవి: గౌరన-త్రిలోకభేది వీరి ఇద్దరి గోత్రాలు ఒకటే కావడం ఇద్దరుకూడా శైవ సాంప్రదాయానికి చెందినవారు కావటం, ఇద్దరున్నూ తెలంగాణా వారు కావటం, ఇద్దరూ భ్రమరాంబా వరప్రసాద కవితా సంపన్నులు కావటం.

సకల ధర్మసారం అశ్వాసాంత గద్యవల్ల, సాహిత్య పరిశోధకులగు బి. రామరాజుగారి పరిశీలనంవల్ల గౌరనకు రామయమంత్రి అనే కుమారుడు, రామయమంత్రికి త్రిలోకభేది అనే కుమారుడు ఉన్నట్లు తెలుస్తోంది. దీనిని బట్టి త్రిలోకభేది భైరవకవికి అన్నకొడుకో లేక తమ్ముని కొడుకో అవుతాడు. 'త్రిలోకభేది క్రీ.శ. 1485 ప్రాంతములందుండు'నని పరిశోధకుల నిశ్చయం. 1

## వెంకటప్పయ్య మంత్రి :

ఈయన దేవరకొండ పాలకుడైన మాధవరాయ ప్రభువుకు మంత్రివర్యుడనీ, ఇతడి ప్రశంస శాసనస్థమనీ, కాలం క్రీ శ. 1400 ప్రాంతమనీ, 'గోలకొండ కవుల సంచిక'లో పూర్వకవి పరిచయంలో శేషాద్రిరమణ కవులు తెలియజేశారు. (పుట 398)

కవిచరిత్రకారులచే గౌరన (భైరవకవి) వంశీయులుగ అనుమానింపబడ్డవారు :

16వ శతాబ్దాన బిక్కనవోలు ఏలికగా కామినేని మల్లారెడ్డి ఉండేవాడు. మల్లారెడ్డి షట్చక్రవర్తిచరిత్ర, పద్మపురాణం, శివధర్మోత్తర ఖండం అనే

1. చరిత్రకెక్కని చరితార్థులు - "త్రిలోకభేది" బి. రామరాజు.

మూడు గ్రంథాలను రచించాడు. ఈ మూడింటిలోకూడా భైరవకవికి సంబంధి ంచిన విషయ ప్రస్తావన ఉందని అనుమానం.

కామినేని మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రలో "మందబుద్ధిదియని ముందె చెక్కలిగొట్టి కవిగజాంకుశ మింద్ర కరికిజూపు" అని శ్లేషిస్తూ (భైరవకవి రచించిన) కవిగజాంకుశాన్ని ప్రస్తావించాడు.

శివధర్మోత్తర ఖండంలో మల్లారెడ్డి తన గురువైన లింగనారాధ్యుణ్ణి అతడి ముగ్గురు కొడుకుల్ని ఈ క్రింది పద్యంలో వర్ణించాడు,-

సీ. మానిత వరధ రామరకుల తిలకంబు । గౌతమగోత్రాబ్ధి కల్పశాఖి
మల్లికార్జున పండితోల్ల సద్వంశ్యుండు । గౌరనారాధ్య శేఖరసుతుండు
శ్రీమల్లమాగర్భ సింధు శీతకరుండు । గంగమాంబా మనః కంజహేళి
సకలాగమ జ్ఞానసార ధౌరేయుండు । పరవాది దుర్మత భంజనుండు

తే.గీ. సంగగురు దక్షిణామూర్తి సద్గురులను
గౌరనాహ్వయ దేశికు గన్న తండ్రి
బ్రవిమలా స్మత్కులోద్భవారాధ్యుఁబుణ్య
రమ్యగుణ సాధ్యు లింగనారాధ్యుఁదలఁతు

చం. అసితరసాధ్య ధర్మము సమగ్ర విభూతియు సర్వమంగళా
తను తనువైభవంబు విబుధస్త వనీయ కుమార గౌరవం
బును దగగా నహీనగుణ భూషణుఁడై ద్విజరాజ మౌళినా
నొనరుచు లింగనాథ గురుఁడొప్పు సదాశివ తుల్యమూర్తియై

— శివధర్మోత్తర ఖండం (అవతారిక)

పై రెండు పద్యాలను ఉదాహరిస్తూ ఆంధ్రకవితరంగిణీకారుడు చాగంటి శేషయ్యగారు ఇలా వ్యాఖ్యానించాడు – "ఈపద్యములలో నిరువురు గౌరనలున్నారు. ఇందెవరైన హరిశ్చంద్రోపాఖ్యానమును ద్విపదగా రచించిన గౌరనయై యుండునాయని చూడవలసియున్నది. ఈ గౌరనలు ముప్పురును నారాధ్యబ్రాహ్మణులే. గౌతమ గోత్రోద్భవులే. హరిశ్చంద్రోపాఖ్యాన కర్త యగు గౌరన తండ్రి అయ్యలమంత్రి, తల్లి పోచమాంబ, మల్లారెడ్డి గురు

పుత్రుడైన గౌరన తల్లి గంగాంబ. తండ్రి లింగనారాధ్యుడు. కావున నా గౌరయునీ గౌరనయు నొకరుకారు. మల్లారెడ్డి గురువునకు జనకుడైన గౌరన తల్లిదండ్రులెవరో మనకు తెలియయు. మల్లారెడ్డి యా గౌరనను గవియని చెప్పలేదు. అందుచేత పై పద్యములలోని మొదటి గౌరనయు, హరిశ్చంద్రోపాఖ్యాన గౌరనయు నొకరగునో కాదో నిర్ణయింపజాలకున్నాము. ఈ విషయ మింకను విచారణీయము"

(ఆంధ్రకవి తరంగిణి–11వ సంపుటం 33పుట)

మల్లారెడ్డి తాను రచించిన పద్మపురాణంలో కూడా స్వీయ గురువంశ వర్ణనం చేశాడు. ఆ పద్యాలు చాగంటివారు ఆంధ్రకవితరంగిణిలో గుర్తింప లేదు. ఆ పద్యాలివి–

సీ. మహనీయ గౌతమ మౌనిగోత్ర సుధాబ్ధికే ద్విజరాజు పూర్ణేందుఁడయ్యె
శ్రీగౌరనారాధ్య భాగధేయ సురద్రుమవరఫలం బయ్యెనే సురుచిశాలి
యే గుణనిధి భవానీ గర్భశుక్తికి మురువైన కట్టాణి ముత్తెమయ్యె
గంగమాంబా మనః కంజంబునకు సుప్రభాకరుండయ్యెనే లోకబంధుఁ

గీ. డట్టి శ్రీమల్లికార్జునాఖ్య ప్రసిద్ధ - పండితాన్వయ జాతవిపశ్చితునకు
లింగనారాధ్య సద్గురు పుంగవునకు–నమితభక్తిబహు ప్రణామములొనర్తు
— 8

ఉ. వేదిజన బ్రువప్రకర విశ్రుత దుర్మద శైలపక్షని
ర్భేదన వజ్రి శైవమత కృత్స్న రహస్య విబోధనావతి
ర్ణాది శివుండు లింగ గురుఁడాత్మజులంగనియెంద్రిమూర్తులన్
సాదర మత్యధీత సకలాగమ శాస్త్ర సమగ్ర కీర్తులన్ —9

గీ. అట్టి ధన్యుల సేవింతు సతుల వాక్ప
సంగగురు సంగగురు నిత్యశాంతి దాంతి
ముఖ్యగుణ సాంద్రు దక్షిణామూర్తి దేశి
కేంద్రు మఱి గౌరనారాధ్య చంద్రు నసఘు — 10

— పద్మపురాణం : ప్రథమాశ్వాసం

శివధర్మోత్తర ఖండం, పద్మపురాణం కావ్యాల్లోని పైనచెప్పిన పద్యాల్లో వర్ణించిన కామినేని మల్లారెడ్డి గురువుగారి వంశవృక్షం ఇలా ఉంటుంది—

గౌతమగోత్రం - మల్లికార్జున పండితోల్లసద్వంశం
|
గౌరనారాధ్యుడు - (భార్య-భవాని [1], మల్లమ [2])
|
లింగనారాధ్యుడు - భార్య - గంగమ్మ
|
సంగగురుడు | దక్షిణామూర్తి | గౌరనారాధ్యుడు

పై వంశ వృక్షంలో చిట్టచివరన పేర్కొన్న గౌరనారాధ్యుని తల్లిదండ్రులు గంగమ్మ–లింగనారాధ్యులు. హరిపాఖ్యానాన్ని రచించిన గౌరన తల్లిదండ్రులు పోచమాంబ అయ్యలుమంత్రి. కనుక పై వంశ వృక్షంలోని చివరి గౌరనారాధ్యుడు హరిశ్చంద్రోపాఖ్యానాన్ని రచించిన గౌరనకన్న భిన్నుడనటం తేటతెల్లం. ఈ విషయాన్ని చాగంటి శేషయ్యగారు కూడా తెలియజేశారు. (ఆంధ్రకవి తరంగిణి. 11వ సంపుటం. 33వ పుట) ఇక చాగంటి వారు పై వంశ వృక్షంలోని మొదటి గౌరనారాధ్యుడున్నూ హరిశ్చంద్రోపాఖ్యానాన్ని రచించిన గౌరనా ఒకరే అవుదురో కాదో నిర్ణయింపలేదు. ఆ విషయాన్ని గురించి చాగంటివారు ఇలా వ్రాశారు. "పై పద్యములలోని మొదటి గౌరనయు, హరిశ్చంద్రోపాఖ్యాన గౌరనయు నొకరగుదురో కాదో నిర్ణయింపజాలకున్నాము. ఈ విషయమింకను విచారణీయము" అనే వాక్యమే ఈ ఉపశీర్షికలో ఈ చర్చకు తావు కల్పించ వలసి వచ్చింది. చాగంటి వారి సూచనమేరకు ఈ విషయం ఇంకా విచారించి పై వంశ వృక్షంలోని గౌరనారాధ్యుడు 1, హరిశ్చంద్రోపాఖ్యానకర్త గౌరన భిన్న వ్యక్తులని ఈ క్రింది కారణాలతో నిరూపించేందుకు వీలవుతుంది.

చాగంటివారు హరిశ్చంద్రోపాఖ్యాన కర్త అయిన గౌరన కాలాన్ని క్రీ.శ. 1380–1440 అని చెప్పారు. 1. కామినేని మల్లారెడ్డి అన్నగారగు కామారెడ్డి కాలాన్ని క్రీ.శ. 1530–1600 అని చెప్పారు. 2. కామారెడ్డికి ఇద్దరు తమ్ములు వారిలో రెండో తమ్ముడు మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, శివధర్మోత్తరఖండం పద్మపురాణం అనే కావ్యాల్ని రచించాడు. కామారెడ్డి కాలాన్ని చాగంటివారు 1530–1610 అని చెప్పటంచే అతని రెండో తమ్ముని కాలం దాదాపు 1540–1610 ఔతుందనటంలో విప్రతిపత్తి ఉండదు. మల్లారెడ్డి గురువు లింగనారా

1. 1. పద్మపురాణంలో చెప్పినపేరు.
2. 2. శివధర్మోత్తరఖండంలో చెప్పినపేరు

ధ్యుడు. అతని కాలంకూడా ఇంచుమించు అదే కాలమే అయివుంటుంది. లింగనారాధ్యుని తండ్రి గౌరనారాధ్యుడు. ఈ గౌరనారాధ్యుడు 16వ శతాబ్ది వాడని చాగంటి వారు చేసిన కామారెడ్డి కాల నిర్ణయాన్నిబట్టి తెలుస్తుంది. కనుక చాగంటివారి ననుసరించి కామినేని మల్లారెడ్డి గురు వంశంలోని మొదటి గౌరనారాధ్యుని కాలం 16వ శతాబ్దం. చాగంటివారే హరిశ్చంద్రోపాఖ్యానాన్ని రచించిన గౌరన కాలం క్రీ.శ. 1380–1440 అని నిర్ణయించారు, కనుక 14వ శతాబ్దం ఉత్తరార్థం–15వ శతాబ్దం పూర్వార్ధంలో ఉండిన హరిశ్చంద్రోపాఖ్యాన కర్త అయిన గౌరన, 16వ శతాబ్దంలో ఉండిన గౌరనారాధ్యుడు (మల్లారెడ్డి గురువు తండ్రి) విభిన్న వ్యక్తులనటం సుస్పష్టం. ఈ ఇద్దరికాల నిర్ణయం కూడా పైన చెప్పింది చాగంటివారు చెప్పిన కాలమే. ఉ విషయాన్ని పరిశోధనా ప్రావీణ్యులయిన చాగంటి వారు ప్రమాదవశాత్తు గమనింపక కామినేని మల్లారెడ్డిగారి గురువు వంశంలోని "మొదటి గౌరనయు హరిశ్చంద్రోపాఖ్యాన గౌరనయు నొకరగునో కాదో నిర్ణయింపజాలకున్నాము. ఈ విషయ మింకను విచారణీయము" అని వ్రాశారు. వారి వ్రాతవల్ల ప్రస్తుతం విషయం విచారించి ఆ గౌరన లిద్దరున్నూ వేరు వేరు వ్యక్తులని తేల్చబడింది.

మరికొన్ని ఆధారాలవల్ల కూడా ఆ గౌరనలిద్దరూ వేరు వేరు వ్యక్తులని నిరూపింపవచ్చు.

కామినేని మల్లారెడ్డి గురువుగారి వంశీయుల పేర్ల చివరన ఆరాధ్యపదం ఉంది. ఉదా॥ గౌరనారాధ్యుడు, లింగనారాధ్యుడు హరిశ్చంద్రోపాఖ్యానకర్త ఐన గౌరన వంశీయుల్లో తెలిసినంతలో ఎవ్వరికీ ఆరాధ్యపదం వారి పేర్ల చివరన లేదు. వారిపేర్ల చివర్లో అమాత్య/మంత్రి శబ్దాలున్నాయి. ఈ విధంగా గ్రంథస్థంగా శాసనస్థంగా ఉండటంచే కామినేని వారిగురువులు ఆరాధ్యులనీ హరిశ్చంద్రోపాఖ్యాన కర్త అయిన గౌరన వంశీయులు అమాత్యులని తెలుస్తుంది. కనుక వీరిద్దరున్నూ వేరు వేరు వంశీయులు. కేవలం గోత్రనామం నామసామ్యం వల్ల ఈ విచారణ జరిపేందుకు దారి తీసింది.

కామినేని మల్లారెడ్డి పద్యాల్నిబట్టి అతడి గురువంశీయులు ఆరాధ్యులనీ స్పష్టమౌతోంది. ఆంధ్ర దేశాన వీరశైవమతం రెండు సాంప్రదాయాల మూలంగా వ్యాప్తి చెందింది. అందులో మొదటిది అవైదికమైన బసవ సంప్రదాయం లేదా జంగమ సంప్రదాయం, రెండోది సవైదికమైన (పండితత్రయ)

సంప్రదాయం. దీనిని ఆరాధ్య సంప్రదాయం అంటారు. ఈ ఉభయ సంప్రదాయం వారున్నూ వీరశైవులే. వీరు శివుడొక్కడే పరదైవమని నమ్ముతూ విష్ణువు నామాన్ని కూడా స్మరింపరు. ఇక హరిశ్చంద్రోపాఖ్యానకర్త అయిన గౌరన ఆరాధ్యుడు (వీరశైవుడు) కాదు. కనుకనే తన లక్షణదీపికలో—

శ్లో. జానకీముఖ పద్మార్కం జానకీకుచ భూషణం
జానకీ రమణం వందే జగతాం మంగళప్రదమ్॥ —అని

ప్రారంభంలో చెప్పాడు. (ఆం.సా. పరిషత్ తాళపత్ర ప్రతి సంఖ్య 2585–లక్షణదీపిక 1.) నవనాథచరిత్రలో మీననాథుడు శిష్యులకు రామకథ చెప్తాడు. ఈ సందర్భాన రామకథను వ్రాసిన గౌరన "మహా పాతక హరమైన రామువినుత చరిత్రంబు" అని పేర్కొన్నాడు. వీరశైవులయిన ఆరాధ్యులు ఇలా వ్రాయరు గౌరన శైవుడేకానీ వీరశైవుడు కాడు. శైవుడైనను కూడ వైష్ణవ ద్వేషి కాదు. అందుకు పై నిదర్శనాలు ప్రబల సాక్ష్యాలు (భైరవకవి కూడా అంతే) పై అంశాలవల్ల కూడ కామినేని మల్లారెడ్డి గురువు వంశంలోని మొదటి గౌరనారాధ్యుడు హరిశ్చంద్రోపాఖ్యాన కర్త అయిన గౌరన విభిన్నవ్యక్తులని నిరూపితమైంది.

## 1. 2 భైరవకవి రచనలు :

భైరవకవి రచనల పేర్లు ప్రస్తావనగ వెనుకటి పుటల్లో చెప్పబడ్డాయి. ఆ రచనల్ని గురించి వరుసగా చర్చింపబడుతుంది.

భైరవకవి కృతులు మూడు (1) కవిగజాంకుశం (2) రత్నపరీక్ష (3) శ్రీరంగ మహత్త్వం.

---

1. ఉ కృతి ముద్రితా ముద్రిత లిఖిత ప్రతుల వివరాలు ఈ గ్రంథం అనుబంధంలో ఇవ్వబడ్డాయి.
2. 1950 ముద్రణ.
3. ఆంధ్రకవి తరంగిణి V సంపుటం పుట 222, 223లో ఉదాహరించిన 9 పద్యాలు వావిళ్ల ప్రతిలోనూ ఉన్నాయి.

## కవిగజాంకుశం :

"సుధీ బృందంబు మెచ్చ నేనొక చందమ్మునఁ గవి గజాంకుశమ్మను పేరన్" (కవిగజాంకుశం-4) "లక్షణ గ్రంథమొనరించి లాగు మీర దానిగొని యేను గుకవి మాతంగములను మదము దూలంగ గీపెట్ట మలపువాడ నని ప్రతాపించి" (కవిగజా-5) భైరవుడీ కృతిని రచించాడు. ఇందులో గణాల గ్రహాలు వాటి మైత్రి మొదలైనవి విపులంగ తెల్పబడ్డాయి. ఇది అప్పకవీయం మొదలైన అనేక లక్షణ గ్రంథాల్లో ఉదాహరింపబడింది. ఈ భాగానికి తెలుగులో ఇదే ప్రమాణగ్రంథం. దీంట్లో మొత్తం 85 పద్యాలున్నాయి 1. వావిళ్ల ప్రతిని 2 అనుసరించి కవిగజాంకుశంలోని పద్యాలవివరాలు ఇవి- కందాలు-53, గీతాలు-10, సీసాలు-06, ఉత్పలమాల వృత్తాలు-02, చంపకమాల వృత్తాలు 03, మత్తేభ విక్రీడిత వృత్తాలు-02, వచనాలు-09, మొత్తం-85 వావిళ్లవారు ప్రచురించిన దానికి నిడుదవోలు మరియు తిమ్మావఝ్ఝుల గారలు పరిష్కరణంలో మిక్కిలి సహాయపడ్డారని ప్రచురణ కర్తలు పీఠికలోతెల్పారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రచురితం అయిన కవిగజాంకుశంలో లేనివి వావిళ్ల ప్రతిలో ఎకువగ 5 పద్యాలున్నాయి. 3. అవి ఇతరత్ర లక్షణ గ్రంథాల్లో కవిగజాంకుశం లోనివిగా ఉదాహరింపబడ్డట్లు పీఠికలో తెలుపబడింది.

భైరవుడు రచించిన కవిగజాంకుశంలోని పద్యాలు కొన్ని గౌరన రచించిన లక్షణదీపికలోనూ ఉన్నాయి. అందువల్ల తండ్రి తన కొడుకు రచించిన గ్రంథంలోని పద్యాల్ని ఉదాహరిస్తాడా అని అనుమానం కల్గి - లక్షణదీపిక కర్త అయిన గౌరన, కవిగజాంకుశం రచించిన భైరవుడు తండ్రి కొడుకులు అనే సిద్ధాంతానికి బాధకమయింది. కొడుకు రచించిన పుస్తకంలోని పద్యాలు లేఖకులవల్ల తండ్రి రచించిన లక్షణదీపికలో చోటు చేసుకున్నాయని ఆరుద్ర గారు సహేతుకంగా నిరూపించారు. 1.

## రత్నపరీక్ష :

ఇందులో నవరత్నాలు వాటి ఆకార విశేషాలు, గుణదోషాలు, వాటిని ధరించటం వల్ల కలిగే శుభాశుభ ఫలాలు విరళంగా చెప్పబడ్డాయి.

---

1. సమగ్రాంధ్ర సాహిత్యం IV సం. పుట 351-355

అగస్త్యుడు వ్రాసిన కృతికి ఇది అనువాదమని తెలుస్తోంది. ఈ కృతిలో భైరవకవి " మున్ను మునీంద్రులకగస్త్యముని చెప్పిన యా సన్నుతమణి లక్షణములు చెన్నుగ క్రోడీకరించి చెప్పెద తెలియన్" (రత్నపరీక్ష-3)అన్నాడు.

కం. శ్రీవెలయఁగద్యములను
బావన నవరత్న కుసుమ పంక్తుల పూజల్
గావించెద ముదిగొండల
శ్రీవీరేశునకు భక్త చింతామణికిన్ –1.

కం. ఆ వీరేశ్వరు పేరిట-నావల కేదారపుత్రుఁడని భక్తులు సం
భావింప నధిక విద్యా-ప్రావీణ్యుండైన వీరభద్రుండెలమిన్-2

కం. తన్ను ప్రియమార వేడిన-మున్ను మునీంద్రులకగస్త్య మునిచెప్పినయా
సన్నుతమణి లక్షణములు-చెన్నుఁ గఁ గ్రోడీకరించి చెప్పెదఁదెలియన్-3

— రత్నపరీక్ష

పై పద్యాలవల్ల భైరవకవి ముదిగొండ కేదారయ్యా గారి కొడుకైన వీర భద్రుని కోరికపై రత్నపరీక్షను రచించినట్లు తెలుస్తుంది. ముదిగొండ గ్రామం దేవరకొండకు ఆరుమైళ్ళ దూరంలో ఉంది. రత్నపరీక్షను అంకితం తీసు కున్న వీరభద్రుడు ముదిగొండ గ్రామ నివాసి. ఒకనాడు ఆ గ్రామం శైవు లకు నిలయంగ ఉండేది. ఇప్పటికిన్నీ ఆ గ్రామంలో శైవ కుటుంబాలు ఉన్నాయి. "అధిక విద్యా ప్రావీణ్యుండైన వీరభద్రుడు" (రత్న-2) "ధనా భిరామాన్ని రచించిన నూతనకవి సూరనకు గురువు. ఈ విషయాన్ని సూరన ధనాభిరామంలోని ఈ క్రింది పద్యం తెలియజేస్తోంది–

"భద్ర వైభవ శ్రీ వీరభద్రలబ్ధ
జనిత చాతుర్య కావ్య లక్షణ విచిత్ర
విమల వాచా సమగ్ర సంవిశదమతిని
సూరయామాత్య తిలకుండ సుకవి వరుఁడ.

నూతన కవి సూరన ధనాభిరామంలో చేసిన పూర్వకవి స్తుతిలో చివరి వాడు నాచన సోమన సోమునికాలం క్రీ.శ. 1344. నూతనకవి సూరనపద్యాలు పెదపాటి జగ్గన్న (క్రీ.శ. 1550) ప్రబంధరత్నాకరంలో ఉదాహరించాడు.

కనుక సూరన 1344–1550 మధ్యకాలం వాడని తెలుస్తోంది. "క్రీ.శ. 1344-1550లకు మధ్య ఇంచుమించు రెండు వందల సంవత్సరాలున్నవి. ఇందు చేత ఇటో ముప్పాతిక అటో ముప్పాతిక లెక్కించి ఇతడు (సూరన) 1420–1475 ప్రాంతాల వాడని చెప్పుకోవచ్చు" అని సూరన కాలాన్ని పరిశోధకులు నిర్ణయించారు.*1

పై అంశాలవల్ల ముదిగొండవీరభద్రుని కాలం కూడా దాదాపు తెలుస్తుంది.

## రత్నపరీక్ష రచించేందుకు గల కారణం :

ఏ కృతి అయినా రచింపబడేందుకు కొన్ని చారిత్రక పరిస్థితుల నేపథ్యం కూడా ఉంటుంది. రత్నపరీక్ష వంటి శాస్త్ర గ్రంథాలు కొన్ని ప్రత్యేకమైన సాంఘిక రాజకీయపరమైన అవసరాలవల్ల నిపుణులు రచించవలసిన అవసరం ఏర్పడి ఉంటుంది. భైరవకవి ఈ గ్రంథరచన చేసేందుకు కారణాన్ని శ్రీరంగాచార్యగారు ఇలా చెప్పారు.*2. — "మహబూబునగరం జిల్లాలోని అచ్చంపేట తాలుకాకు చెందిన నేటి అమరాబాదు (గ్రామం) పీఠభూమికి పూర్వము ప్రతాపగిరిసీమ యని పేరు. ఈ పీఠభూమిపైగల మద్దిమడుగు ఒకనాడు పట్టణము. అప్పుడిది రవ్వలపేట దీని సమీపములోనేగల "తీగల మాను" వద్ద అనాడు ప్రజలు కాళ్ళ తీసేవారు. అపుడు త్రవ్వివిడిచిన గనులు నేటికీ గలవు... రాచకొండి దేవరకొండ పద్మనాయకుల పరిపాలన సమయమందీ ప్రాంతము దేవరకొండ లోనిదే. ఆనాడు భూమిలోగల రత్నాలు వెలికితీసి పరీక్షించుట, వ్యాపారము జరుగుట సంభవించుట వలననే భైరవుడు రత్నపరీక్షను తెనిగించి మరికొన్ని విషయములు క్రోడీకరించి యుండవచ్చు."

రత్నపరీక్షలో మొత్తం 79 పద్యాలున్నాయి. ఈ గ్రంథం పరిమాణంలో చిన్నదైనకూడా విలువైంది. ఇందులోని సాంకేతిక పదాలు వాచస్పత్యంలో కూడా లేవు. కనుకనే "బర్జరము" అనే మణి దోషానికి లక్ష్యంగ ఈ రత్నపరీక్ష లోని పద్యమే ఇవ్వబడింది. వసుచారిత్రాది గ్రంథ వ్యాఖ్యాతలు తమ

---

1. సమగ్రాంధ్ర సాహిత్యం IV సం-పుటి 193-1990 మార్చి ముద్రణ.
2. శ్రీరంగమహత్త్వము–పీఠిక–పుట XLI

వ్యాఖ్యానాల్లో రత్నాల ప్రస్తావన వచ్చినపుడు ఈ రత్నపరీక్షలోని పద్యాల్నే ఉదాహరించటం "రత్నపరీక్ష" ప్రాశస్త్య ప్రచారాల్ని తెలియజేస్తోంది.

## శ్రీరంగ మహాత్త్వము :

ఇది గరుడ పురాణానికి తెనుగుసేత. (శ్రీరంగ 1–24. 25) భైరవకవి– "లోకోత్తర గుణ పుణ్య శ్లోక కథామధురి మధుర శుభవాఙ్మయ రత్నాకల్పం బగు కావ్యం బా కల్పంబగు కృతార్థుండగు కవి వరుండున్–కావున భువనైక కథా సంబంధ బంధురంబుగా నొక్క ప్రబంధంబు రచియింపవల యునని వితర్క్కరించు సమయమున" (శ్రీరంగ 1-16. 17) చాగయ రాఘవ మంత్రి ఈ కృతిని రచింపమని చెప్పటంవల్ల భైరవకవి ఈ మహాపురాణకథను రచించేందుకు ఉపక్రమించాడు.

శ్రీరంగమహత్త్వ కృతిభర్త అయిన చాగయరాఘవుని
వంశ వృక్షం
కశ్యప గోత్రం

- కేశవదేవుడు
  - మాయిదేవ పండితుడు
    - చాగయమంత్రి
      - నరసింహుడు
        - గోవిందుడు
      - విఠలుడు
        - బాబాజీ
      - రాఘవుడు (శ్రీరంగమహత్త్వ కృతిభర్త)
        - నాగనాథుడు
    - గోవింద పండితుడు
      - విశ్వనాథుడు

పై వంశవృక్షాన్ని భైరవకవి ముప్పైమూడు పద్యాల్లో వర్ణించాడు.

కృతిభర్త యైన చాగయరాఘవుడు శ్రీరంగమహత్త్వ కావ్యాన్ని అంకితం తీసుకునే నాటికే అతని కొడుకైన నాగనాథుడు "సమస్త శాస్త్ర ప్రవీణుడు·

వీతరణఖని, చండ కోదండ పాండిత్య సవ్యసాచి, జగద్ధితయశుడు" (శ్రీరంగ 1-65) కనుక భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని చాగయరాఘవునికి అంకితమిచ్చే నాటికి నాగనాధునికి దాదాపు ముప్పై సంవత్సరాల వయస్సు ఉంటుంది. దీన్ని బట్టి శ్రీరంగమహత్త్వ కృతిభర్త అయిన చాగయరాఘవుడు ఈ కృతిని అంకితం పొందే నాటికి అరవై సంవత్సరాలకు పైబడిన వయసుగలవాడై ఉంటాడు.

## కృతిభర్త చాగయరాఘవుని గుణగణాలు :

రూపం : "ఆకారవిజిత మదనుడు. ప్రసన్న వదనుడు (1-17)" సతత ప్రసన్నతావదనంబు సదనంబు భూరి సౌభాగ్య విస్ఫూర్తిమూర్తి" (1-56) "బహు నూతన విభ్రమ వధూ మనోజుడు" (1-69) "మాఘువ సతులితుడు" (1-72). "నవ్య శృంగార జాలుడు, ప్రమదకర విలాసుడు" (1-222). "సమున్నిద్ర భద్రలక్షణ విలాసద్రూపుడు" (2–1) "రూప పుండ్రేక్షుచాపుడు" (2-226) "చామీకర రుచిరథాముడు" (3–1) "వికచ కమలనేత్రుడు"(3-305) "చోళీ చంచదురోజ కుంకుమ నవక్షోద స్ఫురద్వక్షుడు" (4-284) "కమలాంక కాంతి శోభితుడు, కమనీయ దరత్కమలాయతదళలోచనుడు" (4-284) సుందరీ మానసచోరుడు" (5-266).

## ప్రతాపాదికం :

"ప్రతాప సమగ్రుడు" (1-17) "విక్రమపాదితానేక విమతదుర్గ లబ్ధ సామ్రాజ్య లక్ష్మీ విలాసభాసి" (1-56) "పటుబాహు విక్రమ విజిత విమత నృపసమానత మణి రమణీ హయాది బహు విధోపాయ నాంచిత ప్రాంగణుండు, రణజయోల్లాసి" (1-59). "రణదివ్య బిరుద నిర్వాహకుండు ప్రకట సంగ్రామ నిర్భంగ ఫల్గుణుండు" (1-60)- "జగద్గీత రణదివ్య బిరుదఖ్యాతుడు" (1-69)· ఉప సంహృత కర్ణాటకటక జదనాథ చమూరంహుడు"(1-70) బాహా బల భీముడు–ఉగ్రాహవ భీముడు, పటు జవాదిక తురగా రోహణ రేవంతుడు అతి సాహసవంతుడు-నమిత సామంతుడు" (1-71). "శరలాఘవ పటుతా విశేష లక్ష్మణుడు" (1-72). "ధనుః పాండిత్య కౌంతేయుడు-దర్పాంధారాతి వసుంధరా రమణ దుష్టామాత్య నీతిక్రియా సంధాన ప్రబలాంధకార పటలీ సప్తాశ్వుడు" (1-220), "సమదరిపు విరాముడు" (1-222). "మందర

మహీభృద్ధైర్యుడు" (2-224). "జరఠఫణి కమఠ పరివృఢ కరికిరికులకుధ్ర విధృత ఘనతర ధరణీభర భరణక్షమ దక్షిణకర ఖర కరవాలుడు-విమతగర్వ విభాళనుడు" (2-225). "విచలితరిపుచేతుడు" (2-226). "ధాటీ సంభ్రమ జృంభమాణ నిజయోధ్య వ్యూహుడు-బాహాధనుర్జ్యాటంకార విశంకట ధ్వని విశేష త్రస్తుడు-నిస్తంద్ర కర్ణాటోదీర్ణ బలార్ణవార్భటి తురంగారోహణోదారుడు-లీలాటోపార్క తనూజుడు" (3-303). "భుజబల మహితహిత వివర్ధన నిరతాచరణ రణదివ్య రాహుత బిరుద పదోన్నత నతారి బృందాభయదుడు"(3-304) "ప్రకటిత నిజ శౌర్యుడు-ఛద్మ శైలేంద్ర ధైర్యుడు" (3-305). "విమత భయద కోపుడు-వీతిహోత్ర ప్రతాపుడు-సమర పరశురాముడు" (5-266).

## సద్గుణములు :

"అనుపమగుణ భూషణుడు-అపగత దోషుడు" (1-17). "శరణాగత త్రాణ సదయంబు హృదయంబు-ఘనదాన వైభవాకరము కరము-గురుధర్మ కార్యానుకూలంబు-శీలంబు సంపాదిత స్వామి జయము నయము - హరిపదారాధనాయత్తంబు చిత్తంబు" (1-56). "ద్వాదశి యందు దానమిడు గొప్పదాత" (1-61) "ఘనదాన రవి ప్రభవుడు" (1-68). "ధూతాఘ వరమతి" (1-72) "బంధు ప్రాంగణ కల్ప పాదపుడు" [1-220]. "సుజన పావనుడు [1-221] "నమదవన విలోలుడు శమదమయుత భవ్యుడు" [1-222]. "సద్ద్వాదశీవ్రత సంకల్పిత గోహిరణ్య మణిభూ వస్త్రాన్నదానాభి తర్పితధాత్రీసుర బృందుడు" [2-224]. "సచివకుల లలాముడు" (2-226). "శ్రీమాధవ పదకోమల తామర సార్చన విధాన తత్పరుడు-సుజన క్షేమంకర కరుణోదయుడు" (3-1). "నిరుపమ శుభగుణుడు" [3-304]. "సూనృతాలోల శీలుడు-సకల సుగుణధాముడు" [3-305]. శ్రీరంగ రాజసేవా పారంగతుడు-వితరణ చారుగుణాకర సుధాముడు" [4-1]. "కమలాకర నిభ గభీరుడు" [4-285]. దినకరసమ తేజుడు-దీన మందార భూజుడు-పయోధి నిభ గభీరుడు-వినయ సముదిశాలుడు వేదమార్గానుకూలుడు" [4-286]. "శ్రీరఘునాయక మృదపద వారి రుహభ్రమరుడు - బంధువత్సలుడు - వంశోద్ధారణుడు " " శ్రీగురు వచోవశ చిత్త విలాసుడు" [5-264] "కమలనయన సేవా కౌతుకాధీన భావుడు" [5-266].

## కీ ర్తి :

"విశదయశుడు" (1-60). "శశ్వన్నభస్సింధుక్షీర పటీర నిర్మలయశః శ్రీవాసితుడు" (1-220). "శశివిశదకీర్తి వ్యాపిత దిక్సీముడు" (2-1).

## ధిషణా-వాక్పటిమ-పాండితి :

"అతి మధుర ప్రియభాషణుడు" (1-17). "చాతుర్యభోజుడు" (1-69) "చారువిద్వన్నిషేవ్యుడు" (1-22). "ప్రతిభాషోచిత సర్వశాస్త్ర కలనా పాండిత్యుడు-వీణాది సంగత సంగీత కళా విలోల బుధలోకస్తుత్య నిత్యోదయుడు-ప్రచుర విబుధ పుణ్యుడు-బ్రహ్మ వంశాగ్రగణ్యుడు (2-226)" సుకవి శుక రసాలుడు" "వాచా మాధురీ వైభవుడు" (4-284). "సుమహితమతి విస్తారోరగ సార్వభౌముడు" (5-1)

## శ్రీరంగమహత్త్వ రచనకు కారణాలు :

వేదాంతార్థ గంభీరమైన పాపద్మపురాణాన్ని ఆంధ్రభాషా కౌశలంతో అనువాదంచేసి తనకు అంకితం చేయుమని చాగయ రాఘవుడు భైరవకవిని కోరాడు. చాగయ రాఘవుడు వైష్ణవ మతావలంబి. ఆనాటి రాజకీయ చారిత్రక పరిస్థితులు కూడా వైష్ణవం వైపు కొంత మొగ్గుగా ఉండేవి. దానికి కారణం వేదాంత దేశికుల వారి కొడుకు దేవరకొండ ప్రాంతాన చేసిన వైష్ణవమత ప్రచారం. వీర శైవ విజృంభణం అప్పగారి వైపులుకూడా అదినాల్లో హరిహరుల్ని సమభావంతో ఆరాధించారు. శ్రీగిరి పండితుడు శైవుడైకూడా శ్రీరంగమహత్త్వాన్ని రచించాడు. అతడికి అర్వాచీనుడైన గౌరన శ్రీగిరి నవనాథచరిత్రను ద్విపద కావ్యంగా రచింపగా గౌరన కుమారుడు భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని రచించటం గమనింపదగిన అంశం. శ్రీవైష్ణవానికి శ్రీరంగం మూలకందం. అలాంటి శ్రీరంగాన్ని గురించిన మహత్త్వ గ్రంథాన్ని ఆంధ్రీకరించుమని భైరవుడిని చాగయరాఘవుడు కోరేందుకు స్వీయ వైష్ణవ మతాభిమానమేగాక నాటి సాంఘిక పరిస్థితులుకూడా కారణం కావచ్చు. ఏటి కారణంగా శ్రీరంగమహత్త్వ రచన జరిగిందనవచ్చు.

## శ్రీరంగమహత్త్వ ప్రచార ప్రాశస్త్యం :

"శ్రీనాథుని కాశీఖండ భీమఖండములకు పిదప క్షేత్ర మాహాత్మ్యములనింత ప్రౌఢముగ తెలిగించిన కవి అన్యుడెవ్వడు కానరాడు...... వేంకటాచల సింహాచల కాళహస్తి హాలాస్య మంగళగిరి గోకర్ణ శ్రీశైలాది మాహాత్మ్యములింత ప్రౌఢములైనవి కావు" అని సుప్రసిద్ధ పండిత పరిశోధకులైన మానవల్లి రామకృష్ణ కవిగారు దీని ప్రాశస్త్యాన్ని తెలిపారు.[1].

అప్పకవి, ముద్దరాజురామన, గణపవరపు వేంకటకవి, కళువె వీర భూపాలుడు మొదలైనవారు ప్రబంధ రత్నాకరకారుడైన పెదపాటి జగ్గన్న భైరవకవి శ్రీరంగమహత్త్వలోని పద్యాల్ని తమ గ్రంథాల్లో ఉదాహరించటాన్ని బట్టి ఈ కృతి పూర్వం మంచి ప్రచార ప్రాశస్త్యాలను పొందిందని తలచేందుకు వీలుంది.

## 1.3 భైరవకవి కాలం :

భైరవకవి కాలాన్ని నిర్ణయించేందుకు అతడి గ్రంథాల్లో ప్రత్యక్షమైన ఆధారాలు లేవు. కనుక ఇందుకు సంబంధించిన ఇతరత్ర ఆధారాలవల్ల భైరవకవి కాలాన్ని నిర్ణయించవలసిఉంది. అలాంటి వాటిని పరిశీలించి భైరవుని కాలాన్ని ఈ ఉపశీర్షికలో నిర్ణయించటం జరిగింది.

గౌరన కాలాన్ని అనుసరించి భైరవుని కాలనిర్ణయం చేయటం :
గౌరన కాలాన్ని పరిశోధకులు ఈ క్రింది విధంగా తెలియజేశారు.—

వీరేశలింగం పంతులుగారు "ఆంధ్రకవుల చరిత్రము [2]"లో— గౌరనకవి ౧౪౪౦-౫౦వ సంవత్సర ప్రాంతము లందుండి యుండవతెను." అని తెలిపారు. (వీరేశలింగం పంతులుగారు గౌరన జీవిత కాలాన్ని రమారమిగ కూడా తెల్పలేదు).

---

1. శ్రీరంగమహత్త్వము–పీఠిక. (1912)
2. ప్రథమభాగము - పుట 595 - మనోరమా ముద్రక్షరశాల - 1917

చాగంటి శేషయ్యగారు "ఆంధ్రకవి తరంగిణి[1]. లో— "ఇతని (భైరవుని) తండ్రి (గౌరన) కాలము ౧౩౮౦-౧౪౩౦ అని వ్రాసియుంటిని" అని తెలిపారు. అనగా శేషయ్యగారు నిర్ణయించిన గౌరన కాలం 1380-1430.

అరుద్రగారు "సమగ్రాంధ్ర సాహిత్యం[2]. "లో గౌరన కాలాన్ని సూటిగ అంకెల్లో చెప్పలేదు.

తేరాల సత్యనారాయణశర్మ గారు "రాచకొండ చరిత్రము[3] -"లో గౌరన కాలాన్ని 1351-1425 అని తెలిపారు.

శ్రీమతి యశోదారెడ్డిగారు "హరిశ్చంద్రోపాఖ్యానము[4] " పీఠికలో గౌరన కాలాన్ని 1380-1455 అని నిర్ణయించారు.

(ఇంకా ఎందరో తమ గ్రంథాల్లో భైరవుని కాలాన్ని గురించి చెప్పారు. అయితే వారందరకూ పైన చెప్పిన గ్రంథాలే ఆధారం కనుక వాటిని పరిశీలించి కూడా ఆ గ్రంథాల పేర్లన్నీ విస్తరభీతి వల్ల ప్రస్తుతం పేర్కొలేదు.)

పైన చెప్పిన గ్రంథాల్లో పరిశోధకులు నిర్ణయించిన గౌరన కాలంలో శ్రీమతి యశోదారెడ్డిగారు నిర్ణయించిన క్రీ.శ. 1380-1455 కాలం సమంజసంగాసూ నిరాటంకంగాసూ నిర్బాధకంగాసూ ఉంది. గౌరన క్రీ.శ.1449 ప్రాంతాల్లో ఉండిన భిక్షావృత్తి కోరిక మేరకు నవనాథచరిత్రను రచించాడు. 1449లో గౌరన జీవించి ఉన్నట్లు యశోదారెడ్డితప్ప ఇందాకా చెప్పిన పరిశోధకులెవ్వరూ పేర్కొలేదు. కనుక గౌరన కాలం యశోదారెడ్డి చెప్పింది సమంజసంగా ఉంటుందని భావించటం జరిగింది.

భైరవకవి వంశాన్ని గురించి వ్రాసేటప్పుడు ఇందాకటి పుటల్లో వివిధ ఆధారాలవల్ల గౌరన కాలాన్ని క్రీ.శ. 1375-1455 అని నిర్ణయం చేయటం జరిగింది. (పునరుక్తి ఔతుందని ఆ చర్చను ఇక్కడ మళ్లీ వ్రాయలేదు.)

---

1. 5వ సంపుటం - పుట 221 - ప్రథమముద్రణ - 1949
2. 4వ సంపుటం - 1990 మార్చి - పునర్ముద్రణ,
3. ప్రథమముద్రణ - 1970 - పుట - 49
4. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ - 1967 పుట - 7

గౌరన కాలం క్రీ.శ. 1375–1455 కనుక గౌరనకు దాదాపు 30 సంవత్సరాల వయస్సులో భైరవుడు జన్మించి 80 సంవత్సరాలు జీవించాడనుకుంటే భైరవుని కాలం క్రీ.శ. 1405–1485 అవుతుంది. ఈ కాల నిర్ణయానికి ఇదివరకు లభించిన ఇతరత్రా ఆధారాలేవి కూడా అటంకంగా లేవు.

భైరవుని కృతులవల్ల పరోక్షంగా కాలనిర్ణయం : భైరవకవి రచనలు మూడు. అవి : 1. కవిగజాంకుశం, 2. రత్నపరీక్ష, 3. శ్రీరంగమహత్త్వము ఈ కృతుల్లో భైరవుని కాల నిర్ణయానికి లభించే ప్రత్యక్ష ఆధారాలు మృగ్యం. కనుక వీటిలో లభించే పరోక్ష ఆధారాలవల్ల భైరవకవి కాలాన్ని స్థూలంగా నిర్ణయించేందుకు వీలవుతుంది ఆ అంశాలను పరిశీలింతం—

## 1- కవిగజాంకుశం :

కవిగజాంకుశంలోని పద్యాల్ని లాక్షణికులు చాలామంది తమగ్రంథాల్లో ప్రామాణికంగ స్వీకరించారు. అలాంటి వారిలో ఇందాక తెలుస్తున్న మొదటి వ్యక్తి లింగమగుంట తిమ్మకవి. తిమ్మకవి 16వ శతాబ్దంవాడని నిశ్చయింపబడింది. కనుక భైరవకవి పదారోశతాబ్దానికి పూర్వమె ఉండినవాడవుతాడు.

## 2· రత్నపరీక్ష :

ఈ కృతి ముదిగొండ వీరభద్రుని కోరికమేరకు రచింపబడింది. ముదిగొండ వీరభద్రుని శిష్యుడు నూతనకవి సూరన సూరన తాను రచించి ధనాభిరామంలో కవిస్తుతి ఇలాచేశాడు.—

చం. అలఘుని శబ్దశాసన పదాంకితు దిక్కన సోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచన సోమనార్యు జె
న్నలరిన చిమ్మపూడి యమరాధిపు భాస్కరు రంగనాథునిన్
దలతు నపూర్వ దివ్య కవితా మహనీయ సమగ్ర చిత్తులన్

పైకవిస్తుతి పద్యంలో కాలం దృష్ట్యా చివరికవి నాచనసోమన. సోముని కాలం క్రీ.శ. 1344 ప్రాంతం. కనుక నూతనకవి సూరని క్రీ.శ. 1344కు

తరువాతి వాడనటం నిశ్చయం. అతడికి సమకాలికుడైన భైరవకవి కూడా క్రీ.శ. 1344కు తరువాతివాడే ఔతాడు. నూతనకవి సూరన ధనాభిరామంలోని పద్యం, భైరవుని శ్రీరంగమహత్త్వంలోని పద్యాలు క్రీ.శ. 1550లో ఉండిన పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. కనుక వీరు క్రీ.శ 1550కి ముందువారనటం స్పష్టం. "క్రీ.శ. 1344–1550లకు మధ్య ఇంచు మించు రెండు వందల సంవత్సరాలున్నాయి. అందువల్ల ఇటో ముప్పాతిక అటో ముప్పాతిక లెక్కించి ఇతడు (నూతనకవి సూరన) క్రీ.శ. 1420-1475 ప్రాంతాల వాడని చెప్పుకోవచ్చు." అని పరిశోధకులు అభిప్రాయపడ్డారు. 1. నూతనకవి సూరన, భైరవకవి ఇద్దరున్నూ ముదిగొండ వీరభద్రుని శిష్యులవ టంచే వారిద్దరున్నూ సమకాలికులు కనుక రమారమి సూరన కాలమే భైరవ కవి కాలం కూడా అవుతుంది. గౌరన కాలాన్నిబట్టి నిర్ణయించిన భైరవునికాలం క్రీ.శ. 1405–1485కు పైన చెప్పినకాలం నిర్బాధకమే అవుతుంది.

శ్రీరంగమహత్త్వము : ఈ కృతిలో కవిస్తుతిగా ఈ క్రింది పద్యం చెప్ప బడింది.

చం. లలిత కవిత్వరేఖ సఫలత్వము నొంద నశేష కిల్బిషం
టుల దొలగించి నిత్యసుఖమూలములై హరిభక్తిదంబులై
వెలయుపురాణ సత్కథలు వేడ్కరచించి జగత్ప్రసిద్ధులై
పొలుచు మహాత్ములన్ సుకవి పుంగవులం బ్రణుతించి వెండియున్
1–8

పై కవిస్తుతిలో కవులపేర్లు ప్రత్యేకంగా చెప్పలేదు. కాని పై స్తుతిలో భైరవకవి హరిభక్తిదంబులై వెలయు పురాణసత్కథలు వేడ్కరచించి జగత్ప్ర సిద్ధులై పొలుచు మహాత్ములైన కవుల్ని స్తుతించాడు. భైరవుని నాటికి హరిభక్తి దాలైన పురాణాలను రచించిన జగత్ప్రసిద్ధులైన కవులు నృసింహ పురాణకర్త అయిన పోతన అనే విషయం సాహితీ ప్రపంచానికి విదితమే. భైరవకవి శ్రీరంగ మహత్త్వంలో నృసింహ పురాణ, భాగవత పురాణ, ప్రభావం ఎక్కువగా గోచరిస్తుంది. పోతన భాగవతాన్ని భైరవుడు అనుసరించిన తావులు శ్రీరంగ మహత్త్వంలో అధికంగా గోచరిస్తాయి. కనుక భైరవకవి కవిస్తుతిలో పోతనను

---

1. ఆరుద్ర–సమగ్రాంధ్ర సాహిత్యం–4వ సంపుటం.

పేరుపెట్టి స్మరింపకపోయినా పరోక్షంగానైనా స్మరించాడనటం స్పష్టం. పోతన భాగవత రచన క్రీ.శ. 1460–70 ప్రాంతాల్లో పూర్తి అయినట్లు పరిశోధకుల నిర్ణయం.1. భైరవకవి శ్రీరంగమహత్త్వంలో పోతన భాగవత ప్రభావం ఎక్కువగా ఉండటం వల్ల, శ్రీరంగమహత్త్వం భాగవత రచన ప్రచారం పొందిన తర్వాత రచింపబడి ఉండాలి. రాచకొండ, దేవరకొండ ప్రాంతాలు పోతన ప్రత్యక్షంగా దర్శించినాడటం జగద్ధితం. ఇందుకు నిదర్శనం భోగినీదండకం. భాగవతాన్ని సర్వజ్ఞ సింగభూపాలుడు అంకితంగా పొందగోరిన వాడవటంచే ఆ రచన ఆ ప్రాంతంలో (వేగంగా) తక్కువ కాలంలోనే ప్రచారాన్ని పొందిఉంటుందనటం సత్యదూరం కాదు. కనుక భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని క్రీ.శ. 1465–70 ప్రాంతాల్లో రచించి ఉండవచ్చు. ఈ నిర్ణయం వల్ల విప్రతిపత్తి కూడా ఉండదు. ముందు పుటల్లో భైరవకవి కాలం క్రీ.శ 1405-1485 అని నిర్ణయించటం జరిగింది. దానినిబట్టి భైరవకవి తన 60 లేక 65వ ఏట శ్రీరంగ మహత్త్వాన్ని రచించి ఉండవచ్చు శ్రీరంగమహత్త్వ పీఠికా కారులు కూడా "(భైరవుడు) చివరి దినాలలో శ్రీరంగమహత్త్వమును వ్రాసి చాగయరాఘవునికి అంకితము చేసి యుండును" అని అభిప్రాయపడ్డారు. 1 ఆయితే అందులో వారు భైరవుని చివరికాలం 1460 అనిచెప్పారు. అప్పటికి భాగవత రచనకొంత జరిగినాకూడా ప్రచార ప్రసిద్ధులు పొందే ప్రారంభదశ అది. కనుక భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని పోతన భాగవతం ప్రచారం పొందినతర్వాతే రచించి ఉంటాడనటానికి శ్రీరంగమహత్త్వంలోని అనేక పద్యాలు సాక్ష్యమిస్తున్నాయి.2. కనుక భాగవతం 1460-70 ప్రాంతంలో పూర్తి అయినట్లు పరిశోధకులు నిర్ణయించటంవల్ల శ్రీరంగమహత్త్వం ఆ కాలానికి తర్వాత రచింపబడి ఉంటుందనటం సత్యదూరం కాదు. కనుక భైరవకవికూడా దాదాపు 1485 వరకూ జీవించి ఉంటాడు.

భైరవుడు, నూతనకవి సూరన వీరిద్దరున్నూ ముదిగొండ వీరభద్రుని ఆశ్రయించివారే. కనుక సమకాలికులు. వీరిద్దరుకూడా పోతన పద్యాల్ని అనుకరించటం గమనార్హం. అలాంటి పద్యాలు మచ్చుకు—" పుట్టంబుట్ట

1. "పోతన"-నిడుదవోలు వేంకటరావు. నేషనల్ బుక్ ట్రస్ట్ 1962-పుట 17
2. వీటిని "పూర్వకవి అనుకరణాలు" అనే ఉపశీర్షికలో చూడవచ్చు.

శరంబునన్ మొలప" అనే భాగవత పద్యాల్ని అనుసరించి సూరన ధనాభిరామంలో —

కం. పుట్టంబుట్టి మహానది-బుట్టియు సికత స్థలమున బుట్టి జగంబుల్
నెట్టన బొగడగ వెలసిన-యట్టి మహాత్ముల దలంచి యాదిమకవులన్

అని చెప్పగా భైరవకవి శ్రీరంగమహత్త్వంలో—

ఉ. పుట్టకుబుట్టి కోమలికి బుట్టిన ప్రాగవు లాదరించి చే
బట్టిన గావె రాఘవ నృపాలక ధర్మజ కీర్తి చంద్రికల్
నెట్టన సర్వలోకములు నిండిన నిప్పుడు నిందునందులన్
ముట్ట నఖర్వ సర్వ సుఖమూలము కావ్యమవో తలంచినన్– 1-17

అని చెప్పాడు. ఆరుద్రగారు సమగ్రాంధ్ర సాహిత్యంలో (4వ సంపుటం) నూతనకవి సూరన కాలనిర్ణయాన్ని చేస్తూ— "అంత్యాను ప్రాసలోకూడా సూరన్న పోతరాజు గారిని అనుసరించాడు. భాగవతంలో పోతరాజు గారు సరస్వతీ ప్రార్థన ఇలా చేశారు.–

ఉ. క్షోణితలంబు నెన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికి జంచరీకచయ సుందర వేణికి రక్షితామర
శ్రేణికి దోయజాతభవ చిత్తవశీకరవైక వాణికిన్
వాణికి నక్షదామ శుక వారిజ పుస్తక రమ్య పాణికిన్

— (భాగ 1–6)

ఈ అనుప్రాసాన్ని చివరి పదాలలో అనుసరిస్తూ సూరన ధనాభిరామంలో సరస్వతీ ప్రార్థన ఇలాచేశాడు.–

ఉ. వీణెయు బొత్తమంకుశము వేడుకతో జపమాల జేతులం
బ్రాణపదంబులై వెలయు భవ్యతను ప్రభనిండి సర్వగీ
ర్వాణులు సన్నుతింపగను వర్ధనకెక్కిన బ్రహ్మరాణికిన్
వాణికి మత్తకీర పికవాణికి మ్రొక్కెద కావ్యసిద్ధికిన్ – (1-8)

ఈ అనుకరణంవల్ల నూతనకవి సూరన కచ్చితంగా పోతరాజు గారికి తరువాతి కవే అని చెప్పవచ్చు. అందుచేత ఇతని కాలం భాగవత రచన జరిగాక, అది ప్రజాదరణ పొందాక అని చెప్పవచ్చును. అంటే క్రీ.శ. 1475–1500 ప్రాంతాలని నిర్ణయింపవచ్చు."— అని వ్రాశారు. నూతనకవి సూరన, భైరవకవి ఇద్దరున్నూ ముదిగొండ వీరభద్రుని ఆశ్రయించిన వారు కనుక వారిద్దరూ దాదాపు సమకాలీనులనటం సత్యదూరంకాదు. పై అంశాల పరిశీలనంవల్ల భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని భాగవతం బాగా ప్రచారం పొందిన తర్వాత రచించాడనటం సుస్పష్టమౌతోంది. కనుక భైరవకవి కాలం క్రీ.శ. 1405–1485. ఇది శ్రీరంగమహత్త్వంలోని కవిస్తుతి మరియు పోతనను అనుసరించిన పద్యాల్నిబట్టి నిర్ణయింపబడింది.

ఇక శ్రీరంగమహత్త్వం కావ్యావతారికలోని చారిత్రకాంశాల్ని బట్టి పరోక్షంగా భైరవకవి కాల నిర్ణయం చేయవచ్చు—

చాగయరాఘవుని రెండోఅన్నఅయిన విఠలేంద్రుడు ఇమ్మడి సైఫఖాను వద్ద మంత్రిగా ఉన్నాడు. విజయనగరం మీద బహమనీ సుల్తానులు దండయాత్రలు చేశారు క్రీ.శ. 1443–44లో బహమనీ సుల్తానుల దండయాత్రలు విజయవంతమయ్యాయి.[1] ఆ యుద్ధంలో విఠలేంద్రుడు పాల్గొని ప్రశంసల్ని పొంది ఉంటాడని శ్రీరంగమహత్త్వంలోని ఈక్రింది పద్యాలు గుర్తుచేస్తున్నాయి.

మ. పటుధాటీముఖ జృంభమాణ కలహ ప్రాఘార్ణ సంఘాత వి
స్ఫుట రింఖాపుట కోటీ ఘట్టన పరిక్షుణ్ణ క్షమోద్యద్విశం
కట ధూళీ పటల ప్రశోషిత మహా కర్ణాట సేనా సము
ద్భట పాథోనిధి విఠ్ఠలేంద్రు బురణింపన్ మంత్రులేరీ ధరన్
1–50

సీ. చండ దిగ్వేదండ కాండ ధూర్వహమహీ -
మండలోద్ధరణ సమర్థమగుచు
దుర్వార పరిపంథి సర్వ సంపద్వర్గ -
నిర్వాపణ క్రియా నిపుణమగుచు

1. విజ్ఞాన సర్వస్వం-3సంపుటం-పుట 360 - తెలుగుభాషా సమితి ప్రచురణ.

వేదాది విద్యా వినోద విద్వజ్జనా -
మోదాతిశయ సముత్పాది యగుచు
జంభ జిన్మద కుంభి కుంభీన సాధీశ -
శంభు భూభృత్ ద్యుతి స్వచ్ఛమగుచు

గీ. బరఁగునే మంత్రి భుజబల ప్రకట శౌర్య -
దాన సత్కీర్తుల ప్రతిమాన మహిమ
నాత డిమ్మడి సైఫఖానాది రాజ్య -
భారధుర్యుండు విఠ్ఠల ప్రభువరుండు 1-51

విఠ్ఠలమంత్రి తమ్ముడైన చాగయరాఘవుడు కూడా చాలా పరాక్రమవంతుడు. అమిత సాహసుడు. ఇతడుకూడా తనకు సార్వభౌములైన మహమ్మదీయ ప్రభువులతో కలిసి కర్నాటకంపైన చేసిన యుద్ధంలో పాల్గొన్నాడు. శ్రీరంగమహత్త్వంలోని షష్ట్యంత పద్యాల్లో ఆ విషయం ఇలా ప్రస్తావింపబడింది.—

కం. సింహ తలాటాంకున కుప
సంహృత కర్ణాట కటక జననాథచమూ
రం హుసకు— (1-70)

పై అంశాన్ని పరిశీలిస్తే విజయనగరం మీద బహమనీ సుల్తానులు చేసిన దండయాత్ర (క్రీ.శ. 1443–44) తర్వాత శ్రీరంగమహత్త్వం రచింపబడిందనటం స్పష్టం.

## భైరవకవి కాలనిర్ణయ చర్చా ఫలితాంశం :

పోతరాజు శాసన కాలం, ముక్తికాంత భిక్షావృత్తి శాసనకాలం– వీటివల్ల గౌరన కాలాన్ని నిర్ణయించేందుకు వీలయింది. దానివల్ల భైరవుని కాలం క్రీ.శ 1405–1485 గా అనిర్ణయించటం జరిగింది. ఈ కాలనిర్ణయానికి నూతనకవి సూరన కాలం, భాగవత రచన - ప్రచారకాలం కూడా సరిగ్గా సరిపోతుంది. క్రీ.శ. 1550కి పూర్వం ఉండిన లాక్షణికులు కానీ, కవులు కానీ, సంకలన గ్రంథాలు కానీ భైరవకవిని స్మరించిన ఆధారాలు ఇంతవరకూ లేవు. కనుక

పైన చెప్పిన భైరవుని కాలానికి ఇతరత్ర అంశాలేవీకూడా ఆటంకంగాలేవు. కనుక ప్రస్తుత ఆధారాలవల్ల భైరవకవి కాలం క్రీ.శ.1 405-1485 అని నిర్ణయింపబడింది. ఈ కాలానికి ప్రతిబంధకంగా ప్రామాణికం అయిన సహేతుకమైన ఆధారాలులభిస్తే ఈ కాలనిర్ణయంలో మార్పును అంగీకరింపవచ్చు. అంతవరకూ భైరవకవి కాలం క్రీ.శ. 1405-1485 అనే నిర్ణయంలో మార్పుఉండదు.

## 1.4 భైరవకవి నివాసం :

భైరవకవి ముదిగొండ వీరభద్రుని కోరిక మేరకు రత్నపరీక్షను రచించాడు. ముదిగొండ గ్రామం దేవరకొండకు ఆరు మైళ్ళ దూరంలో ఉంది. "గౌరన-భైరవుల స్వగ్రామము కూడ ఇదేయని మిత్రులు తేరాల సత్యనారాయణశర్మగారు రాచకొండ చరిత్రమను గ్రంథమందు వ్రాసిరి" అని శ్రీరంగమహత్త్వం పీఠికలో శ్రీ రంగాచార్య గారు చెప్పారు. 1. ముదిగొండ శైవులకు నిలయం. ముదిగొండ వీరభద్రుని ఆశ్రితుడవటం వల్ల భైరవుని గ్రామం కూడా ముదిగొండ అని భావించటం జరిగింది. కాని దీనిని నిర్ధరించే ఆధారాలు ఇంతవరకూ లభించటం లేదు.

గౌరన పెద్దనాయన అయిన పోతరాజు మాధవపురం నివాసి అని భావించేందుకు ఉమామహేశ్వరశాసనం వీలుకల్పిస్తోంది. కనుక పోతరాజు తమ్ముని మనుమడయిన భైరవకవి కూడా మాధవపురం నివాసి అనేందుకు వీలుంది. ఉమామహేశ్వర శాసనంలో- "దాచయ సింగభూపతి సుతుండైన మేదినీరూప నారాయణ సింగమాంబా గర్భ శుక్త్యుదయ రేచర్ల దుగ్ధాబ్ధి సుధాకరుండైన శ్రీ మాధవేంద్రుండు దేవనగర దక్షిణప్రాంతమందుగల స్వనామాంకిత మాధవపురమందు స్వారాజ్యోప విష్టుండైన —2." అని ఉంది. ఈ శాసనంలో పోతరాజు సింగయ మాధవుని మంత్రి అనికూడా చెప్పబడింది. ప్రభువులున్న చోటనే మంత్రులు కూడా ఉండటం సహజం. కనుక పోతరాజు మాధవపురం నివాసి అని భావింపవచ్చు. కనుక అతని తమ్ముడి మనుమడైన భైరవకవి కూడా మాధవపురం నివాసి అనుకునేందుకు వీలుంది. కానీ ఈ అంశాన్ని సైతం ఇంకా నిర్ధారణ చేసేందుకు ఆధారాలు మృగ్యం, ఏదియేమైనా నాడు

---

1. పుట XXX VII అథసూచికలో
2. ఉమామహేశ్వర శాసనం-"రాచకొండ చరిత్రము"-అనుబంధం-పుట 17-19

భైరవకవి నేటి నల్గొండ జిల్లా ప్రాంత నివాసి అనటం మాత్రం యథార్థం. ఈ విషయంలో పరిశోధకుల్లో అభిప్రాయ భేదాలులేవు.

## 1.5 భైరవకవి మతం :

భైరవకవి భ్రమరాంబా వర ప్రసాద లబ్ధ కవిత్వం కలవాడు. కనుక అతని ఆరాధ్య దేవత భ్రమరాంబిక అని తెలుస్తోంది. గౌరన కూడా అంతే. కనుక భైరవకవి శైవుడు. ఇతడు శైవుడై ఉండికూడా వైష్ణవ ద్వేషికాడు. కేవలం వీరశైవుడుకూడ కాదు. ఎర్రన శంభుదాసుడై ఉండికూడా నృసింహ పురాణాన్నీ, పోతన పరమేశ్వర కలితుడై ఉండి కూడా రామేశ్వర కథా కలిత మైన భాగవతాన్నీ రచించినట్లు భైరవుడు కూడా భ్రమరా వర ప్రసాది అయిన శైవుడై ఉండికూడా శ్రీరంగమహత్త్వాన్ని రచించాడు.

శ్రీరంగమహత్త్వం వైష్ణవుడయిన చాగయ రాఘవుని కోరిక మేరకు రచింపబడినదై కూడా కృత్యాదిలో దైవస్తుత్యాదికాన్నిబట్టి భైరవకవికి వైష్ణవ ద్వేషం లేదనటం స్పష్టమౌతోంది. అదెలాగంటే– పారిజాతాపహరణాన్ని రచించిన నంది తిమ్మన్న శైవుడు. అతడు తన కృతిభర్త అయిన కృష్ణదేవ రాయలు వైష్ణవుడటంచే అతడికి ఇష్టదేవమైన వేంకటేశ్వరుని ఇలా ప్రార్థిం చాడు.– "వేంకటస్వామి గృతార్థు జేయు నరసక్షితి నాథుని కృష్ణరాయనిన్" ఇక్కడ వేంకటస్వామిని కవి తనను కృతార్థుని చేయమనక తన కృతిభర్తను కృతార్థుని చేయమన్నాడు ఇందుకు కారణం తాను శైవుడు తన కృతి భర్త వైష్ణవుడు కావటం ఒక కారణం కాబోలు. భైరవకవి అలాకాక కృత్యాదిలో శ్రీరంగనాథుని ఫలాపేక్ష రహితంగా "పూజింతున్ దయాంభోనిధిన్" అని స్తుతించాడు. కనుక భైరవకవి శ్రీరంగమహత్త్వాన్ని కేవలం కృతిపతిని సంతోష పెట్టేందుకేగాక తానుకూడా వైష్ణవ మతాభిమాని కావటంచే శ్రీరంగ మహత్త్వాన్ని రచించాడని భావింపవచ్చు. కనుక భైరవుడు వైష్ణవమతావలంబి కాకున్నా వైష్ణవ మతాభిమాని అనటం మాత్రం నిజం. అతడు శైవుడే కానీ వైష్ణవ ద్వేషికాడు. వీర శైవుడంతకన్నా కాడు. అందువల్లనే ఎర్రన–పోతనల మాదిరిగ తాను శైవుడయికూడా వైష్ణవ సంబంధమైన గ్రంథాన్ని రచించాడు. ఆ గ్రంథ రచనలో ఆ ఇద్దరి (ఎర్రన–పోతనల) కవితా ప్రభావముద్ర గోచరింప జేశాడు. ఎర్రన–పోతనలది ఏమతమో భైరవునిది కూడా అదే మతం. శైవ మతం. వీరి శైవం వీర శైవంకాదు. వైష్ణవ మతాన్ని కూడా అభిమానించే శైవ మతం.

## 1. 6 భైరవకవి సమకాలీనులు :

పోతనను భైరవకవి ప్రత్యక్షంగా ఎరిగిన వాడని నా అభిప్రాయం. అయితే పోతన భైరవుని కన్న చాలా పెద్దవాడు. పోతన–భైరవులది తండ్రి కొడుకులవలె ఉండే వయస్సు. గౌరన, శ్రీనాథుని అంత్య కాలంలో ఉన్నాడు. గౌరన–పోతనలు ఇంచుమించు సమకాలికులు. నూతనకవి సూరన భైరవకవి దాదాపు సమకాలికుడు. ఇద్దరున్నూ ముదిగొండ వీరభద్రుని ఆశ్రితులే. భైరవుని సమకాలీనులు ఎందరో ఉన్నారు, కానీ వారందరున్నూ పరస్పర పరిచయం కలవారని చెప్పలేం, నిర్ధారింపలేం. కనుక భైరవకవితో పరస్పరం పరిచయం కూడా ఉండి వుంటారనదగిన వారినే ఈ ఉపశీర్షికలో చెప్పటం జరిగింది.

## 1. 7 భైరవకవి బహుముఖ ప్రజ్ఞావైదుష్యాలు :

ఇతడు లాక్షణికుడు. కవిగజాంకుశం అనే లక్షణగ్రంథాన్ని రచించాడు భైరవకవి శాస్త్రకారుడు కూడ. రత్నశాస్త్రాన్ని "రత్నపరీక్ష" అనే పేరుతో రచించాడు. ఈ శాస్త్ర గ్రంథంలో రత్నాలను ఎలా పరీక్షించేది వాటి బాగోగులు మొదలైనవి ఉన్నాయి. "భైరవుడు వేదాంత శాస్త్రమున జక్కగా బరిశ్రమించి నట్లు శ్రీరంగమహత్త్వ పరిశీలనము వలన తెలియుచున్నది. 1" శ్రీరంగమహత్త్వంలో పాంచరాత్రాగమ విధానాలు, విగ్రహాల పద్ధతులు, వాటిని స్థాపించటం మొదలైనవి తెల్పబడ్డాయి. సంగీతాన్ని గురించి కూడా శ్రీరంగమహత్త్వంలో చెప్పబడింది. ఇవన్నీ భైరవకవి బహుముఖ ప్రజ్ఞావైదుష్యాలకు నికషోపలాలుగా ఉన్నాయి. ఇంతటి వాడు కనుకనే భైరవకవి తనను గురించి తన కృతుల్లో– "శ్రీమద్భ్రమరాంబా వర ప్రసాద లబ్ధ సారస్వత"– (శ్రీరంగ. ఆశ్వాసాంత గద్య). "కృతవిద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీ విలాసుండు– కల్యాణ కవిత్వ లక్షణ సమర్థుండు– చంద్రికోల్లసిత విద్వత్కైరవపుడు" (శ్రీరంగ 1-21). "చెప్పెద కావ్యము రసములు చిప్పిల వర్ణనల నింపు చిలుకగ బాకం బుప్పతిల జిత్ర రచనలు చొప్పడ శబ్దార్థ ఘటన సుకవులు మెచ్చన్" (శ్రీరంగ 1-27). "కుకవి మాతంగములను మదము దూలంగ

1. శ్రీరంగమహత్త్వ పీఠిక - పుట V - మానవల్లి రామకృష్ణకవి.

గీపెట్టి మలపువాడ" (కవిగజాంకుశం –5). "ఉభయ భాషా పారీణుడు–దుష్కవి ఘోర పిశాచుల నదల్చుకొను భైరవుడన్" (కవిగజాంకుశం –7) అని చెప్పాడు.

## 1. 8 తెలుగు సాహిత్యంలో భైరవకవి స్థానం :

కవి వచించిన/రచించిన కవిత్వాన్ని/గ్రంథాన్ని బట్టి ఆ కవి స్థానాన్ని నిర్ణయింపవలసి ఉంటుంది. కవిత్వ/కావ్య ప్రాశస్త్యాన్ని ప్రచారాన్ని బట్టి ఆ కవి దానికి తగిన స్థానాన్ని ఆక్రమిస్తాడు. భైరవకవి రచించిన మూడు కృతులు కూడా అతనికి తెలుగు సాహిత్యంలోసముచిత స్థానాన్ని కల్పించేవిగా ఉన్నాయి అలాంటి స్థానాన్ని పరిశీలింతం.

భైరవుడు కవిగజాంకుశాన్ని రచించిన లాక్షణికుడు. కవిగజాంకుశం గణవర్ణాలు – గ్రహాలు – వాటిమైత్రి మొదలైన వాటిని తెలిపే గ్రంథం. ఈ భాగానికి తెలుగులో ఇదే ప్రామాణికమైన గ్రంథం. కనుక గణ సంబంధిత విషయికమైన లాక్షణిక గ్రంథాల్లో ప్రామాణికమైనదిగా రచించిన కవుల్లో భైరవకవిది అగ్రస్థానం అనటం సత్యదూరం కాదు.

ముద్దరాజు రామన, లింగమగుంట తిమ్మకవి, కాకునూరి అప్పకవి, గణపవరపు వేంకటకవి. పొత్తపి వేంకటరమణ కవి మొదలైన లాక్షణికులు కవిజన సంజీవిని, సులక్షణ సారం, అప్పకవీయం, సర్వలక్షణ శిరోమణి, లక్షణ శిరోమణి మొదలైన లక్షణ గ్రంథాల్లో గణ సంబంధిత విషయాన్ని తెలిపేటప్పుడు కవిగజాంకుశంలోని పద్యాల్ని ఉదాహరించటం గమనింపదగిన అంశం. అది భైరవకవికి గల లాక్షణిక స్థానాన్నీ, పూర్వకాలాన కవిగజాంకుశానికి ఉండే ప్రచారాన్ని వ్యక్తపరిచేదిగా ఉంది.

భైరవకవి "రత్నపరీక్ష"ను రచించాడు. అందులో నవరత్నాల లక్షణాలు వాటి పరీక్ష విధానం, వాటి మంచి చెడ్డలూ తెలుపబడ్డాయి. ఈ రంగాన తెలుగు సాహిత్యంలో వెలువడిన రచనల్లో ఇదే ప్రామాణికమైనది. ప్రథమ గణ్యమైనది కూడ. ఇందులోని సాంకేతిక పదాలు వాచస్పత్యంలో కూడా లేవు. కాబట్టే సూర్య రాయాంధ్ర నిఘంటువులో "జర్జరము" అనే మణిదోషానికి లక్ష్యంగా రత్నపరీక్షలోని పద్యభాగం ఈయబడింది. *1. వసుచరిత్ర

1. చాల పొరలున్న జర్జర సంజ్ఞమువును"–రత్న–14. సూర్య. నిఘ. 3వ సం.

మొదలైన గ్రంధాల వ్యాఖ్యాతలు ముత్యాలు, రత్నాలు మొదలైన వాటిని గురించి వ్యాఖ్యానించేటప్పుడు రత్నపరీక్షలోని పద్యాలనే ప్రామాణికంగా ఉదాహరించారు. కనుక (Metallurgyకి) రత్నాలకు సంబంధించిన రచనల్లో భైరవకవి "రత్నపరీక్ష" ప్రామాణికమైనదని స్పష్టమౌతోంది.కనుక ఈవిధమైన శాస్త్ర గ్రంథకారుల్లో భైరవకవిది అగ్రస్థానం.

లభిస్తున్న ఆంధ్రీకృత గరుడ పురాణాల్లో మొట్టమొదటిది భైరవకవి శ్రీరంగమహత్త్వం. ఈ కృతిలోని పద్యాల్ని పెదపాటి జగ్గన్న (16వ శతాబ్దం) తన ప్రబంధ రత్నాకరంలో, అప్పకవి మొదలైన లాక్షణికులు తమ లక్షణ గ్రంథాల్లోనూ ఉదాహరించారు. దీన్నిబట్టి పూర్వం శ్రీరంగమహత్త్వానికిబాగా ప్రచారం ఉండిందని తెలుస్తోంది. కనుక భైరవకవికి తర్వాతి కవులు ఒక స్థానాన్ని కల్పించారని తలచవచ్చు.

నన్నెచోడుని తర్వాతి కావ్యాల్లో[2*]. బంధ కవిత్వానికి స్థానాన్ని కల్పించిన కవుల్లో ప్రథమ స్థానం భైరవకవికే దక్కుతుంది. కావ్యాలలో ఉండే చక్రబంధాల్లో కృతి-కృతికర్త-కృతిభర్తల పేర్లను చెప్పిన కవుల్లో భైరవకవికి ప్రథమస్థానం లభిస్తుంది.

ఇటు ప్రబంధ వాఙ్మయంలోనూ అటు శాస్త్ర వాఙ్మయంలోనూ సమర్థవంతంగా గ్రంథరచన సాగించాడు భైరవకవి. అందువల్ల పరిశోధక పరమేశ్వరులు, విద్యారత్న బిరుదాంచితులు అయిన నిడుదవోలు వేంకటరావు గారు భైరవకవికి ప్రబంధ వాఙ్మయముననే గాక శాస్త్ర వాఙ్మయమునను స్థానము గలదు"[*3]. అని చెప్పారు. వారి మాటలు ప్రత్యక్షర సత్యం అని పై పరిశీలనవల్ల స్పష్టమయింది.

---

2. నన్నెచోడునికి భైరవునికి మధ్య కాలానగల కొన్ని లక్షణ గ్రంథాల్లోనూ, శాసనాల్లోనూ బంధ కవిత్వం గోచరిస్తుంది, కానీ కావ్యాల్లో మృగ్యం.
3. ప్రబంధమణిభూషణం - పుట 76. ఆం.సా. అకాడమి 1971.

# ద్వితీయాధ్యాయం

# 2. శ్రీరంగం - మహత్త్వ పారిశస్త్యాలు

## 2. 1 మాహాత్మ్య కావ్య నిర్వచనం :

తెలుగులోని వివిధ సాహిత్య ప్రక్రియల్లో మాహాత్మ్య కావ్య ప్రక్రియ ఒకటి. ఈ ప్రక్రియ పురాణేతిహాసాల్లోని మాహాత్మ్య వృత్తాంతాన్ని ఆధారంగా చేసుకుని అవతరించింది. మాహాత్మ్య కావ్యాల్లోని ఇతివృత్తానికి దైవభక్తి, మత విశ్వాసం, ముక్తిమార్గం మూలకందాలు. మాహాత్మ్య కావ్యాల్లో స్థల దైవ మహత్త్వాలు వేరువేరుగా గానీ అన్నింటిని గురించి కానీ ఇతివృత్తంగా స్వీకరించటం జరుగును. కొన్ని మాహాత్మ్య కావ్యాల్లో పర్వదిన వార మాస క్షేత్ర భగవంత భగవద్వస్తు మొదలైన-వాటి మహాత్మ్యాలను ఇతివృత్తంగ కలిగి ఉంటుంది. ఇవన్నీ కూడా స్థల దైవ తీర్థ మహాత్మ్యాల్లోని అవాంతర భేదాలని పరిశోధక పండితులు చెప్తున్నారు. *1.

మహిమ శబ్దం మహన్ శబ్దభవం, పూజ్యమైనభావాన్ని తెలిపేదిమహిమ ఆ మహిమను వివరించేది మాహాత్మ్యం /మహత్త్వం. విశ్వం విష్ణు వషట్కార మొదలగు సహస్రనామాలతో పిలువబడే విష్ణువుకు మహాత్మ్యం అనే పేరు ఉన్నట్లు "యాని నామాని గౌణాని విఖ్యాతాని మాహాత్మనః" అనే విష్ణుసహస్ర నామ వచనం తెలియజేస్తుంది. "క్షేత్రము, తీర్థము, దైవము-ఈమూడింటి మహిమలను వర్ణించు వానిని మాహాత్మ్యము లందురు క్షేత్రమనగా పవిత్ర స్థానమని ఆశ్రయని అర్థము. తీర్థమనగా పుణ్యస్థానము, స్నానఘట్టము అని అర్థము. వీనిని గూర్చి ప్రకటించు గ్రంథములే మాహాత్మ్య గ్రంథములు"*2

తెలుగు సాహిత్యంలో శైవ, వైష్ణవ మాహాత్మ్య గ్రంథాలు అనేకం వెలువడ్డాయి. మచ్చుకు-భీమేశ్వర పురాణం, కాశీఖండం, శివరాత్రి మాహాత్మ్యం కాళహస్తి మాహాత్మ్యం మొదలైనవి శైవకావ్యాలు. నృసింహ పురాణం, శ్రీరంగమహాత్మ్యం, ఘటికాచల మాహాత్మ్యం, పాండురంగ మాహాత్మ్యం, వెంక

---

1. శ్రీరంగమహత్త్వం-పీఠిక-పుట XIII-శ్రీరంగాచార్య
2. తిరుపతి క్షేత్ర సమీక్ష (సిద్ధాంత వ్యాసం) - రాంపల్లి నాగభూషణం.

టాచల మాహాత్మ్యం మొదలైనవి వైష్ణవ మాహాత్మ్య కావ్యాలు. "మన ప్రబంధాలకన్న గొప్పనైన గౌరవాన్ని ఈ మాహాత్మ్య గ్రంథాలు పొందినవి. ఉదా: పాండురంగ మాహాత్మ్యము; శ్రీకాళహస్తి మాహాత్మ్యము."

మాహాత్మ్య గ్రంథాలు కొన్ని-తీర్థ ప్రాధాన్యమైన ఇతివృత్తం ఉండేవిగ మరికొన్ని క్షేత్ర ప్రాధాన్యం కలిగి ఉండేవిగ, ఇంకాకొన్ని దైవ ప్రాధాన్యాన్ని కలిగి ఉండేవిగా గోచరిస్తాయి. శ్రీరంగమహత్త్వం క్షేత్ర తీర్థ దైవత అనే మూడింటికిన్నీ ప్రాధాన్యతనిచ్చి ప్రధాన ఇతి వృత్తానికి పోషకాలైన ఉపాఖ్యానాలతో ప్రాశస్త్యాన్ని సంతరించుకుంది. అలాంటి ప్రాశస్త్యాన్ని ఈ అధ్యాయంలో— 1. శ్రీరంగమహత్త్వం-క్షేత్ర ప్రాశస్త్యం, 2, శ్రీరంగమహత్త్వం_తీర్థ ప్రాశస్త్యం, 3. శ్రీరంగమహత్త్వం-దైవ ప్రాశస్త్యం అనే ఉపశీర్షికలో దర్శింతం.-

## 2. 2. 1 శ్రీరంగమహత్త్వం క్షేత్ర ప్రాశస్త్యం :

శ్రీరంగ క్షేత్రం తమిళనాడులోని తిరుచునాపల్లికి ఉత్తరంగా మూడు మైళ్ళ దూరాన కావేరి-కొల్లడం అనే నదుల మధ్యన వెలసింది వైష్ణవ పుణ్యక్షేత్రాల్లో అతి ప్రాచీనతను ప్రాశస్త్యాన్నీ సంతరించుకున్నది శ్రీరంగం. వైష్ణవులు పవిత్ర స్థలంగా భావించే 108 దివ్య తిరుపతుల్లో శ్రీరంగ క్షేత్రం మొట్టమొదటిది. ఇంతటి ప్రాశస్త్యం కలిగిఉన్న శ్రీరంగ క్షేత్ర మాహాత్మ్యాన్ని భైరవకవి గరుడపురాణాంతర్గతమైన కథామూలాన్ని తెనిగించాడు. భైరవకవి తెనుగు సేతలో శ్రీరంగ క్షేత్ర మహత్త్వ ప్రాశస్త్యాలు అనేక విధాలుగా అభివర్ణితమైన క్షేత్ర ప్రాశస్త్యం ఈ ఉపశీర్షికలో చర్చించడమైనది

## క్షేత్రావిర్భావం :

శ్రీమహ విష్ణువును గురించి బ్రహ్మ అనేక సంవత్సరాలు తపస్సుచేస్తాడు. విష్ణువు విరించికి ప్రత్యక్షమై వరాన్ని కోరుకొమ్మంటాడు, "భవదీయ దివ్య రూపము నెల్లప్పుడును అర్చించు మహద్భాగ్యమును ప్రసాదింపు"మని బ్రహ్మ విష్ణువును కోరును. విష్ణువు శేష శయనుడై బృందారక సందోహం కొలుస్తుండగా దివ్య మంగళ రూపంతో బ్రహ్మ పూజకోసం వ్యక్తమౌను. (కనుక శ్రీరంగ క్షేత్రం స్వయం వ్యక్త మూర్తిగల దివ్య క్షేత్రం) ఎక్కడ సాలగ్రామ శిలార్చనం

జరుగుతుందో ఆ ప్రదేశం మూడు ఆమడల వరకూ పుణ్యప్రదేశం అవుతుంది. శ్రీహరి విమానాలు ఎక్కడ విరాజిల్లుతాయో అక్కడ సాలగ్రామ పర్వతమే ఉన్నట్లు, అక్కడి నుండి రెండు యోజనాల దూరం పుణ్యస్థలం అవుతుంది అలాంటి వాటిలో శ్రీరంగధామం ఒకటి.

శ్రీరంగధామాన్ని బ్రహ్మ తపస్సుచేసి విష్ణువువల్ల వరంగా గ్రహించి బ్రహ్మ లోకాన పూజించినట్లున్నూ, తర్వాత వైవస్వత మనువు బ్రహ్మ నుండి రంగధామాన్ని పొందినట్లున్నూ, అతడు తన మనుమడైన ఇక్ష్వాకునికి ఇచ్చి నట్లున్ను ఆ వంశీయుడైన శ్రీరామచంద్రుడు రంగ మందిరాన్ని విభీషణునికి ఇవ్వగా అతడు కావేరి తీరాన ఉంచినట్లున్ను అప్పటి నుండి అది శ్రీరంగక్షేత్ర మైనట్లున్ను క్షేత్ర ఆవిర్భావాన్ని గురించి భైరవకవి శ్రీరంగమహత్త్వం ప్రథ మాశ్వాసంలో చెప్పాడు.

## శ్రీరంగ క్షేత్ర వర్ణనం :

శ్రీరంగం కమలాక్షుని నిజాగారమై మోక్ష పదానికి ఆధారమైందిగా వర్ణిం పబడింది.

కం. సారంబై మోక్షపదా - ధారంబై పుండరీక దళనయన నిజా
గారంబై మహిబరఁగిన - శ్రీరంగమహత్త్వ మతి విచిత్రము దలఁపన్
— శ్రీరంగ 1-82

ఉభయ కావేరీ పరీవాహక ప్రదేశాన, వివిధ పుష్పఫల సంభరిత వృక్షా లతో, లతానికుంజాలతో, నిత్య వసంత భాసురమై, బహు విధ పక్షి జంతు సంతాన నివాసమై, సుందర సరోవరాలతో శ్రీరంగధామ పుణ్యక్షేత్రం అలరా రుతూ ఉన్నట్లు (ప్రథమాశ్వాసంలో) చెప్పబడింది.

"దివ్యమణి కుట్టిమ కుడ్య కవాట వేదికా వినుత విటంక సంజనిత విస్ఫుట ధామము రంగధామము" (శ్రీరంగ 4-222). "అమృతప్రాయములైన తోయముల లోకానందమ్ముంజేయు నీ కమనీయా పగ నీతట ద్రుమ సమగ్ర చ్ఛాయలన్ జాల శీతములై మించిన సైకతంబులను" (శ్రీరంగ 4-233). "విమ త విహగ శ్యేనుండగు విష్వక్సేనుని ...... పార్శ్వ భాగంబున" (శ్రీరంగ 4-237). "సన్నుత మేచక జలధర సన్నిభరుచి గలిగి...... సర్వోన్నతమై

...రంగధామ మున్నది" (శ్రీరంగ 4-238). అది "జలజనాభున కాధారశక్తి యగుచు దనరు శేషాఖ్య నొప్పు నిధామము" (శ్రీంగ 4-247). ఆ ప్రదేశానికి దక్షిణాన ఒక ఉన్నతమైన పర్వతం ఉంది. అక్కడి నుండి రమణీయమైన కావేరీ పరీవాహ ప్రదేశంతో రంగ మందిరం మనోజ్ఞంగా కన్పిస్తుంది. (శ్రీరంగ 4-252, 253). శ్రీరంగ క్షేత్రాన ఎత్తైన మేడలు, శృంగార వనాలు, అతులో ద్యాన ప్రతతులు ఉన్నాయి శ్రీరంగపురం అనిమిషానందకరం, ధనదనివా సమై పుండరీకాక్షయుతమై సర్వమంగళాభిరామమై అలరారుతూ ఉంటుంది. (శ్రీరంగ 4-252, 53, 59, 64, 65). "ఖగ విగ్రహ ప్రముఖా కృతులొగి బూని మహాత్ములందు రొక్కొక యెడలన్" (శ్రీరంగ 5-214) అని కూడా శ్రీరంగ క్షేత్ర ప్రాశస్త్యాన్ని భైరవకవి వర్ణించాడు.

## శ్రీరంగ క్షేత్ర మహత్త్వం :

"శ్రీరంగ మహత్త్వ మతి విచిత్రము దలపన్" (శ్రీరంగ 1-82) అని అనేక విధాలుగా రోమహర్షణుడు శౌనకాది మునులకా శ్రీరంగక్షేత్ర మహిమను విన్పిస్తాడు.

సీ. ఎయ్యెడ లక్ష్మీసమేతుడై వసియించు -
నాది నారాయణుండ విరతంబు
నెచటితోయ స్పర్శ మింతగల్గిన మాత్ర -
నరులు బాపశ్రేణి బరిహరింతు
రెచ్చోట నొకదివం బేని నిల్చినవారి -
కపునర్భ రత్వ మహత్త్వ మొదవు
నెందు దపస్స్థితి జెంది సిద్ధర్షులు -
బహులతా గుల్మ రూపముల నుందు

గీ. రేనెలవునందు దళమాత్ర మైనదునుమ -
బ్రహ్మ హత్య పమంబగు పాప మొదవు
నే స్థలంబున గీతాది హింప సేసి -
పతనమొందు దురతి పుణ్యభావులైన

(శ్రీరంగ 1-111)

మ. సహజ జ్ఞానయుతంబులై సరసభాషల్ ప్రీతి చేతస్సుఖా
వహముల్ గా దగబల్కుచున్ మెలగు సత్యస్ఫూర్తి నెందేని న
య్యహిమార్జాల వృషప్లవంగ నకులవ్యాఘ్ర విశ్వ విద్విట్కురం
గ హరివ్యాఘ్ర మదేభ శల్యరురు ఖడ్గక్రోడ భేరుండముల్
(శ్రీరంగ 1-112)

కం. ఎందు వసించును జేతన - బృందం బాధ్యాత్మికాది పీడావళులం
జెందక యాపదనలజడి-బొందక యాకట గృశించిపోవక యెలమిన్
(శ్రీరంగ 1-113)

సీ. గతవర్తమా నైష్య కాలవేదులు సర్వ
కామవంతులును, సంఘటిత భూత
హితులు, సర్వజ్ఞు, లహీన సత్వులు, దుఃఖ
రహితులు, జ్ఞాన వైరాగ్య యుతులు
బ్రహ్మజ్ఞులధిగత బ్రహ్మతేజులు, పర
స్పర మిత్రులతి పుణ్యపరులు, సములు,
నిత్య శుద్ధాత్ములు, నిర్మలుల్, నిత్యులు
నిర్మముల్, సత్త్వులు, నిత్యతృప్తు

గీ. లనఘు, లవికారు, లద్వంద్వు, లనుపహతులు
సుప్రసన్నులు, సుముఖులు, శుభవచనులు-
నై చరింపుదు రెందు నరామరాసు
రాదు లిచ్ఛావహ కృతులగుచు నెపుడు
— శ్రీరంగ 1-114

మ. వినవేర్చుంజెవిటైన, మూఢుడయినన్ విద్వాంసుడౌ, వెర్రియై
నను విజ్ఞానియగున్, ఖలుండు నతిశాంత స్వాంతుడౌ, వక్రుడై
నను సౌమ్యాకృతిదాల్చు బాపరతుడైనన్ దోషనిర్ముక్తుడౌ
ఘన పుణ్యంబగునే ప్రదేశము చొరంగాగల్గు మాత్రంబునన్
— శ్రీరంగ 1-115

ఎక్కడ లక్ష్మీసమేతుడై ఆదినారాయణుడు ఎల్లప్పుడూవసిస్తాడో, ఎక్కడ జలస్పర్శ యిసుమంత మాత్రం కల్గటం వల్ల నరులు పాప విముక్తులవుతారో ఎక్కడ ఒకదినం ఉంటే అపునర్భరత్వ మహత్త్వం కలుగుతుందో, ఎక్కడ తపస్స్థితిలో సిద్ధర్షులు లతాగుల్మ రూపాల్లో ఉంటారో, ఏచోటగల (మొక్కల) దళాలను దునుమటం వల్ల బ్రహ్మ హత్యాతుల్యమైన పాపం సంభవిస్తుందో ఎక్కడి కీటాది హింస వల్ల అతిపుణ్యులు కూడా పతనమౌతారో అలాంటి స్థలమే శ్రీరంగ క్షేత్రం. అంటే శ్రీరంగ క్షేత్ర మహత్త్వ ప్రాశస్త్యం అలాంటి దన్నమాట.

సాధువులు ఎక్కడ నివసిస్తే ఆధ్యాత్మికాభివృద్ధులకు ఆటంకం కలుగక అపదలు ఆలజడులు పొందక అకలితో కృశించిపోక ఉంటారో అలాంటి పవిత్ర స్థలం శ్రీరంగ క్షేత్రం. అంటే శ్రీరంగ క్షేత్ర మహత్త్వ ప్రాశస్త్యం అలాంటి దన్నమాట. త్రికాలజ్ఞులు, సర్వకామవంతులు, భూతహితులు, సర్వజ్ఞులు, మహాసత్వ వంతులు, నిత్య సంతోషులు, జ్ఞాన వైరాగ్య హితులు, బ్రహ్మజ్ఞులు, నిత్యశుద్ధులు, నిర్మలులు. నిర్మములు, నిత్యతృప్తులు, అనఘులు, అవికారులు, ద్వంద్వాతీతులు, నిత్య ప్రసన్నులు, సుముఖులు, శుభవచనులు అయిన దేవదానవులు మొదలైన వారు ఇష్టానుసారంగ వివిధ రూపాల్ని ధరించి శ్రీరంగ క్షేత్రంలో వెలసి ఉంటారు. అలాంటి నిత్య మహిమాన్వితమైన ఈ క్షేత్రంలో బధిరులైనా కూడా వినగల్గుతారు, మూఢుడయినా విద్వాంసుడవుతాడు, వెర్రి అయినా విజ్ఞాని అవుతాడు, దుర్మార్గుడు సైతం శాంత స్వభావుడవుతాడు, వక్రుడైనా సౌమ్యాకృతిని దాల్చగలడు, పాపరతుడైనా దోషనిర్ముక్తుడౌతాడు. శ్రీరంగ క్షేత్ర ప్రదేశాన్నిచొచ్చిన మాత్రానచే ఇలాంటి మార్పు కలుగుతుంది. అంటే ఈ క్షేత్రం చాలా మహిమాన్వితమైన దని తెలుస్తుంది.

శా. ఏ పుణ్యాయతనంబు జొచ్చినియతిన్ వీక్షించు పుణ్యుల్ మహా
పాపశ్రేణి జయించి నిర్మలమతిం బ్రాపించు సుజ్ఞానులై
తాపంబుల్ పెడబాసి దండధర దూత వ్రాతముందోలి యు
వ్యాపన్నంబగు సత్పథంబున దుదిన్ వర్తింతు రత్యంతమున్

— శ్రీరంగ 1-118

కం. కృతనిష్ఠీవన పతిత-ప్రతిభాషానృత దురుక్తి పరవాదుల స
న్మతి శ్రీరంగము బేర్కొను-నతఁడ ఘముల బాసి పొందునచ్యుత
పదమున్ — శ్రీరంగ 1-119

గీ. అతి విదేశ వాసులైన నన్యద్వీప-నిలయులైన భక్తినివ్వటిల్ల
జేతులెక్కి మ్రొక్కి శ్రీరంగమునకెదు-రై భజించి కాంతురభిమతముల
— శ్రీరంగ 1-120

శ్రీరంగధామాన్ని ప్రవేశించిన పుణ్యులు సుజ్ఞానులై పాపశ్రేణిని బాసిన వారై తాపాన్నిబాసి నిర్మల మతిగలవారై యమదూతల్ని పారదోలి చివరకు అత్యున్నతమైన సత్యపథాన్ని పొందగలరు. ఉమ్మివేయటం, దూషణ, తిరస్కారం, దురుక్తి, అపశబ్దం పల్కటం మొదలయిన వాటివల్ల కలిగే దోషాలు శ్రీరంగం పేరును ఉచ్చరించిన మాత్రాననే తొలగిపోతాయి. విదేశాలందున్న వారు కూడా భక్తితో శ్రీరంగక్షేత్రం వైపునకు తిరిగి చేతులెత్తి మ్రొక్కితే వారు తమ తమ అభిమతాల్ని పొందగలరు. (శ్రీరంగ 1-118, 119, 120). ఇలా శ్రీరంగ క్షేత్ర మహిమ ప్రాశస్త్యం అనేక విధాలుగా చెప్పబడింది.

విష్ణువాసర సమయాన ఉపవాసముండటం, తులసిని ఆస్వాదించటం, చంద్రపుష్కరిణి తీర్థావగాహనం చేయటం, రంగధామంలోని అర్చామూర్తిని దర్శించటం, గీతను పఠించటం మొదలైనవి ఒక జన్మలో కలిగిన మాత్రననే వారు జగత్ పూజ్యులవుతారు అలాంటి వారు విష్ణు సమానులు (శ్రీరంగ 1-121). శ్రీరంగ క్షేత్రాన చాతుర్మాస్యం చేస్తే కలిగే పుణ్యం మరే ఇతర పుణ్య ప్రదేశాల్లో ఆచరించినా కూడా కలుగదు. (శ్రీరంగ 1-122),

కం. గురుమతి శ్రీరంగమునకు-నరిగిన సుజనుండు భక్తి నతనికి నన్నం
బరసి యిడునతడు లోకో-త్తర చరితులుదుహినబింబదళన స్ఫూర్తిన్
— శ్రీరంగ 1-124

కం. శ్రీరంగ భవనమున ముద -
మారగ నొకరాత్రి యున్నయట్టి ఘనులు దు
ర్వార మహా పాతక శత -
పారం పర్యముల వలన బాయుదురనఘా
— శ్రీరంగ 1-123

శ్రీరంగ క్షేత్రానికి వెళ్లిన సజ్జనుడికి అన్నం పెట్టేవారు సైతం లోకోత్తర చరితులు అవుతారు (1-124), శ్రీరంగంలో ఒకరాత్రిఉండిన ఘనులు దుర్వార్యమైన పాతకాలను కూడా పోగొట్టుకోగలరు. (1-123). శ్రీరంగ క్షేత్రాన్ని దర్శించిన మాత్రాననే ప్రతిదినం కూడా తిలపాత్రాదులు దానం చేసినంతటి ఫలితం కలుగుతుంది. రని కన్యారాశిలో ప్రవేశించే సమయాన మాఘమాసంలో కృష్ణపక్షాన శ్రీరంగ క్షేత్రంలో పితృ కృత్యాలు చేస్తే వారి పితృసమాజం అక్షయస్థితిని అందగలరు (1-129).

మ. శ్రుతికోటిం బ్రణవంబు, వైష్ణవ వర స్తోత్రంబు లందంబికా
పతి, పెన్నేరులగంగ, వేల్పుగమిలో పద్మాక్షు, డెబ్భంగిను
న్నత కీర్తిన్ విలసిల్లు రట్టు మహిపుణ్యక్షేత్ర జాలంబులో
గత నానాఘ నికాయమైదనరు రంగ క్షేత్ర మాకల్పమై

— శ్రీరంగ 1-132

వేదాల్లో ఓంకారం, వైష్ణవ స్తోత్రవరుల్లో శివుడు, నదుల్లో గంగ, దైవతాల్లో కమలాక్షుడు, ఎలా మంచి పేరుగలవారో అలాగే పుణ్యక్షేత్రాల్లో శ్రీరంగ క్షేత్రం గొప్పది.

"స్వయంభువుల యందెల్లన్ గడున్నెట్టియై క్షపితా శేష దురంత దోష చయమై కల్పాంతర స్థాయియై యపవర్గప్రద యోజన ద్వయయుతంబై భవ్యమై దివ్యమై.........వేదాంత విఖ్యాతమై"నది శ్రీరంగ పుణ్యక్షేత్రం (శ్రీరంగ 1-210).

గోహత్య మొదలైన అనేక పాతకాలను ప్రతిదినం ఆచరించే వారి దోషాలను సైతం శ్రీరంగ క్షేత్రాన హరిని సేవించటంవల్ల నివారణమౌతాయి (శ్రీరంగ 1-123), శ్రీరంగ క్షేత్ర స్మరణం వల్ల నారకం నాకం అనే రెండున్నూ ఖిలములౌతాయి (1-217). అనగా అలాంటి వారు శాశ్వత పదాన్ని పొందుతారన్నమాట. శ్రీరంగ క్షేత్ర మహత్త్వ ప్రాశస్త్యం అలాంటిది. మర్త్యలోకం నుండి గానీ అంబరం నుండిగానీ మరియెక్కడి నుండి గానీ శ్రీరంగ పుణ్యక్షేత్రం వైపునకు తిరిగి నమస్కరిస్తే అలాంటి వారికి పుణ్యం ప్రాప్తిస్తుంది (శ్రీరంగ 1-218).

కం. ధారుణిగల నానావిధ-దారుణ దురితములోనర్చు తామసులైనన్
శ్రీరంగ దివ్య దేశము-జేరగ గలిగినను ముక్తిజెందుదు రధిపా
(శ్రీరంగ 2-13)

వివిధ పాపాల్ని చేసిన నరులు సైతం శ్రీరంగ క్షేత్రాన్ని చేరగలిగితే వారు ముక్తిని చెందుతారు. శ్రీరంగ క్షేత్ర నివాసం వల్ల "క్రిమికీట విహగ మృగ తిమి కమఠాది ఖగోరగములుగను తమ తమ తిర్యక్త్వము దొరగి శాశ్వత స్థితి" పొందును (శ్రీరంగ 2-14).

చంద్ర పుష్కరిణీ ప్రాంతాన విభీషణునిచే శ్రీరంగ మందిరం ప్రతిష్ఠితమైనప్పటి నుంచీ కల్పాంతం వరకు అక్కడే ఉండి ఆ తర్వాత ఆ ధామం బ్రహ్మలోకానికి పోతుంది (శ్రీరంగ 2-10).

బ్రహ్మలోకం నుండి రంగ మందిరంతోపాటు తానుసూర్యవంశ రాజుల రాజధాని అయిన అయోధ్యలో నాలుగు మహా యుగాలు ఉంటానని తర్వాత చోళ మండలాన కావేరీ తీరాన చంద్ర పుష్కరిణీ ప్రదేశాన ఏడు మన్వంతరాలు ఉంటానని బ్రహ్మకల్పం ముగిసిన తర్వాత తిరిగి బ్రహ్మలోకానికి వస్తానని శ్రీమహా విష్ణువు చెప్పాడు. — (శ్రీరంగ 2-104, 5).

"ప్రతిమాసమారాధనంబు చేసి యొకవాసరంబు లేక యున్న మహాదోషము సంభవించు, బ్రాయశ్చిత్తబును వలయు, నారునెల లెడపడిన బునః ప్రతిష్ఠాపనంబు కర్తవ్యంబు తత్ప్రసాదకైంకర్యాదు లొదవినం బ్రతివిధానం బవశ్య కర్తవ్యంబని తత్పరవేదు లెన్నుదురిన్నియమంబులన్నియు దివ్య సైద్ధమానుషార్చనల యందకాని భుక్తి ముక్తి నిదానంబై స్వయం వ్యక్త ప్రధానంబైన శ్రీరంగంబందున లేవు" — శ్రీరంగ 2-106).

"కావేరీ తీరము పరమాహ్లాదమైనది, చంద్రపుష్కరిణీ వారి సుధానుకారి, శ్రీరంగమున పురనిర్మాతయగు ధర్మవర్మ జనలోకస్తుత్యుడు, అచటి మునులు మద్భక్తులు. కనుక శ్రీరంగ క్షేత్రము నాకు ఇష్టమైన నివాస స్థానము" అని శ్రీరంగ నాయకులు చెప్పాడు. — (శ్రీరంగ 2-169)

కం. విలయ సమయమున గలజడి
నలజడి బడి భువన నివహ మడగెడు నపుడున్

జలశాయి నిలయమగు నీ
లలిత క్షేత్రము నిరాకులత బొలుపారున్ — (శ్రీరంగ 3-111)

ప్రళయ కాలాన-భువనాలు నాశనమయ్యే సమయాన శ్రీరంగ లలిత క్షేత్రం నిరాకులతతో ఉంటుంది. "సర్వశక్తిమయము జగతి శ్రీరంగంబు" (శ్రీరంగ 3-112).

బ్రహ్మచేత నియమితులైన మహా బలవంతులగు భూతేశులు శ్రీరంగ క్షేత్రాన కావలి ఉంటారు.

మ. క్రమ యోగంబున నెన్నగాబడు కళా కాష్ఠాదులం బేర్చుకా
లముచే భూతచయంబులెల్ల నవలీలం సంక్షయం బందునా
కమలాక్ష ప్రియ ధామమై మెరయు రంగ క్షేత్ర మందెప్పుడున్
బ్రమదంబార వసించు ప్రాణుల హరింపజాలదా కాలమున్
— శ్రీరంగ 3-131

కాలం చేత బంధింపబడే భూతచయాన్ని అజ్ఞాపించవచ్చు గానీ శ్రీరంగ క్షేత్రంలో నివసించే ప్రాణుల్ని ఆ కాలం కూడా ఏమీచేయలేదు.

శ్రీరంగ క్షేత్ర మహత్మ్య ప్రాశస్త్యాలు ఇలా బహు విధాలుగా వ్యాసుడు నాగదంతుడికి చెప్పినట్లు శ్రీరంగమహత్త్వంలో కలదు. శ్రీరంగక్షేత్ర మహాత్మ్య ప్రాశస్త్యాలను కావ్యంలోని ప్రతి ఆశ్వాసంలోనూ చెప్పిన ఫలశ్రుతి పద్యాలు కూడా నొక్కిచెప్తున్నాయి. ఉదాహరణకు అలాంటి పద్యాలు కొన్ని—

ఉ అంచిత రంగ మండల మహాత్త్వము వైష్ణవకోటి కింపు రె
ట్టించ లిఖించి యిచ్చిన బఠించిన విన్న ధరించినన్ జనుల్
సంచిత పుణ్యులై సకల సంపదలం బెనుపొంది కీర్తి దీ
పించి సుఖించి పొందుదురు ప్రీతి ముకుందపదస్థితిన్ తుదిన్
— శ్రీరంగ 1-134

ఉ. ఈ కథ విన్న వ్రాసిన బఠించిన నాయు రనామయత్వముల్
చేకురు వేద విత్త్వ రిపుజిత్త్వ ధనిత్వ సుఖిత్వముల్ దిరం
బై కలుగున్ మహీసుర నృపార్య బఘన్యజ కోటి కున్నతుల్
బైకొను వంధ్య పుత్రుగను బాయుసనేక భవార్జితాఘముల్
— శ్రీరంగ 2-197

కం. ఈ కథ విను నరుడఘముల-
సోకక యధికార నిరతి స్రుక్స్రక శుభమల్
గైకొనుచు నుండు నిచ్చటి-
శ్రీకరగంధర్వ పథము జెందుదు రచటన్

— శ్రీరంగ 3-301

కం. అని ప్రాచేతసుడాదర -
మెనయ భరద్వాజ మునికి నెరిగించిన యీ
వినుతేతిహాస పఠనం -
బున నరులకు నుభయలోకములు పెంపొందున్

— 4-282

సీ. గ్రహణ కాలంబున కపిలా సహస్రంబు -
నవనీ సురల కిచ్చినట్టి ఫలము
భూరి యాగములుసంపూర్ణ దక్షిణలిచ్చి -
కావించునట్టి సత్కర్మ గరిమ
పసిడి పుష్పముల సద్భక్తి సాలగ్రామ -
పూజనం బొనరించు పుణ్యమహిమ
సతతత జపతప స్వాధ్యాయ నోపాస -
సువ్రతంబుల వచ్చు సుకృత చయము

యవని యంతయు సత్పాత్రమైన యతని
కొసగ నెసగెడి పుణ్య ధర్మోన్నతియును
గలుగ శ్రీరంగ మాహాత్మ్య మెలమి జదువ
నలఘు మతులకు విను విమలాత్ములకును

— శ్రీరంగ 5-260

కం. ఈ యాఖ్యాన రతిన్ సచి -
రాయువు నారోగ్యమును గులాభ్యున్నతియున్
శ్రీయు బహు పుత్రలాభము -
బాయని సౌఖ్యములు విష్ణుభక్తియు గలుగున్

— శ్రీరంగ 5-261

## 2. 2. 2. శ్రీరంగమహత్త్వం - దైవప్రాశస్త్యం

దైవ శబ్దం దేవశబ్దం నుండి ఏర్పడింది. శ్రీరంగాన వెలసిన దేవుడు శ్రీరంగనాయకులు. శ్రీరంగక్షేత్రాన వెలసి ఉండటంచే అక్కడి దైవాన్ని శ్రీరంగనాయకులు, శ్రీరంగనాథుడు, శ్రీరంగేశుడు, శ్రీరంగస్వామి అని పిలువ బడుతున్నాడు. "శ్రీరంగం" అనే సమాసం "శ్రీ" – "రంగం" – అనే రెండు పదాల సమాహారం. సంస్కృతంలో రంగం అంటే వేదిక ఉన్నతాసనం అని అర్థం. కనుక శ్రీరంగం అంటే పరమ పవిత్రమైన స్థానం అని చెప్పికోవచ్చు. శ్రీవైష్ణవులకు శ్రీరంగం పరమ పవిత్రమైన స్థానాల్లో ముఖ్యమైంది.

శ్రీరంగంలో ఉండే దైవం స్వయం వ్యక్త అర్చామూర్తి స్వరూపాన భక్తులతో సేవలందుకుంటున్నాడు. అర్చామూర్తుల్లో స్వయం వ్యక్తాలు శ్రేష్ఠతమాలు. "స్వయం వ్యక్తంబును తేజోమయంబును ప్రణవ స్వరూపంబును ప్రభూత వైభవాభిరామంబును నగు శ్రీరంగ ధామంబున" (శ్రీరంగ 1-192) శ్రీరంగనాయకులు ఇలా ఉంటాడు— "తలగడ గానిడి తలమూది వలచెంప గుడిహస్త మెత్తుగానిడి మేలి చే దొడవుల మెరుగు దాపలుమించు పెరకేలు కటిజాచి సిరిమేని పొందున-జిత్తంబు సోగయింప నరమోడ్పు కన్నులనమరి- అకుంఠితోన్న తంబగు వామ పదంబున బిరుదు నూపురము శోభిల్లి - మొల కన గవుల దెలివొందు మోము – మేరుపుగల మేఘరుచి బొల్చుమేను – ఉరగ శయ్యపై నొదికిలి - శ్రీరంగశాయి యలరారును" – (శ్రీరంగ 1-195)

శ్రీమన్నారాయణుని ప్రార్థించి బ్రహ్మ ఆ దేవదేవుని దివ్య మంగళ విగ్రహాన్ని ప్రతిరోజూ సేవించేందుకు వీలు కల్పింపమని కోరగా – శ్రీహరి శ్రీరంగశాయి రూపాన శ్రీరంగ ధామంతో సహా స్వయం వ్యక్త అర్చామూర్తి స్వరూపాన్ని బ్రహ్మకు అర్చనార్థం ఇచ్చాడు.

### దైవం (శ్రీరంగనాధుడు) వెలసిన సందర్భం :

సుబోధుడు, సత్యుడు అనే ఇద్దరు మహర్షులు గంగా తీరాన తపస్సు చేస్తుండగా ఇంద్రుడు అందుకు భయపడి వారికి అంతరాయం కలిగించాడు. ఆ ఋషులు ఇంద్రుడితో ఘర్షణ పడక అక్కడి నుండి బయలుదేరి ప్రసిద్ధ తీరాలను దర్శిస్తూ క్కావేరీ తీరానికి వచ్చారు, ఒకనాటి సాయం సమయాన

కావేరీనది సరభస గమనాన పొంగులు వారింది. నది ఉరవడికి వారి దండా జినాలు కొట్టుకపోయాయి. ఆ నది అలాగే ఉద్వేగంగా పారుతుంటే తన వీచి కలతో లోకాన్ని ఏకం చేస్తుందని సుబోధుడు కావేరీనది ఇంకునట్లుగ మొత్తం జలాన్ని ఆపోశనం చేసేందుకు దోసిలి ఎత్తాడు. అపుడు దశదిశలు కంపిం చాయి. అపుడు "ఓ బ్రాహ్మణులారా! కావేరి సామాన్యమైనదికాదు. అమృత ప్రాయమైన జీవనది. సనంసనందన ప్రముఖ ప్రసిద్ధ సిద్ధముని శుద్ధాంతః కరణ సిద్ధాంతీ సుకృత వస్తువిస్తారంబై రామాభిరామ హేమ ధామా కలిత హరినీలమణి కరండంబై శేషశయనంబు' శ్రీరంగంబు శ్రీరంగ ధర్మంబు అను నామంబుల భవ్యంబైనదిగా నవ్యయంబైన తదుభయ ప్రవాహ పరిపాలితంబై మెరయునదిగావున నీపుణ్యతరంగిణి సరస భాజనంబైనదిగాని విరస భాజంబు గాదు" (శ్రీరంగ 1-158) అని అంతర్హితుడగు ఒక దివ్య పురుషుడు జలద గంభీర స్వనంతో ఉద్ఘోషించాడు. అపుడు ఆ మునులు ఆశ్చర్యపడి "నీ దివ్య రూపంబు సొంపుమీర నాకు జూపవలయు" (శ్రీరంగ 1-164) అని ప్రార్థింపగా శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై తాను రంగ మందిరాన భక్తులను కాపాడేం దుకు నిలిచి ఉన్నానని చెప్పాడు. ఈ కథలో రంగ మందిరాన రంగేశుడు వెలసిన సందర్భం తెల్పబడింది. శ్రీహరి స్వయంభువుగ రంగ మందిరాన వెలసి ఉండటంవల్ల ఇక్కడి అర్చామూర్తి ఇతర వాటికన్న కూడా చాల ప్రాశస్త్యం కలదిగా ఔతుంది. అర్చామూర్తి భేదాలలో స్వయం వ్యక్తాలు శ్రేష్ఠతమమైనవని ఆర్యోక్తి.

## క్షేత్ర దైవ వర్ణన :

రంగ మందిర మయ్యిందిర తోడగూడి యను రక్తిన్ యోగ నిద్రాళుడై హరి యున్నాడు. జగత్కుటుంబ పరిరక్షాయత్త చిత్తంబునన్" (శ్రీరంగ 1-193) "ఊర్ధ్వాధః స్థలంబుల గనక మహీమండలంబులును, మధ్య భాగంబున శ్రీదేవియు, నభ్యంతరమున ననంత భోగియు, బ్రతిహారాంతికంబున-జయ విజయులు, పార్శ్వ భాగంబుల దుర్గా హేరంబులును, శిఖరంబున ప్రణవ స్వరూపిణియగు భారతియు, గనక కలశంబుల నామ్నాయ సముదాయం బును, నాసాముఖంబున రహస్య జాతంబును, పాదతలంబున గ్రతుప్రత తియు, నంగుళీ సంచయంబుల యజనంబును, నుదరంబున హవిర్జలంబును

మరియు నెడ నెడ బాకశాసన పరేతరాజ పలలాశన పాశపాణి పవమాన పాల స్త్ర్యపాశుపతులును నాదిత్య రుద్ర మరుదశ్విని విశ్వదేవ సిద్ధ సాధ్యులును, సప్తర్షులు నక్షత్ర గ్రహతారకంబులు నాదిగాగల చరాచర భూతజాలంబు లెల్లను" రంగ మందిరాన బప్పారెను (శ్రీరంగ 1-194). శ్రీరంగ నాధుని స్తుతించే సందర్భాన బ్రహ్మపలికిన దండకంలో శ్రీరంగనాధుడు రమణీయంగా వర్ణితమయ్యాడు. (శ్రీరంగ 1-197).

## దైవ మహిమ :

శ్రీరంగే రుచిరాయస్య శ్రీరంగే రుచిరాయతా
సదైవతః శరణ్యానః సదైవత ముపాస్మహే

— (శ్రీరంగ 1-98).

అని శ్రీరంగేశుని బ్రహ్మ ప్రార్థించినట్లు శ్రీరంగమహత్త్వంలో ఉంది.

శ్రీరంగనాధుని పాద పద్మాలను శరణు చొచ్చుట పాపావరణముల హరింపజేసేందుకు మార్గమనీ, శ్రీమన్నారాయణుడు లక్ష్మీసమేతుడై రంగ ధామంలో ఉంటాడు కనుక ఆచోట స్పృశించిన మాత్రాన- ఒకదినం అక్కడ ఉండిన మాత్రాన- సర్వ పాపాలు పరిహారమౌతాయి (శ్రీరంగ 1-111). శ్రీరంగనాధుడు ఉండిన అ క్షేత్రంలో జాతి వైరాలు మరచి జంతువులు సైతం పరస్పరం అన్యోన్యంగా మసలుతుంటాయి (శ్రీరంగ 1-113).

మ. నరులైనన్ సురలైన దైత్యవరులైనన్ సన్నుత ద్వాదశా
క్షర మంత్రైక పరాయణత్వమున నన్ సద్భక్తి సేవించినన్
బరమైశ్వర్య సమగ్ర భోగవితతిన్ బ్రాపించి సర్వోత్తర
స్థిర వైకుంఠ పదంబు జెందుదురు ప్రీతిన్ కర్మ నిర్ముక్తులై

— (శ్రీరంగ 1-211)

శ్రీరంగనాధుని ద్వాదశాక్షర మంత్రంతో సేవించిన వారు నరులుగానీ సురలుగానీ, అసురులుగానీ, ఐశ్వర్యాది భోగాలను కలిగి ఉత్తమమగు వైకుంఠ పదాన్ని పొందుతారు.

శ్రీరంగమాహాత్మ్య కథాపఠన శ్రవణాదులవల్ల సర్వాభీష్టాలు కలిగి సర్వో త్కృష్టమైన పదం సిద్ధిస్తుందని ఫలశ్రుతిగా చెప్పిన పద్యాల్లో ఉంది. ఈ) పద్యాలు వెనుకటి పుటల్లో ఉదాహృతం.)

## దైవమహిమను తెలిపే ఉపాఖ్యానాలు :

శ్రీరంగ క్షేత్రాన వెలసిన దైవమహిమల్ని తెలిపే ఉపాఖ్యానాలు "శ్రీరంగ మహత్త్వం"లో రెండు ఉన్నాయి. అవి : 1. కుశలుని కథ, 2. ప్రభాకరుని కథ, ఈ రెండు ఉపఖ్యానాలున్నూ పంచమాశ్వాసంలో చెప్పబడ్డాయి. ఆ ఉపాఖ్యానాల్లోని దైవమహిమను తెలిపే కథల సంగ్రహ సారాంశం ఇలా ఉంటుంది—

### కుశలుని కథ :

పూర్వం కుశలుడు అనే సూర్య వంశపురాజు ద్వాదశీవ్రత పరాయణుడై ఉంటాడు. అతడు ఒకనాడు యమధర్మరాజును చూసేందుకు వెళ్లాడు. ఆయన అక్కడ నరకబాధల్ని అనుభవించే పాపుల్ని చూసి దీనాననుడై వీరికి విముక్తి మార్గం లేదా అని యముడిని అడిగాడు. యముడు "విధిని దాటేందుకు ఏవ్వరివశం?" అని సమాధానమిచ్చాడు. అపుడు కుశలుడు "యమధర్మరాజా! నీవు సకల ప్రాణుల పుణ్య పాపాలు ఎరిగి ఉంటావుకదా! నేను చేసిన పుణ్యం ఏదైనా ఉంటే చెప్పండి" అన్నాడు. అపుడు, యముడు "నీవు ద్వాదశీ వ్రతం నిష్ఠతో ఒక సంవత్సరం చేశావు. దాని ఫలం ఇంతింత అని చెప్పేందుకు సాధ్యం కాదు" అని చెప్పాడు. అపుడు కుశలుడు నారకుల విముక్తికి తన వ్రతఫలంలో ఎంతఈయవలెనో యముడినిఅడుగగా అతడు"ఒక నాటి వ్రత పారణ ఫలం చాలును. దానివల్ల నారకులందరున్నూ దేవలోకానికి పోగల"రని చెప్పాడు. అది విని కుశలుడు తాను ఆచరించిన ఒకనాటి ద్వాదశీ వ్రత ఫలాన్ని వారికి ఇచ్చాడు. అప్పుడు నారకులందరున్నూ సిద్ధచారణులు కొలువగా దివికి వెళ్లారు అపుడు కుశలుడి కారుణ్యభావానికి యముడు సంతో షించి హరిభక్తి పుణ్యఫలం చూచావుకదా! అని సంభావించి వీడ్కొలిపాడు.

రంగనాథుడి సన్నిధిలో ద్వాదశీవ్రతంచేస్తే సర్వదోషాలు తొలగి అనంత పుణ్యాలు కలుగుతాయని ఈ కథ తెలియజేస్తుంది. ఈ కథలో దైవమహిమ

తోపాటు ద్వాదశీవ్రత మహిమ కూడా చెప్పబడింది. అయితే ఆ వ్రతం దైవ సంబంధి కావటంవల్ల ఈ ఉపాఖ్యానం దైవమహిమను తెలిపేదని చెప్పవచ్చు.

## ప్ర భా క రు ని క థ :

గర్గ గోత్రజుడైన ప్రభాకరుడు అనే ముని తపశ్శక్తిచే పరమాయువును పొంది సంపూర్ణ వేదపాఠం చేయాలని కోరి ఘోరమైన తపస్సును చేస్తాడు. బ్రహ్మ ప్రభాకరునికి రెండుసార్లు ప్రత్యక్షమై అతడి కోరిక అసాధ్యమని చెప్పి వెళ్ళాడు. కాని ప్రభాకరుడు పట్టు వదలక తపమాచరిస్తాడు. అతడికి సూర్యుడు ప్రత్యక్షమై సునేత్రుని కథ చెప్తాడు. ప్రభాకరుడు సునేత్రుని దగ్గరకు వచ్చి తన వృత్తాంతాన్ని తెలుపగా అతడు ప్రభాకరునితో "నారాయణుని ఆరాధనం వల్ల పొందరానిది లేదు" అని చెప్పాడు. అపుడు ప్రభాకరుడు చంద్రపుష్కరిణి దగ్గరకు వచ్చి ఘోరమైన తపస్సు చేస్తాడు. దానికి శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై వేదాలన్నింటినీ పారము ముట్ట చదివే విజ్ఞానాన్ని ఇచ్చాడు. ప్రభాకరుడు భారతీదేవి చెంత హంసల రూపంలో ఉన్న వేదాలు ఉమిసిన హంసపు ముక్కల్ని పక్షిరూపి అయి భుజించి సర్వవేదాలను పొందాడు. శ్రీరంగ క్షేత్రానఉండే తరులతాదులు పశు పక్ష్యాదులు కూడ శ్రీరంగనాథుని కృపాకటాక్షంవల్ల పుణ్య పురుషులై కామితార్థాలను పొందుతారని ఈ ఉపాఖ్యానం తెలియజేస్తుంది.

ఇలా—పైరెండు ఉపాఖ్యానాలున్నూ క్షేత్ర ప్రధాన దైవమైన శ్రీరంగనాథుని మహిమా ప్రాశస్త్యాలను తెలిపేవిగా ఉన్నాయి.

## 2. 2. 3 శ్రీరంగమహత్త్వం - తీర్థప్రాశస్త్యం :

తీర్థ శబ్దానికి అనేక అర్థాలున్నాయి. మహర్షులు స్నానం చేసిన పుణ్యోదకం—పుణ్యనది—రేవు—జలం—పుణ్యక్షేత్రం-పుణ్యస్థలం—యజ్ఞం—శాస్త్రం—ఉపాయం— పాఠం. మొదలైన అర్థాలున్నాయి. సంసార దుఃఖాన్ని పోగొట్టేది తీర్థం అని అర్య నిర్వచనం.

శిష్టరక్షణ దుష్టశిక్షణచేసేందుకు భగవంతుడుఏదైనా ఒక ప్రదేశంలో అవతరిస్తాడు ఆ అర్చారూపంకూడా ఆయాప్రదేశాలలోనెలకొంటుంది. అలాంటి ప్రదే

దైవక్షేత్రాలు. పుణ్యక్షేత్రాలు సాధారణంగా అలాంటి పుణ్యక్షేత్రాలు నదీతీరాన గానీ జలాశయాల ప్రక్కనగానీ ఉంటాయి. ఆ క్షేత్ర దైవాన్ని పూజించేందుకు వెళ్ళే భక్తాదులు చిత్తంతోపాటు దేహం కూడ నిర్మలంగ ఉండేందుకు ఈ తీర్థాలు ఉపకరిస్తాయి. తీర్థాలు కొన్నిచోట్ల ఎంతో పవిత్రతను ప్రాశస్త్యాన్ని మహిమనుకలిగిఉండి ఆయాక్షేత్రాల ఖ్యాతిని ఇనుమడింపజేసేవిగా ఉన్నాయి.

శ్రీరంగ క్షేత్రంలో ఉండే తీర్థాల ప్రాశస్త్యాన్ని గురించి ఈ ఉపశీర్షికలో తెలుసుకుందాం– శ్రీరంగ క్షేత్రం కావేరీ నదీ తీరాన ఉంది. కావేరీ జలాలు పవిత్రమైనవిగా "శ్రీరంగమహత్త్వము"లో వర్ణితం శ్రీరంగమహత్త్వమున వర్ణింపబడిన తీర్థాలు : చంద్రపుష్కరిణీ, కేసర, జంబూ, ఆమ్ర, బిల్వ, అశ్వత్థ, వకుళ, కదంబ, పున్నాగ, పలాశ తీర్థాలు.

కావేరీ ప్రాశస్త్యం మరియు ఈ తీర్థాల ప్రాశస్త్యం శ్రీరంగమహత్త్వంలో గమనింతం—

## కావేరీ నదీ ప్రాశస్త్యం :

జగాలలోని నదుల్లో కావేరీ నది శ్రేష్ఠమైనదిగా ఇలా వర్ణితమైనది—

శా. రంగత్కేతు విచిత్ర తోరణ మణి ప్రాసాద వప్రప్రభల్
నింగింబర్వ భుజంగ తల్పునకు గేళీ సద్మమై యొప్పు శ్రీ
రంగంబే తటినీ తటిన్ మెరయుదా రమ్యోత్సవ శ్రీనటీ
రంగంబై యదివో జగంబుల నదీ రత్నంబు చర్చింపగన్
— శ్రీరంగ 1-100

కావేరీ నదీ వైశిష్ట్య వర్ణనం కవి విపులంగ చేశాడు. అలాంటి పద్య గద్యాలలో మచ్చుకు కొన్ని—

మ. సతతానేక మునీంద్ర బృంద కృతపూజా వందనం జందనా
గత మందానిల కందళీ కృత తరంగన్ స్యందనన్ ధీరసం
గత మాకంద మరంద బిందు సహితార్క స్యంద నంగాంచిర
య్యతు లింపొంద గవేర నందన ద్రిలోకానందనా నందనన్
— శ్రీరంగ 1-140

మునీంద్ర బృంద కృత పూజావందన అయిన కావేరీ, త్రిలోకానంద అని నదీ ప్రాశస్త్యం పై పద్యంలో వర్ణితం.

కం. క్షితగల నదులిందలి వి
శ్రుతయగు కావేరి నీరు సోకిన మాత్రన్
ధృతి సద్గతి గను దిర్య
క్తతియయినను జెప్పనేల తక్కినవారిన్
— శ్రీరంగ 1-144

సీ. గురుధర్మ చరితాను కూలంబు కూలంబు
సంకాళి తాఘ కజ్జలము జలము
ఘనముక్తి నృత్త రంగములు తరంగము
లవినీతి కుజన భైరవము రవము
విహత తాపత్రయోద్వేగంబు వేగంబు
లలిత భక్తానంద లహరి లహరి
కుశల ప్రశంసాను గుణపులు కణములు
విధ్వస్త దుర్భర వీచి వీచి

నిరుపమజ్ఞాన సంపద నెరపు నెరపు
భరిత బహు మోహ పటలిబో నురువు నురువు
గాన నెనగాన మీ నదితో నమాన
మహిమ వహికెక్కు తీర్థ సమాజములను
— శ్రీరంగ 1-142

సూర్యుడు కన్యారాశిలో ఉన్నప్పుడు మాఘ బహుళ పక్షంలో పితృ కార్యాలకు ముఖ్యంగ కావేరీ స్నానం శ్రేయస్కరమైనది— (శ్రీరంగ 1-128) మరియు— "కావేరీ జలావగాహన మొనర్చి యగ్రజన్ములకు నాహారమైన నత్యల్ప దక్షిణయైన దిలోదకమైన ధేనుగ్రాసమైన దనకుగలిగిన రీతి దక్కక నెమ్మినొసగువాడు గల్గునొకోయని పితృ సమాజంబు లెదురు జూచుచుందురు. అట్లొసగినచో బితృ సమాజము లక్షయ స్థితుల నొందెదరు" — (శ్రీరంగ 1-129). "ఈ పుణ్య తరంగిణి సరస భాజనంబైనది గాని విరస భాజనంబు గాదు" — (శ్రీరంగ 1-158). కావేరీ నది భువనమాన్య. దీని తోయం ప్రజా

జీవనోపాయం. మునీంద్ర బృందం దీనిని సేవిస్తారు. శేషశాయి ధామమైన శ్రీరంగం కావేరీ ప్రవాహ పాలితం. కనుక ఇది సరస భాజనం.

కథ : పూర్వం విశ్వావసుడు అనే గంధర్వ రాజు వింధ్యాద్రి సమీపాన ఒకచోట కూడిఉండిన నదులకు సమస్కరించాడు. అప్పుడు ఆ నదులు, గంధర్వుడు తనకు మ్రొక్కాడనీ తనకు మ్రొక్కాడనీ వాదులాడాయి. ఆ గంధర్వుడు దక్షిణ సముద్రాన దిగి అక్కడ కొంత కాలం గడిపి ఉత్తరాయణాన నిజస్థానానికి వెళ్ళుతూ మరల వింధ్యాద్రి సమీపానగల నదులకు నమస్కరించాడు. అపుడు ఆ నదులు "మాలో ఎవరికి నమస్కరించా"వని గంధర్వుని అడిగాయి. అపుడు గంధర్వుడు మహిమాధికులకు నమస్కరించానని చెప్పాడు. ఆ మాటలకు "మేము మహిమాధికులం మేము మహిమాధికులం" అని అని నదులకు పరస్పరం తీవ్రవాదం జరిగింది. ఆ వాదంలోనూ గంగకు కావేరికి వివాదం పెరిగింది. ఆ నదులు బ్రహ్మను తీర్పు అడుగగా అతడు మహత్త్వంలో గంగ గొప్పదని చెప్పాడు. అది విని కావేరి గంగకంటే మహిమాధిక్యతను కోరి బ్రహ్మను గురించి సహ్యాతటాన తపమాచరించింది అపుడు బ్రహ్మ ప్రత్యక్షమై "ఓ కావేరీ! నీకు గంగతో సమానంగ మహత్త్వం ఇస్తాను. కానీ దానికన్న ఆధిక్యతను ఇవ్వలేను" అన్నాడు. అపుడు కావేరి తన మనస్సులో గంగ విష్ణుపాదోద్భవ కనుక మహత్త్వాన్ని కలిగి ఉందనితలచి శ్రీమహావిష్ణువును గూర్చి ఘోరమైన తపస్సు చేసింది. అపుడు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై "నీకు మహాత్మ్యం గంగకన్న అధికంగా ఉండేటట్లుగా నేను నీ ప్రవాహ మధ్యన రంగ మందిరంలో స్థిరంగా ఉంటానని వరాన్నిచ్చాడు." (ద్వితీయా శ్వాసం) ఈ కథవల్ల కా వే రీ న ది మహిమాన్వితమైనదని తెలుస్తున్నది.

కావేరి నదిని ఉద్దేశించి శ్రీరంగనాథుడు—

మ. అమృత ప్రాయములైన తోయముల లోకానందముంజేయునీ
కమనీయాపగ నీ తటద్రుమ సమగ్రచ్ఛాయలన్ జాలశీ
తములై మించిన సైకతంబులను మోదంబార నీక్షించిని
త్యము నిచ్చోట వసింతు కౌతుకము తెంపంబందు సంధిల్లగన్

— శ్రీరంగ 4-233

అని చెప్పాడు. ఈ వాక్యాలు కావేరీ నది వైశిష్ట్య ప్రాశస్త్యాలను చాటుతున్నాయి.

## ఉపాఖ్యానం :

కావేరీ నదీ తీర్థ మహిమను తెలిపే ఉపాఖ్యానం ఒకటి శ్రీరంగమహత్త్వంలో ఉంది. అ ఉపాఖ్యాన సారాంశం ఇది—

ఒకప్పుడు చోళరాజు దోషం చేయటంవల్ల అతడి దేశంలో పన్రెండు సంవత్సరాలు వర్షాలు లేక క్షామం సంభవించింది. వడగాల్పులతో జీవకోటి తల్లడిల్లింది. కొండల్లోని అడవుల్ని కార్చిచ్చులు దహించాయి. జలాశయాలు వాగులు ఎండిపోయాయి. ఆకలి దప్పికలతో జనాలు బాధపడ్డారు. ఎక్కడ చూచినా మృత్యుదేవత తాండవమాడింది. కావేరీ తీర్థంలో శ్రీరంగధాముడు ఉండటంవల్ల సుభిక్షంగా ఉండే ఆ ప్రదేశం క్షామ పీడితులైన సర్వజనాలకూ ఆశ్రమ స్థానమయింది. ఇలా ఉండగా కొంత కాలానికి కావేరిలో కూడా నీరు తగ్గిపోయింది. అక్కడి జనాలు అందరి మాదిరి మరణమే శరణమనీ భయమొందారు.

అప్పుడు కావేరీ తీర్థ రక్షకులు మేఘాలకు పిల్లులు పాడిచారు. జలధారలు కావేరీ తీర్థంలో కురసినవి. కావేరి నిండుగ ప్రవహించింది. జీవనాధారం ఉండటంవల్ల అక్కడి ప్రాణికోటి సంతాపాన్ని తీర్చుకొని సుఖంగా ఉంది.

ఇలా ఉండగా చోళరాజు చేసిన బ్రహ్మ హత్యా దోషం పిశాచ రూపాన్ని దాల్చి కావేరీ జలాలను త్రాగింది. మునుపటి రీతిగ నదీ జలాలు ఇంకిపోయాయి. అందుకు కారణాన్ని తెలుసుకొనగోరి క్షేత్ర పాలకుడు కావేరీ తీరం వెంటవెళ్లి పిశాచాన్ని పట్టుకొని "నిర్భయంగ ఇక్కడికి వచ్చిన నీవు ఎవరవు" అని ప్రశ్నించాడు. అపుడు పిశాచం "నేను సర్వ పాపాలకంటే ఎక్కువైనదానను. ఈ రాజ్యాన్ని ఏలే సోమకుడు అనే రాజు పాపం ఎరుగని ఒక బాపని చంపాడు దేశంలో ఏవ్వరు కూడా ఆ పాపకార్యాన్ని వారింపలేదు, ఆ పాప ఫలాన దేశమంతటా అనావృష్టి సంభవించింది. జగానికి కలిగిన ఈ ఉపద్రవాలన్నికూడ పాపస్వరూపిణి అయిన నావల్లనే సంభవించాయి. నేనే జలాశయం

లోని నీటినంత త్రాగివేశాను. నన్ను మీరు చంపలేరు" అని చెప్పింది. అపుడు క్షేత్ర పాలకులయిన విష్ణు భూతేశులు పిశాచాన్ని అడ్డగించి ఇలా అన్నారు— "ఈ ప్రదేశాన్ని నీవు లోకసాధారణ దృష్టితో చూస్తున్నావు. ఇక్కడ సంచరించటం నీకు శక్యం కాదు. ఒకవేళ అలా జరిగితే నీకు నాశనం తప్పదు" అన్నారు. వారు మరల ఇలా అన్నారు—

మ. క్షితి నీచక్కటి దివ్యదేశ మమిత శ్రీవిష్ణు భూతేశ ర
క్షిత మీ పుణ్యనదీ ప్రవాహము జగత్సేవ్యంబు భవ్యంబు సం
స్మృతి మాత్రాఘ నివారణంబు మహిత శ్రీరంగధామాంతికా
గత మారూఢ సమస్త తీర్థమయ మగ్ర్యం బాపగా కోటికిన్
— శ్రీరంగ 3-192

ఆ వె. ఎట్టి పాపులైన నీ జలంబులు మేను
సోకినంత మాత్ర శుద్ధులగుదు
రే తదంబుపాన పూతమై జగము నీ
వలన ముక్తి బొంది వెలయుచుండు
— శ్రీరంగ 3-193

"కావున నిచటివారి జోలికిబోక వేగముగ వెడలిపొమ్ము. ఈ తావున నున్నయెడల పాప పుంజమవగు నిన్ను వధింపగలము" అని విష్ణు భూతేశులు పలికారు. అంత ఆ బ్రహ్మ హత్యా పాపం ఆ దేశంలో సద్యోనాశాన్ని పొందింది వెంటనే అక్కడ కుంభవృష్టి కురిసింది. జనులు ఆనందమొందారు.

## తీర్థ ప్రాశస్త్యం :

వ్యాసుడు నాగదంతుడికి శ్రీరంగ క్షేత్రంలోని తీర్థాలను గురించి చెప్పే సందర్భాన "అయ్యెడ జనవినుతార్థంబులైన షట్తీర్థంబుల్" – (శ్రీరంగ 4-4) ఉన్నాయని చెప్పాడు. "శక్తి పాత్రుడాతని కెరింగించినట్టి సముదంచిత తీర్థ షులాదు జెప్పుమా" (శ్రీరంగ 4-5) అనికూడా ఉంది. దీనినిబట్టి శ్రీరంగ క్షేత్రంలోని ప్రధాన తీర్థాలు (జన వినుతార్థాలైనవి) షట్తీర్థాలని తెలుస్తుంది. శ్రీరంగమహత్త్వంలోనే మరోచోట (శ్రీరంగ 5-81 వచనం) " ఆ తీర్థంబునకు (చంద్రపుష్కరిణీ తీర్థంబునకు) క్రమంబున గంధవాహన, నరవాహన, పుర

హర, పురందర, వైశ్వానర, వైవస్వత, పలాశన, పాశధర దిశాభాగంబుల భజదమర సార్థకంబులగు తీర్థంబులుగల వవియును గేసరకదం బామ్ర బిల్వ జంబూ పలా శాశ్వత్థ పున్నాగాహ్వయంబులన నంహెూ నిరాసంబులై భాసిల్లు" నని ఉంది. అంటే చంద్రపుష్కరిణి కేంద్రంగ ఆయాదిశల్లో ఆయాతీర్థాలు ఎనిమిది ఉన్నాయని తెలుస్తుంది ఇవిగాక వకుళ తీర్థం కలదు. దీనినిబట్టి క్షేత్రంలో ఉన్న మొత్తం తీర్థాలు ఇవి—

| | | | |
|---|---|---|---|
| 1. | చంద్రపుష్కరిణి | ... ... | కేంద్రస్థానంగా ఉన్న ప్రధాన తీర్థం |
| 2. | కేసర తీర్థం | ... ... | చంద్రపుష్కరిణికి వాయువ్యదిశలోకలదు |
| 3. | కదంబ తీర్థం | ... ... | " ఉత్తర దిశలో కలదు. |
| 4. | ఆమ్ర తీర్థం | ... ... | " ఈశాన్య దిశలో కలదు |
| 5. | బిల్వ తీర్థం | ... ... | " ప్రాగ్దిశలో కలదు. |
| 5. | జంబూ తీర్థం | ... ... | " ఆగ్నేయదిశలో కలదు. |
| 6. | పలాశ తీర్థం | ... ... | " దక్షిణ దిశలో కలదు. |
| 8. | అశ్వత్థ తీర్థం | ... ... | " నైఋతి దిశలో కలదు. |
| 9. | పున్నాగ తీర్థం | ... ... | " పశ్చిమ దిశలో కలదు. |
| 10. | వకుళ తీర్థం | | |

షట్తీర్థాలుగా చెప్పబడిన తీర్థాలు (పైన పేర్కొన్న) అష్ట దిక్కులలో ఉన్న తీర్థాల్లో కూడా ఉన్నాయి పై పరిశీలనం వల్ల క్షేత్రంలోని తీర్థాల సంఖ్య పది అని తెలుస్తుంది. *1. ఇక ఆయా తీర్థాల ప్రాశస్త్యాన్ని గురించి పరిశీలింతం—

## చంద్రపుష్కరిణీ తీర్థం :

చంద్రపుష్కరిణి తీర్థానికి ఆ పేరు కలిగేందుకు కారణం– "సర్వప ర్వంబుల శర్వరీ విభుండిందు గ్రుంకు వెట్టుక నిందు పుష్కరిణీ నామం బి

1. అకాడమి ప్రచురించిన శ్రీరంగమహత్త్వము పీఠికలో (పుట LXXIX) తీర్థ దర్శిని పట్టిక ఉంది. ఆ పట్టికలోని వివరాలు (బ్రహ్మాండ పురాణాంత ర్గత శ్రీరంగమాహాత్మ్యములోనివని) గరుడ పురాణాంతర్గత శ్రీరంగమహత్త్వము లోనివి కావని పరిశీలనం వల్ల తెలుస్తుంది

సరోవరంబునకు భువన ప్రసిద్ధంబుగా నయ్యె" (శ్రీరంగ 3-58). "యక్ష్మరోగ వ్యథ బెడబాసి పోషింపు మోషధీ పుంజంబులను యుద్మదుదయంబు లోక నేత్రోత్సవంబు జేయుచుండెడి గల్యాణదాయి యగుచు దపము నీ పొందు జేసిన దాన జంద్రపుష్కరిణి నాగ వెలయునీ పుణ్య సరసి" (శ్రీరంగ 3-153) అనే పై వాక్యాల వల్ల (1) సర్వ పర్వాలలో చంద్రుడు ఇక్కడ స్నానం చేస్తాడు కనుక దీనికి చంద్రపుష్కరిణి అనే పేరు కలిగింది. (2) చంద్రుడు ఇక్కడ తపస్సు చేయటం చేత దీనికి చంద్రపుష్కరిణి అనే పేరు కలిగింది అని తెలియవస్తుంది. దీనిని తెలియజేసే కథా సంగ్రహం ఇది—

పూర్వం చంద్రుడు దక్షుని కూతుర్లు అశ్విని మొదలైన ఇరవైఏడు మందిని వివాహం ఆడాడు. చంద్రుడు భార్యలందరితోనూ సమానంగా ప్రవర్తింపక రోహిణి యందు బద్ధానురాగుడై ఉంటాడు. ఆ విషయాన్ని తక్కినవారు తమ తండ్రితో చెప్పారు. అతడు చంద్రుని మందలించాడు. కాని చంద్రుని ప్రవర్తనలో మార్పు కలుగలేదు. చాలాసార్లు దక్షుడు చంద్రుని దండించినా కూడా అతడు రోహిణి యందే అనురాగుడై ఉంటాడు. చంద్రుడిలో మార్పు కలుగకపోవటంచే దక్షుడు కోపించి "యక్షదుర్దశ చెందుదువుగాక" అని చంద్రుని శపించాడు. చంద్రుడు యక్ష్మరోగ బాధితుడై భూలోకానికి వచ్చి శ్రీరంగంలోని పుష్కరిణీ సమీపాన పది సంవత్సరాలు విష్ణువును ఆరాధించాడు. అందుకువిష్ణువు ప్రీతుడయి చంద్రుడికి యక్ష్మరోగం మానేటట్లు వరంఇచ్చాడు చంద్రుడు అక్కడ స్నానం చేసి తపస్సు చేయటం చేత దానికి చంద్రపుష్కరిణి అనే పేరు కలిగింది.

## చంద్రపుష్కరిణీ మహత్త్వ ప్రాశస్త్యాలు :

గీ. పురుషులందు బుణ్య పురుషుండు సతులలో
నబ్ధి తనయ నదుల యందు గంగ
యెవ్విధమున వెలయు నవ్విధమున తీర్థ
రాజి నీ సరోవరంబు మెరయు.

— శ్రీరంగ 3-154

పై వాక్యాలు చంద్రుడితో విష్ణువు పలుకటాన్ని బట్టి చంద్రపుష్కరిణీ వైశిష్ట్యం ఎంతటిదో తెలియవస్తుంది. "పరమాహ్లాద మీ కవేర తనయా పర్యంత మీ చంద్రపుష్కరిణీ వారి సుధానుకారి" (శ్రీరంగ 2-169). విభీషణుడి కారణంగ చంద్రపుష్కరిణీ తీరాన శ్రీహరి సర్వదా ప్రత్యక్ష దైవంగా ఉంటాడు. భూలోకంలో ఈ ప్రదేశం భద్రాశ్రయమై ఉంటుంది. లోకానుగ్రహం కోసం శ్రీహరి ఇక్కడ ఆ కల్పాంతం వసించి ఉంటాడు. కనుక చంద్రపుష్కరిణీ అతి మహిమాన్వితమై ప్రాశస్త్యాన్ని కలిగి ఉన్నది.

కం. పరమంబై సకల జగ
త్పరి పావనమై సమస్త భద్రాకరమై
దురిత నిరాసకమగు పు
ష్కరిణీ తీర్థంబు తీర్థసారం బెందున్
— శ్రీరంగ 3-47

కం. సుమహిత పుష్కరిణీ తీ
ర్థమున గృతస్నానుడై జితంతే యను మం
త్రమున హరిదలచు నత డఘ
సమితి దొరగిపోయి పొందు సాయుజ్యంబున్
— శ్రీరంగ 3-49

చంద్రపుష్కరిణీ తీర్థ తీరంలో చేసే దానాలు వ్రతాలు అల్పమైన వయినా కూడా అత్యధిక ఫలాన్ని ఇస్తాయి. వేదం పాదమాత్రం పఠించిన సర్వాధ్యయన ఫలం కలుగుతుంది. శుక్ల పక్షాన పూర్వదివసాన భార్యాసహితుడై ఉపవసించి పంచమినాడు పుష్కరిణిలో స్నానంచేసి బ్రాహ్మణులకు దానాలనిచ్చిన అతడు పుత్రవంతుడూ ఆయుష్యవంతుడూ ఔతాడు (శ్రీరంగ 3-50).

తే.గీ. అచట గోదాన మొనరించు నతడు గోవు
తనువు నను నెన్ని రోమములోనరు నన్ని
యబ్ద శతములు త్రిదశ సౌఖ్యములనొందు
నిందు ననమాన లక్ష్మి బెంపొందు మరియు
— శ్రీరంగ 3-52.

కం. కడునిష్ఠ సబ్ధ మాత్రం
బుడుగక నక్షత్రమాత్ర యోగంబులనె
వ్వాడు తీర్థమాడు నిదంత
దడరగ బహుళాశ్వ మేధమగు ఫలమందున్

— శ్రీరంగ 3-53

పండుగలలో జన్మనక్షత్రాన చంద్రపుష్కరిణిలో స్నానం చేసిన రాజు భూమండలాన్ని పరిపాలింప గలుగును (శ్రీరంగ 3-54). చంద్రపుష్కరిణిలో సితపక్ష పంచమినాడు స్నానం చేసి మూడు దినాలు ఉపవసించి ఉదకపారణ చేసి త్రిసంధ్యల్లో నింగిని చూస్తూ హవిస్సుకు మాత్రమే ఆహారంగ గ్రహించి భూశయనాభిరతుడై ఉండే నరునికి అపస్మృతి తొలగుతుంది. ఒక నెల ఈ తీర్థంలో స్నానం చేసే వారికి గుల్మ కుష్ఠ శూల రుజాది దుష్కోటి వ్యాధులు తొలగిపోతాయి. (శ్రీరంగ 3-55). "గురుతల్పగ-శిశుఘాతుక-హరినిందాపర-కృతఘ్న-నాస్తిక-మదిరానిరత పతితాదులు చంద్రపుష్కరిణిలో స్నానమాచరిస్తే పాపచయ శాంతి అవుతుంది" (శ్రీరంగ 3-56).

పాప పరిహారమున్నూ పుణ్యప్రదమున్నూ మహిమోపేతమున్నూ అయిన చంద్రపుష్కరిణి పది యోజనాల పొడవు, ఏడున్నర యోజనాల వెడల్పూ కలిగి ఉంటుంది కలియుగంలో ఈ విస్తీర్ణం దినదినానికీ తగ్గుతుంది. చంద్రపుష్కరిణి భావి విపత్తులను సూచించే మహిమ గలదికూడా. రాజ్యపాలకునికి మరణం సంభవింపనున్న రక్తవర్ణంతోనూ, దేశానికి కీడుకలుగనున్న పసరు రంగుతోనూ ప్రజాక్షయం కలుగనెడ క్రిమిమయమై ఉంటుంది. లోకానికి క్షోభ ఏర్పడునెడ నురుగులు కట్టుతుంది. అనావృష్టి దాపురించేటట్లయిత్తే వట్టిపోతుంది. దేశపాలకులు శాంతి పాలకులై యుద్ధాలు మానేటట్లయితే క్షీరకాంతితో ఉంటుంది. విప్రులు సౌఖ్యంగ ఉండేటట్లయితే చంద్రకాంతో పల ఛాయతోనూ విశేష వర్ణ సమయాన మంగళకరంగానూ ఉంటుంది.
— (శ్రీరంగ 3-161-3-168)

కలియుగాన కాలదోషం సంభవించే ఏ ఉపద్రవం కూడ చంద్రపుష్కరిణీ పరిసరాలందు సంభవింపదు... (శ్రీరంగ 3-173).

ఇలా చంద్రపుష్కరిణీ మహిమా ప్రాశస్త్యాదులు బహువిధాలుగా పేర్కొనబడినవి చంద్రపుష్కరిణీ మహిమను తెలియజేసే ఒక ఉపాఖ్యా నం శ్రీరంగమహత్త్వంలో ఉంది. ఆ ఉపాఖ్యాన సారాంశం ఇది—

పూర్వం ఒక జఘన్యుడు బాటలు కొట్టి ప్రయాణికులను హింసిస్తూ వారి ధనాన్ని దోచుకొని జీవిస్తూ ఉండేవాడు. నిర్దాక్షిణ్యంగా బ్రాహ్మణ హత్య నుచేసేవాడు. ఒకనాడు దారిని వెళ్లే ఒక బ్రాహ్మణుడిని అడ్డగించాడు. పారుని వద్ద పైకం ఏమాత్రం లేకపోవటంచే చోరుడు వాడిని నరుకేందుకు సిద్ధుడౌతాడు. అప్పుడు ఆ బాపడు దీనంగా దుఃఖిస్తూ "చేత గవ్వలేని నన్ను చంపితే నీకు కలిగే లాభం ఏమీలేదు. కనుక నన్ను రక్షించ"మని వేడుకుం టాడు. చోరుడు బ్రాహ్మణుడిని చూసి "ఓరీ! నీవు ఎక్కడి నుండి ఎక్కడికి వెళుతున్నావు" అంటాడు. బాపడు "నేను తీర్థ యాత్రలు చేస్తూ చంద్ర పుష్కరిణిలో స్నానంచేసి శ్రీరంగనాథుని పూజించి మా దేశానికి వెళుతున్నా" నని చెప్పాడు. చంద్రపుష్కరిణీ తీర్థాన స్నానం చేసిన ఆ బ్రాహ్మణుడు చోరునితో మాట్లాడినందువల్ల ఆ చోరునికి కొంత పుణ్యం లభించి విశుద్ధమానసు డౌతాడు. ఆ దొంగ, దారులు కొట్టడం ఇతరులను హింసించటం మానుకుం టాడు. చంద్రపుష్కరిణీ మార్గాన్ని బ్రాహ్మణుని వల్ల తెలుసుకొని చంద్ర పుష్కరిణికి వెళ్ళేందుకు నిశ్చయించుకుంటాడు. చోరుడు ప్రయాణమై చంద్ర పుష్కరిణికి చేరుకునేటప్పటికి ఆయువు మూడటంచే మరణిస్తాడు. అపుడు అతడిని తీసుకొని వెళ్లేందుకు యమభటులు వస్తారు. అదే సమయాన చంద్ర పుష్కరిణి తీర్థ రక్షకులైన విష్ణుభటులు వచ్చి యమదూతలతో పోరాడి వారిని తరిమివేస్తూ యమభటులకు ఇలా తెలుపుతారు– "శ్రీరంగ క్షేత్రాన్ని రక్షించేం దుకు విరించి మమ్మల్ని పుట్టించాడు. మా అనుమతి లేక ఇక్కడ ఎవ్వరున్నా ఏమికూడా చేయలేరు" ఈ మాటలకు యమభటులు యమధర్మరాజు కార్యా న్ని నెరవేర్చేందుకు మీరు అడ్డు రారాదని పలుకుతారు. దానికి విష్ణుభటులు యమాది దిక్పాలకులను సర్వదేవతలను వారి వారి పనులందు నియమించే వాడు జగదీశుడైన శ్రీరంగేశుడే కావటంవల్ల, ఈ ప్రదేశం శ్రీహరికి అత్యంత ప్రీతిపాత్రమైనది కావటంవల్ల, ఇక్కడ ఉండే వారికి యమబాధలేదు. కాలో పహతులైన వారిని దండించే అధికారం మాత్రమే యముడికి ఉంటుంది. ఈ శూద్రుడు చోరుడైనా కూడా చంద్రపుష్కరిణీ సమీపాన సమాధి యోగాన్ని

పొందటం వల్ల పరిశుద్ధుడయ్యాడు. కనుక మీరు మరలి పోవలసిందే అని యమదూతలతో విష్ణుదూతలు చెప్తారు.

ఆ తర్వాత నిర్మలుడైన ఆ చోరుడు విష్ణుభటులచే తాకబడి భయదూరుడౌతాడు. చంద్రపుష్కరిణీ తీర్థాన స్నానం చేసి శ్రీరంగేశుని సేవించి చోరాధముడు పునీతుడౌతాడు. అతడి భక్తికి విష్వక్సేనుడు అతడిని విష్ణుభక్తుల అనుచరుని చేస్తాడు.

యమభటులు యమలోకానికి వెళ్ళి తమ భగంపాటును యముడితో విన్నవిస్తే యముడు విషయాన్ని ఎరిగి యమదూతలతో భంగపాటుకు వగవనవసరం లేదని చెప్తాడు.

ఈ ఉపాఖ్యానం చంద్రపుష్కరిణీ మహత్త్వ ప్రాశస్త్యాలను తెలియజేస్తుంది.

## కేసర తీర్థం :

(శ్రీరంగ 4-108 నుండి 4-131) వాల్మీకి మునీంద్రుడు భరద్వాజునికి కేసర తీర్థాన్ని గురించి చెప్తాడు. ఈ తీర్థ మహిమ ఈ విధంగ వర్ణితం—

ఆ.వె. అనఘ వినుము కేసరాహ్వాయ విఖ్యాతి
నొనరు తీర్థమచట నొకటి కలదు
కోరి విన్న బేరుకొన్న విలోకింప
గను దలంగు నఖిల కల్మషములు

— శ్రీరంగ 4-108

"నిరుపమ నిరాంత మహిమం బరగెడి తత్తీర్థమున కశ్యపమహాముని పూర్వము తపమాచరించెను" -(శ్రీరంగ 4-109)

సుకీర్తి అనే కాశీరాజు తన సైన్యం నానాటికి వివిధ రోగాలతో కృశిస్తూ ఉంటే కశ్యపుడు ఉండే కేసర తీర్థానికి వస్తాడు. సైన్యాన్ని దూరంగా నిలిపి రాజు కశ్యపుని దర్శిస్తాడు. కశ్యపుడు "ఓ సుకీర్తి! మీ తండ్రి సబలుని నేను ఎరుగుదును. నీవు రాజ్య పాలనంలో తండ్రికి సహకరించక ఎందుకిలా తిరుగు

తున్నావు" అని అడుగుతాడు. అందుకు తను వచ్చిన కారణాన్ని రాజు కశ్యపునికి తెలుపుతాడు. కశ్యప ప్రబోధితుడై రాజు శ్రీరంగేశుని దర్శించి దైవసేవ చేసి అభీష్టార్థాలను పొందుతాడు.

భార్గవ కుల విస్తారుడయిన తారకుడు అనే తాపసాగ్రణి కేసర తీర్థాన తపస్సు చేసి భవపాశాలను తొలగించుకుంటాడు. (శ్రీరంగ 5-81)

## కదంబ తీర్థం :

శ్రీరంగ క్షేత్రానగల కదంబ వృక్షం ఇలా వర్ణితం—

చం ఇదియొక పాదపంబు గడునేపున శాఖలనెల్ల దిక్కులం
బొదివి మహా తపస్విజన పూజితమై గిరిబోలెదోచుచు
న్నది విలసత్ప్రసూన భర సవ్య మనోహర దివ్యవాసనా
ముదిత మదాలిగాగ బరిమోహిత ముగ్ధ కురంగ బృందమై
— శ్రీరంగ 5-3

ఉ. అంబురుహాప్తబాల కిరణారుణ కోమల పల్లవ ప్రభా
లంబము జందనానిల చలత్కుసుమస్తబక ప్రబుద్ధరో
లంబము నాలవాల పరిలాలిత కేళివిలోల మత్త కా
దంబము నగ్ర సంశ్రిత పతత్రి కుటుంబము నాకదంబమున్
— శ్రీరంగ 5-10

ఈ కదంబ వృక్షం ఉండేచోట ఒక తీర్థం కలదు. ఆ తీర్థానికి ఆవృక్షం పేర "కదంబ తీర్థం" అనే పేరు కలిగింది.

## తీర్థమహిమ :

కదంబ తీర్థం అనుపమైనది. ఆ తీర్థమందు ప్రియమార నిమజ్జనం చేసే వారికి పాపాలు తొలగి శాశ్వతమైన విష్ణు పదాన్ని చేరుతారు. కదంబ తీర్థ మాహాత్మ్యాన్ని భరద్వాజుడికి వాల్మీకి, ఆ వాల్మీకి మునికి గౌతముడు చెప్పినట్లు కలదు.

ఈ తీర్థానికి సంబంధించిన ఒక ఉపాఖ్యానం ఉంది, అందలి కథా సారాంశం ఇలా ఉంటుంది—

పూర్వం ఇక్కడ మిథిలానాథుడైన విదేహుడు యజ్ఞాన్ని చేశాడు. ఒక నాటిరాత్రి ఋత్విక్కులు నిద్రిస్తుండగా తలుపులు తెరచి ఉంచిన యాగశాల లోకి ఒక కుక్క ప్రవేశిస్తుంది. ఆ కుక్క యజ్ఞ ద్రవ్యాలను కొన్నింటిని తిని మరికొన్నింటిని వాసన చూచి వెళ్ళుతుంది. ఆ తర్వాత ఋత్విక్కులు మేలుకొని యాగాన్ని సమాప్తి చేసేందుకు హోమం చేస్తే ఎవ్వరికి కూడా మంత్రాలు స్ఫురణకు రాలేదు. వారు విషణ్ణులై కశ్యపునికి ఈ విషయాన్ని విన్నవించారు. ఎన్నో యజ్ఞాలను చేసిన కశ్యపుడు తనకు ఈ విధంగ ప్రయోగ విస్మృతి ఎప్పుడు కూడా కలుగలేదని చెప్తాడు. విదేహుడు కూడ అక్కడి వారినందరినీ "మీకు ఇలాంటి విస్మృతి ఎందుకు వచ్చిం"దని అడుగుతాడు. వారుకూడా "మేము ఏమీ ఎరుగ"మని చెప్తారు. విదేహుడు చింతాక్రాంతుడయి ఈ యజ్ఞం ఏ విధంగ పూర్తి చేసేందుకు వీలవుతుందని వారిని అడుగుతాడు. అపుడు మునులు విదేహునితో "యజ్ఞం ఎవరినిగూర్చి చేస్తున్నావో ఆ దైవాన్ని ఆశ్రయించమని" చెప్తారు. రాజు తన మనస్సులో విష్ణువును ప్రార్థిస్తాడు. అపుడు అక్కడికి ఒక సంయమి వస్తాడు. అక్కడి వారు ఆ సంయమికి తమ విస్మృతిని గురించి చెప్తారు. అప్పుడు ఆసంయమి "విష్ణువు ఈ కదంబ వృక్షాన్ని ఆశ్రయించి ఉంటాడు కనుక విస్మృతి కారణం ఆ కదంబ వృక్షానికీ తెలిసి ఉంటుంది. మీరు ఈ కదంబాన్ని పూజించి అడుగండి"అని చెప్తాడు. అపుడు వారు కదంబ వృక్షాన్ని పూజింపగా అందుండి మంత్ర విస్మృతికి కారణం తెలుపుతూ "శుచి ద్రవ్యాలతో హోమం చేయండి." అనే మాటలు విన్పిస్తాయి. అపుడు మునులు ఆవిధంగానే చేయగ సర్వ మంత్రాలు స్ఫురిస్తాయి. వారు యజ్ఞాన్ని పూర్తిచేస్తారు. కదంబాన్ని పూజించండని చెప్పి యజ్ఞసమాప్తికి తోడ్పడిన సంయమిని మునులందరు "మీరెవ్వరని ఎక్కడి నుండి వచ్చా"రని అడుగుతారు. అప్పుడు ఆ సంయమి "నేను సర్వాంతర్యామిని కనుక అంతటా ఉంటాను. నాకు వాలాయమైన పని ఒకటిని లేదు. విదేహుని యజ్ఞానికి అంతరాయం కలుగటంవల్ల దానిని తొలగించేందుకు వచ్చాను, యజ్ఞం సంపూర్తి అయింది" అని వారినందరినీ కరుణావలోకమున దనిపి "ఓ తాపసులారా! నేటి నుండి ఈ కదంబంలో శ్రవణ పింగళోమగు శ్రుతిఘోష వినిపిస్తుం"దని

వరమిచ్చి ఆ సంయమి అంతర్హితుడవుతాడు. అప్పటి నుంచి అది వేదనాద ఘోషతో పుణ్యతీర్థమై ఒప్పారింది.

"జితారివర్గుడై వర్గ గోత్ర జాతుడైన రుక్మదృష్టి భజదభీష్ట ఫల కదంబ మగు కదంబమును పాసించి బ్రహ్మపద ప్రాప్తుడయ్యె" — (శ్రీరంగ 5-81)

## ఆమ్ర తీర్థం :

సుకీర్తి అనే కాశీరాజు వివిధ రోగాలతో బాధింపబడే తన సైన్యంతో ఆమ్ర తీర్థంలో స్నానంచేసి నితాంత తేజంతో వెలుగొందాడు., సైన్యం నక్షత్రా అవలె ప్రకాశించింది. "అనుపమ దివ్యగంధ రుచిరాక్షత పుష్ప ఫలోపహారమై పెనుపుగ దోచు" ఆమ్ర తీర్థాన్ని గురించి భార్గవ మునీంద్రుడు కశ్యప మునీంద్రునికి ఆ తీర్థ మాహాత్మ్యాన్ని తెలిపే ఉపాఖ్యానాన్ని చెప్తాడు. ఆ ఉపాఖ్యాన సారాంశం ఇది—

పుష్కరుడు అనే ఒక విప్రుడు తీర్థ యాత్రలు చేస్తూ ఆమ్ర తీర్థానికి వస్తూ ఉంటాడు. అపుడు దారిలో ఒక పిశాచి భయంకరమైన బెబ్బులిరూపం తోవచ్చి పుష్కరునిపై పడును. అపుడు పుష్కరుడు ధైర్యంగదానిని విడిపించుకుని "ఉత్తమ వ్రతుడను అతుల తపః ప్రభావ విజితాఖిల కల్మష చిత్తుడను అగు నన్నిట్లు అకారణముగ చంపబూనితివి ఇందులకు కారణమేమి" అని అడిగెను. అందుకు పిశాచం "నాయందు తప్పేమీ లేదు. నన్ను పుట్టించిన దైవానిది తప్పు" అని పలుకుతుంది. అందుకు బ్రాహ్మణుడు "ఇది నీవు చేసుకున్న కర్మఫలం కానీ దైవము తప్పెట్లవుతుంది" అని ప్రశ్నించాడు. అందుకు పిశాచం "తత్త్వగతి నీకు తెల్లంగా తెలియదు సకల చరాచరాల కున్నూ ఈశ్వరుడొకడే కర్త మరియు భోక్త మేలు కీడులకు దైవమే కారణం అందువల్ల కర్మఫలం అతడికే చెందుతుంది" అంటుంది. ఇలా ఎవరి కర్మ ఫలం వారికే వర్తిస్తుందని బ్రాహ్మణుడు, ఆ కర్మఫలం దైవానికే చెందుతుందని పిశాచం వాదులాడారు. చివరకు ఆమ్ర తీర్థాన గల మునులను తమ వాదాన్ని తీర్పమంటమనీ అందులో ఓడినవారు గెలిచిన వారిచే సంహరింపబడుదురనీ ఇరువురూ ఒక నియమాన్ని ఏర్పాటు చేసుకున్నారు. ఆమ్ర తీర్థ సమీపాన ఉండే మునులకు వారి వాదాన్ని వినిపించారు. ఇద్దరి వాదాలుకూడా శాస్త్రసమ్మతంగా ఉండటంచే మునులు వారి వాదాన్ని తీర్పలేక వితర్కించు

కొంటూ ఉంటారు. అప్పుడు అక్కడికి ఒక దివ్య పురుషుడు తన సతితో సేవకులతో వస్తాడు. అపుడు అక్కడి వారందరున్నూ లేచి ఆ దివ్యపురుషునికి నమస్కరించి "మీరెవ్వర"ని ప్రశ్నింపగా దివ్యపురుషుడు "నేనీవనంలో సంచరిస్తాను. ఈమె నాభార్య మీ వాదం విని ఇక్కడికి వచ్చాను" అంటాడు. అపుడు వారు అతని మాటలు విని లావణ్యరూప తారుణ్య విరాజమానుడైన అతడు శ్రీరంగనాయకుడని గుర్తించి నమస్కరించి వారి సంశయాలను విన్నవిస్తారు. అపుడు ఆ దివ్య పురుషుడు "ఈశ్వరుడు వారి వారి ధర్మాలను అనుసరించి జీవులకు శరీరాలను సృష్టించి వారి యందు తాను ఉండి సర్వ ప్రవర్తకుడై ఉంటాడనీ, తాను కర్మ బద్ధుడుగాక సాక్షిగా వెలుగొందుననీ, జీవుడు కర్మబద్ధుడై పుణ్య పాపాలు చేసి సుఖ దుఃఖాలను అనుభవిస్తాడనీ తెలిపి బ్రాహ్మణ-పిశాచ ఉభయ వాదాలు కూడా సమంజసమే అని తెలిపి వారిరువురున్నూ పరమ పదం పొందుతారని కూడా తెలియజేశాడు. అంత బ్రాహ్మణుడు, పిశాచి ఆమ్ర తీర్థాన స్నానం చేసి దివ్య విమానం ఎక్కి స్వర్గానికి వెళ్ళారు. దివ్యపురుషుని రూపంలో ఉన్న శ్రీరంగేశుడు ఆమ్ర తీర్థ ప్రాంతాన కొంతసేపు క్రీడించి అదృశ్యుడయ్యాడు

"అఖిల లోకోపాస్యుడగు కాశ్యప మునీశ్వరుడు విధాత పాపధ్వామ్రమగు ఆమ్రమమునాశ్రయించి యమృతత్వము నొందెను" (శ్రీరంగ 5-81)

## బిల్వ తీర్థం :

"మహిత తపో విరాజమాన ముని సమాజ పూజితమును ప్రసిద్ధ సిద్ధ చారణ గీర్వాణ సేవితమును సకల కాల కుసుమఫల భరిత తరులతా పరీవృతమును, క్రోశమండల విస్తారమును" కలిగి బిల్వతీర్థం ప్రకాశిస్తుంటుంది. — (శ్రీరంగ 5-55).

శ్రీరంగ క్షేత్రాన ప్రకృతి రమణీయకత చెన్నారే ప్రదేశాన ఒక బిల్వ వృక్షం వెలసింది. పూర్వం ఆ వృక్షాన్ని ఆరాధించి ఇంద్రుడు సురరాజ్య వైభవ స్ఫురణతో ప్రకాశించాడు. మైత్రేయి అనే బ్రాహ్మణి ఆ మహీజాన్ని సేవించి యోగసిద్ధిని పొందింది. వాలఖిల్యాదులు ఆ వృక్షచాయను ఎల్లకాలం ఆశ్రయించి ఉంటారు. బ్రహ్మ నిర్మితమైన యాగవేదిక ఆ తరువు సమీపాన

కలదు. దేవ మానవ దైతేయులు ఎందరో ఆ బిల్వ వృక్షాన్ని కొలచి కోర్కెలను పొందారు. అలాంటి బిల్వ వృక్షం పేర ఆ తీర్థానికి "బిల్వతీర్థం" అనే పేరు కలిగింది. — (శ్రీరంగ 5-56)

## బిల్వతీర్థ మహత్త్వాన్ని తెలిపే ఉపాఖ్యానం :

పూర్వం సోమకుడు అనే రాజర్షి మార్కండేయ ముని వలన బిల్వతీర్థ మాహాత్మ్యాన్ని తెలుసుకుని అందులో స్నానం చేసి ఇహలోకంలో సమస్త సుఖాలు అనుభవించి పరలోకాన విష్ణు సాయుజ్యాన్ని పొందాడు. సోమకునికి మార్కండేయ ముని ఈ తీర్థ మాహాత్మ్యాన్ని తెలిపే జయధరుని కథను చెప్పాడు. ఆ కథా సారాంశం ఇది—

పూర్వం జయధరుడు అనే రాజు క్రూరుడై భూసురులకు కీడుకల్గిస్తూ ఉంటాడు. భూసురులు రాజు పెట్టే బాధలు పడలేక రాజ్యాన్ని విడిచివెళ్లారు. అందువల్ల అతడి రాజ్యం వేద నాద రహితమై దుర్భిక్షానికి నిలయమై దీన దశలో ఉంటుంది. జయధరుని నూరుగురు పుత్రులు నూర్గురు వ్యాధులతో మరణిస్తారు. జయధరుని శ్రేయస్సును కోరి భరద్వాజుడు ఆ విషయాన్ని వాల్మీకికి తెలుపగా అతడు జయధరుని వెంట పెట్టుకొని బిల్వ తీర్థానికి వెళ్తారు. బిల్వ మూలాన పుష్ప వృష్టి కురుస్తుంది. మనోహరమైన గానం వినబడుతుంది. ఉభయ సంధ్యలందు అక్కడ మంగళాచారాలు జరుగుతుంటాయి. జయధరుడు వాల్మీకి దానిని చూచి ఆశ్చర్యపడతారు. అక్కడికి తీర్థ నిషేవనం విచ్చేసిన సనత్కుమారుడు తరుమూలాన పుష్పవృష్టి కురిసేందుకు గానం వినిపించేందుకు గల కారణాలను తెలుపుతాడు. జయధరుడు బిల్వ తీర్థంలో స్నానమాడి శుభాలను పొందుతాడు.

## జంబూ తీర్థం :

శ్రీరంగంలో ఒక జంబూ వృక్షం కలదు. ఆ వృక్ష వర్ణనం ఇలా ఉంది—

కం॰ పంబిక శాఖా శిఖర క
దంబముచే నంబుధర పథం బొరయుచు లో
కంబులు పొగడగ నిటనొక
జంబూ తరు వమర నమర సంపూజితమై

— శ్రీరంగ 4-134

ఆ తరువు పేర వెలసిన తీర్థం జంబూ తీర్థం. ఆ తీర్థం అపవర్గ దాన సమర్థం. బహుదురిత వ్రాత తమః పటల చటుల వనజ వనహిత ద్యోతం. శుభ సలిల దేవఖాతం — (శ్రీరంగ 4-132, 33)

పూర్వం ఇంద్రుడు వృత్రాసురుని చంపటంవల్ల బ్రహ్మ హత్యాపాపంతో తేజోహీనుడయ్యాడు. ఆ పాప నివారణార్థం అతడెంత తిరిగిన కూడ లాభం లేకపోయింది. బ్రహ్మ హత్యా పాపం వెన్నంటి రాగా బ్రహ్మ దగ్గరకువెళ్ళి ఆ పాపం బారి నుండి తప్పించుకునే ఉపాయం తెలుపమని అడిగాడు ఇంద్రుడు. బ్రహ్మ ఇంద్రునితో పుండరీకాక్షుని సేవింపమని చెప్తాడు. ఇంద్రుడు పుష్కరాన ఎనిమిదేండ్లు, గంగా ద్వారాన పదేండ్లు ఉపవసించి, కాళిందిలో స్నానంచేసి సాలగ్రామ శైలాన నారాయణుని, కాశిలో కృత్తివాసుని, సరస్వతీ తీరాన సరస్వతిని పూజించి తన పాపాన్ని పోగొట్టుకోలేక చంద్రపుష్కరిణికి వచ్చి ఇరవై మూడు సంవత్సరాలు తపస్సు చేశాడు. జంబూ తీర్థానికి వచ్చి శ్రీహరిని పూజించాడు. అక్కడ శ్రీహరి ప్రత్యక్షమై వరం కోరుకొమ్మనగా బ్రహ్మ హత్యా పాపం బారినుండి రక్షించి తాను కోల్పోయిన తేజాన్ని తిరిగి యివ్వాలసిందని వేడాడు. అందుకు శ్రీహరి ఇంద్రుని జంబూ తీర్థాన స్నానం చేయమన్నాడు ఇంద్రుడు ఆ తీర్థంలో స్నానం చేసి పూర్వ తేజాన్ని పొంది తిరిగి వైభవాలను పొందాడు.

## పలాశ తీర్థం :

ఈ తీర్థం "సకల తీర్థంబులకు నెల్ల చక్రవర్తి" అయి చంద్రపుష్కరిణీ తీర్థానికి వైవస్వత (దక్షిణ) దిశాభాగాన ఉండే భజదమర సార్థాలగు తీర్థాలలో ఒకటి (శ్రీరంగ 5 31). శ్రీరంగమహత్త్వంలో ఈ తీర్థాన్ని గురించి ఇంత మాత్రమే ఉంది.

## అశ్వత్థ తీర్థం :

"ఘన దురిత క్షయకరమై చనునీ యశ్వత్థ తీర్థ సామర్థ్యము" (శ్రీరంగ 4-57). "పవిత్ర పావనంబై నుతికెక్కు నీ చలదళాహ్వాయ తీర్థ జలావ గాహ నంబూనిన వేడ్క సేయు జనులొక్కట మిక్కుటమైన పాప సంతానము పాసి పొందుదురు దార సుఖప్రద మత్ప్రద స్థితిన్" (శ్రీరంగ 4-106) అని తీర్థ మాహాత్మ్య ప్రాశస్త్యాలను గురించి శ్రీరంగనాథుడు పలికాడు.

ఈ తీర్థ మాహాత్మ్యాన్ని తెలిపే కథలు రెండున్నాయి. అవి (1) మాధవి కథ (2) కణ్వునికథ. ఈ కథల సారాంశం ఇది—

## మాధవి కథ :

పూర్వం మాధవి అనే బ్రహ్మవాదిని అశ్వత్థ తీర్థ జల మధ్యన నిల్చి తపమాచరిస్తూ ఉండెను. ఒకనాడు ఆమెకు ఆకాశం నుండి "రక్షింపుడు చచ్చితిని చచ్చితిని" అని ఒక స్త్రీ చేసే దీనాలాపాలు వినబడ్డాయి. మాధవి తలయెత్తి చూచింది. అక్కడ ఒక స్త్రీని యమభటులు బాధిస్తూ ఉంటారు. మాధవికి ఆమెపై జాలికలిగి "ఆ దీనురాలిని కృపాళురై రక్షింపు" డని వేడింది. అందుకు యమభటులు మాధవితో "ఓ తపస్వినీ! ఈమె అనేక పాపాలు చేసింది. కనుక శిక్ష అనుభవిస్తోంది. మేము పుణ్యాత్ములకు సౌఖ్యం కలిగిస్తాం" అని చెప్పారు. మాధవి తాను అశ్వత్థ తీర్థాన నియమంతో సంపాదించిన పుణ్యంలో ఒకనాటి పుణ్యాన్ని ఆమెకుఇచ్చింది. దాంతో ఆమె యమ భటులతో విడువబడి సిద్ధులతో సంభావింపబడుతూ యముడి సభకు వెళ్ళి యముడికి నమస్కరించింది. యముడు ఆమెను తండ్రివలె ఆదరించి "ఓ నెలతా! నీవు ఈ జన్మాన చేసిన పుణ్యం లేశంకూడాలేదు. పూర్వం పన్నెండు జన్మల కిందట మీ ఇంటికి ఒక హరిభక్తుడు వచ్చి ఒకరాత్రి మీ ఇంట్లో ఉండెను ఆ పుణ్యంవల్ల, అశ్వత్థ తీర్థవాసి అయిన మాధవి తన పుణ్యమందు ఒకనాటి పుణ్యాన్ని నీకు ఇచ్చినందువల్ల కల్పాంతం వరకు బ్రహ్మలోకాన దివ్యసుఖాలను అనుభవించమని చెప్పి ఆమెను దివ్య విమానంలో బ్రహ్మ లోకానికి పంపించాడు.

మాధవి అసాధారణమైన రీతిలో అశ్వత్థ తీర్థాన తపస్సు చేసి పరమ పదాన్ని పొందింది.

అఖిల భువన విశ్రుతమైన అశ్వత్థ తీర్థాన స్నానం చేసి దేవర్షి పితృ తర్పణాలు ఆచరించి యీ కథను వినేవారికి దురితనాశం, పుణ్యలోక శాశ్వత నివాసం సిద్ధిస్తుంది. ఈ కథ భరద్వాజునికి వాల్మీకి చెప్పాడు. (శ్రీరంగ 4-28, 4-59).

## కణ్వుని కథ :

పూర్వం కణ్వుడు అనే ముని రంగ మందిరాన స్వామిని దర్శించి మందిరం వెలుపలకు వచ్చాడు అతనికి కావేరీ తీరాన అచ్చము రంగపతి వలెనే ఉండే ఒక దివ్య పురుషుడు ఒక కాంతతో ఉండటం కనిపించింది. కణ్వుడు రంగ మందిరంలో అప్పుడే రంగపతిని దర్శించి వచ్చినందువల్ల అచ్చం రంగపతివలె ఉండే ఆ దివ్య పురుషుని చూచి విస్మయం పొందాడు. అతడు ఇతడు ఒకరేనా" అని కణ్వుడు ఆశ్చర్యపడుతుండగ దివ్యపురుషుడు కణ్వునితో "ఓ మునీంద్రా! నీవు ఏమి ఆలోచిస్తున్నావో చెప్పదలచిన చెప్పు" మన్నాడు. అందుకు కణ్వుడు "ఇప్పుడే రంగమందిరాన రంగవిభుని దర్శించి బయటకు రాగా ఇక్కడ అచ్చము రంగ విభునివలె ఉండే మీరు కనిపించారు అతడున్నూ మీరున్నూ ఒకరా కాదా సెలవిచ్చి నన్ను ధన్యుని చేయండి" అన్నాడు. అందుకు ఆ దివ్యపురుషుడు "శ్రీరంగ క్షేత్ర ప్రాంతం నాకు ఇష్టమైంది. ఇక్కడ నేను లక్ష్మి సహితుడనై విహరిస్తుంటాను" అనిచెప్పాడు. కణ్వాది మునులందరూ చూస్తుండగా శ్రీరంగనాథుడు లక్ష్మీదేవి సహితంగా అశ్వత్థ తీర్థం చెంతకేగి అక్కడ ఉండే అశ్వత్థ వృక్షాన అదృశ్యుడయ్యాడు. కణ్వుడు తాను అక్కడ ఉండగానే హరి సిరితోగూడ అంతర్ధానమైనందుకు విచారించి వారిని చూచేందుకు అనేక సంవత్సరాలు నిరీక్షించాడు. అంత ఒకనాడు అంతరిక్షం నుండి "ఓ కణ్వమునీ! పరమ పావనమైన ఈ అశ్వత్థ తీర్థాన స్నానం ఆచరిస్తే సకల దురితాలు తొలగుతాయి. ఇక్కడ గో దానం చేస్తే విష్ణులోక సాయుజ్యం కలుగుతుంది. అన్నదానం వల్ల స్వర్గప్రాప్తి, తిలా దానంవల్ల ఏకవింశతికులోద్ధరణం. స్వర్ణ దానంవల్ల పాపవినాశం, ఏకరాత్రోపాసనం వల్ల అపస్మారాది రోగ విమోచనం కలుగుతుంది" అని వినబడింది. ఆ తర్వాత కణ్వుడు శ్రీరంగనాథుని శాసనం వల్ల అనేక సంవత్సరాలు అక్కడే ఉండి బ్రహ్మోపాసనం చేస్తాడు.

## పున్నాగ తీర్థం :

ఇది చంద్రపుష్కరిణీ తీర్థానికి పాశధరదిశాభాగాన (పడమర దిక్కున) ఉంది. ఈ తీర్థాన బ్రహ్మవర్చ సోపారుడైన వర్చసుడు అనే బ్రాహ్మణుడు

బ్రహ్మజ్ఞాన నిరతుడై సంసార విముక్తుడై నిత్యానందాన్ని పొందాడు (శ్రీరంగ 5-81).

ఈ తీర్థాన్ని గురించి భైరవకవి తన శ్రీరంగమహత్త్వంలో ఇంత మాత్ర మే ప్రస్తావించాడు.

## వకుళ తీర్థం :

పూర్వం "కుశలం" అనే పర్వతం మీద శివుడు తపస్సు చేసి బ్రహ్మ హత్యాపాపాన్ని పోగొట్టుకున్నాడు. ఆ పర్వతానికి తూర్పు దిక్కున వకుళ తీర్థం ఉంది.

పూర్వం ఈ వకుళ తీర్థ తీరాన సురాధిపత్యాన్ని పోగొట్టుకున్న ఇంద్రుడు విష్ణువును గూర్చి తపస్సు చేసి ఆ కల్ప నిశ్చల లోకత్రయ రాజ్య లక్ష్మిని పొంది సంప్రీత చేతస్కుడయ్యాడు — శ్రీరంగ 1-107, 108).

ఇలా శ్రీరంగమహత్త్వములో తీర్థ మహత్త్వ ప్రాశస్త్యాలు బహు విధా లుగ అభివర్ణితమయ్యాయి.

పురాణ సంప్రదాయం ప్రకారం తీర్థాలు నాలుగు అవి: దైవతీర్థం, అసురతీర్థం. ఆర్షతీర్థం, మానుషతీర్థం.

దేవుడు స్వయంగ వెలసిన తీర్థాన్ని దైవతీర్థం అంటారు. దైవం అసురు లను చంపినచోట వెలసిన తీర్థం అసుర తీర్థం అంటారు. ఋషులు నివసించే చోట ఉండే తీర్థాన్ని ఆర్షతీర్థం అంటారు. మానవ నిర్మితాలైనవి మానుష తీర్థా లంటారు.

శ్రీరంగ క్షేత్రానగల తీర్థాలు దైవ, ఆర్ష తీర్థాలని పైన పేర్కొన్న తీర్థా లను గురించి చెప్పే కథలు ఉపాఖ్యాలవల్ల తెలుస్తోంది. ఇదికూడా తీర్థప్రాశ స్త్యమే అవుతుంది.

ఈ విధంగ శ్రీరంగ మహత్త్వాన క్షేత్ర, దైవ, తీర్థాలకు మూడింటికిన్నీ ప్రాధాన్యత కన్పిస్తుంది. ఈ మూడింటి ప్రాశస్త్యాలను భైరవకవి బహు విధా లుగ అభివర్ణించాడు.

మాహాత్మ్య గ్రంథాలు క్షేత్ర మాహాత్మ్యాన్నో, తీర్థ మాహాత్మ్యాన్నో లేక దైవ మాహాత్మ్యాన్నో తెలిపేవి అధికంగా ఉన్నాయి. కాగా ఈ మూడింటిని తెలుపటం శ్రీరంగ మహత్త్వ ప్రాశస్త్య విశేషం.

# తృతీయాధ్యాయం

# 3. శ్రీరంగమహత్త్వం - ఆంధ్రీకరణ విధానం

## 3. 1. ఆంధ్రీకరణ విధాన విషయ భూమిక :

శ్రీరంగమహత్త్వ ఆంధ్రీకరణ విధానాన్ని పరిశీలించేందుకు ముందు దానికి భూమికగా మూలమైన సంస్కృత శ్రీరంగ మాహాత్మ్యాన్ని మరియు తెలుగు అనువాదాన్ని గురించి కొంత చర్చింపవలసి ఉంది.

## సంస్కృత మూలం :

భైరవకవి శ్రీరంగమహత్త్వంలో ఈ క్రింది వచనాలు పద్యాలు చెప్పాడు:-

"వ. హరి కథామృత పూరంబు వీనులలరం జవిగొనుచు గారుడపురాణ ప్రసిద్ధంబై సిద్ధముని గణస్తోత్ర పాత్రంబగు శ్రీరంగ క్షేత్ర ప్రభావంబునకు ప్రమోదం బావహించి"

— 1-17

"శా. వ్యాసప్రోక్త మహాపురాణములు ముయ్యాఱింటి యందున్ జగ
ద్వ్యాసుండైన రమామనోహరు మహత్త్వ వ్యక్తి మూలంబులై
భాసిల్లుందగు నాలు గందును బహూపాఖ్యాన విఖ్యాతమై
యా సౌపర్ణ పురాణ మొప్పు బహు వేదాంతార్థ గంభీరమై

— 1-24

"వ. అమ్మహా పురాణంబునందు" — 1-81

"కం. శ్రీరంగ మహత్త్వ మతి విచిత్రము దలపన్" — 1-82

పైన పేర్కొన్న పద్యాల్లో క్రగీతలుంచిన భాగాలవల్ల భైరవకవి తెనుగు చేసిన శ్రీరంగ మహత్త్వానికి మూలం గరుడ పురాణమని స్పష్టమౌతోంది. కనుక సంస్కృత గారుడోక్త శ్రీరంగ మాహాత్మ్యాన్ని గురించి తెలుసుకోవటం ఇక్కడ అవసరం.

పదహారు అధ్యాయాలుండే గరుడ పురాణం ఒకటి ఉంది. *1, దానిని ఉత్తరక్రియల్లో చదువుతారు. భైరవకవి అనువదించినది ఉత్తర క్రియల్లో చదివే గరుడ పురాణం భాగం కాదు. వ్యాసప్రోక్త అష్టాదశ మహా పురాణాల్లో రమా మనోహరుని వ్యక్తిత్వ మూలమై భాసిల్లేవి నాలుగు. అవి: విష్ణు, నారద భాగవత, గరుడ పురాణాలు. అందులో బహూపాఖ్యాన విఖ్యాతమైన గారుడ పురాణోక్త శ్రీరంగ మహాత్మ్యం అతి విచిత్రం. శ్రీరంగం శ్రీవైష్ణవానికి మూల కందం. అట్టి శ్రీరంగ క్షేత్రాధి దైవతమైన విష్ణువుయొక్క కథాపారమ్య ప్రబోధకమైనదిన్నీ. శ్రీరంగ క్షేత్ర తీర్థ మాహాత్మ్య కథా విలసితమైనదిన్నీ అయిన సాత్త్విక పురాణమగు గరుడ పురాణాన్ని భైరవకవి అనువదించాడు. ఇది ఉప పురాణమని పరిశోధకులు చెప్పారు. 2*ఈ ఉపపురాణ రచన రామానుజుల (క్రీ.శ. 1017–1037) కాలాననో లేక ఆ తర్వాతనో జరిగి ఉంటుందని పరిశోధకుల అభిప్రాయం. *3. అంతకు పూర్వమే గరుడపురాణోక్త శ్రీరంగమాహాత్మ్య రచన జరిగి ఉంటుందనేందుకు కొన్ని ఉపపత్తులున్నాయి. ఎంత పూర్వం అని చెప్పటం, ఆ ఉపపురాణ రచన ఎప్పుడు జరిగిందని తేల్చిచెప్పటం ప్రస్తుత చర్చనీయాంశం కాదు, కానీ, సంస్కృత శ్రీరంగ మాహాత్మ్యంగల గరుడోప పురాణం దాదాపు ఒక వెయ్యి సంవత్సరాలకు ఈ వల రచితమైనది మాత్రం కాదు. భైరవకవి దీనిని వ్యాసప్రోక్తం అన్నాడు (శ్రీరంగ 1–24). ఉపపురాణాల కర్తృత్వాన్ని వ్యాసునికి అంటగట్టడం వైశిష్ట్య ప్రాశస్త్యాల కోసమే అనటం సత్యదూరం కాదు. ఏదిఏమైన సంస్కృత గరుడోప పురాణాంతర్గతమైన శ్రీరంగ మాహాత్మ్యం దాదాపు ఒక వెయ్యి సంవత్సరాల ప్రాచీనతోనైనా కలిగి ఉండటం నిజం. సహస్రాబ్దాలతో సంస్కృత శ్రీరంగమాహాత్మ్యం ఎన్నో మార్పులకు చేర్పులకు గురై ఉంటుంది. అలా గురై ఉంటుందనేందుకు ఈ క్రింది అంశాలు తోడ్పడతాయి.

---

1. వావిళ్ల ప్రచురణ–1951.

2. శ్రీ విజయ రంగ చొక్కనాయక శ్రీరంగమాహాత్మ్యము.

3. పీఠిక: ముదివేడు ప్రభాకరరావు. ప్రచురణ SVORI–Tirupati.

గరుడ పురాణాన్ని అనువదించిన కవులలో మరింగంటి సింగరాచార్యులు (క్రీ.శ. 1500-1580), కట్టా వరదరాజకవి (క్రీ.శ. 1650 ప్రాంతం) సంస్కృత గరుడ పురాణాన్ని గురించి ఇలా చెప్పారు—

" శత సంహితను తెన్గు జేసి"

— మరింగంటి వారి నిరోష్ఠ్య సీతాకల్యాణం 1-16

"ఆమ్నాయ చతుష్కసారము సనాతన గారుడ సంహితా శతా
ధ్యాయి తెనుంగు సేయ నొకడర్హుడ నేటి కవీంద్ర కోటిలోన్"

— కట్టా వరదరాజ కృత శ్రీరంగమాహాత్మ్య అవతారిక

పై పద్యపాదాల్లో క్రీగీతలుంచినతావులలో చెప్పినదాన్నిబట్టి మరింగంటి వారు, కట్టావారు అనువదించిన శ్రీరంగ మాహాత్మ్యం (గారుడము) మూలం నూరు అధ్యాయాలు కలిగి ఉండేదని తెలుస్తోంది. ప్రస్తుతం మనకు లభిస్తున్న సంస్కృత మూలం అష్టోత్తర శతాధ్యాయి. *1.

వైఖానస గృహ్య సూత్రానికి *2. గల తాత్పర్య చింతామణి అనే వ్యాఖ్యానంలో శ్రీరంగ క్షేత్రమందు వైఖాన సార్చనం జరిగేదని ఉంది. అందుకు ప్రమాణంగా గరుడ పురాణాంతర్గత శ్రీరంగ మాహాత్మ్య మందలివిగా ఈ క్రింది శ్లోకాలు ఉదాహృతాలు—

" గారుడే శ్రీరంగ మాహాత్మ్యే—

శ్లో. బ్రహ్మోzపి దివ్య హంసేన సితమేధోప మేనచ
పృష్ఠతోzzయయౌ విష్ణుం వస్త్రేణాచ్ఛాద్య చాననమ్
తత్రార్చకో మహా భాగో భగవాన్ విఖనసస్తదా
దదౌ ప్రసాదం దేవానాం రంగనాథాభ్యనుజ్ఞయా
... ... ... ...
అధ్వర్యుభి ర్విప్రవరైర్మతే విఖనసస్థితైః
తత్రారాధన మీహస్వ విష్ణోరమిత తేజసః"

---

1. విద్యాతరంగిణీ ముద్రాక్షరశాల-మైసూరు 1895 ముద్రితం.
2. వైఖానస గృహసూత్రమ్-(శ్రీసూత్రతాత్పర్య చింతామణ్యాఖ్యయా వ్యాఖ్యా సమలంకృతమ్) ప్రథమ సంపుటం-తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ 1967. ప్రథమ ముద్రణ.

పై శ్లోకాలు ప్రస్తుతం (నాకు) లభించిన సంస్కృత మూలంలో కన పడవు.

భైరవకవి కృతిలో కూడ రెండు శ్లోకాలు ఉన్నాయి. (1-198, 5-108) వీటిలో రెండో శ్లోకం (5-108) ప్రస్తుతం లభించిన మూలంలో కనిపిస్తుంది. (90వ అధ్యాయం). మొదటి శ్లోకం (1-198) ప్రస్తుత మూలంలో కనపడదు.

ప్రస్తుతం లభించిన సంస్కృత మూలం ముద్రిత ప్రతిముఖ పత్రం మీద "నానాదేశానీతానేక విద్వత్పుస్తక సాహాయ్యేన యథామతి పరిశోధ్య పరిష్కృత్య తాదృశ మహరాజా శ్రితేన చక్రవర్త్యయ్యం గార్యేణ మహీశూర పురీ మధ్య వర్తిన్యాం విద్యా తరంగిణ్యా ఖ్యాయాం స్వీయముద్రాక్షర శాలాయాం ముద్రాపితం సద్విజయతే తమామ్" -అనే వాక్యాలవల్ల సంస్కృత శ్రీరంగ మాహాత్మ్యానికి వివిధ ప్రాంతాల్లో అనేక ప్రతులు ఉండినట్లు తెలుస్తోంది. దీనినిబట్టి సంస్కృత మూలాన్ని పరిష్కరించిన శ్రీవైష్ణవ పండితులు అనేక ప్రతుల్ని పరిశీలించి తమకు అనుకూలంగా ఉండేవి తాము మంచివని అనుకున్నవి అయిన, పాఠాలను గ్రహించి ఆ గ్రంథాన్ని ముద్రించారని చెప్పవచ్చు.

భగవద్రామానుజుల వారికి పూర్వం శ్రీరంగక్షేత్రంలో వైఖానసఆగమం ప్రకారం అర్చన జరిగేది రామానుజుల కాలం నుండి అక్కడ పాంచరాత్రాగమం ప్రకారం అర్చన జరుగుతోంది. దానికి అనుగుణ్యంగ సంస్కృత శ్రీరంగ మాహాత్మ్యంలో అక్కడక్కడ మార్పులు చెందాయి. ఇందుకు వైఖానస గృహ్య సూత్ర వ్యాఖ్యానంలో ఉదాహరించిన శ్లోకాలు ప్రస్తుత లభ్య ప్రతిలో లేకపోవటం గమనార్హం.

గారుడోక్త శ్రీరంగ మాహాత్మ్యానికి ఎన్నో ప్రతులుండేవనీ, వాటిలో నూరు అధ్యాయాలతో కొన్ని, నూట ఎనిమిది అధ్యాయాలతో కొన్ని ఉండేవనీ అవి వైఖాన సాగమానుగుణ్యంగా ఉండినవి కాలక్రమాన పాంచరాత్రాగమాను గుణ్యంగా మార్పుచెంది ఉంటాయని ఇలా ఈ సంస్కృత మూలం అనేకమైన మార్పులకు చేర్పులకు గురైందనీ తెలుస్తోంది. అలాంటి ప్రతుల్లో మైసూరులోని విద్యా తరంగిణి ముద్రాక్షరశాలలో ముద్రితమైన (క్రీ.శ.

1895) ప్రతి మాత్రమే నేడు లభిస్తుంది. ప్రత్యంతరాలు అలభ్యాలు. ఇట్టి పరిస్థితుల్లో భైరవకవికి అనువదించేందుకు ఉపయోగపడిన గారుడోక్త శ్రీరంగ మాహాత్మ్య ప్రతి ఎలాంటిదో నిర్ణయించటం అసాధ్యం. అయితే, భైరవకవి రామానుజుల వారికి తదనంతర శతాబ్దాలవాడు కనుక అతడు అనువాదం చేసేందుకు ఉపయుక్తమైన మూలం పాంచరాత్రాగమాన్ని సమర్థించేదిగా ఉంటుంది. ఇలా అనేందుకు "వ. అని పలికి యా రాజ పంచాననుండు పాంచరాత్రాగమ ప్రపంచిత విధానంబున సావధాన మానసుండై యా భోగి తల్పు ననల్ప భవ్య దివ్యోపచారంబుల బూజించి" (శ్రీరంగ 4-237) ఇత్యాది గాగల వాక్యాలు అధారాలు.

భైరవకవి తాను అనువదించె గరుడ పురాణోక్త శ్రీరంగ మాహాత్మ్యంలో ఎన్ని అధ్యాయాలున్నవి తెలుపలేదు. ఉపాఖ్యానాల సంఖ్యకూడా తెలుపలేదు. "బహూపాఖ్యాన విఖ్యాతమై యా సౌపర్ణ పురాణ మొప్పు" (శ్రీరంగ 1-24) అని మాత్రం తెలిపాడు.

సుప్రసిద్ధ పరిశోధకులు, కవి పండితులు సైతం గరుడ పురాణాన్ని కేవలం ఉత్తరక్రియల్లో చదివేదిగా మాత్రమేభావించటం చేత, *1. ప్రస్తుతం

1. "ఇది (గరుడ పురాణం) విష్ణు సంబంధమైన పురాణమేగాని ఉత్త ఓఘాయిత్య పురాణం. ఎవరింటనైనా పీనుగు లేచినప్పుడు గానీ దీనిని చదువరు"— సమగ్రాంధ్ర సాహిత్యం— VII-190.

"గరుడ పురాణము-ఉత్తర క్రియులలో చదువ వలసిన ఈ గ్రంథము మనలేకపోవుటలో ఆశ్చర్యము లేదు" — కళాపూర్ణోదయానికి మరుపూరు కోదండరామిరెడ్డిగారి పీఠిక "శ్లేష కావ్యంబుజేసి విశేషయశము-గనిన పింగళి సూరన గడుసువాడె కాని, శుభమస్తని యదేమి గారుడంబు-దెలుగు జేసిన వాడు వైదికుని పగిది."

— వేంకట రామకృష్ణ కవుల "ఆంధ్రకవుల అపరాధములు" ఆంధ్రపత్రిక-కాళయుక్తి.

వేంకట రామకృష్ణ కవులు చెప్పిన పై పద్యాన్ని ఖండిస్తూ తిరుపతి వేంకట కవులు గీరత మందలి "క్షమాపణ వ్యాసావళి"లో కొంత వ్రాశారు (పుట-339). అది పై పద్యానికి ఖండనమే అయినాకూడా తిరుపతి వేంకట కవులు కూడా గారుడాన్ని పితృకర్మలను గురించిమాత్రమే చెప్పేదని భావించి నట్లు వారి వ్యాసమే తెలియజేస్తుంది (చూడు: గీరతము. ప్రకాశకులు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి సన్స్ కడియము. 1954).

లభించిన మూలం దాదాపు నూరేండ్ల నాడు (క్రీ.శ. 1895) ముద్రితం కావటంచే ఆ ప్రతులు నేడు అందరకూ అందుబాటులో లేవు. అందువల్ల మూలం స్వరూపాన్ని సంక్షిప్తంగానైనా తెలిపేందుకు మూలంలోని 108 అధ్యాయాలలోగల విషయం ఈ దిగువ ఇవ్వడమైనది—

| అధ్యాయ క్రమసంఖ్య | అధ్యాయమందలి విషయం | అధ్యాయమందలి శ్లోక సంఖ్య |
|---|---|---|
| 1 | సూతమహర్షి సంవాదం | 16 |
| 2. | వ్యాసుని నాగదంతుడు ప్రశ్నించటం | 32 |
| 3. | వ్యాసోక్త గరుడాగమనం | 30½ |
| 4. | గరుడ నిర్గమన కథనం | 39½ |
| 5. | వ్యాస కృత భగవన్మహిమాభి వర్ణనం | 14 |
| 6. | జగత్ స్రష్ట్యాది క్రమ ప్రదర్శనం | 33½ |
| 7. | వ్యాసుడు నాగదంతునికి చెప్పిన భూగోళ వర్ణనం | 30½ |
| 8. | పుణ్యతీర్థ ప్రశంస | 21½ |
| 9. | గంగ మున్నగు తీర్థాల ప్రశంస | 19 |
| 10. | సరయూ కావేరీ నదుల ఆధిక్యతా ప్రస్తవం | 45½ |
| 11. | అనంతశయ్యా మహిమాను వర్ణనం | 29 |
| 12. | సుబోధుడు మరియు సత్యుడు అనే మునుల కథ | 25 |
| 13. | భగవదావిర్భావ సత్ప్రశంస | 39½ |
| 14. | శ్రీరంగ విమాన ఆగమన కథనం | 21 |
| 15. | భగవద్వచనం విని సుబోధుడు శ్రీరంగానికి వెళ్లటం | 11 |
| 16. | సనత్కుమారుని తపస్సుకు భీతిచెంది దేవతలు భగవంతుని స్తుతించటం | 45 |

17. క్షీరసాగరాన ఆవిర్భవించిన భగవంతుడు దేవతలను ఊరడించటం 24½
18. ఉపాధ్యాయ రూపాన భగవానుడు ఆవిర్భవించటం 23
19. ఉపాధ్యాయ సనత్కుమార సంవాదం 27½
20. సనత్కుమారునికి ఉపాధ్యాయుడు తత్త్వోపదేశం చేయటం 33
21. ఉపాధ్యాయుడు జ్ఞానప్రకర్షను చెప్పటం 15
22. ఉపాధ్యాయుడు అధ్యాత్మ విషయజ్ఞానాన్ని చెప్పటం 16½
23. ఉపాధ్యాయుడు భగవత్స్వరూపాన్ని చెప్పి తిరోహితుడు కావడం 18
24 బ్రహ్మ సనత్కుమార సంవాదం 12
25. బ్రహ్మరచిత చంద్రపుష్కరిణీ మహిమాను వర్ణనం 36½
26. ,, ,, ,, 36½
27. ఒకానొక శూద్రునికథ 22
28. యమకింకర భూతేశ్వరుల సంవాదం 36½
29. ,, ,, ,, 15½
30. ,, ,, ,, 16½
31. యమ-యమకింకరుల సంవాదం 27
32 యముడు చేసిన శ్రీరంగ మహిమాను వర్ణనం 20
33. ,, ,, ,, 31
34. ,, ,, ,, 28
35. చంద్రునికి శాపం కలిగిన కథ 16½
36. చంద్రుడు చేసిన భగవన్నుతి 18
37. చంద్ర-భగవత్సంవాదం 15
38. కలియుగ ప్రశంస 58½
39. శ్రీరంగ దేశానికి కలిగే దుర్భిక్ష కథనం 31½
40. భూతేశ్వర బ్రహ్మహత్యా సంవాదం 09
41. విమానచ్ఛాయను లంఘించిన గంధర్వరాజుకథ 18
42. విమానోల్లంఘనుడై క్రింద పడిన చిత్రసేనునికి ధూర్జటి ప్రత్యక్షం కావటం 30½

| | | |
|---|---|---|
| 43. | దేవ భూతేశ్వరుల యుద్ధ వర్ణనం | 25 |
| 44. | వారి యుద్ధకాలాన బ్రహ్మాగమన వర్ణనం | 33½ |
| 45. | విమానచ్ఛాయా లంఘన దోష కథనం | 27½ |
| 46. | విమానచ్ఛాయాలంఘన దోష పరిహారాన్ని బ్రహ్మ చెప్పటం | 22½ |
| 57. | కాశ్యప చిత్రసేన సంవాదం | 37 |
| 48. | చంద్రపుష్కరిణీ తీర్థ షట్కస్థితి కథనం | 23½ |
| 49. | వాల్మీకి భరద్వాజ సంవాదం | 26 |
| 50. | మాధవి-యమకింకర సంవాదం | 28 |
| 51. | ,, ,, ,, | 15 |
| 52. | ,, ,, ,, | 24 |
| 53. | కండు మునికథ | 23⅔ |
| 54. | అశ్వత్థ తీర్థ ప్రశంస | 29 |
| 55. | సుకీర్తి అనే పేరుగల కాశీరాజు ఉపాఖ్యానం | 30 |
| 56. | కాశ్యపుడు చేసిన భగవత్ప్రశంస | 17½ |
| 57. | సుకీర్తి-కాశ్యప సంవాదం | 16½ |
| 58. | ,, ,, | 33½ |
| 59. | జంబూక తీర్థ ప్రశంస | 18½ |
| 60. | పుష్కరుడు అనే విప్రుని వృత్తాంతం | 30 |
| 61. | బ్రాహ్మణ పిశాచ సంవాదం | 26 |
| 62. | భగవదావిర్భావం | 23½ |
| 63. | భగవానుడు చేసిన తత్త్వోపదేశం | 28 |
| 64. | పులి-మనుజుడు ఇంద్రలోకానికి వెళ్లటం | 27 |
| 65. | మునులు రంగేశ్వరునికి నమస్కరించి ఆమ్రతీర్థానికి వెళ్లటం | 18 |
| 66. | కాశ్యప బోధితుడై సుకీర్తి గ్రామ నిర్మాణం చేయటం | 55 |
| 67. | రాజకృత రంగనాథ సేవన స్తవనం | 18½ |
| 68. | రంగనాథ కథిత స్వప్న వృత్తాంతం | 16 |
| 69. | పురోహిత కథిత స్వప్న వృత్తాంతం | 27½ |
| 70. | రంగధామ సమీపానఉండే కొండనెక్కుట మొదలైనవిషయాలు | 13½ |

ప్రస్తుతం లభించిన సంస్కృత గారుడోక్త శ్రీరంగ మాహాత్మ్యంలో పైన పేర్కొన్న విధంగా నూట ఎనిమిది అధ్యాయాలు ఉన్నాయి. అయితే ఆయా అధ్యాయాలలో ఉండే విషయాన్ని పరిశీలిస్తే ఒక అభిప్రాయం కలుగుతుంది. అదేమనగా — (1) 25, 26 అధ్యాయాలలో గల విషయం చంద్రపుష్కరిణీ మహిమాను వర్ణనం (2) 28, 29, 30 అధ్యాయాలలో గల విషయం యమ కింకర భూతేశ్వర సంవాదం, (3) 32, 33, 34 అధ్యాయాలలో యమకృత శ్రీరంగ మహిమాను వర్ణనం, (4) 50, 51, 52 అధ్యాయాలలో మాధవీ యమకింకర సంవాదం, (5) 57, 58 అధ్యాయాలలో సుకీర్తి-కాశ్యప సంవాదం ఉంది. 25, 26, 28, 29, 30, 32, 33, 34, 50, 51, 52, 57, 58 ఈ పదమూడు అధ్యాయాల్లో చెప్పిన వివిధ విషయాల (ఇతి వృత్తాల) సంఖ్య 5. ఈ 5 అంశాలు ఒక్కొక్క అధ్యాయంలో చెప్పితే ఐదు అధ్యాయాలుగానే చెప్పవచ్చు. ఐదు అధ్యాయాలలో చెప్పవలసింది పదమూడు విభజించటం వల్ల 8 అధ్యాయాలు (13-5 = 8) పెరిగావని తెలుస్తుంది. భైరవకవికి దాదాపు ఒకటి రెండు శతాబ్దాలు అర్వాచీనులైన మరింగంటి సింగరాచార్యులు కట్టా

వరదరాజ కవి గారుదోక్త శ్రీరంగ మాహాత్మ్యాన్ని శతసంహిత, శతాధ్యాయిగానే పేర్కొన్నారు. కనుక భైరవకవి అనువదించింది కూడా శతాధ్యాయమే అయి ఉంటుంది ప్రస్తుతం లభించిన మూలం అష్టోత్తర శతాధ్యాయిగ (108) ఉన్నా కూడా అందలి అధ్యాయాల్లోని **వివిధాంశాల** సంఖ్య (100) నూరే. కనుక "శతాధ్యాయి" తదనంతర కాలాన అష్టోత్తర శతాధ్యాయిగ విభజించబడి ఉంటుంది తదనంతర కాలాన అంటే– కట్టా వరదరాజ కవి క్రీ.శ. 1650 ప్రాంతం వాడు. ఆయన దీనిని శతాధ్యాయిగానే పేర్కొన్నాడు. కనుక క్రీ.శ. 1650 ప్రాంతం తరువాతనే ఇది అష్టోత్తర శతాధ్యాయిగా విభజింపబడి ఉంటుందనటం స్పష్టం. ప్రస్తుత మూలం అష్టోత్తర శతాధ్యాయి అయినా కూడా ఇందులోని **వివిధాంశాల** సంఖ్య "శతం" కనుక ఇదికూడా శత సంహితమే.

శతాధ్యాయిని అష్టోత్తర శతాధ్యాయిగ **విభజించేందుకు** కూడా కారణం ఉంటుంది. ఆ కారణాలను ఇలా భావింపవచ్చు – అధికశాతం ప్రతిఅధ్యాయంలోనూ శ్లోక సంఖ్య తక్కువగానే గోచరిస్తుంది. పైన పేర్కొన్న ఐదు అంశాలు గల పదమూడు అధ్యాయాలను విభజింపక ఐదు అధ్యాయాలుగానే ఉంచితే ఆ ఐదు అధ్యాయాల్లో మిగతా (అధిక శాతం) అధ్యాయాలకన్న కూడ ఎక్కువౌతుంది. ఈ కారణం వల్లకూడ ఆ అధ్యాయాలను ఆ విధంగా విభజించి ఉంటారు. అలా విభజించటంలోనూ గ్రంథంలో మొత్తం అష్టోత్తర శతాధ్యాయాలు ఉండేట్లు విభజించటం గమనార్హం. అష్టోత్తర శతం అనేది భారతీయులకు పరమ పవిత్రసంఖ్య. భగవన్నామ స్తోత్రాలు అష్టోత్తరశతనామ స్తోత్రాలుగ ఉండటం సంప్రదాయం. శ్రీవైష్ణవులు దివ్య దేశాలుగ భావించిన వాటి సంఖ్య అష్టోత్తర శతమే. తెలుగులో వీటిని నూట ఎనిమిది దివ్య తిరుపతులు అంటారు. అష్టోత్తర శత దివ్య దేశాలలో మొదట గణింపబడేది ప్రాముఖ్యమైనది అయిన క్షేత్రం శ్రీరంగం. ఏతన్మాహాత్మ్యం శ్రీరంగ మాహాత్మ్యం. కనుక ఈ దృష్టితో కూడ శతాధ్యాయి అష్టోత్తర శతాధ్యాయిగ మార్పు చెంది ఉండటానికి అవకాశముంది.

ఇది ప్రస్తుతం లభించిన సంస్కృత మూలం యొక్క సంక్షిప్త స్వరూపాది కథనం. ఇక ఈ మూలప్రతిని ఆధారంగా తీసుకుని భైరవకవి కృత శ్రీరంగ మహత్త్వ ఆంధ్రీకరణ విధానం చర్చింపబడుతుంది.

## అనువాదం :

శ్రీరంగ మహత్త్వ ఆంధ్రీకరణ విధాన పరిశీలనానికి ముందు తద్భూమికగా "అనువాదం" అనే ఈ ఉపకర్షికలోను కొన్ని అంశాలు చర్చింపవలసి ఉంది.

ఆంధ్రకవులు గీర్వాణ పురాణ వారాన్నిధి నుండి అనర్ఘ రత్నాలవంటి పురాణ కథల్ని స్వీకరించి తమ అ ప్రతిమాన ప్రతిభా పాండిత్య కవితా వైభవంతో కావ్య ప్రబంధాలుగ "స్వతంత్ర రచనలు" అనే రీతిగా అనువాదంచేసి చిరయశస్కులయ్యారు. అలాంటి వారిలో భైరవకవి ఒకడు.

శ్రీరంగ మహత్త కృత్యవతారికలో భైరవకవి "హరిభక్తిదంబులై వెలయు పురాణసత్కథలు వేడ్కరచించి జగత్ప్రసిద్ధులైపొలుచు మహాత్ములన్ సుకవి పుంగవులం బ్రణుతిం"చాడు (1-8). భైరవకవికి పూర్వం "హరిభక్తిదములు" అయిన పురాణాలను రచించి జగత్ ప్రసిద్ధులైన తెలుగు కవులలో ప్రథమ గణ్యులు ఎర్రన-పోతనలు. వీరిద్దరుల్ను శైవులే. అయినా కూడా హరిభక్తిదాలైన నృసింహ, భాగవత పురాణాలను ఆంధ్రీకరించారు. భైరవకవి కూడా శైవుడే. అయినా కూడ విష్ణు పారమ్య కథాభరితమైన గారుడోక్త శ్రీరంగ మహత్త్వాన్ని ఆంధ్రీకరించాడు.

శ్రీరంగ మహత్త్వం కృత్యవతారికలోని కవిస్తుతిని (1.8)బట్టి, మఱియు ఆంధ్రీకరణ విధానాన్నిబట్టి భైరవకవికి తెనుగుసేత యందు ఎర్రన-పోతనల కృతులు (నృసింహ పురాణం- భాగవతం) మార్గదర్శకాలయి ఉంటాయి.

నృసింహ పురాణాంధ్రీకరణాన్ని గురించి పండితులిలా చెప్పారు—"ఎఱ్ఱన ప్రధానముగ కథా భాగమును విడువక మూలమును యథోచితముగ పెంచియు దగ్గించియు గొన్నిచోట్ల నన్యథాకరించియు నీయనువాదమును

సాగించెను. ఈ యాంధ్రీకరణము భారతీయాంధ్రీకరణము వలె స్వతంత్ర మైనది" *1. ఇక పోతరాజు శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని అనుసరించి భాగవతాన్ని అనువదించినా కూడ తత్కృతి కూడ మూలాతిరిక్తంగ, మూల సంక్షిప్తంగ, అన్యథా ప్రకల్పనంగ, తత్తత్సందర్భోచిత రీతిగ చేయబడి భాగవతం తెనుగుసేత ఒక స్వతంత్ర రచనవలె గోచరిస్తుంది. భైరవకవి ఆంధ్రీకరణ విధానం కూడ ఎఱ్ఱన–పోతనల వలెనే గోచరిస్తుంది.*2

ఎఱ్ఱన "మహా ప్రబంధ కల్పనా కుతూహలాయత్త చిత్తంబున" (నృసింహ–అవతారిక–14) ఉండగా అయన తాత కలలో కన్పించి కావ్యరచనకు ప్రోత్సహించాడు. భైరవకవి కూడ "ఒక్క ప్రబంధంబు రచింపవలయునని వితర్కించు సమయంబున" (శ్రీరంగ 1–17) శ్రీరంగ మహత్మ్యాన్ని రచింపమని చాగయ రాఘవుడు అభ్యర్థించాడు. దీనిని బట్టి ఎఱ్ఱన–భైరవులు నృసింహ పురాణ–శ్రీరంగ మహత్మ్యాలను ఆంధ్రీకరించేందుకు ముందు తామొక ప్రబంధాన్ని రచించాలనే ఉద్దేశ్యం కలిగి ఉండినారనటం తెల్లం. ప్రబంధం పురాణాలవలె గాక ప్రత్యేక పద్ధతిలో వర్ణనాది లక్షణాలు కలిగి ఉంటుంది కదా! ప్రబంధ రచనోద్దేశ్యం కలిగిన వారై పురాణాలను అంధ్రీకరించటం చేత ఆ అనువాదాల్లో పురాణాలలో లేని ప్రబంధ లక్షణాలైన వర్ణనాదులు చోటు చేసుకోవటం తప్పదు. దీనినిబట్టి మూల కృతికి కవులు కావ్యత్వాన్ని సిద్ధింపచేస్తుంటారనవచ్చు.

నృసింహ పురాణ కథా ప్రారంభంలో ఎఱ్ఱన "ఏను విన్నపంబు సేయంగల...... పురాణ కథకు ప్రారంభం బెట్టి దనిన" అని చెప్పగా భైరవకవి కూడ "నా రచింపంబూనిన యిప్పురాణ కథకు ప్రారంభం బెట్టిదనిన" అని చెప్పాడు. ఈ ఇద్దరున్నూ ఆశ్వాసాంత గద్యలలో "పురాణకథ" అనే పేర్కొన్నారు. ఇలా వారు ప్రసక్తానుసారంగ " కథ " అని చెప్పటం గమనార్హం.

---

1. ఆం.ప్ర. సాహిత్య అకాడమి వారు (1967లో) ప్రచురించిన నృసింహ పురాణానికి దివాకర్ల వేంకటావధాని గారి పీఠిక (పుట–30).
2. తరువాతి పుటల్లో ఈ విషయం నిరూపితమౌను.

దీనినిబట్టి మూలంలోని అనావశ్యకాలైన భాగాలు పునరుక్తులు మొదలయినవి తొలగించి "కథా" భాగాన్ని ప్రధానంగ గ్రహించి కావ్యత్వం/ప్రబంధత్వం సిద్ధించేటట్లు అనువాదం చేశారనటం ఆయా కావ్యాల / ప్రబంధాల పరిశీలనం వల్ల స్పష్టమౌతుంది. మూలమందలి ముఖ్యకథను ప్రధానంగ స్వీకరించటం వల్ల కొన్ని తావులలో యథా మూలానువాదం ఉండటం తప్పదు. ప్రబంధోచితాలైన భాగాలను, తమను అకట్టుకున్న వర్ణనలను కూడ మూలం నుండి యథాతథంగ స్వీకరించి అనువాదం చేయటం అగుపిస్తుంది. భైరవుడు కూడా అలాంటి పద్ధతినే అవలంబించాడు.

పూర్వోక్త అనువాద పద్ధతులను అనుసరించి భైరవకవి, శ్రీరంగ మహత్త్వాన్ని అసాధారణ ప్రతిభతో కవితా వైదుష్య పాటవాలతో స్వతంత్ర రచన వలె సంతరించాడు.

అనువాద రచనలో కవికి ఏ కొంతనోతప్ప పూర్తిస్వాతంత్రం ఉండదు. మూలంలోని ప్రధాన ఇతి వృత్తానికి భంగం వాటిల్లనట్లు అనువదింపవలసి ఉంటుంది. ఇలా వుండగా శ్రీ మద్భ్రమరాంబా భక్తుడున్నూ, శైవుడున్నూ అయిన భైరవకవి, శ్రీరంగ మహత్త్వాన్ని తన అభిరుచివల్ల రచించింది కాదు. "శ్రీరంగ రాజసేనా పారంగతుడగు" చాగయ రాఘవుని కోరిక మేరకు అనువదించిన కృతి. కృతికర్త శైవుడు., కృతిభర్త విష్ణుభక్తుడు. ఒక శైవుడు విష్ణుకథా పారమ్యమైన గ్రంథాన్ని సమర్థవంతంగ అనువదించి ఒక వైష్ణవుడని మెప్పించాడన్నమాట. చాగయ రాఘవుడు వైష్ణవుడు మాత్రమెగాక "చాతుర్య భోజుడు" (శ్రీరంగ 1-69). "వాచామాధురీ వైభవుడు" (శ్రీరంగ 4-285). "ప్రతిభాపోదిత సర్వశాస్త్ర కలనా పాండిత్యుడు" (శ్రీరంగ 2-224) కూడ. అలాంటి చాగయ రాఘవుని సంతుష్టుని చేసేదిగా ఉండాలి భైరవకవి అనువాదం. అందుకు సమర్థుడు భైరవుడని తలచియే చాగయ రాఘవుడు అతనిని "శ్రీరంగ మహత్త్వము ప్రియమారంగ దెనుంగు బాస నతిమృదుల వచః శ్రీరుచి రత్వముగా" (శ్రీరంగ 1-18), "ఆంధ్ర బాషా కౌశలంబు పచరించి రచింపవలయునని యభ్యర్థించినాడు" (శ్రీరంగ 1-25). కనుక భైరవకవి అనువాదం అతిమృదుల వచః శ్రీరుచిరత్వంగా ఆంధ్ర భాషా కౌశలం పచరిం

చేదిగా ఉండాలి. అంత మాత్రమే కాదు - శ్రీరంగ మహత్త్వాన్ని అనువదిం వాలని కోరిన చాగయ రాఘవునితో భైరవకవి—

కం, చెప్పెద కావ్యము రసములు
ఉప్పొల వర్ణనలనింపు చిలుకగ బాకం
బుప్పతిల ( జిత్ర రచనలు
చొప్పడ శబ్దార్థఘటన సుకవులు మెచ్చన్" (శ్రీరంగ-1-27)

అన్నాడు దీనినిబట్టి భైరవకవి తన అనువాదాన్ని రసాలు చిప్పిలేట ట్లుగ శబ్దార్థఘటన యుక్తంగ వర్ణనలు ఇంపు చిలికేటట్లుగా పాకాలు ఉప్పతి ల్లేటట్లుగ చిత్ర రచనలు చొప్పడేటట్లుగా చేస్తానని చెప్పినట్లు తెల్లమౌతుంది. చాగయ రాఘవుని కొలువు కూటం "సచమత్కార కారణ గుణానుబంధ బంధుర ప్రబంధ రచనా నిస్తంద్రులగు కవీంద్రుల"కు (శ్రీరంగ 1-17) నిలయం. కనుక ఆ "సుకవులు మెచ్చునట్లుగా" కూడా తాను అనువాదం చేయగలననే ఆత్మస్థైర్యంతో చెప్పి కృత కృత్యుడైన ప్రజ్ఞశాలి భైరవకవి.

"ఇతని శ్రీరంగ మహత్త్వమును లాక్షణికులందరు జదివినట్లు దాహృత పద్యములే ఘోషించుచున్నవి." *1, ప్రబంధ మణిభూషణాది సంకలన గ్రంథాల్లోనూ శ్రీరంగ మహత్త్వంలోని పద్యాలు అధిక సంఖ్యలో స్వీకరింప బడ్డాయి. దీనినిబట్టి ఈ అనువాదాన్ని (నాటి) కవి పండిత లోకం ఎంతగా అభిమానించి ఆదరించారో తెలుస్తుంది. శ్రీగిరికవి, మరింగంటి సింగరాచా ర్యులు మొదలైన వారు కూడ శ్రీరంగ మహత్త్వాన్ని అనువదించారు. కాని, వారి రచనలు కాలవాహిని గర్భంలో కలిసి/కరిగి పోయి నేడు అలభ్యాల య్యాయి. అందలి పద్యాలు లక్షణ గ్రంథ, సంకలన గ్రంథాల్లోచాలతక్కువ సంఖ్యలో ఉదాహృతాలు. భైరవకవి శ్రీరంగ మహత్త్వంవలె పై శ్రీరంగమహత్త్వ పద్యకృతులు నేటివరకూ నిలుపలేకపోయాయి. భైరవకవి కృతి నేటివరకూ నిలిచిందంటే దానికి ప్రధాన కారణం ఈ కవి అనువాద నైపుణ్యం- గట్టిగింజ నిలబడుతుంది., తాలు ధాన్యం గాలికి పోతుంది., ఇది జగమెరిగిన సత్యం.

1. శ్రీరంగ మహత్త్వము (1912) మానవల్లి రామకృష్ణ కవిగారి పీఠిక.

ఇక మూలంలోని అధ్యాయాలు, అందలి శ్లోకాలు- అనువాదంలోని ఆశ్వాసాలు అందలి పద్యగద్యాలు - వీటిని గురించి లేశమాత్రంగానైనా ప్రస్తావించవలసి ఉంది.

ప్రస్తుతం లభించిన మూలంలోని అధ్యాయాల సంఖ్య 108 కాగా ఆ అధ్యాయాలలోని మొత్తం శ్లోకాల సంఖ్య 3192. ఇక అనువాదంలోని పద్య గద్యాల సంఖ్య 1306 మూలంలోని అధ్యాయాలు తెనుగు సేతలో క్రింది విధంగ ఆశ్వాసాలుగా విభజితమయ్యాయి.

| | | |
|---|---|---|
| మూలం | 1 నుండి 14 వరకు గల అధ్యాయాలు | 15వ అధ్యాయం నుండ 18వ అధ్యాయం కొంత వరకు |
| అనువాదం | ప్రథమా శ్వాసం | ద్వితీయా శ్వాసం |

| | | |
|---|---|---|
| 18వ అధ్యాయం చివరి నుండి 47వ అధ్యాయం వరకు | 48వ అధ్యాయం నుండి 70వ అధ్యాయం వరకు | 71వ అధ్యాయం నుండి 108వ అధ్యాయం వరకు |
| తృతీయాశ్వాసం | చతుర్థాశ్వాసం | పంచమాశ్వాసం |

మూలంలోని అధ్యాయాల సంఖ్య నూట ఎనిమిదిగా ఉండేందుకు గల కారణాలు ఇంతకు ముందు చర్చించడమైనది. ఇక అనువాదం ఐదు ఆశ్వాసాలుగా రచించేందుకు గల కారణాలను ఇలా భావింపవచ్చు— శ్రీరంగ క్షేత్రంలో పాంచరాత్రాగమ ప్రస్తావనం ఉండటం వల్ల ఆ దృష్టితో భైరవకవి

పంచమాశ్వాస పరిమితంగా అనువాదం చేసి ఉంటాడని భావించటం (యుక్తి) యుక్తంగా ఉంటుంది.

సంస్కృత మూలం. అనువాదం అనే ఉపశీర్షికలలో ఇంత వరకూ చర్చించిన అంశాలు "ఆంధ్రీకరణ విధాన విషయ భూమిక". ఇక శ్రీరంగ మహత్త్వం ఆంధ్రీకరణ విధానం పరిశీలింపబడుతుంది.

## 3. 2. శ్రీరంగమహత్త్వం - ఆంధ్రీకరణ విధాన పరిశీలనం :

శ్రీరంగ మహత్త్వ అనువాద విధావాన్ని స్థూలంగ (1) యథామూలకథ (2) మూల కుంచనం (3) మూల ప్రపంచనం (4) అన్యథా ప్రకల్పనం, (5) మూలత్యాగం (6) అమూలకం అనే ఆరు విభాగాలుగ వింగడించి ఆయా విభాగాలలో అందుకు సంబంధించిన అనువాద విధానం పరిశీలింపబడు తుంది: *1.

## 3. 2. 1. యథామూలకత :

ఒక పురాణాన్ని కావ్యత్వం సిద్ధించేటట్లు అనువదించేటప్పుడు మూల మందలి ప్రధాన ఇతి వృత్తానికి భంగం వాటిల్లనట్లు చూడవలసి ఉంటుంది. కనుక అనువాదంలో యథా మూలకత కొంతైనా తప్పక ఉండి తీరుతుంది. నిజానికి యథా మూలకత అనేమాట ఎప్పుడున్నూ సార్థకంకాదు. మూలంలో ఒక ఛందస్సులో ఉండిన శ్లోకం అనువాదంలో మరొక ఛందస్సులోగల పద్యంగ అవతరిస్తుంది. ఈ పద్ధతి పురాణానువాదాలలో సర్వత్ర కన్పి

---

1. ఈ సిద్ధాంత గ్రంథం కేవలం ఆంధ్రీకరణ విధానాన్ని మాత్రమే పరిశీలిం చేదికాదు. ఈ పరిశీలనం ఈ గ్రంథంలో ఒక భాగం మాత్రమే. కనుక (ఆంధ్రీకరణ విధాన పరిశీలన సమగ్రంగా విస్తారంగ చేసి ఉండి కూడ) ఇక్కడ విస్తరభీతిచే అనువాద విధాన స్థూల విభాగాలు ఆరింటికిన్నీ ఒక్కొక్కదానికి ప్రతి అశ్వాసంలో రెండు ఉదాహరణల చొప్పున యివ్వ బడ్డాయి. అలాగైనా కూడా అరవై ఉదాహరణలవుతాయి.

స్తుంది. ఛందోను గుణంగ నడుపవలసిన పద్యాలలో మూలమందలి శ్లోకాల లోని పదానికి పదం ఎప్పుడూ అవతరించదు. "ఒక భాష నుండి మరియొక భాష కనువాదము జరుగునప్పుడు యథామూల భావానువాదమే కానీ యథా మూల పదానువాద ముండదు. కాని సంస్కృతము నుండి తెనుగున కను వదించునపుడు సంస్కృతములోని పదములు ధారాళముగ తెనుగులోనికి ప్రవేశించు నవకాశముండుటచే మూలంలోని పద భావములు రెంటును పరిశీ లించుట విమర్శకుల] కలవాటైనది* *2. మూలాన్ని ఎలాంటి మార్పులు చేర్పులు చేయక ఉన్నది ఉన్నట్లుగా అంటే యథామూల శ్లోక తాత్పర్యంగ అనువదించటం యథామూలకమనే అనిపించుకుంటుంది. అంటే ఏ ఒకటి రెండు పదాలలోనో కించిద్భేదం కనిపించినా కూడ అర్థంలో మాత్రం ఎలాంటి మార్పు ఉండదన్నమాట. ఇలాంటి యథామూలకం శ్రీరంగ మహత్త్వంలోని అశ్వాసాల వారిగ క్రమంగ పరిశీలింతం.

## ప్రధమాశ్వాసం :

నాగదంతుని ప్రశ్నకు సమాధానంగ వ్యాసుడు వకుళ–అనంతశయన తీర్థ మాహాత్మ్యాలను చెప్పటం మూలంలో 11వఅధ్యాయంలో వర్ణింపబడింది. ఈ అధ్యాయాన్ని అంత (29 శ్లోకాలు) భైరవకవి యథా మూలంగ ఎనిమిది పద్యగద్యాల్లో అనువదించాడు. ఈ 11వ అధ్యాయమంతా మరియు దీని యథానువాదాన్నంతా ఇక్కడ ఉదాహరిస్తే గ్రంథం విస్తరిస్తుందనే భీతిచే మచ్చుకు ఒక పద్యానువాదం – దాని మూలం ఉటంకించటం జరిగింది,—

శ్లో. యస్మిన్నిత్యం సన్నిధత్తే సాక్షాన్నారాయణోఽవ్యయః
యత్రాంభ స్పర్శ మాత్రేణ యాంతి పాపక్షయం నరాః
యస్మిన్వాసర మాత్రేణ వాసం విదధతాం నృణాం
భవేత్తు యోన్వయే తేషాం భవః క్వచన విద్యతే
భవాన్వయా వినశ్యేయుః లోభమోహాద యోద్విజ

---

2, "ఆంధ్ర భాగవత విమర్శ" – డా॥ ప్రసాదరాయకులపతి.

యత్ర దేవాస్త పోయోగా త్సిద్ధాశ్చ పరమర్షయః
స్తంభ గుల్మ లతాభూతా స్థావరత్వ ముపాశ్రితా
యత్రచ్ఛదన విచ్ఛేద మాత్రేణాపి ద్విజోత్తమ
బ్రహ్మ హత్యా సమం పాప మధికం ప్రాప్నుయాన్నరః
యత్ర పీడాదికం కించిద్బాల క్రీడాది గోచరం
కుర్వంతః ప్రపంత్యేవ సద్యస్సుకృతి నోపిచ

— 11వ అధ్యాయం*

పై శ్లోక పాదాలు యథామూలంగా సీసపద్యంలో ఈ విధంగా అనువాద మయ్యాయి.—

సీ. ఎయ్యెడ లక్ష్మి సమేతుడై వసియించు
నాది నారాయణుం డవిరతంబు
నెచటి తోయస్పర్శ మింత గల్గిన మాత్ర
నరులు పాపశ్రేణి బరిహరింతు
రెచ్చోట నొకదివం బేని నిల్చినవారి
కపునర్భరత్వ మహత్వ మొదవు
నెందు తపస్థితి జెంది సిద్ధర్షులు
బహులతా గుల్మ రూపముల నుందు

తే.గీ. రే నెలవునందు దళ మాత్రమైన దునుమ
బ్రహ్మ హత్య సమంబగు పాపమొదవు
నే స్థలంబున గీటాది హింస సేసి
పతన మొందుదు రతి పుణ్య భావులైన

— శ్రీరంగ 1–111

* ముద్రిత ప్రతిలో కేవలం అధ్యాయ సంఖ్య మాత్రమే కలదు. శ్లోకసంఖ్య ఇవ్వలేదు.

ఇలా 11వ అధ్యాయం కథా భాగం శ్లోకభావం చెడకుండ ఆంధ్రీకర ణం యథామూల తాత్పర్యంగా సాగింది.

**మరో ఉదాహరణ :**

భగవాన్॥శ్లో. భూతేశ్వరంచ మాం విద్ధి భూతానాం ప్రభ వాప్యమం
అధారభూతం విశ్వస్య తవానుగ్రహ కామ్యయా
తవ సందర్శ యిష్యామి స్వరూపం భూత భావనం
అభక్తానాంచ దుర్దర్శం యదితామపి సువ్రత

వ్యాసః॥శ్లో. ఇత్యుక్త్వా సర్వభూతేశో భూతానామాది రవ్యయః
దర్శయామాస విప్రాయ స్వరూపం సర్వరూపధృత్

మం. క్రా. యోగిధ్యేయం పరమ మమలం వ్యాపకం వ్యాప్య విశ్వం
శ్రీమద్బాహా దశశత యుతం కౌస్తుభోద్భాస్యురస్కం
శ్రీవత్సాఢ్యై స్ఫురదురుచలత్కుండలోద్దామ హారం
లోలత్కాంచీ కనకవసనం రూపమావిర్బ భూవ
భూతాధారం భువన భవనం భూతరాభం ప్రభూతం
దాంతం శాంతం కమల నికరోద్భాసి నీలాచలాభం
విశ్వత్రాణం విలసిత దృశం దీపితం చారుహాసం
లక్ష్మీవాసం బహుళ లలితోద్దామ వక్ష శ్రియాఢ్యం

— 13వ అధ్యాయం

పై శ్లోకాలకు అనువాద పద్యాలివి—

కం. దేవాది చతుర్విధ భూ
తావళి బొడమింప బెంప నడపం బతినై
యీవిశ్వము నాధారం
బై వెలయుదు నిత్యసుఖ పరాయణ లీలన్

— శ్రీరంగ 1–166

చం. నినుజరితార్థుజేయు మతి నేడు ప్రసన్నుడనై మదీయమై
యొనరిన దివ్యరూప మహిమోన్నతి జూపితి గాని సారసా
సన పురశాసనాదులును జాలరుగాన ప్రసన్నులైన స
జ్జనులకు దక్క నన్యులకు శక్యమెనిక్కము నన్నెరుంగగాన్
— శ్రీరంగ 1-167

వ. అని యాక్షణంబ — శ్రీరంగ 1-168

## మహాస్రగ్ధర :

బహుల భాస్వద్భా సమాన ప్రభలు నభమునంబర్వ వార్వాహగర్వా
సహ నీలాంగద్యుతుల్ భూషణ మశితతి మించన్ లసద్వైజయంతీ
సహితోరః కౌస్తుభాంశుల్ జడిగొన గనకచ్ఛాదనంబొప్ప శౌర్యా
వహ చంచద్దోస్సహ స్రావలి మెరయ బలిధ్వంసి ప్రత్యక్షమయ్యెన్
— శ్రీరంగ 1-169

పై మూల శ్లోకాలు అనువాద పద్యాల్లో "భూతేశ్వరంచమాం విద్ధి" మొదలు 3/4 పాదం, కందం (1-166)లో, "తవానుగ్రహ కామ్యయా" అనే పదాలకు "నిను జరితార్థు జేయుమతి" (1-167) చంపక మాల, "దర్శయా మాసవిప్రాయ" అనే దానికి "అక్షణంబ" (1-168) అనే వచనం, మందాక్రాంత శ్లోకాలు రెండింటికీ మహాస్రగ్ధర (1-169) అనువాదాలు. శబ్దక్రమాన లేదనటయే గానీ పై శ్లోకాలు యధాభావముగనే తెనుగునందు అనూదితాలు.

## ద్వితీయాశ్వాసం :

భగవానుడు దేవతల స్తుతులకు అలరి ప్రసన్నుడైన సందర్భాన—

వ్యాసః॥శ్లో. ఇతిస్తుతో హరిస్తత్ర దేవానుచ్చైరువాచహ
ప్రసన్న యాదృశాలోక్య జగద్విస్మాపయన్నివ

భగవాన్॥శ్లో. కిమర్థ మాగతా యూయం కోవావో భూదుపద్రవః
కేయూయం కుత ఆయాతాః క్షిప్రం ప్రబూత మాచిరమ్
— 17వ అధ్యాయం

మూలంలోని పై శ్లోకాలు అనువాదంలో ఇలా అవతరించాయి.—

ఉ. అవ్విబుధ ప్రజంబు నుతులంబు రుహోదరు డాదరించి లే
నవ్వొదలంకు చూపుల మనంబుల దుస్థితులెల్ల బాపి మీ
రెవ్వరు మీకు నిచ్చటికి నిప్పుడురా గతమేమి యాగతిం
బర్విన నవ్వయెయ్యది సమస్తము జెప్పుడు నాకు నావుడున్

— శ్రీరంగ 2-215

మూలంలో *క్షిప్రం ప్రబూత మాచిరం" (అలసింపక తొందరగా చెప్పు ము) అని ఉంటే అనువాదంలో "సమస్తము జెప్పుడు" అని ఉంది. అల సింపక తొందరగా చెప్పండి అనేదానికన్న సమస్తం చెప్పండి అని విష్ణువు అనటం సముచితంగ ఉంది. దయామయుడైన విష్ణువు సమస్తం చెప్పమన టమే సముచితం. ఈ చిరుమార్పు ఔచిత్యంగా చేసినాకూడ మిగతా పద్య మంత యథామూల భావంగానే అనువదింపబడింది.

శ్లో. జానామ్యహ మృషేస్తస్య వాంఛితంచ సుదుర్లభం
తత్తుసర్వం విధాస్యామి యూయం యాత యథాగతం
మమదృష్టి పథం యాతః కశ్చిదేవహి పద్మజ
అర్తిం నయాతి పరమా మృద్ధిం విందతి చ ధ్రువం
కిముత తత్సాద్భృశాం నాంహి సర్వం సంపత్స్రతే ఽరాం
అస్మాకమంతరం తావన్న విజానంతి కేచన
ఇత్యుక్త్వాం తర్దధే విష్ణుః తేపి జగ్ముర్య థాగతం
కృతార్థతాం కీర్తయంత స్వాత్మనః కృష్ణదర్శనాత్

— 18వ అధ్యాయం

పై శ్లోకాలకు తెనుగుసేత యథామూలంగ ఇలా ఉంది—

చం. వనజ భవుం హరుం ద్రిదశవల్లభు జూచి సనత్కుమారస
న్మని తపమాచరించుపని మున్న యెరుంగుదు దన్మనోరథం
బనితరసాధ్య మట్లగుట నంతయు నేనొక జాడదీర్చి పా
మ్మని యెదగాని మీరు చనుడా తమ వీడులకున్ ముదంబునన్

— శ్రీరంగ 2-220

తే.గీ. పద్మ సంభవ నాదృష్టి పథమునందు
బడిన వాడెప్పుడైన నాపద దొరంగి
చిరత రైశ్వర్య సుఖముల జెంది వెలుగు
ననియె మరి చెప్పనేల నీయట్టి వారి
— శ్రీరంగ 2-221

చం. అనిన గృతార్థులై ప్రమదమార దదీయ పదారవింద వం
దన మొనరించి తద్వర శతంబులు గాంచి విశేష కాంతి యౌ
పన కరుణావలోక మృదువాగ్వి భవంబు లనేక భంగులన్
వినుతులు సేయుచుం జనిరి విశ్వపితామహ ముఖ్య దేవతల్
— శ్రీరంగ 2-222

పూర్వోక్త మూల శ్లోకాల్లో "అస్మాక మంతరం తావన్న విజానంతి కేచన" అనే పదాలుతప్ప మిగతా శ్లోకాలన్నీ యథామూల తాత్పర్యంగా అనూదితాలు, భగవానుడు అంతర్ధానమైనట్లు కూడ అనువాదంలో చెప్పలేదు.

## తృతీయాశ్వాసం :

సనత్కుమారుడు అడిగిన ప్రశ్నలకు అధ్యాపక వేషుడైన విష్ణువు సమాధానం చెప్పే సందర్భాన మూలంలో ఈ క్రింది శ్లో కాలు ఉన్నాయి.—

భగవాన్॥శ్లో. ధర్మం కార్యైకనిశం సద్భిర్వస్త్వ సంస్కారానుసారిభిః
సర్వేషాం సూనృతం వాచ్యం సర్వదా సువిజానతామ్
ఆదిత్యశ్చక్షు భూతానాం శక్త్యావిష్టస్తు దివ్యయా
ప్రధానమేకం త్వం విద్ధి కార్యరూపం సదా బహు
ఆధారహీనం బ్రహ్మాహం బృహత్స్వాల్పంచ తన్మతం
అక్షరం సత్పరం చా సదస్యద్బ్రహ్మ పరం మునే
అజమీశ్వర మిత్యాహుః బీజం చాపి చతం విదుః
ఏవం సంక్షేపతః ప్రోక్తం కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛసి
— 20వ అధ్యాయం

పై నాలుగు అనుష్టుప్పులకూ తెనుగుసేత యథాతథంగ ఇట్లుంది—

సీ. ఎల్ల వర్ణములకు నెప్పుడు గార్యంబు
ధర్మంబు మరి సుకృతంబు బాయ
రనిశంబు దివ్య శక్త్యా విష్టుడగు పద్మ
బంధుండు చక్షువు ప్రాణితతికి
తగనేకమయ్యు ప్రధానంబు కార్య రూ
పమున జూడగ బహుత్వము భజించు
నాధార హీనమై యధికమైనది పర
బ్రహ్మ మల్పం బనల్పంబు వ్యాపి

తే.గీ. పరగ సదసత్తులనగ నక్షరము క్షరము
నన్యమీ రెంటకిని బరమాత్మ దలప
భవము బొరయక యుండియు బహు విధముల
జననమొందు చునుండు నీశ్వరుడు వత్స!

— శ్రీరంగ 3–24

శ్లో. అవమత్యచ యే యాంతి భగవత్కీర్తనం నరాః
నాధిక్య ముపయాం త్యాశు తేవై జన్మ జన్మని
పశ్యతో భగవద్బింబం ధామ వాతత్పరిచ్ఛదం
అకృత్వా తత్ప్రణామాది యే యాంతి పురుషాధమాః
జాత్యంధాస్తే చ జాయంతే హ్యంగ హీనాః పరిగ్రహాః
అఖేత్య భగవద్ధామ యోగచ్ఛేత్సవ్యతో నరః
క్షీణ పుణ్య చ యోనష్టస్సవై యాత్యధమాం గతిం
కృచ్ఛ్రేపి నాన్యథా యాయా దేకాంతీ సత్యసంస్థితః
అద్వారేణ ప్రవేశస్తు భగవద్ధామ్ని వృత్రవాన్
నరాణాం సర్వధర్మాణాం హానించ కురుతేభృశమ్

— 45వ అధ్యాయం

పై అనుష్టుప్పులు తెనుగుసేతలో యథామూలంగ నాలుగు కంద పద్యాలుగా ఇలా అవతరించాయి—

కం. వనజోదరు శుభగుణములు
గొనకొని కీర్తింప గేలిగొనుచు నవజ్ఞం
జను జనులు బధిరులై మహి
జనియింతు రనేక జన్మ జన్మములందున్
— శ్రీరంగ 3-272

కం. హరి బింబమైన, దత్పరి
కరమైన, ధ్వజంబునైన గని మ్రొక్కక నా
దరబుద్ధి గడిచి చనునా
పురుషులు జాత్యంధులగుచు బుట్టుదురుర్విన్
— శ్రీరంగ 3-273

కం. హరి నగరి క ప్రదక్షిణ
సరణిం జను దుర్వివేకి సంచిత పుణ్య
స్ఫురణ బెడబాసి సంప
ద్విరహితుడై పడప నరక వితతుల గూలున్
— శ్రీరంగ 3-274

కం. ద్వారమున జనక విష్ణున
గారము మరియొకడు వెంటగా జొచ్చుదురా
చారమున జేసి నదులకు
ధారంబగు పుణ్యవితతి దలగు నరేంద్రా!
— శ్రీరంగ 3-275

## చతుర్థాశ్వాసం :

శ్లో. ఆశ్చర్యమిద మాఖ్యానం వరం త్వత్త శ్శ్రుతం మయా
ప్రభావః పుణ్యతీర్థస్య క్షేత్రస్య చ మహామునే
సర్వవిద్యా ప్రతిష్ఠాచ సర్వజ్ఞత్వ మితి శ్రుతం
లోకేష్వపిచ సర్వేషా మపి సర్వం విజానతాం

సమస్త విద్యా ప్రసృతిస్త్వ ఏవ న సంశయః
ఇతిహాస పురాణాని యాని యాని మహామునే
ప్రవృత్తానిచ వేదానాముప బృంహణ కర్మణి
త్వత్త ఏవ ప్రవృత్తాని తాని సర్వాణి వై మునే
అతస్త్వ మేవ జానీషే పదార్థస్య వినిశ్చయం
తద్బ్రూహి భగవన్నద్య తీర్థాన్యత్ర మహామతే

— 48వ అధ్యాయం

పై ఐదు శ్లోకాలు మూలానుసారంగ ఇలా అనూదితాలు—

సీ. అతిచిత్రమగు నీయుపాఖ్యానమనఘాత్మ
వింటి నీవలన భూచిదితమైన
చంద్రపుష్కరిణీ ప్రశస్తియు నంచిత
క్షేత్రానుభావంబు చిత్తగతము
లయ్యెను వేద వేదాంగ పురాణేతి
హాసాది సకల విద్యా ప్రపంచ
కల్పనంబున నీవ కర్త వీరూపున
నవతారమైన నారాయణుడవు

తే.గీ. గాన, నిగమార్థ నిర్ణయ గతుల నీవ
యెరుగు దెరిగెడి వారికి నెల్ల మేటి
వానతిమ్ము కృపామతి సచట మరియు
సుమహితములైన పుణ్యతీర్థముల తెరగు

— శ్రీరంగ 4–3

పూర్వోక్త శ్లోకాల తర్వాత గల—

శ్లో. ఇత్యుక్తో భగవాన్ వ్యాసో నాగదంతేన ధీమతా
పునః పుష్కరిణీ తీరే షట్తీర్థాని జగాదసః

— 48వ అధ్యాయం

అనే శ్లోకం తెనుగు సేతలో యథామూలంగ ఇలా అనూదితం—

కం. అనుటయు కృష్ణద్వైపా
యనుడా సంయమివరేణ్యు నాదరమున గ
న్గొని చెప్పె మరియు నయ్యెడ
జన వినుతార్థంబులైన షట్త్రీర్థంబుల్
— శ్రీరంగ 4–4

ఏబది ఒకటో అధ్యాయంలో పదహారు అనుష్టుప్ శ్లోకాలున్నాయి. ఈ శ్లోకాలన్నీ తెనుగు సేతలో దాదాపు యథామూల తాత్పర్యంగానే ఉన్నాయి. (4–40 నుండి 4–48 వరకు) మచ్చుకు—

శ్లో. కోహి విశ్వ సృజస్తస్య శాసనం శార్ఙ్గధన్వనః
లంఘయేత సతచ్ఛ్రక దీప్తా శలభతా మియాత్
— 51వ అధ్యాయం

పై శ్లోకానువాదం ఇలా ఉంటుంది—

ఆ.వె. సకల కర్తయయిన శార్ఙ్గి శాసన మెవ్వ
డతకరింప జూచు నట్టి జడుడు
తన్మహోగ్ర చక్ర ధారానల జ్వాల
లందు మిడుతబోలె మ్రందిపోవు
— శ్రీరంగ 4-43

శ్లో. అర్తాన్ కృతాంజలీ న్వృద్ధాన్ తథైవ శరణం గతాన్
జీవిత వ్యత్యయేనాపి యో రక్షతి స పుణ్యకృత్
య ఏతాన్ సముపేక్షంతే దుఃఖభాజో భవంతితే
— 51వ అధ్యాయం

పై మూడు పాదాలు యథా మాతృకంగా తెలుగు సేత ఇలా ఉంది—

చం. పొడమిన యార్తియై శరణు బొందినవారి కృపాగుణంబు చొ
ప్పడ సభయంబు లిచ్చి వెలయందన ప్రాణములిచ్చియైన నె
వ్వడు సవరించు నప్పురుష వర్యుడు పుణ్యుడు తద్విధంబు చొ
ప్పడక యుపేక్ష సేయు జడభావులు పొందుదురుగ్ర దుఃఖముల్
— శ్రీరంగ 4-45

శ్లో. ఏతత్ క్షేత్రం మహాపుణ్యం సర్వలోకేషు పూజితం
యత్ర సంవాస మాత్రేణ ముచ్యతే సర్వపాతకైః
— 51వ అధ్యాయం

పై శ్లోకానికి యథాతథాంధ్రీకరణం ఇలాజరిగింది—

కం. ధారుణి ద్రిభువన పూజిత
మీ రమ్య క్షేత్రరాజ మిచ్చోట ప్రియం
బార వసియించు ప్రాణులు
తోరపు దురితముల బాయుదురు నిముషమునన్
— శ్రీరంగ 4-46

## పంచపహాశ్వాసం :

డెబ్బైరెండో అధ్యాయం అంతా కూడ దాదాపు తెనుగుసేతలో యథామూలకంగానే కన్పడుతుంది. మచ్చుకు యజ్ఞవాటికలో శునకప్రవేశం వల్ల అపవిత్రమైన సందర్భాన మూలంలో ఈ క్రింది శ్లోకాలు ఉన్నాయి—

శ్లో. అథర్త్వి జస్తదా శ్రాంతాః కుర్వంత స్నవనం నిశి
శ్రపయిత్వా పురోడాశా శమవశాస్సుషుపుర్మనే
అన్యేచస్సుషు పుస్సర్వే ప్రేక్షకా మృష్ట భోజనాః
అనావృతం యజ్ఞవాటం శ్వాగచ్ఛ దనివారితః
పీత్వాదధి ఘృతం తత్ర హెూవమార్థం పాత్రసంచితం
పురోడాశాధికం చాన్యజ్జిఘ్రన్ సంచార్య నిర్భయః
ఇతస్తతో స్తతోగత్వా దుద్రావ స బహిస్స్వయమ్
— 72వ అధ్యాయం

పై శ్లోకాలు యథా మూలానుసారంగ ఈ క్రింది పద్యాలుగా అనూదితాలు—

కం. ఒకనాటి రాత్రి ఋత్విక్
ప్రకరము బరిచారకులును బడలిన మేనన్
సకలంబు మరచి నిద్రా
వికలేంద్రియులగుచునున్న వేళన్ బెలుచన్
— శ్రీరంగ 5-18

చం, అలరగ నొక్క కుర్కుర మనావృత భూరి కవాటమైన త
త్సలలిత యజ్ఞవాటము వెసంజన జొచ్చి తదనంతరంబునం
గలయ మలంగి వేలిమికి గాదగు పాత్రికలందు ముందు వా
రలవడ నుంచినట్టి పృషదాజ్యము నెమ్మదిగ్రోలి వెండియున్
— శ్రీరంగ 5–19

ఆ.వె. ఆచట మంత్రపూతమగు పురోడాశంబు
కొంత కొంత మెసవి యంతబోక
తక్కగల పదార్థ తతులెల్ల మూర్కొని
తనిసి వెడలిపోయె దనకు దాన — శ్రీరంగ 5-20

ఋత్విజః॥శ్లో. న విద్మో వయ మేతద్ధి రాజన్ కేన కథం త్వితి
శ్రేయసో బహువిఘ్నస్స్యా దిత్యేషా లౌకికీశ్రుతిః
— 72వ అధ్యాయం

డెబ్బైరెండో అధ్యాయం చివరగల పై శ్లోకం తెనుగుసేతలో ఉత్పలమాలగా యథామూల భావంగా ఇలా అవతరించింది—

ఉ. వారు నతాస్యులై ధరణివల్లభుజూచి నరేంద్ర! దీనికిం
గారణ మేమెఱుంగ మధికంబగు మేలొడ గూడుచోట దు
ర్వారములైన విఘ్నములు వచ్చుననేకములంచు భూమిలో
వారలు రూఢిగా బలుకు తప్పునె వేయునేటికిన్
— శ్రీరంగ 5–26

శ్లో॥ సునేత్ర ఇతి విఖ్యాతః స్తత్రపక్షీ మహాబలః
సబ్రహ్మణా దత్తవరో వేదాప్యై స మహామతిః
తదాశీ ద్విదుషాం శ్రేష్ఠ స్త్వధాధ్యాత్మ పర్యాయణః
చింతన్తో మహాయోగీ తత్త్వజ్ఞాన నిధిస్స్వయం
సమాకృతిభి రన్యైశ్చ సేవితస్సమబుద్ధిభిః
రంగనాథ మభిధ్యాయన్వ సత్రిస్మ నదీతటే

— 104వ అధ్యాయం

పై మూడు శ్లోకాలున్నూ ఆంధ్రీకరణంలో యథామూలాన్నుగుణంగ ఇలా అవతరించాయి—

సీ. కలడు సునేత్ర విఖ్యాతు డచ్చట నొక్క
పక్షీంద్రుండతడు దక్షుబు ధర్మి
జునిచే వేదంబులన్నియు దుదముట్ట
నెరుగునట్లుగ వరం బెలమివడసి
యఖిల విద్వత్ జ్ఞానియై నిర్మలజ్ఞాన
పరుడయి భోగైక నిరతుడగుచు
నాత్మ సమాన సాచార సంపన్ను
లగు విహంగములు తన్నాత్మ గొల్వ

ఆ.వె. రంగనాథు దివ్య మంగళ విగ్రహ
ధ్యాన సౌఖ్యలీల బూని పెద్ద
కాల మొసగి పొల్చు కావేరి తటమున
నొక్క దినము బాయుకున్న వాడు శ్రీరంగ 5-211

భైరవకవి శ్రీరంగ మహత్త్వంలో యథా మూలకతగల భాగాలు ఇందాక కొన్ని ప్రదర్శితమైనవి. ఇక మూలసంక్షిప్త భాగాలు పరిశీలింతం—

## 3. 2. 2. మూలసంక్షేపనం :

సంస్కృత గారుడ పురాణోక్త శ్రీరంగ మాహాత్మ్యాన్ని ఆంధ్రీకరించటంలో భైరవకవి కొన్ని తావులలో మూలాన్ని మిక్కిలి సంక్షేపించాడు. అలా

మూలకుంచనం చేసేందుకు అనువాదకుడు కొన్ని పద్ధతుల్ని అనుసరించి ఉంటాడు. భైరవకవి తన కృతిలో కథా ప్రారంభ సందర్భాన "నా రచింప బూనిన యిప్పురాణ కథకు ప్రారంభం బెట్టిదనిన" (శ్రీరంగ 1-74) అని, ఆశ్వాసాంత గద్యల్లోను పుణ్యకథ అని పేర్కొన్నాడు. ఇక్కడ "కథ" అని ప్రయోగించటం గమనార్హం. అలా ప్రయోగించటంవల్ల భైరవకవి మూలాన్ని అనువదించటంలో కేవలం కథాభాగానికే ప్రాధాన్యత ఇచ్చినట్లు భావింపవచ్చు. ఈ విధమైన అనువాదంలో భైరవకవి అనుసరించిన పద్ధతులు ముఖ్యముగ యివి: మూలంలో ఉన్న పునరుక్తుల్ని అనువాదంలో తొలగించటం, మూలంలో పురాణ పద్ధతిలో చెప్పిన అనావశ్యక సుదీర్ఘ భాగాలను అనువాదంలో సారాంశ మాత్రంగా సంగ్రహంగా చెప్పటం. ఈ విధంగా మూలకుంచనం చేసి అనువదించిన భాగాలు ఈ ఉపశీర్షికలో ప్రదర్శితం.

## ప్రథమాశ్వాసం :

శౌనకాదులు అడిగిన ప్రశ్నలకు సూతుడు ప్రాచార్యుడైన వ్యాసునికి నమస్కరించి జనక సభలో ఆయన శ్రోతలకు చెప్పిన విధంగానే చెప్తానని మొదలు పెట్టాడు. జనకసభలో నాగదంతునికి వ్యాసుడు చెప్పిన విధానాన్ని అభ్యుదయలాలసులకు చెప్పటం మొదలైనవి మూలంలో రెండో అధ్యాయంలో ఉన్నాయి. మరియు వ్యాసుని వర్ణనం, అక్కడి మునుల పేర్లు, వ్యాస సన్నిధితో మునులు అపూర్వత్వాన్ని పొందటం, వ్యాసుడు తన సంతృప్తిని ప్రకటించటం మొదలైన విషయాలు రెండో అధ్యాయంలో 15½ అనుష్టుప్ శ్లోకాల్లో వర్ణింపబడినవి. (విస్తర భీతిచే ఆ శ్లోకాల్నన్నీ ఇక్కడ ఉటంకించేందుకు వీలుకాలేదు.) ఈ శ్లోకాలన్నింటిలోనూ ఉండే ముఖ్యమైన కథా సారాంశాన్ని మాత్రం గ్రహించి భైరవకవి ఈ క్రింది రెండు పద్యాల్లో మూలాన్ని కుదించాడు.

ఆ.వె. తే.గీ. అనేక శ్రీమహా చరణ విహ్వానుషక్తి
చిత్త జలజభ్రాతృష్యుణ్ణు వికసింపజేయు
దను పదీయు కథాంశ విస్తారమట్టగ
జెలగి వారల కిట్లని చెప్పెనతడు — శ్రీరంగ 1-83

చం. అమల చరిత్రులార వినుడమ్మిథిలాపురి నధ్వరోత్సవాం
తమున మునీశ్వరానుమతుడై తనువేడెడి నాగదంత సం
యమికి బరాశరాత్మజు డుదాత్త కథా పరిపాటి బుణ్య తీ
ర్థములను బుణ్యభూములు ముదంబునదెల్పగబూని యిట్లనున్
— శ్రీరంగ 1-84

## తృతీయాశ్వాసం :

మూలంలో 32, 33, 34 అధ్యాయాల్లో విష్ణు దూతలను యమదూతలు మందలంచటం, వారిని మరల యమదూతలు ప్రశ్నించటం, వారికి మరల విష్ణుదూతలు సమాధానం చెప్పటం కలదు. అనగా ఈమూడు అధ్యాయాల్లో దాదాపు చర్విత చర్వణమే పురాణ శైలిలో పునరుక్తమైంది. కనుక భైరవ కవి ఈమూడుఅధ్యాయాలను తెనుగుసేతలో ఒకసీసపద్యం (3-126) మరియు 11 పంక్తుల వచనంలో (3-127) కుదించి చెప్పాడు. (విస్తర భీతిచే ఆ మూడు అధ్యాయాలను ఇక్కడ ఉటంకింపలేదు.)

దక్షునిచే శప్తుడైన చంద్రుడు శాప నివారణార్థం శ్రీరంగంలో పుష్కరిణీ తటాన తపమాచరిస్తాడు. అపుడు అతనికి విష్ణువు ప్రసన్నుడౌతాడు. ఆ సంద ర్భాన మూలంలో చంద్రుడు విష్ణువును 14 శ్లోకాల్లో స్తుతిస్తాడు. ఆ శ్లోకాల ఆద్యంతాలివి—

శ్లో. నమో జగన్మంగళదాయినే నమో
జగత్ప్రసూతి స్థితి నాశ హేతవే
... ... ... ...
నమో జగన్మంగళదాయినే నమో
నమోస్తు లక్ష్మీశ్రయచారు వీక్షసే — 36వ అధ్యాయం

పై 14 శ్లోకాలను భైరవకవి పూర్తిగా అనువదింపక, అనువాదాన్ని విడువక చంద్రుడు చేసిన స్తుతిని మాత్రం ప్రస్తావించి ఇలా మూలకుంచనం చేశాడు—

రిబహువిధంబుల బ్రస్తుతి జేసెనమ్ముదై" —శ్రీరంగ 3-147. 14 శ్లోకాల్లోని ప్రస్తుతి మూలకుంచనంలో బహువిధంబుల ప్రస్తుతి అయింది.

## చతుర్థాశ్వాసం :

భగవత్కృత తత్త్వోపదేశం పిశాచీ విప్రులు తీర్థ స్నాతులై ముక్తులు కావటంమొదలైన విషయాలుగల మూలంలోని 63వఅధ్యాయం తెనుగుసేతలో చాల కుదింపబడింది. మూలంలోని శ్లోకాలు—

భార్గవ॥శ్లో. ఇతి తేషాం వచశ్శ్రుత్వా నిశ్చయజ్ఞో మహామతిః
వచనం వక్తు మారేభే నిర్ణయార్థం నరోత్తమః

భగవాన్॥శ్లో. చరాచరమిదం విశ్వం తత్ క్షేత్రస్య ప్రవర్తనం
ఉభౌసుష్ఠు తథాబ్రూతాం వ్యాఘ్రీమర్త్యౌ మహామతీ
ఉభయోస్సం వివాదస్యాన్న చాన్యస్య విపర్యయః
సమస్త హేయ రహితం పరమాత్మేతి సూనృతం
సర్వదోషాశ్రయో జీవ ఇతిద్విజ సమీరితం
తత్ర కించి త్ప్రపశ్యామి హ్యనుక్తం మునిసత్తమాః
ఏవంహి సర్వభూతేషు పరమాత్మావతిష్ఠతే
విధాయ వివిధానీహ కరుణానిచ దేహినాం
సంకల్ప్య దేహినో దేహం తత్తత్కర్మో పలక్షితం
ఆత్మనోభోక్తృ శక్తించ క్రియాశక్తిం తథేశ్వరం
విధాయ చైవం విశ్వం తత్ నియంతు మవతిష్ఠతే
సర్వస్యాధార భూతత్వాత్తథా విశ్వ ప్రవర్తనాత్
విశ్వం కరోతి భగవాన్ తథావిశ్వస్య జన్మభూః
పరమాత్మ స్థితిరియం సర్వభూతేషు శాశ్వతీ
విశ్వమస్య శరీరం తద్విశ్వస్యాత్మా స ఈశ్వరః
సుఖ దుఃఖాది యోగిత్వ మాత్మనః కర్మ హేతుకం
కర్మబద్ధో హ్యయం జీవస్సద సత్కురు తేనిశమ్
తం నియచ్ఛతి విశ్వాత్మా శరీరమితరో యథా

వర ప్రేరిత శక్తి స్స్వాత్మా సర్వం కరోతిహి
ఏతావ దేవ కర్తృత్వ మాత్మనోస్యైవ సర్వదా
యదిష్ట కార్య కరణం శుభం వాప్యథవాఽశుభం
అతశ్శుభా శుభం కర్మ కుర్వతస్త త్ఫలాన్వయః
శుభం కృత్వా శుభం భుంక్తే పాపం కృత్వాశుభేతరత్
ఇదం శరీర మాత్మానం వ్యాప్యతిష్ఠత్య పీశ్వరః
న కర్మణా పరిష్పృక్తః పద్మపత్ర మివాంభసాః
ఉదాస్తే సర్వభూతాత్మా సాక్షిత్వే నవ్యవస్థితః
అతశ్శుభా శుభై స్సంగమః కర్మబంధన హేతుకః
సర్వబంధ వినిర్ముక్తః పరమాత్మా స్వతస్సుఖీ
కరణాయత్త భోగశ్చ వశ్యః క్షేత్రజ్ఞ ఇష్యతే
పరావర విభాగజ్ఞో బంధాన్ముక్తిం సమేష్యతి
యదా స్వస్మిన్ స్థితో విష్ణుస్తదా జ్ఞానాద్వి శుధ్యతి
విచిత్ర కార్య కరణే శక్తిరస్త్యేవ చాత్మని
నో చేత్సర్వ శాస్త్రస్య వై యర్థ్యం చ ప్రసజ్యతే
యద్యయం సర్వకార్యాణి కర్తుం కించన చ ప్రభుః
ప్రవర్తకం హి తచ్ఛాస్త్రం తం ప్రకృత్య ప్రవర్తతే
ఇదం కుర్యా దిదం నేతి నేశ్వరే ప్రెరణం భవేత్
అవాప్త సర్వ కామస్తు న వియోజ్యస్స ఈశ్వరః
శుభా శుభే ప్రవృత్తస్య సాపేక్షస్య కరోతిహి
నివృత్తి మశుభాచ్ఛాస్త్రం ప్రవృత్తించ శుభేషుచ
శుభా శుభ ప్రవృత్తించ స్సాపేక్ష మధికారిణమ్
ఫలం ప్రదర్శ యచ్ఛాస్త్ర మధికృత్య ప్రవర్తతే
శాస్త్రంహి విపులం తస్య శాసనం తత్పరేశితుః
అతస్తత్పరి హారార్థ మర్థయాథార్థ్య యోగతః
ఆత్మనః కార్యసామర్థ్యం తస్యైవచ ఫలాన్వయః
స్వం స్వమభ్యేతి సర్వత్ర హ్యేషశాస్త్ర వినిశ్చయః
పరం నిశ్రేయసం ప్రాప్తా వ్యాఘ్రీ మర్త్యావుభావిమౌ

పరా పర విభావజ్ఞౌ పరాం సిద్ధిం సమేష్యతః
అస్మిన్వివాదే విజయః పరస్పర మతీవహి
యువాభ్యా మస్త బంధాభ్యాం జ్ఞాతవ్య మధునా సుఖం
సాధ్వీవా యదివాసాధ్వీ మతిరెషా మమ ద్విజాః
ప్రమాణం భగవంతో త్రయూయం దృష్ట పరావరాః
— 63వ అధ్యాయం

పై శ్లోకాలకు తెనుగుసేతలో ఈ క్రింది విధంగా కుదింపు జరిగింది.

వ. అనిన నమ్మౌని బృందంబునకు నందకహస్తుండిట్లనియె
— శ్రీరంగ 4-189

కం. విను విప్రుండును బలియును
వినుత ప్రజ్ఞావశేష విదులిరువురు వ
ల్కిన పల్కులు గావనగా
జన దఖిల పురాణ శాస్త్ర సమ్మత మగుటన్ — శ్రీరంగ 4-190

సీ. అఖిల రూపముల గర్మానుభూత శరీర
ధారులగా నాదితా సృజించి
వానియం దుండి సర్వప్రవర్తకు డయ్యు
నప్పయోరు హాదళ శ్యాముడరయ
గర్మ ప్రసక్తుండు గాక విశ్వమ్మునకు
సాక్షియై యేపారి సంతతమును
సచ్చిదానంద భాస్వ ద్రూపియై యొప్పు
పరమాత్మ మరి కర్మబంధుడగుచు

తే.గీ. పుణ్య పాపము లొనరించి పూని జీవు
డోలి మేలును గీడును నొందు చుండు
నిట్లుగాకుండె నేనియు నెసగు సకల
మైన శాస్త్రంబులకును వైయర్థశక్తి — శ్రీరంగ 4-191

వ. కావున నీ వివాదంబు ప్రాగల్భ్యంబగుట నిక్కంబగు జయం బొక్కనికి జొప్పడ దిప్పిశాచియు విప్రుండును సుఖంబగు నిశ్రేయస పదంబు నొందెదరని చెప్పిన నప్పరమ తపోధన సందోహంబు సందేహంబు బాసియా జగన్నివాసు నందరు నన్నిచందంబుల గొనియాడి పదంపడి

— శ్రీరంగ 4–192

మూలంలో 104 అధ్యాయాన ప్రభాకరుడనేవాడు తపన్సు చేయటం వర్ణింపబడింది. అపుడు బ్రహ్మ రెండుసార్లు ప్రత్యక్షమై రెండుసార్లు తిరోహితుడౌతాడు.

పక్షి॥శ్లో. అథద్విజ వరోరాజన్ యతాత్మా దృఢనిశ్చయః
పునస్తప స్సమా స్థాయ భూయస్తస్థా మహామతిః
తతస్స ముత్థితో వహ్నిర్జ్వలన్ బ్రహ్మ తపోమయః
దదాహ లోకానఖిలాన్ సదేవాసుర పన్నగాన్
అభ్యుపేత్య చతం విప్రం పునశ్చోచైః ప్రజాపతిః
అబ్రవీచ్చ యదిష్టంతే వరం తద్ర్వియతామితి
పునశ్చా వాచితం విప్రో బ్రహ్మాణ మభిపూజ్యచ
ఇచ్ఛామి సకలాన్వేదానధ్యేతు మితి సాదరం
నిశమ్య తద్వచ స్థైర్యం భగవాన్ కమలాసనః
తన్నశక్యం తపేత్యుక్త్వా తత్రై వాంతర ధీయతః
సోప్యతిష్ఠ ద్యథాపూర్వ ముగ్రే తపసి సంయతః
సన్నియమ్యేంద్రియ గ్రామం సమాధి నియమశ్శుచిః
అథోవాచ పునర్బ్రహ్మ తత్రైవాంతర్హితస్స్వయం
ప్రభాకర ద్విజం రాజన్ తపసాధ్వస్త కిల్బిషం

బ్రహ్మ॥శ్లో. భోభో విప్ర నృశంసంతే కృత్యం యచ్చ చికీర్షసి
భస్మీభూత ఇమే లోకాస్తపసా తవ సువ్రత
కర్మణాహి జగత్సర్వం ప్రతిబద్ధం ప్రకాశతే

అవివేకాల్ప శక్తీశ్చ నష్టస్మృతి రసంగతః
అనంత శాఖినో వేదాహ్య ధేత్యుం సకలా ఇహ
కథమత్యల్ప సత్వేన త్వయా శక్యా వదద్విజ
విరమత్వం తతోఘోరాత్తపస శ్శాంత మానసః
నిరుద్విగ్నా స్తతస్సర్వే లోకాస్సంతు గతవ్యధా

పక్షి॥శ్లో. ఇత్యాకర్ణ్య ద్విజో వాణీం గంభీరాంచ వియద్గతాం
మునిస్సంతోష మతులం సమపద్యత భూపతే
అథోవాచ వచో ధీమాన్ సముద్వీక్ష్య చతాందిశం
వాణీతు వదతాం శ్రేష్ఠ యతో నిస్సరతి స్స్వయం

బ్రాహ్మణః॥ యోబ్రవీతి వియన్మధ్యే స్వయమంతర్హితో వచః
నమో దృశ్యస్వరు పాయ తస్మై దేవాయ వేధసే
తపసా విదంతే లోకా నమలానపి పూరుషః
తపసా పరమిచ్ఛంతి నిర్వాణ మపి శాశ్వతం
పాప్మానం క్షపయంత్యాశు తపసా భువి మానవాః
తపసా చైహికీం సిద్ధిం విపులామపి విందతి
లభం తేచ సుతాదీంస్తాన్ తపసా మర్త్యజా తయః
అక్షయంత ధనంచాపి తపస్యంతో నరాభువి
అతస్సం పత్స్యతేస్మాకం తపసా భావితాత్మనాం
అపి సర్వం సుదుప్రాపమితి మేధీయతే మతిః
యతేంద్రి యస్య సతతం తిగ్మే తపసి తిష్ఠతః
యుక్తాచారస్య తస్యైవ కిం నామచ దుర్లభం

పక్షి॥ ఇతిశ్రుత్వా వచస్త స్య ద్విజస్య కమలాసనః
తూష్ణీం భూతో నృపశ్రేష్ఠ జగామ భవనం స్వకం
అథ పంచాగ్ని మధ్యస్థో భాస్కరంచ ప్రభాకరః

పై శ్లోకాలు ఈ క్రింది వచన, పద్యాలుగా తెనుగు సేయబడ్డాయి. అవి మూలకుంచనంగా ఉన్నాయి—

వ. అనిన నా మాటలు సమ్మతింపక భారతీకాంతుండంతర్హితుం డయ్యె నా ప్రభాకరుండును దృఢ నిశ్చయుండై వెండియు నతిఘోరతపంబు గావింప నిలింప ప్రబోధితుండై చతుర్ముఖుండు మరియు రెండు వరుసల నా తపోధన సత్తము పాలికిం జనుదెంచి యతని పూనిక వదిలింపలేక నిజలోకం బున కరిగె నంత — శ్రీరంగ 5-198

శా. పాదంబొక్కటి నేలనూది శుచియై పంచాగ్ని మధ్యస్థితుం
డై దృష్టుల్ దివిజేర్చి యమ్మౌని వరుండస్వీకృతాహారుడై
వేదాత్మున్ విధి విష్ణుశంకరమయున్ విశ్వేశు సంపూజ్యు న
య్యాదిత్యున్ మదినిల్పి చేసెదపమత్యంత స్థిరస్వాంతుడై
— శ్రీరంగ 5-199

భైరవకవి ఆంధ్రీకృత శ్రీరంగ మహత్త్వంలోని మూలకుంచన భాగాలు మచ్చుకు ఈ ఉపశీర్షికలో ప్రదర్శింపబడ్డాయి. ఇక మూలప్రపంచన భాగాలు పరిశీలింపబడును.

## 3. 2. 3. మూలప్రపంచనం :

శ్రీరంగ మహత్త్వ మూలం ఒక పురాణం. భైరవుని అనువాదకృతి ఒక కావ్యం. భైరవుని కృతిని కావ్యం అని చెప్పేందుకు ఆ గ్రంథమే ప్రత్యక్ష సాక్ష్యం. భైరవకవి కూడా "చెప్పెద కావ్యము" (శ్రీరంగ 1-27) అన్నాడు. పురాణ లక్షణాలు వేరు. పురాణ అనువాదానికి కావ్యత్వం సిద్ధించాలంటే అయా సందర్భాలకు తగినట్లుగా రసాలంకార వర్ణనాదులు చాలా అవశ్యం. అందువలననే పురాణం ఆంధ్రీకరింపబూనిన భైరవకవి "చెప్పెద కావ్యము రసములు చిప్పిల వర్ణనల నింపు చిలుకగ" (శ్రీరంగ 1-27) అన్నాడు. వర్ణ నాది అంశాలు మూలంలో అతి సంగ్రహంగ సూత్రప్రాయంగ ఉండే భాగాలను చాలా సందర్భాల్లో భైరవకవి చక్కగా పెంపుచేశాడు. సూత్రప్రాయంగా చెప్పిన సంగ్రహాలను కన్నులకు గట్టినట్లు అర్థవివరణాత్మకంగ రసాలంకార వర్ణనాది శోభితంగ చెప్పాలనే భావచాలన కుతూహలమే దీనికి (మూల ప్రపం చనం) ముఖ్య కారణం. అందువల్ల అనువాదంలో మూలాతిరిక్తం చోటు

చేసుకుంటుంది. మూల గ్రంథంలోని విషయాన్ని ప్రపంచించి చెప్పటం మూల ప్రపంచనం. అలాంటి మూల ప్రపంచనం శ్రీరంగమహత్త్వంలో ఎలా జరిగిందో మచ్చుకు ప్రదర్శింపబడుతుంది—

## ప్రథమాశ్వాసం :

మూలంలో ప్రథమాధ్యాయాన కథా ప్రారంభంలో మొదటి శ్లోకం "మునయోనైమిశారణ్యే సత్రం ద్వాదశ వార్షికమ్ సమాసత మహాత్మానో బ్రహ్మణ్యా హిత చేతసః" అని ఉంది. ఈ అధ్యాయంలో ఈ మొదటిశ్లోకం లోని నైమిశారణ్య నామ ప్రస్తావనాన్ని ఊతగా గ్రహించి భైరవకవి సందర్భోచితంగా నైమిశారణ్య వర్ణనం ఒక ఆటవెలది మరియు ఒక సుదీర్ఘ వచనం (44 పంక్తులు*) రచించి మూల ప్రపంచనం అతి రమణీయంగా చేయబడింది అ మూల ప్రపంచన పద్యగద్యాలు ఇవి—

ఆ.వె. త్రిభువనైక పుణ్య దేశాగ్రగణ్యమూ
ర్జిత పయస్సరోవరేణ్య-మనఘ
బహుసుకృత రత్న పణ్యము నైమిశా
రణ్యమొప్పు మునిశరణ్య మగుచు — శ్రీరంగ 1-74

వ. మరియు నప్పరమ పవిత్ర క్షేత్రంబు............మయూరంబు లను గలిగి యుల్లసిల్లునందు *1. — శ్రీరంగ 1-75

శ్లో. పరస్యరూపం సహసాదదర్శ-ప్రణమ్య బద్ధాంజలి రగ్ర్యమగ్ర్యః
ప్రసీదదేవేత్య సుకృద్వ చోబ్రవీత్-తదా బ్రువంతంచ హిరణ్యగర్భం
ప్రియంవరంతే ప్రియతామితీర్థం-అథాహ వేధాః పురుషోత్తమత్వం
కురుష్వయ ద్రూపమిదం తవాద్యం— — 14వ అధ్యాయం

---

* ఆం.ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ (1979) డెమ్మిసైజు పుస్తకంలో 44 పంక్తులు.

1. 44 పంక్తులు గల ఈ సుదీర్ఘ వచనాన్ని విస్తరభీతిచే ఆద్యంతాలు మాత్రం ఇచట ఉటంకించబడింది.

పై శ్లోక పాదాలు అనువాదంలో ఈ క్రింది విధంగా ప్రపంచనం చేయబడ్డాయి—

కం. ఆలోక పితామహునకు
నాలోకన సమధికోజ్వ లాకృతి పటుభూ
షాలోక మెసగ నవ్విభు
డాలో బొడచూపి వేడు మభిమత మనినన్ —శ్రీరంగ 1-80

తే.గీ. లీల జాగిలి మ్రొక్కి కెంగేలు గవలు
ఫాల భాగంబునందున గీలుకొలిపి
బహువిధంబుల వినుతించి పద్మభవుడు
వేడ్క దనకోర్కి యిట్లని విన్నవించె — శ్రీరంగ 1-181

ఉ. నేరెడువండు చాయ తవణించెడు మేన బదారువన్నె బం
గారొరబటు పట్టు బసగందని తామరరేకు మైసిరుల్
దోరణగట్టి యేలు కనుదోయును బొందుకు నుద్దియై మెరుం
గారు నురంబు కెంపు దయనానిన యుల్లము చల్లచూపులున్
— శ్రీరంగ 1-182

కం. అలరిన లలితాకృతినా
తలపున నెలకొల్పినట్లు దైత్యాంతక! యి
మ్మల నెల్లప్పుడు కనుగవ
లలర గనుంగొనెడి భాగ్యమంటింపగదే! — శ్రీరంగ 1-183

పూర్వోక్త శ్లోకాలను వాటికి అనువాదాలైన పై పద్యాలను పరిశీలిస్తే అనువాదం మూలప్రపంచితంగ అవతరించినట్లు తెల్లమౌతుంది.

## ద్వితీయాశ్వాసం :

శ్లో. తతః స్వర్లోక సస్సర్వే భవశక్ర పురోగమాః
ప్రజాపతిం పునస్కృత్య జగ్ముః క్షీరనిధేస్తటమ్
తతః ప్రాంజలయ స్సర్వే భగవంతం సురేశ్వరాః
తుష్టువుః పుండరీకాక్షం శరణ్యం శరణార్థినః — 16వ అధ్యాయం

సనత్కుమారుని తపస్సుకు దేవతలు భయపడి బ్రహ్మతో మొరపెట్టి ఆ తర్వాత దేవతలందరున్నూ కలిసి పాలకడలి దగ్గరకు వెళ్ళి విష్ణువును శరణుజొచ్చుట మొదలైన కథాసందర్భాన పై శ్లోకాలు ఉన్నాయి మూలంలో సముద్రం దగ్గరకు దేవతలు వెళ్ళినట్లు ఉంది. కానీ సముద్ర వర్ణనంలేదు. భైరవకవి పై శ్లోకాల్లో ఉండే సముద్ర ప్రస్తావనాన్ని ఆధారంగా అనువాదం మూల ప్రపంచనం ఇలా చేశాడు.

వ. అని యాక్షణంబ కదలి చని — శ్రీరంగ 2-206

మ. అరవింద ప్రభవుండు గన్గొనియె మధ్యస్థాన సుప్తాంబు జో
దర పర్యంక భుజంగ పుంగవ సముద్యద్భూరి భోగాగ్రవి
స్ఫురితానేక నిరర్ఘ దివ్యమణి సంభూత ప్రభాపుంజ పం
జర జాతాభ్ర పదభ్రమాకులిత భాస్వత్సారథిన్ నీరధిన్
— శ్రీరంగ 2-207

వ. మరియు......... డెందంబుసం దనుభావంబున గొనియాడుచు దీరంబుసేరి శరణాగత శరణ్యుండగు నప్పుండరీకాక్షు నిట్లనిస్తుతించె
— శ్రీరంగ 2-208

పై వచనం రెండు పుటలకు సరిపడే సుదీర్ఘ వచనం. వచనమంతా కూడ సముద్ర వర్ణనా భూయిష్ఠంగా ఉంది. విస్తర భీతిచే వచనమంత ఇక్కడ ఉటంకింపలేదు. మూలంలో సూత్రప్రాయంగ చెప్పిన సముద్ర ప్రస్తావనం అనువాదంలో పై పద్యగద్యాల్లో మిక్కిలి ప్రపంచింపబడింది.

## తృతీయాశ్వాసం :

శ్లో. అథ పద్మాసన స్తత్ర హ్యజ గామ యదృచ్ఛయా
దృష్ట్వా సనత్కుమారాస్తు పితరం త్వభ్యగాదయత్
— 24వ అధ్యాయం

పై శ్లోకంలో బ్రహ్మకు సనత్కుమారుడు నమస్కరించినట్లు చెప్ప బడింది. అనువాదంలో బ్రహ్మ నామధేయ పర్యాయ పదాలు చెప్పి మూల ప్రపంచనం చేయబడింది. ఆ పద్యం ఇది—

సీ. తాతల తాత నెత్తమ్మి నెయ్యపుబట్టి
వేలుపు పెద్దవా వెలది మగడు
తపసుల మొనగాడు తపముల జెట్టికా
డెల్ల విద్యల నెర నెరగుజాణ
ముక్కంటి సారథి ముల్లోకముల జేత
నంటక జేయు విన్ననుపుకాడు
పంచాళి రాయంచ బరపి యాడెడు రౌతు
కైలాట కపుముని గన్నతండ్రి

తే.గీ. జగతి నేరికి దనవ్రాలు మిగులరాని
బిరుదు లేకరి నేర్పుల బరగు ప్రోడ
నాల్గు మొగముల దేవుడున్నతి దలిర్ప
నచటి కేతెంచుటయు వినయమున మ్రొక్కి — శ్రీరంగ 3-42

శ్లో. చిత్రసేనస్య సంతుష్ట స్సన్నిధత్తే స్మభూర్జటి
ప్రసాదాభి ముఖో దేవ కరుణం తం విలోక్యచ
కిం కిమిత్య బ్రవీద్దేవో వదయత్తే వివక్షితమ్
తస్య తద్వచనం శ్రుత్వా గంధర్వో మునిసత్తమః
బ్రహ్మయ్యోత్థాయ సకలం సోబ్రవీత్స్వాం వ్యతిక్రమం
పినాకీ తద్వచశ్శ్రుత్వా తతః పతన హేతుకం
చింతయామాస కింకృత్వా కథమే తద్భవిష్యతి
స్తోతుః ప్రసన్నో భగవాన్ త్రినేత్రస్త్రిపురాంతకః
ప్రేషయామాస భూతేశాం చ్ఛతశోధన సహస్రశః
మహేశ్వరాణి భూతాని స్కందేన సహ నిర్యయుః
యత్ర ప్రతిష్ఠితం ధామ శ్రీమద్రంగ మితిశ్రుతం
— 42వ అధ్యాయం

పై శ్లోకాలు అనువాదంలో ప్రపంచింపబడ్డాయి. వీటి మూలాతిరిక్త గద్యపద్యాలు ఇవి—

వ. అని నన్నుతించిన బ్రసన్నుండై విపన్నగాశనియగు పన్నగాభరణుండ తనిపై గృపాతరంగితంబగు నపాంగంబు నిగిడించి నీతలం పెయ్యది చెప్పుమనిన నప్పశుపతికి నందంద వందనంబూ జాచరించి కృతాంజలియై యా చిత్ర సేనుండు తన వృత్తాంతంబంతయు విన్నవించిన దత్పతనకారుల నిరూపించి విరూపాక్షుం డాక్షణంబున నిజకింకర గణంబుల రణంబున కాజ్ఞాపించిన—

— శ్రీరంగ. 3-216

శా. బాహాకంపిత హేతి దీప్తులు వియద్భాగంబు గప్పన్ సము
త్సాహో దంచిత సింహనాదముల దిక్చక్రంబు భేదిల్లగా
సాహంకార భయంకరాకృతాలతో సాయోధనోదగ్ర స
న్నాహంబద్భుత మావహింప వెడలెన్ మాహేశభూతావళుల్

—శ్రీరంగ 3-217

శా. చంచద్వాహన కేకి పింఛ రుచులాశా మండలం బెల్ల జి
త్రించెన్ రోహణ శృంగరాజముల భాతిన్ రత్న కోటీరము
ల్మించెన్ బాశ శరాది సాధనము లోలింబూని దర్పంబునం
గ్రౌంచారాతియు బల్విడిన్ వెడలె సంగ్రామ క్రియాలోలతన్

— శ్రీరంగ 3-218

వ. ఇట్లరిగి సకల దురిత లతాలవిత్రంబగు శ్రీరంగ క్షేత్రంబు ప్రవేశించి యందు నిరర్గళాపవర్గ కరవారియగు కావేరిం జేరి యా భూతజాతంబు నానా ముఖంబుల దజ్జలంబు చులుకంబుల గ్రోలం దొడంగిన — శ్రీరంగ 3-219

యుద్ధవర్ణన సందర్భాన మూలంలో ఈ క్రింది శ్లోకాలుకూడా ఉన్నాయి—

శ్లో. సముద్ధతధ్వనిం శ్రుత్వా రక్షిణస్తత్ర నిర్యయుః
తాన్ దృష్ట్వా పిబతో రౌద్రాన్ నిజఘ్నుస్తత్ర సంగతా॥

— 42వ అధ్యాయం

పై శ్లోకంలోని నిజఘ్ను అనే క్రియ తెనుగుసేతలో సందర్భోచితంగా ఒక చంపకమాలా వృత్తంగ ప్రపంచింపబడింది. మూలంలో మూడు అక్షరాల పదం అనువాదంలో ముద్దుగా విస్తృతి చెందిన అ పద్యం ఇది —

చం. కని–కడునల్గి బిట్టదిరి కన్నుల దిట్టపుకెంపు బర్వ ద
ర్జనములు గర్జనంబులు వికంకట భంగి జెలంగ దాకి క
న్కని బరిఘాసి చక్ర శర ఖడ్గ గదా ముసలాది ఘోర సా
ధనముల బిట్టునొంప గడు దల్లడ మందుచు బారి రందరున్
— శ్రీరంగ 3-224

(పై శ్లోకంలోని మిగతా భాగం శ్రీరంగ 3-223వ చంపకమాలగా అనూదితం

## చతుర్థాశ్వాసం :

శ్లో. అయంహి దయితో దేశో రమణీయశ్చ మేమతః
యథాచ దయితా చేయం స్వచ్ఛోదక మహానదీ
అతస్తత్సరిత్తీరం రోచతే మే మనోమునే
ఏతత్ప్రీత్యా మయాచాపి శయితం రంగధామని
అభ్యర్థి తస్య మే బ్రహ్మన్ రాక్షసేంద్రేణ ధీమతా
విభీషణేన చాన్యత్ర నరే మే జాతు చిన్మనః
చరామి సరస్తీరే రమ్యేషు పుళినేషుచ
పుష్పితేషు వనాంతేషు తీర్థేషు సరిత్సు చ
అనయా ప్రియయాసార్థ మేభిశ్చ ప్రియదర్శనైః
భక్తిరనుచరై శ్చైవ వ్యచరం సుసుఖం మునే
ఇతి బ్రువాణో భగవాన్య యౌతీరం శనై శనైః
చూత చంపక ఖర్జూర పనసైశ్చ సబిల్వకైః
ప్లక్ష న్యగ్రోధతి నిశైః కదంబ బదరీధనైః
కపిత్థ కదళీనింబ ఫలనీభీ స్సుపుష్పితైః
భ్రమద్భ్రమర సంఘైశ్చ కూజద్భిరపి కోకిలైః
జలజైః ప్రతిసంఘైశ్చ గాయద్భిర్మధురం బహు
అన్యైశ్చ వివిధై ర్వృక్షైః మనోనయన హారిభిః
ముని భిర్యోగి భిశ్చాన్యైరుపేతం సరితస్తటం
గత్వా పుష్కరిణీ తీర్థం దృష్ట్వా సీనామ్మనీన్ హరిః
చక్రేతత్ర జలక్రీడాం ప్రియయాను చరైస్సమం
తదాశ్చర్య వరం దృష్ట్వా మునయః పురుషోత్తమం
— 54వ అధ్యాయం

పై 10½ అనుష్టుప్ శ్లోకాలు అనువాదంలో ఆరున్నర పుటలుగా విస్తృత రూపంలో అవతరించింది. ఈ మూల ప్రపంచనంలో సుదీర్ఘమైన ఒకవచనం మూడు లఘువచనాలు, పన్నెండు కందాలు, మూడు సీసాలు: నాల్గు ఉత్పల మాలలు, మూడు చంపక మాలలు, ఒక తేటగీతి వెరసి ఇరవై ఏడు గద్య పద్యాలు ఉన్నాయి. రమణీయమైన ఈ పద్యగద్యాలు భైరవకవి వర్ణనా నిపుణతకు మచ్చుతునుకలు. విస్తర భీతిచే ఈ (6½ పుటల) పద్యగద్యాలు (శ్రీరంగ 4-76 నుండి 4-4-102) ఇక్కడ ఉటంకింపలేదు.

మూలంలో డెబ్బైయవ అధ్యాయంలో "అథ దక్షిణ తస్తస్య దేశస్యాస్తే దేశస్యాస్తే మహాగిరిః" అని గిరి ప్రస్తావన వచ్చింది. ఈ శ్లోక పాదంలోని "మహాగిరి" అనే కేవలం ఒక పదాన్ని ఆధారంగా స్వీకరించి భైరవకవి మూలా తిరస్కృంగా అనువాదంలో గిరివర్ణనం ఇలా చేశాడు.—

సీ. శిఖరాగ్రగతి హరి ప్రఖరాశని క్రూర
నఖరాభి హతనవ్య నాగకులము
శబరీ వరిప్రష్ఠ కబరీ కలాప వి
క్లబరీణ ఘన భుజంగ ప్రజంబు
రహిత దోషాటోప మహిత రత్నప్రభా
పిహిత బృందారక బృందసరణి
వితత సానుస్వాన సతత నిర్ఝరజల
ప్లుత తరు ప్రత్యంత భూమికులము

తే.గీ. బహుళ గైరికమయ దృషత్ప్రభవ రాగ
కల్పితాలీక దినసావ గమనికామ
విపుల వార్వాహ సందోహ విభ్రమంబు
రుంద్ర కటకంబు ధరణీ ధరేంద్ర మొకటి —శ్రీరంగ 4-250

## పంచమాశ్వాసం :

మూలంలోని 90వ అధ్యాయంలో ఏకాదశీ మాహాత్మ్యం: ఆ (ఏకాదశీ) వ్రతవిధానం చెప్పబడింది. ఈ సందర్భంలో మూలంలో "వైష్ణవేభ్యం" ప్రదాతవ్యం భోజనాదిచ కామతః" అనే వాక్యాన్ని తెనుగుసేతలో భైరవకవి

"శ్రీమదష్టాక్షరాను సంధాన నిష్ఠాగరిష్ఠులగు భాగవతశ్రేష్ఠుల నభీష్టాన్నమృష్టాన్న దానంబుల బరితుష్టి నొందించి" (శ్రీరంగ -111) అని మూల ప్రపంచనం చేశాడు.

90వ అధ్యాయంలో "ఏచ పాతకినో లోకే తిథిద్వయ విధేస్తథా" అనే ఈ శ్లోకపాదం ఒక్కదానిని వివరణాత్మకంగా తెనుగుసేతలో విస్తరింపబడింది. ఆ మూలాతిరిక్తమైన ఆ పద్యం ఇది—

సీ. ఖలుడు స్వామిద్రోహి గరదుడనాచారి
పరదూషకుడు సురాపానరతుడు
గ్రహదాహకుడు సత్య రహితుడన్యాంగనా
సక్తుండు జీవహింసా పరుండు
గురుతల్పగుడు కృతఘ్నుడు బ్రాహ్మణద్వేషి
పశు ఘాతకుడు సాధుబాధకుండు
వ్రత విహీనుడు సువర్ణస్తేయ దుష్ప్రవృత్తి
హర జీవనుండు దుష్టాన్నభోజి

ఆ.వె. వేదనిందకుండు నాడిగాగల పాప
శీలురెల్ల నితర చింతలుడిగి
హరిదినంబు వ్రతము జరిపిశుద్ధాత్ములై
పడయుగాంతు రమృత పదము తుదను — శ్రీరంగ 5-115

శ్రీరంగ మహత్త్వంలో మూలాతిరిక్తం గల తావులన్నికూడా ముఖ్యంగ వర్ణనాత్మకాలుగా వివరణాత్మకాలుగా భాసించాయి. వర్ణనాత్మకాలైన తావులన్ని కూడా భైరవకవి కల్పనా చాతుర్యాన్ని చాటిచెప్పేవిగా గోచరిస్తాయి. ఈ ఉపశీర్షికలో మూలప్రపంచనానికి మచ్చుకు కొన్నిమాత్రమే ప్రదర్శింపబడ్డాయి. విస్తరభీతివల్ల అన్నింటినీ పేర్కొనేందుకు వీలుకాలేదు

## 3. 2. 4. అన్యథాప్రకల్పనం :

మూలంలో ఒకవిధంగా ఉండేదాన్ని అనువాదంలో మరోవిధంగామార్పు చేసి రచింపబడటం అన్యథా ప్రకల్పనం అనబడుతుంది. భైరవకవి అన్యథా ప్రకల్పనం ఎలాచేశాడో ఈ ఉపశీర్షికలో మచ్చుకు ప్రదర్శింపబడుతుంది.

## ప్రథమాశ్వాసం :

శ్లో. పురావిధిర్దుష్కర ముగ్ర రూపం
తపస్సమా తిష్ఠ దదృశ్య రూపః
పరంచదధ్యౌ పురుషం పురాణం
యతోఖిలం యత్ర లయంచ విశ్వమ్

శ్లో. స పుండరీకోత్కర చారుదర్శనం
ప్రతప్త కార్తస్వర వాసనం ప్రభుః
శతహ్రదానద్ధ ఘన ప్రకాశం
పరస్య రూపం సహసాదదర్శ — 14వ అధ్యాయం

పై రెండు శ్లోకాలలోని క్రియలు మాత్రమే తెలుగులో క్రియాప్రయోగాలుగా మారాయి, శ్లోకభావం కాదు. "తపః సమాతిష్ఠత్" "ధధ్యౌ" "దదర్శ" ఈ మూడున్నూ సమాపక సకర్మక క్రియలు. వీటిలో మొదటి శ్లోకంలోని పదానికి క్రింది మత్తేభంలో "అత్యుగ్రతపం బొనర్చినన్" అనే ఇనన్నంతా సమాపక క్రియ ఒకటి క్రింది కందంలో "బొడసూపి" అనే క్త్వార్థక క్రియ ఒకటి ఉంది. మొదటి శ్లోకంలోని "ధధ్యౌ" అనే క్రియకు తెలుగు రాలేదు. పై శ్లోకాలకు అన్యథా ప్రకల్పన అనువాద పద్యం ఇది—

మ. అఖిలప్రాణి హితైకబుద్ధి నురగేంద్రానల్ప తల్పంబునన్
సుఖలీలన్ శయనించియున్న హరి దేజోమూర్తి నా తాపసో
న్ముఖు గల్యాణకరుం గుఱించి దివసంబుల్ పెక్కు భక్తిం జ తు
ర్ముఖుడత్యుగ్ర తపం బొనర్చిన గృపా పూర్ణ ప్రసన్నాత్ముడై
— శ్రీరంగ 1-179

కం అలోక పితామహునకు
నాలోకన సమధికోజ్జ్వలాకృతి పటు భూ
షాలోక మెసగ నవ్విభు
డాలో బొడసూపి వేడు మభిమత మునినన్ — శ్రీరంగ 1-180

## ద్వితీయాశ్వాసం :

దేవతలు బ్రహ్మపురోగాములై విష్ణు దర్శనం కోసం క్షీరసాగరనికి వెళ్ళ టం, అక్కడ అందరున్నూ విష్ణువును స్తుతించటం, వారి స్తుతులకు భగవా నుడు ప్రసన్నుడై వారు ఎవరినీ వారి రాకకు కారణం ఏమని అడుగటం 17వ అధ్యాయంలోని ఈ క్రింది శ్లోకాల్లో చెప్పబడింది—

శ్లో. ఇతిస్తుతో హరిస్తత్ర దేవానుచ్చైరువాచ హ
ప్రసన్నయా దృశాలోక్య జగద్విస్మాప యన్నివ

భగవాన్॥శ్లో. కిమర్థ మాగతా యూయం కోవాఽభూదు పద్రవః
కే యూయం కుత అయాతాః క్షిప్రం ప్రబ్రూత మాచిరం

పై శ్లోకాలు ఇలా తెనిగింపబడ్డాయి—

ఉ. అవ్విబుధ వ్రజంబు నుతులంబురు హోదరుడాదరించి తే
నప్పుడొలంకు చూపుల మనంబుల దుస్స్థితులెల్లబాపి మీ
రెవ్వరు మీకు నిచ్చటికి నిప్పుడు రాగత మేమి యాగతిం
బర్విన నప్పుడెయ్యది సమస్తము జెప్పుడు నాకునావుడున్
— శ్రీరంగ 2-215

పూర్వోక్త శ్లోకంలో "క్షిపం ప్రబూత మాచిరం" అని తొందరగా చెప్పమ న్నట్లు ఉంది. "ఆలస్యం చేయకండి" అంటున్నాడు, తెనుగుసేతలో అలా గాక "సమస్తము జెప్పుడు నాకు" అని ఉంది. మూలంలో "తొందరగా చెప్పండి" అనేది తెనుగుసేతలో "సమస్తము జెప్పు"డని మారింది. సమస్తం అంటే జరిగినదంతకూడ వివరంగా అని ఔతుంది. ఈ అన్యథా కరణం సమర్థనీయంగా ఉండి మూలానికి మెరుగులు దిద్దింది.

## తృతీయాశ్వాసం :

మృతుడైన శూద్రచోరుడిని బంధించి తీసుకుని వెళ్ళే కాలకింకరులకు తీర్థ రక్షకులకు జరిగిన సంవాదం మూలంలో 28వ అధ్యాయంలో చెప్ప బడింది. ఆ సందర్భాన ఈ క్రింది శ్లోకాలు ఉన్నాయి—

శ్లో. అస్మిన్ శ్రుణుత భద్రంవో ముహూర్తం తిష్ఠతా శుభాః
ఇతి తేషాం వచశ్శ్రుత్వా దూరం యతాశ్చ కింకరాః
భీత భీతాశ్చ తే సర్వే కథం చిత్సం ప్రతస్థితే
— 28వ అధ్యాయం

పై శ్లోకాలకు తెనుగుసేత పద్యాలు ఇవి—

కం. వలదు వలదింక బరువిడ
నిలునిలు డో దూతలార నెరి జిత్తములం
గలగక మా కభవందన
మెలమి నొనర్పుడు శుభంబు లెసగెడు మీకున్ — శ్రీరంగ 3-32

ఆ.వె. అనిన యెట్టకేల కాభయంబొక కొంత
యుడిగె నెమ్మనంబులుమ్మలింప
... ... ...
... ... ... — శ్రీరంగ 3-83

పూర్వోక్త శ్లోకం ప్రథమ పాదానికి పై కందం తెనుగుసేత, నిలువడని చెప్పే రక్షకుల మాటలు విని దూతలు భయం భయంగ (భీత భీతాః)-వచ్చిన వారికి రక్షకులు బదులు చెప్పటం పూర్వోక్త శ్లోక పాదంలో చివరి పాదాన ఉంది. "భీత భీతాశ్చతే సర్వే" అని మూలంలో ఉండగా తెనుగుసేతలో "ఎట్టకేలకు ఆ భయంబొక కొంత యుడిగి" అని అన్యథాకరింప బడింది. మూలంలో "భద్రంవో" అని రక్షకులు అభయం ఇచ్చి ఉండగా "భీత భీతాశ్చతే సర్వే" అని ఉండట యుక్తంగా అనిపించదు. అందువల్లనే భైరవకవి దీనిని అన్యథాకరించి ఉంటాడు.

బ్రహ్మ-ఇంద్రుడు సంభాషించే సమయాన అకస్మాత్తుగా అక్కడికి శివుడు రావటం, తన విషయం చెప్పటం 44వ అధ్యాయంలో ఉంది. ఈ సందర్భాన—

శ్లో. శంకరస్య వచశ్శ్రుత్వా తతః కమలసంభవః
విమృశ్యతా సభాభాష్య జగాద ప్రథితం వచః
తిష్ఠత్వయం సురపతిస్సదా హసిత విక్రమః

అని ఉంది. ఇది అక్కడి వారిలో–మూడో వ్యక్తితో చెప్పినట్లుఉంది. మూలంలో ఇలా ఉంటే తెనుగుసేతలో ఈ క్రింది పద్యంలో నేరుగ ఇంద్రుని తో చెప్పినట్లుగా ఉంది. ఇది అన్యథా ప్రకల్పనమే అవుతుంది.

చం. అనిజలజాసనుండు దివిజాధిపుగన్గొని దైవకృత్య మె
వ్వనికి నతిక్రమించి చనవచ్చునె పుణ్యపరుల్ శుభంబులం
ఘన దురితాత్ములాపదలు గైకొను చుండుదు రట్టి కర్మముల్
దన వశమే యొనర్పగ విధాతృ నియోగమె కాకసర్వమున్
— శ్రీరంగ 3-260

## చతుర్థాశ్వాసం :

మూలంలో 53వ అధ్యాయంలో "కండు" అనే పేరుగల మునికథ చెప్పబడింది. 54వ అధ్యాయంలో కూడ కండుముని ప్రసక్తి ఉంది. కండుముని నామ ప్రసక్తిగల శ్లోకాలు మచ్చుకు—

శ్లో. కండునా ముని తత్ర ధర్మజ్ఞేన మహాత్మనా......
శ్లో. కండు ర్నామ మహాతేజే———
కండు॥ శ్లో———— — 53వ అధ్యాయం
శ్లో. కండు రప్యద్భుతం దృష్ట్వా——
శ్లో. బహూన్వర్ష గణాం స్తత్రనిన్యే కండు ర్భృ శాతురః——
శ్లో. అథకాలే బహుతిధే గతి కండోర్మహాత్మనః —54వ అధ్యాయం

ఇలామూలంలో పేర్కొనబడిన కండుముని తెనుగుసేతలో కణ్వమునిగా మారాడు.

తే.గీ. ముందు కణ్వుండు నానొప్పు మునివరుండు — శ్రీరంగ 4-59
వ. కణ్వుం డప్పుండరీకాక్షు శాసనంబున — శ్రీరంగ 4-107

తెనుగుసేతలో కండుముని కణ్వమునిగా అన్యథాకరింపబడ్డాడు.

కశ్యపుడు రాజుకు పురోహితుడని మూలంలో గల శ్లోకాలు తెలియజేసున్నాయి. అలాంటి శ్లోకాలు ఉదాహరణకు—

శ్లో. దృష్ట్వా పురోహితం రాజాప్యత్యర్థ మిదమూచెవాన్
— 68వ అధ్యాయం

పురోహితః॥ శ్లో—— — 69వ అధ్యాయం

తెలుగుసేతలో కశ్యపుడు రాజుకు పురోహితుడు కాడు. అతడు కేవలం సాధుజనోపాస్యుడు. ఉన్నదానిని చెప్పకపోవటం వల్ల కూడ కశ్యపుడు రాజ పురోహితుడు కాడని తెలుస్తుంది. ఇది మార్పేకదా! కనుక అనువాదంలో "సకల జనోపాస్యుండగు కశ్యపు గనుంగొని" (శ్రీరంగ 4-238) (పూర్వోక్త శ్లోక పాదానికి ఇది తెనుగుసేత) అనటం ఒక విధంగా అన్యథా కల్పనమే అవుతుంది. శ్రీరంగ 4-239వ పద్యంలో "అడిగిన నన్నరేంద్రునకు నమ్మని పుంగవుండిట్లనున్" అనే ఉంది. అనువాదంలో కశ్యపుడు రాజపురోహితుడుగా అగుపించడు. మూలంలో రాజ పురోహితుడుగా గోచరిస్తాడు.

## పంచమాశ్వాసం :

శ్లో, పురామైత్రితి విఖ్యాత బ్రహ్మజ్ఞా బ్రహ్మవాదినీ
యోగాగ్నినాస్త కలుషా తత్ర ప్రాప్తా వరం మునే
— 77వ అధ్యాయం

మూలంలో "మైత్రి" అనే పేరుగల బ్రహ్మవాదిని అనువాదంలో మైత్రేయిగా మార్పు చెందింది.

సీ. మైత్రేయి నాగ బ్రాహ్మణియే మహీజంబు — శ్రీరంగ 5-56

మైత్రేయి యాజ్ఞవల్క్యుని భార్య. ఆమె యోగ విద్యా పరురాలుగ బ్రహ్మవాదినిగా మన పురాణాల్లో కన్పించదు. ఆమె పతి అనుయాయిగానే అగుపిస్తుంది, యోగ సంసిద్ధిని పొందినట్లు ఎక్కడ చెప్పబడలేదు. *1. మరి ఇక్కడ మూలంలో "మైత్రి" అని ఉన్న పేరును భైరవకవి మైత్రేయి అని మార్చేందుకు గల కారణమేమో! కారణమేదైనాకూడా లభ్యప్రతుల్ని బట్టి ఇది అన్యథాకరణమే అవుతుంది.

---

1. పూర్వగాథాలహరి – పుట 355

శ్లో. సోమవంశే సముత్పన్నః క్షత్రియోత్తమ భూషితే
అయం జయధరోనామ సుతః కీర్తిధరస్యహి॥
— 102వ అధ్యాయం

పై శ్లోకంలో జయధరుడు కీర్తిధరుని కొడుకని చెప్పబడింది. అనువాదంలో జయధరుని తండ్రిపేరు "తీర్థధరుడు" అని ఉంది. ఇది లేఖన/ముద్రణ దోషమా? లేక భైరవకవి చేసిన అన్యథాకరణమా? తేల్చి చెప్పేందుకు మూలప్రతులు అనువాద ప్రతులు ప్రత్యంతరాలు లభించందే సాధ్యం కాదు. ప్రస్తుతం లభిస్తున్న ప్రతుల పాఠాన్ని అనుసరించి ఇది అన్యథాకరణమే ఔతుంది.

## 3. 2. 5. మూలత్యాగం :

మూలంలో ప్రధాన ఇతివృత్తానికి భంగం వాటిల్లని విధంగ అనావశ్యకాలని భావింపబడే మూలంలోని భావాలను అనువాదం చేయక పరిత్యజించటం పూర్వాంధ్ర కవుల్లో కన్పిస్తుంది. భైరవకవి కూడా ముఖ్యకథా భాగాన్నే ప్రధానంగా స్వీకరించి అనువాదంలో అనావశ్యక భాగాలను వదలి పెట్టాడు. అలాంటి మూల త్యాగం శ్రీరంగ మహత్త్వంలో ఎలా చేయబడిందో ఈ ఉపశీర్షికలో మచ్చుకు ప్రదర్శింపబడుతుంది.

### ప్రధమాశ్వాసం :

మూలం ద్వితీయాధ్యాయంలో 32½ అనుష్టుప్పులు ఉన్నాయి. జనకుని యజ్ఞం, ఆ సభలో వ్యాసుడు ఉండటం, సదస్యులు కథలు అడుగటం, వ్యాసుడు తన సంతృప్తిని వెలిబుచ్చటం. మునులు నాగదంత మునిని పృచ్ఛకుడుగా ముందు కూర్చున్ని బెట్టటం మొదలైన అంశాలు– ప్రతి నిమిషానికి గౌరవ సూచకంగా పదేపదే నమస్కారాలు చేయటం అనువాదంలో వదలబడింది. మూలంలో సదస్యులైన ఋషుల పేర్లుకూడా ఉన్నాయి. ఆ పేర్లు కూడ అనువాదంలో పరిత్యక్తం. నిజానికి మూలంలో ద్వితీయాధ్యాయం నాగదంతుడు వ్యాసుని ప్రశ్నించటం, స్తుతించటం లాంటి మొదలైన అంశాల తొనె ౧౨½ అనుష్టుప్ శ్లోకాలతో ఒప్పారింది. అందులోని స్తుత్యాదివిషయాలన్నీ

కూడా తెనుగుసేతలో త్యక్తం. అలా త్యక్తం చేయక అధ్యాయమంత కూడ యధాతథంగ అనువదించిఉంటే ఎన్నో పద్యగద్యాలు అనవసరంగ అవతరించి కథాగమన వేగాన్ని అడ్డుకుని ఉండేవి. అందువల్లనే ప్రథమ-ద్వితీయ అధ్యాయాల్లో ప్రధాన కథకు సంబంధించిన శ్లోకాలు తప్ప మిగతా శ్లోకాలన్నీ కూడా అనువాదంలో వదలబడ్డాయి.

"దక్షాధ్వరే వ్యాసోక్త గరుడాగమనం-పురాణముపదిశ్య' గరుడ నిర్గమన కథనం-వ్యాసకృత భగవన్మహిమాభివర్ణనం-జగత్ సృష్ట్యాదిక్రమ ప్రదర్శనం-నాగదంతస్య వ్యాసేన భూగోళ వర్ణనం" అనే విషయాలు మూలంలో వరుసగా 3, 4, 5, 6, 7 అధ్యాయాల్లో అభివర్ణింపబడ్డాయి. ఈ ఐదు అధ్యాయాలు తెనుగుసేతలో వదలబడ్డాయి. ఈ ఐదు అధ్యాయాల్లో చెప్పబడిన అంశాలు శ్రీరంగ మాహాత్మ్యకాలు కావు. శ్రీరంగమాహాత్మ్య ప్రధాన ఇతివృత్తానికి ఉ అధ్యాయాలు అనువదింపకున్నాకూడ భంగం కలుగదు. కనుక భైరవకవి ఈ ఐదు అధ్యాయాలను అనువదింపక వదిలాడు.

మూలంలో 8వ అధ్యాయంలో 21½ శ్లోకాలు. 9వ అధ్యాయంలో 19 శ్లోకాలున్నాయి. ఈ రెండు అధ్యాయాల్లోనూ పుణ్యతీర్థ ప్రశంసాభివర్ణనమే ఉంది. నాగదంతుని ప్రశ్న, కథారంభం, గంగా యమునల ప్రస్తావనం మొదలైన రెండు మూడు శ్లోకాలు తప్ప కడమభాగమంతకూడ కథాగమనానికి అడ్డుతగిలేవిగా ఉన్నాయి. కనుక ఇవి తెనుగుసేతలో పరిత్యక్తాలు.

## ద్వితీయాశ్వాసం :

శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు – ఈ ముగ్గురున్నూ పాలకడలి కడకేగి శ్రీమన్మహావిష్ణువును స్తుతించటం 16వ అధ్యాయంలో ఉంది, బ్రహ్మ స్తుతించిన 11 శ్లోకాలు తెనుగుసేతలో శ్రీరంగ 2-208వ వచనం చివరి నుండి శ్రీరంగ 2-212 వచనం మొదటివాక్యంవరకు అనువదింపబడ్డాయి. శివుడు, ఇంద్రుడు హరిని స్తుతించిన శ్లోకాలు ఇవి—

శ్లో. అథప్రణమ్య భగవాన్ దేవదేవ ఘనామయం
అల్పాక్షర మసందిగ్ధం శూలీ వచన మబ్రవీత్

శంకర॥శ్లో. సర్వాత్మా పరమాత్మ త్వాద్వైశిష్ట్యా ద్వైశ్వ రూప్యతః
సర్వాయ సర్వరూపాయ స సర్వవ్యాపినే నమః
అదృశ్యాయా ప్రమేయాయ సదసద్వ్యక్తి హేతవే
మహావిభూతయే చింత్యా షాడ్గుణ్య నిధయే నమః
పాహి విప్రతపః క్రౌర్య భీతానేతాన్సురాన్ గురో
శరణం త్వాం ప్రపన్నాశ్చ భగవన్ దేవరక్షకః
విభూతి భూతయో కృష్ణ తవ సర్వేశ్వరావయోః
బ్రహ్మణో మమచాప్యద్య దర్శయాత్మాన మేవచ

వ్యాసః॥శ్లో. ఇత్యుక్తే శూలినా స్తోత్రే గంభీరార్థేల్ప శబ్దకే
ఉవాచా నంతరం వాక్యం శక్రః శ్లక్షతరం లఘు

ఇంద్రః శ్లో॥ జానన్నపి నజానాతి వదంశ్చ నవదద్యపి
ప్రజాపతిః పశుపతిః పశ్యన్నపి నపశ్యతి
పరస్మాత్పరమం యస్య వపుర్విశ్వం చరాచరం
తస్మై సంపూర్ణ కామాయ పరస్మై బ్రహ్మణౌ నమః
జ్ఞానా నందమయం యస్య స్వరూపం నిత్యరూపిణః
తస్మై పరావరేశాయ నమశ్శాంత విభూతయే
తపసాచాతి తీవ్రేణ లోకోద్వేగవతా పునః
అద్యైవలభతాం కామం లోకాస్సంతు గతవ్యథా

। 16వ అధ్యాయం

శంకరుడు ఇంద్రుడు హరిని స్తుత్యాత్మకంగ చెప్పిన పైశ్లోకాలు తెనుగు సేతలో త్యక్తాలు. తెనుగుసేతలో శ్రీరంగ 2-212 వచనమందు "ఖండ పర శుండును నా ఖండలుండును బహు విధంబుల ప్రస్తుతించిరి" అని మాత్రమే

ఉంది. పై శ్లోకాల భావం అనువాదం చేయక దాటవేయ బడింది. శ్లోకాల భావం మాత్రమే అనువాదం కానందున ఇది మూలకుంచనం కాదు, కనుక ఇది మూలత్యాగమే అవుతుంది.

**దేవతలకు విష్ణువు ప్రత్యక్షం కాగా వారు విష్ణువును ఇలా స్తుతించారని మూలంలో 17వ అధ్యాయంలో ఉంది.**

దేవా॥ శ్లో॥ నమస్తే పుష్కరాక్షాయ నమః పుష్కర నాభయే
నమః పరావరేశాయ నమస్తే పరమాత్మనే
నమేస్తే విశ్వమూర్తాయ చతుర్మూర్తాయతే నమః
అమూర్తాయ నమస్తుభ్య మేకమూర్తాయ విష్ణవే
సద్రూపాయ నమస్తుభ్య మసద్రూపాయ శార్ఙిణే
నమః ప్రధాన రూపాయ భద్రరూపాయతే నమః
నమోహం కృతిరూపాయ త్రిధాభిన్నాయ విష్ణవే
నమో బుద్ధీంద్రియ గ్రామ స్వరూపాయ మహాత్మనే
నమశ్శబ్ద స్వరూపాయ స్పర్శరూపాయ విష్ణవే
రూపరూపాయ హరయే రసరూపాయతే నమః
నమో గంధర్వ రూపాయ నమః శంకర రూపిణే
హిరణ్య గర్భ రూపాయ నమస్తే జగదాత్మనే
విష్ణవే వాసుదేవాయ నమోనంత స్వరూపిణే
చరాచర స్వరూపాయ నరసింహ స్వరూపిణే
నమో వరాహ రూపాయ మత్స్యరూపాయ విష్ణవే
నమస్తే కుర్మరూపాయ వామనాయనమోనమః
నమోరాఘవ రూపాయ నమః కృష్ణాయజిష్ణవే
నమస్తే కల్కి రూపాయ నమః పరశుధారిణే
విశుద్ధ జ్ఞానరూపాయ నమోనంత విభూతయే
సూరిభిర్దృశ్య రూపాయ జ్ఞానానందాత్మనే నమః

— 17వ అధ్యాయం

పై శ్లోకాల్లో స్మరింపబడ్డ విష్ణ్వవతారక్రమం వ్యత్యస్తంగ ఉంది. ఈ శ్లోకాలు తెలుగుసేతలో కనబడవు. తెలుగుసేతలో కేవలం ఈ క్రింది పద్యం మాత్రమే చెప్పబడి పై శ్లోకాలు అనువాదం చేయక పరిత్యక్తమైనవి.

కం. అప్పరమేశ్వరు గనుగొని
యప్పుడు ప్రమదంబు భయము సద్భుతమును లో
ముప్పిరి గొన శ్రుతిమతములు
చొప్పడ నుతియించి రదితి సుతులానతులై

— శ్రీరంగ 2-214

## తృతీయాశ్వాసం :

మూలంలో 22వ అధ్యాయం మొత్తానికి మొత్తం అనువాదం చేయబడ లేదు. ఈ అధ్యాయంలో భగవానుడు సనత్కుమారునికి యోగసాధనాది విషయాలు చెప్పటం ఉంది. 16½ అనుష్టుప్పుల్లో ఉండే ఆధ్యాత్మిక విషయమైన ఈ అధ్యాయం ప్రధాన కథాగమన వేగానికి నిరోధకంగా ఉంటుందని తెనుగుసేతలో పరిత్యక్తం చేసినట్లు భావింపవచ్చు. ఈ అధ్యాత్మిక విషయం గోపనీయమైనదనికూడ మూలంలో భగవానుడు చెప్తాడు. భైరవకవి దీనిని తెనుగుసేయక గోపనీయంగానే ఉంచాడు. ఇక మూలంలో 25వ అధ్యాయంలో 36 అనుష్టుప్ శ్లోకాలు ఉన్నాయి ఈ అధ్యాయంలో చంద్రపుష్కరిణీ తీర్థ మాహాత్మ్యాన్ని రెండు శ్లోకాల్లో సూచించి కదమశ్లోకాల్లో జ్ఞాన, కర్మ, పుణ్య-పాప, కర్మఫల, భగవన్నామ సంకీర్తనా మహిమ మొదలైన అంశాలు చెప్పబడ్డాయి. ఇదివరలో 20వ అధ్యాయంలో జ్ఞానచర్చ వచ్చింది. అపుడు తెనుగుసేతలో జ్ఞానసంబంధిత పద్యాలు రచింపబడ్డాయి. కనుక మళ్ళీ జ్ఞాన సంబంధితమైన ఈ శ్లోకాలు తెనుగుసేతలో త్యక్తమైనవి ఇక్కడ తెనుగుసేతలో మూల త్యాగం చేసేందుకు కారణం ప్రధానకథనువదలి శాఖాచంక్రమణం చేయుటవుతుందనే ఉద్దేశ్యమే అయి ఉంటుంది. విస్తరభీతివల్ల ఇక్కడ మూలత్యాగం చేసిన 34 శ్లోకాలను ఉటంకింపలేదు.

చిత్రసేనుడు అనే గంధర్వుని ప్రార్థనకు శివుడు తన గణాలను తీర్థ రక్షకులైన విష్ణుభూతేశులపైకి పంపటం 43వ అధ్యాయంలో చెప్పబడింది. ఈ సందర్భానగల ఈ క్రింది శ్లోకం ఉంది—

శ్లో. యత్ర వ్యతిక్రమ ఖ్యాత్సద్యో గంధర్వాః పతితోభువిః
ఉత్థితే వైష్ణవో వాయుః తం వాయుం గ్రసతి స్మహ
— 43వ అధ్యాయం

పై శ్లోకానికి తెనుగుసేతలో

కం. సురగణవిభు పనుపున గడు
సురవడి జండానిలంబు లొక్కట విసరన్
బురిగొని వైష్ణవ వాయువు
లరుదారగ జేర్చి వాని నన్నిటిదోలెన్ — శ్రీరంగ 3-235

అనే పద్యం ఉంది. "యత్ర వ్యతిక్రమాత్ సద్యో" అనే మూలంలోని వాక్యాలు తెనుగుసేతలో పరిత్యక్తం. ఈ యుద్ధ విషయాన వాయువుకు ప్రత్యర్థిగ వైష్ణవ వాయువు ఉత్పత్తి అయింది, ఇది ప్రధానం. ఆ వైష్ణవ వాయువు ఉత్పత్తి స్థానం ఇక్కడ అప్రధానం. కనుక ఆది మూలత్యాగంగా తెనుగుసేయబడింది.

మూ ల ం లో—

శ్లో. అథరుద్రాస్తదా దిత్యాస్సాధ్యాశ్చాన్యే మరుద్గణాః
లోకపాలాశ్చ గంధర్వా శ్శతశోథ సహస్రశః

అని ఉంది. భూతేశ గణాలతో రుద్రాదిత్య సాధ్యాది మరుద్గణాలు పోరాడినవని అగణాలన్ని భూతేశ గణాలచే పరాజితమైనవనీ మూలంలో ఉంది. రుద్రగణాలను గురించి "రుద్రాః ప్రద్రువుస్సర్వే నష్టశూలా హత త్విషః" అని కూడా మూలంలో ఉంది. భైరవకవి తెనుగుసేతలో "విముక్త రణ పాండిత్యులగు నాదిత్యులును విస్మృత హరిత్తులగు మరుత్తులును విగ ళిత గంధర్వులగు గంధర్వులును విఘూర్ణితాక్షులగు యక్షులు వితతక్షత వేదనా సాధ్యులగు సాధ్యులును వికంపితాశువులగు వసువులును" — (శ్రీరంగ 3-237) అని చెప్పాడు. ఇందులో "రుద్రాః ప్రద్రువుస్సర్వే నష్టశూలా హత త్విషః" అనె వాక్యాలు పరిత్యక్తమై కదమ భాగమంత అనూదితమైంది. రుద్ర గణాలు పరాజితమైనట్లు మూలంలో ఉండగ దానిని తెనుగుసేతలో పరిత్యక్తం చేయటానికి కారణం భైరవకవి శైవుడగుటవలననే కాబోలు.

## చతుర్థాశ్వాసం :

వాల్మీకి భరద్వాజ సంవాదాత్మకమైన 49వ అధ్యాయంతో చతుర్థాశ్వాసం ప్రారంభమౌతుంది.

భరద్వాజుడు గురువైన వాల్మీకిని గురించి అడిగే ప్రశ్నలకు సమాధానంగ గల ఈ క్రింది శ్లోకాలు అనువాదంలో పరిత్యక్తమైనవి.—

మునయః॥శ్లో. ఆహోస్విద్ధత్ర భగవన్ పశ్యన్నపి నపశ్యసి
యశసా ఖండలో లోకే దీప్త్యా భానుశ్శ్రియోడుపః
యథా పరస్తథా శ్రేయా నయమాత్మాగుణైర్మునిః
సోయం పారామికామృద్ధిం సంప్రాప్యా త్రావ సన్మునిః

— 49 అధ్యాయం

తెనుగుసేతలో (శ్రీరంగ 4-18 తే గీ.లో) "తాపసులచేత దాశ్రమస్థలము దెలిసి" అని మాత్రం ఉంది.

సుకీర్తి అనే పేరుగల కాశీరాజు ఉపాఖ్యానం మూలంలో 55వ అధ్యాయంలో ఉంది. ఈ ఉపాఖ్యానాన్ని వాల్మీకి భరద్వాజునికి చెప్తాడు. అధ్యాయాంతంలో రాజు చెప్పినట్లు గల ఈ క్రింది శ్లోకాలు తెనుగుసేతలో పరిత్యక్తమైనవి.

రాజా॥శ్లో. యథాపరం స్వరూపస్తు పత్యస్య పరమాత్మనః
అగోచరం తథాత్వేషాం యోగినా మమలాత్మనాం
తథాకాల విపర్యాస్యాత్ మహాభాగ్య విపర్యయాత్
భద్రాశ్రయాః భద్రదస్య మూర్తయో జ్ఞానగోచరాః
మనోహా విషయాలంబి విజ్ఞానం చాల్పకం మమ
ఇంద్రియాణి నవశ్యాని కథం కృత్వా కథంభవేత్

— 55వ అధ్యాయం

## పంచమాశ్వాసం :

మూలంలో 73వ అధ్యాయం కదంబతీర్థ మహిమాత్మకమైంది. యజ్ఞమందు ఋత్విజులకు మంత్రాలు స్ఫురణకు రాకున్న సమయాన ఒకఋషి

వచ్చి కదంబ వృక్షాన్ని పూజింపమని చెప్తాడు. అ సందర్భానగల ఈ క్రింది శ్లోకాలు "సాక్షి" శబ్దానికి వివరణగా ఉన్నాయి. అలాంటి ఈ క్రింది శ్లోకాలు తెనుగుసేతలో త్యక్తమైనవి—

శ్లో. న కేవలం మనుష్యాద్యా భవేయు స్సాక్షిణోభువి
యేషాంచ తత్వ విజ్ఞానే సామర్థ్యంతే చ సాక్షిణః
నో చేత్తు నృప లోకేషు జ్ఞానినో హ్యేవ సాక్షిణః
దేవత్వం వా మనుష్యత్వం సాక్షి కృత్యేన కారణమ్

యస్య సంశయితార్థస్య స్థావరస్య నరస్యచ
యధార్థ జ్ఞాన సామర్థ్యం తం చవై సాక్షిణం విదుః
మనుష్యే ష్వేవ నియతం ప్రాయికం త్వితరేషుతత్
అతస్త జ్ఞాన సామర్థ్యం సాక్షిత్వే కారణం విదుః

— 73వ అధ్యాయం

మునికృత కదంబ వృక్ష ప్రార్థనం 74వ అధ్యాయంలో ఉంది ఈ అధ్యాయంలోని మొదటి 13 శ్లోకాలు కదంబవృక్ష స్తుత్యాత్మకాలు ఈశ్లోకాలు కథాగమన వేగానికి అడ్డుగా ఉంటాయని తెనుగుసేతలో త్యక్తమైనవి. విస్తర భీతివల్ల ఆ శ్లోకాలు ఇక్కడ ఉటంకింపలేదు.

సర్వాభీష్ట ప్రదమైన పంచమీ వ్రత విధానం ఉండే 84వ అధ్యాయం ఆరోగ్య హేతువగు షష్ఠీ వ్రత చక్రపూజ గల 85వ అధ్యాయం, మాంగల్యాభిలాషులగు స్త్రీలు చేసే సప్తమీ వ్రత విధానం ఉండే 86వ అధ్యాయం, శత్రునాశనార్థం రాజులు చేసే అష్టమీ వ్రతాన్ని గురించి చెప్పే 87వ అధ్యాయం, యోగ్యుడగు భర్తను కోరేవార్లు చేసే నవమీ వ్రతవిధి గల 88వ అధ్యాయం, ఆయురారోగ్యాభిలాషులు చేసే దశమీ వ్రతాన్ని గురించి ఉండే 88వ అధ్యాయం— ఈ అరు అధ్యాయాలు కూడ అనువాదంలో పరిత్యక్తమైనవి. పూర్వోక్త వ్రతాలకు వైష్ణవంలో ఏకాదశీ ద్వాదశీ వ్రతాలవలె ప్రసిద్ధి లేదు. కనుక పూర్వోక్త అధ్యాయాలు అనువాదంలో వదలబడి ఉంటాయి అలాగే పుత్రకాములు చేసే త్రయోదశీ వ్రతవిధి గల 93వ అధ్యాయం, రోగనాశక చతుర్థశీ వ్రతం గల 94వ అధ్యాయం, ఆయుః ప్రద పర్వవ్రత విధిగల 95వ అధ్యాయం, సంపత్కరమగు పాడ్యమి వ్రతవిధానం ఉండే 96వ అధ్యాయం, విద్యాప్రదమగు ద్వితీయా వ్రతవిధిగల 97వ అధ్యాయం, గ్రహపీడాహమగు

తృతీయా వ్రతవిధానం గల 98వ అధ్యాయం, గజాశ్వ రోగహర చతుర్థీవ్రతం గల 99వ అధ్యాయం— ఈ ఏడు అధ్యాయాలు కూడ అనువాదంలో పరిత్యక్తమైనవి. మరియు సుమంత సునందో పాఖ్యానం, కాశ్యప సువర్చులులకథ సుమంత సునంద సంవాదంఅనే కథలుఉండే 105, 106, 107 అధ్యాయాలు అనువాదంలో త్యక్తమైనవి. ప్రధాన కథాగమనానికి అడ్డుతగిలే అనావశ్యక భాగాలుగా భావించి భైరవకవి వీటన్నింటినీ తెలుగుసేతలో వదలి ఉంటాడు.

## 3. 2. 6. అమూలకం :

పురాణ కథను కావ్యంగ అనువదించేటప్పుడు కొన్ని సందర్భాల్లో అమూలకమైన వర్ణనలు అనువాదంలో రచించటం పూర్వాంధ్ర కవుల్లో గోచరిస్తుంది కవిస్వీయ కల్పనా సామర్థ్యం, సమకాలీన కవి పండితుల సాహిత్య ప్రభావ ముద్ర, మతాభిమానం మొదలైన వాటివల్ల కావ్యంగ సంతరించనున్న పురాణానువాదంలో కావ్య ప్రశస్త్యాదులకొసం అమూలక వర్ణనాదులు చేయవలసి వస్తుంది. ఈ ఉపశీర్షికలో అలాంటి అమూలక విషయాలు ప్రదర్శితమౌతాయి.

### ప్రథమాశ్వాసం :

నైమిశారణ్యంలో మునులు ద్వాదశ వార్షిక సత్రం చేస్తుంటారు అక్కడకు వివిధ ప్రదేశాల నుండి ఇతర మునులు కూడ వస్తారు. ఈ సందర్భాన మూలంలో—

శ్లో. తత్రాన్యేపి సమాగచ్ఛన్ దిగ్భ్యోపిచ తపస్వినః –(1వ అధ్యాయం). అని ఉంది. మునుల స్వరూప వర్ణనం మూలంలో కన్పడదు. భైరవకవి ఈ సందర్భాన మునుల స్వరూపాన్ని ఇలా వర్ణించాడు—

సీ. పల్లవారుణ జటా ధారులా రచితత్రి
పుండ్రాభిరాములు భూతిలిప్త
సర్వాంగులుజ్వల స్ఫటికాక్ష సూత్రులు
రుద్రాక్ష భూషణ రుచిరుల మర
ఋణ్యతీర్థోదక పూర్ణ కమండలు
లజినోత్తరీయు లత్యంత మృదుల
పరిధౌత వల్కల పరిధానులభినవ
దండ పాణులు దీప్తదహన తేజు

తే.గీ. లలఘు దివ్య తపశ్శక్తి కలితులఖిల
వేద విద్యా రహస్య సంవేదులసమ
సవన కర్తలు సంయమీశ్వరులు వచ్చి
రెలమి శిష్యప్రశిష్య సమేతులగుచు — శ్రీరంగ 1-77

ఇలా అమూలకమైన మునిస్వరూపాది వర్ణనం అనువాదంలో చోటు చేసుకునింది.

మూలంలో మునులను గురించి "మహాత్మానో బ్రహ్మణ్యాహిత చేతసః" అని ఉంది. కాని వారిపేర్లు లేవు. తెనుగుసేతలో "శౌనకాది మునులు" అని ఉంది. శౌనకాది మునులనటం అమూలకమే.

మూలంలో 8, 9 అధ్యాయాల్లో పుణ్యనదీ తీర్థాల ప్రశంస ఉంది. ఆ పుణ్యనదీ తీర్థాల్లో సరస్వతీ, యమున, పద్మిని. కావేరి, మథురాతీర్థం, పుండరీకం, కాళిందీహ్రదం, గోపాల తీర్థం, గోవర్ధనతీర్థం మొదలైనవి ఉన్నాయి. తెనుగుసేతలో భైరవకవి గౌతమి, జహ్ను, నర్మద, దేవిక, చంద్రభాగ, భావనాశిని, తుంగభద్ర, పెన్న, విపాశ మొదలైన నదులను ప్రశంసించాడు. (శ్రీరంగ 1-89). తెనుగుసేతలో పేర్కొనిన నదులలో యమునా నదితప్ప మిగత నదుల ప్రశంస అమూలకం.

పుణ్యనదీతీర్థ ప్రశంస సందర్భాన మూలంలో లేని భావాలు గల ఈ క్రింది పద్యాలు భైరవకవి సందర్భోచితంగ రచించాడు.—

సీ. హరి దివ్యనామధేయామృతం బింపార
జెలగి యాస్వాదించు జిహ్వ జిహ్వ
గోవింద కల్యాణ గుణవిశేషంబులు
పలుమారు దలపోయు తలపు తలపు
కమలాక్షు నిత్య మంగళమూర్తి విభవంబు
సొంపార వీక్షించు చూపు చూపు
ఫణిరాజ తల్ప శ్రీపాద పద్మంబులు
చేరి యర్చన సేయు సేత సేత

తే,గీ. వాసుదేవ ప్రీయంబైన వ్రతము వ్రతము
దైత్య భేది నుపాసించు తపము తపము
శౌరినారాధనము సేయు జపము జపము
విష్ణు పదభక్తి తమకొల్పు వినికి వినికి — శ్రీరంగ 1-91

సీ. పటు తర భవరోగ పరితాపముల బాప
నబ్జాక్షు సేవ దివ్యౌషధంబు
అంచిత జ్ఞాన మహా నిధానము జూప
నచ్యుత భక్తి శుద్ధాంజనంబు
దుర్వార భయములు దొడర కుండగ జక్ర
పాణిసం స్తుతివజ్ర పంజరంబు
ఇష్టార్థ ఫలసిద్ధు లెసగింప హరినామ
పఠన మంగళ కల్ప పాదపంబు

తే.గీ. విపుల దుర్మోహ తిమిరంబు విరియజేయ
నురగ శయనుని పూజ సూర్యోదయంబు
అనిమిషానంద లీలల నునిచి మనుప
గనులనాభుని పదతీర్థ మమృత రసము శ్రీరంగ 1-92

పై పద్యములకు మూల శ్లోకాలు లేవు. ఈ పద్యాలన్నీ అమూలకాలే. పాతనార్యుని కవితా ప్రభావంవల్ల భైరవకవి పై పద్యాలను అమూలకాలుగ రచించి ఉంటాడు.

కావేరీ నదీ పరీవాహక ప్రదేశం, తత్తీరం, తద్గిరి ప్రాంతాలు మొదలైన వాటిని వర్ణించిన సుదీర్ఘ వచనం (శ్రీరంగ 1-102) బాణభట్టారకుల కాదంబరీ వచనాలను తలపింపజేస్తుంది. ఈ వచనమంత అమూలకమైనదే. విస్తరభీతి వల్ల సుదీర్ఘమైన ఆ వచనంలో ఆదిమధ్యాంత భాగాలను మాత్రం ఇక్కడ ఉదాహరించడమైనది— "మరియు నన్నదీ ప్రవాహ రత్నంబు నాయతన ప్రవర్ధమాన సుధాసమాన పానీయ పూరసారంబులగు నారికేరంబులును, కమల భవ కామినీ కపోల పాలికా సవర్ణ పరపూర్ణ రాగకర నాగవల్లీ వేల్లితా

భోగంబులగు పూగంబులును, ........... కలశాబ్ధి యునుంబోలె నమృతా నంద కారణంబై, *1. రణరంగంబునుంబోలె ననేక శతపత్ర విసరంబై, సరసీజాసనా కపోలంబునుంబోలె దర్పసార మకరీ కాంతంబై,............ సముదితాబ్దంబయ్యును ఘటితచక్రంబై, తరణిమండల మండితంబయ్యును ప్రవృద్ధ కుసుమంబై, హరి విహారస్థలంబయ్యును సమద నాగంబై, లక్ష్మణా నందంబయ్యును మేఘనాథాభ్యుదయంబై, యీశాను వర్తియయ్యును సుకృతి స్తుత పాత్రంబై, యతుల స్వర్ణంబయ్యును బహువారాగత వీరప్రకర కలితంబై యర్జున శరపాత భయంబయ్యును సింధు రాజప్రీతికరంబై విలసిల్లు వెండియు"
— శ్రీరంగ 1-102.

తెనుగు సేతలోని ప్రథమాశ్వాసం 107వ (సీస) పద్యం నుండి 134వ (ఉత్పలమాల) పద్యం వరకుగల 28 పద్యగద్యాలలో రంగ మందిర మాహాత్మ్యం కావేరీ పరివాహక పరిసర తీర్థ ప్రాంతాలు అభివర్ణితం. ఈ పద్య గద్యాలు భైరవకవి స్వీయ రచితాలు. వీటికి మూలం కన్పడదు. విస్తరభీతి వల్ల అమూలకమైన ఈ 28 పద్యగద్యలు ఇక్కడ ఉదాహరించలేదు.

పాంగులువారు కావేరీనది ఉరవడికి సుబోధ సత్త్వాల దండాజినాలు కొట్టుకొనిపోతాయి. అ నది అలాగే ఉద్వేలంగ పారితే లోకాలు ఏకం చేస్తా యని తలచి సుబోధుడు నదికి తగిన ప్రతీకారం చేయాలనుకుంటాడు. అ సందర్భానగల ఈ క్రింది పద్యం అమూలకం—

సీ. చటుల దిక్కరి కర్ణ పుటపాటన ప్రౌఢి
నొడవు నిర్ఝర ఘోష మదము మెడుగ
పాథోధి మండల పాటవంధమములైన
కల్లోల వితతుల త్రుళ్లడంగ
మకర నక్రగ్రాహ మత్స్యకచ్ఛపకోటు
లోరలుచు నొండింటి మరువు కొదుగ
బక్రటిట్టి భసార సక్రౌంచ ముఖజల
విహగ జాలము గమివిచ్చి పరవ

*1. ఈ పాదము సాహిత్య అకాడమి వారి ముద్రితప్రతిలో ప్రమాదవశమున వదలబడింది. ఈ వచనంలో మరో 14 పంక్తులు కూడా ఈ ప్రతిలో వదలబడింది. మానవల్లి వారి ప్రతిలో ఈ వచనం సమగ్రంగాఉంది.

తే.గీ. నా రసాతల నిమ్నంబులైన మడువు
బట్లు పంకా విలంబులై బయలు పడగ
శిలలు గుల్లలు నిసుము చిప్పలును దక్క
నెసగి యీతోయ మీతోయమే గ్రహింతు — శ్రీరంగ 1-152

బ్రహ్మ విష్ణువును సందర్శించిన సందర్భాన మూలంలో 14వ అధ్యాయంలో "ప్రసీద దేవ'' అని మాత్రమే ఉంది. ఈ సందర్భాన భైరవకవి తెనుగుసేతలో ఎంతో ఔచిత్యంగ వాణీపల్లభునినోట గీర్వాణ దండకాన్ని పలికించాడు. ఈ దండకం అమూలకం. విస్తరభీతివల్ల సుదీర్ఘమైన ఈ దండకాన్ని ఆదిమధ్యాంత భాగాలు మాత్రం ఇక్కడ ఉదాహృతమైనవి—

## దండకం :

"జయ జయ జగదేక కల్యాణ భవాని శత్రాణ పారీణ నిష్కారణాపార కారుణ్య రత్నాకరా...... దేవ తుభ్యం నమః- కలశ జలధి మధ్య చంచత్సి తద్వీప రత్నాగ్ర వైకుంఠ పూరుజ్వలద్దివ్య సౌధాంతికాంతే సభాంతే భవంతం నిశారంభ సంపుల్ల నీలోత్పల శ్రీ విశాలాంగ .....భావానువర్తీ భవాన్-పరమ పురుష తత్వస్త్వాం నజానాతి కశ్చిత్కథం విస్తరేణస్తుతిం కర్తుమీశో...... ప్రభో పాహిమాం పాహిమాం పాహిమాం — శ్రీరంగ 1-197

## ద్వితీయాశ్వాసం :

శ్రీరంగ మహత్త్వాన్ని కావ్యంగా రచించాలనే ఉద్దేశ్యం కలిగిన వాడగుట వల్ల కావ్యత్వ సిద్ధికై భైరవకవి అమూలకములైన వర్ణనలను సందర్భోచితంగా రచించాడు. వాటిలో మచ్చుకు—

నిదాఘ వర్ణనం – శ్రీరంగ 2-20, 2-21, 2-22, 2-23, 2-24.
వర్షకాల వర్ణనం – శ్రీరంగ 2-26, 2-28, 2-29
హేమంత వర్ణనం – శ్రీరంగ 2-31, 2-33, 2-34
వసంత వర్ణనం – శ్రీరంగ 2-37, 2-39, 2-40, 2-41, 2-43, 2-47
వెన్నెల వర్ణనం – శ్రీరంగ 2-48,50

మలయానిల వర్ణనం – శ్రీరంగ 2-50
మన్మథ వర్ణనం – శ్రీరంగ 2-52-54, 2-78, 2-87
వనవిహార వర్ణనం – శ్రీరంగ 2-59-69
కందుక క్రీడా వర్ణనం – శ్రీరంగ 2-70–71
వీణావాద్యగానాభి వర్ణనం – 2-72–73
బృందారక సుందరీ విలాస చేష్టాభివర్ణనం – శ్రీరంగ 2-75
మేనకాది అప్సరల నివ్వెరపాటు – శ్రీరంగ 2-77
మన్మద బాణసంధానాభి వర్ణనం – శ్రీరంగ 2-81–82
సుదర్శన చక్ర వర్ణనం – శ్రీరంగ 2-102
ఉత్సవ వాసర వర్ణనం – శ్రీరంగ 2-166

విస్తరభీతివల్ల పైన తెల్పిన వర్ణనాత్మక పద్యగద్యాలు ఇచట ఉటంకింపలేదు.

మూలం 16వ అధ్యాయంలో "ప్రజాపతిం పురస్కృత్య జగ్ముః క్షీరనిధే స్తటమ్" అని ఉంది. కాని–సముద్ర వర్ణనం మూలంలో లేదు. అమూలకమైన సముద్ర వర్ణనం (శ్రీరంగ 2-207 మత్తేభవృత్తం, శ్రీరంగ 2-208 సుదీర్ఘ వచనం) భైరవకవి రమణీయంగ రచించాడు. విస్తరభీతివల్ల సుదీర్ఘ వచనాన్ని వదలి మత్తేభ విక్రీడిత వృత్తాన్ని మాత్రం ఇక్కడ ఉటంకించడమైనది.—

మ. అరవింద ప్రభువుండు గన్గొనియె మధ్యస్థాన సుప్తాంబుజో
దర పర్యంక భుజంగ పుంగవ సముద్యద్భూరి భోగాగ్ర వి
స్ఫురి తానేక నిరస్త దివ్యమణి సంభూత ప్రభాపుంజ పం
జర జాతాభ్ర పదభ్రమాకులిత భాస్వత్సారథిన్ నీరధిన్

— శ్రీరంగ 2-207

## తృతీయాశ్వాసం :

శ్రీమన్మహావిష్ణువు ఉపాధ్యాయ వేషధారియై సనత్కుమారుని దగ్గరకు వచ్చేకథ మూలమందు 18వ అధ్యాయంలో ఉంది. కాని, ఉపాధ్యాయ

వేష వర్ణనం మూలంలో కన్పడదు. అట్టి అమూలక వర్ణనం అనువాదంలో ఉంది. ఆ పద్యం ఇది—

సీ. పరిణాహ పరిలసత్ఫాల భాగంబున
రమ్యమై యూర్ధ్వ పుండ్రంబు వెలుగ
నలినాక్ష మాలికా కలిత వక్షంబున
ధవళయజ్ఞోప వీతములు మెరయు
ముఖ్య రత్నాంకిత ముద్రాభిరామ హ
స్తముల నూతన పవిత్రములు దనర
సింహ సంహన నతా శ్రీకిని బైకాపు
గాగ నుద్గమనీయకం బెలర్ప

తే.గీ. కోమలోత్పలదళకాంతి కొమరు మిగుల
మేను గృపతోడ జిరునవ్వు మెరయజూపు
నుదయ శైలో పరిస్థలి నుల్లసిల్లు
జలజ బాంధవు మిగుల తేజమున గలిగి — శ్రీరంగ 3-3

సనత్కుమారుడు తనచెంతకు వచ్చిన ఉపాధ్యాయ వేషధారియగు విష్ణువును "నీవెవ్వరని" అడుగును. ఆ సందర్భాన మూలంలో 19వ అధ్యాయాన భగవదోక్తంగా గల కొన్ని శ్లోకాలను భైరవకవి అనువదించాడు. అపుడు అమూలకంగా ఈ క్రింది పద్యాన్ని మర్మగర్భిత దశావతారప్రస్తావితంగ ఉండే ట్లు ఇలా రచించాడు —

సీ. నిగమ జాతంబునే నిల్పబట్టిన నిల్చు
నగములు నా చెప్పినట్లు చేయు
బుడమి నాముందట బోరాదు చర్చింప
శ్రీవహింతు నపూర్వ సింహ మనగ
బటు పదక్రమముల బ్రహ్మ మీరుదువాదు
లెదిరిన ఖండింతు మదములడగ
శైవవంబున నయజ్ఞ వ్యాహుతుల్ దీర్తు
బజ్ఞమై శేషరూపము భజింతు

తే.గీ. మును మహర్షులు సర్వజ్ఞ మూర్తి యనుచు
వినతులుగ నిష్పరిగ్రహ వృత్తినుందు
వివిధ దుష్కర్మ రతులు గర్వించిరేని
నిగ్రహింపుదు సుకృతంబు నిలుపుకొరకు — శ్రీరంగ 3-16

తృతీయాశ్వాసంలోని 80వ వచనం అమూలకమైన రచన. మూలం లోని 26వ అధ్యాయంలో "అన్యోన్యం ప్రపతం తస్తే దుద్రువుర్యమ కింకరాః" అనే పాదం క్రియాన్వయం కలది కనుక తక్కిన తెనుగుసేతలోని వచనమంత కూడ అమూలకమే. విస్తరభీతివల్ల సుదీర్ఘమైన ఈ (శ్రీరంగ 3-80) వచనాన్ని ఇక్కట ఉటంకింపలేదు.

యమదూతలు చోరుని విడిచిన తర్వాత విష్ణుదూతలు ఆతడిని శ్రీరంగ నాథుని దగ్గరకు తీసుకువెళ్లి దర్శనం చేయించటం, అవెడు స్వాతవారినిచూచి నమస్కరించటం మొదలైన విషయాలు 31వ అధ్యాయంలో ఉన్నాయి. ఈ సందర్భాన తెనుగుసేతలో గల ఈ క్రింది పద్యం అమూలకం,—

సీ. శరదిందు మండల స్వచ్ఛాహి పర్యంక
భానురు నపసవ్య పార్శ్వ శాయి
దక్షిణ బహూ పధాస పీతాంబరో
జ్జ్వల కటి విన్యస్త సవ్యహస్తు
వైజయంతీల సద్వక్షు నాకుంచితో
త్థానిత పాద పద్మాసమేతు
యోగ నిద్రాముద్రితోద్భాసిలోచన
జలజాతు బశ్చిమాశా శిరస్కు

తే.గీ. నసమ మణిమయ మకుట కర్ణావతంసు
హార కేయూర కంకణోదారసార
సన తులాకోటి ముఖ్య భూషణ విశేష
కలితు శ్రీరంగ విభుజాడ గాంచి మ్రొక్కె — శ్రీరంగ 3-115

పై పద్యంలోని శ్రీరంగేశ వర్ణనం మూలంలో (31వ అధ్యాయంలో) కన్పడదు.

## చతుర్థాశ్వాసం: :

ఆరామ సీమంత తరుసంతాన విపుల వర్ణనం (శ్రీరంగ 4-76 నుండి 4-84), మలయానిల వర్ణనం (శ్రీరంగ 4-85), చంద్రపుష్కరిణీ వర్ణనం (4-87 నుండి 4-90), జలకేళీ వర్ణనం (4-91 నుండి (4-101) మొదలైన వర్ణనాత్మకాలైన పద్యాలు భైరవకవి స్వీయరచితాలు. వీటికి సంస్కృత మూలం అగుపించదు. కనుక ఇవన్నికూడ అమూలక వర్ణనలే. విస్తరభీతి వల్ల వీటినన్నింటిని ఇక్కడ ఉటంకింపలేదు.

మూలంలో 70వ అధ్యాయంలో "నగరీ నిర్మితా తత్ర యధానాకేఽమరావతీ" అని ఉంది. ఇది తెనుగుసేతలో ప్రపంచితం. ప్రపంచితమైనాకూడ తెనుగుసేతలోని ఈ క్రింది వర్ణనాత్మకాలైన పద్యాలు అమూలకాలు—

పురవర్ణనం (4-25 నుండి 4-262), శృంగార వన వర్ణనం (4-263 నుండి 4-266), వారసతుల వర్ణనం (4-267), మదవారణ వర్ణనం (4-268), అశ్వవర్ణనం (4-269), విప్రవర్ణనం (4-270), రాజ కుమార వర్ణనం (4-271), వైశ్య వర్ణనం (4-272), బాహ్య వన వర్ణనం (4-273), బాహ్యవన మలయ పవన వర్ణనం (4-274, 275), పురవర్ణనం (4-276).

## పంచమాశ్వాసం :

"శ్రీమదఖిల భువన చరాచర ప్రచుర రచనా మనోహర చతురానన మానస మానసాంతస్సైరంతర కేళీ విలోల మరాళ బాలికా ..... శేఖరీకృత శితాంశు రేఖా మమిత భాగ్యదాం శారదాం మన్మహే మన్మహే" — శ్రీరంగ 5-221). సరస్వతీ స్తుతిపరమైన వర్ణనాత్మకమగు ఈ సుదీర్ఘగద్యం (చూర్ణిక) అమూలకమైనది.

"అమూలకం" అనే ఈ ఉపశీర్షికలో ప్రదర్శించిన అంశాలవల్ల మూలాన లేకున్నకూడ వర్ణనాత్మకంగ రచించే అవకాశం ఏ మాత్రం దొరికినా భైరవకవి కవితా రచనలో సిద్ధహస్తుడైన భైరవకవి హృద్యాలైన పద్యాలను రచించాడని తేలింది. భైరవకవి "వర్ణనల నింపు చిలుకగ" పద్యాలను గద్యాలను నడిపించేందుకు అమూలకమైన వాటిని అనువాద కృతిలో రచించాడు.

## 3.3 ఆంధ్రీకరణ విధాన పరిశీలన సారాంశం :

శ్రీరంగ మహత్త్వ ఆంధ్రీకరణ విధానాన్ని 1. యధామూలకత, 2. మూలకుంచనం, 3. మూలప్రపంచనం, 4. అన్యధాప్రకల్పనం, 5. మూల త్యాగం, 6. అమూలకం అనే అంశాలను పరిశీలించిన తర్వాత భైరవకవి అనువాద విధాన సారాంశం ఇలా ఉంటుందని భావించవచ్చు—

### 1. యధామూలకత :

పురాణకథను" రచింపబూనిన భైరవకవి మూలంలోని కథను తెనుగు సేయుటంలో అక్కడక్కడ ఒకటి రెండు పదాలు మూలంతో కించిద్భేదించినా భావార్థములలో మాత్రం ఎలాంటి భేదం లేక ఆంధ్రీకృతి యధామూలంగ రచించిన భావం అధికంగానే ఉందనవచ్చు.

### 2. మూలకుంచనం :

మూలంలో సందర్భానుసారంగ శ్రీరంగ మాహాత్మ్యానికి సంబంధించని ఇతర విషయాలు కూడ చాలాచోట విస్తృతిగా ఉన్నాయి. అలాంటి వాటిని ప్రధానేతి వృత్త కధాగమన వేగాన్ని అడ్డుకొన్నట్లుగా భైరవకవి సంక్షిప్తీకరించాడు.

### 3. మూలప్రపంచనం :

కవితా సంపత్తి, భావుకత, వర్ణనాచాతురి పుష్కలంగ ఉన్న భైరవకవి సంస్కృత మూలంలో లేశమాత్రంగ చెప్పినకొన్ని అంశాలను సందర్భోచితంగ

వర్ణనలతో తెనుగుసేతలో విస్తృతి చేశాడు. స్వీయకవితా నైపుణ్యాన్ని ప్రదర్శించి పురాణకథకు కావ్యత్వాన్ని సిద్ధింపజేసేందుకు భైరవకవి సందర్భోచితంగ మూల ప్రపంచనం చేశాడు.

## 4. అన్యథాప్రకల్పనం :

ఈ ఆంధ్రీ కృతిలో అన్యథా ప్రకల్పించిన భాగాలు చాల తక్కువగా ఉన్నట్లు పరిశీలనవల్ల తెలియవచ్చింది.

## 5. మూలత్యాగం :

శ్రీరంగ మాహాత్మ్యాత్మకేతరాలైన అనావశ్యక భాగాలను భైరవకవి తెనుగుసేతలో త్యజించాడు. మూలంలోని పునరుక్తులు సైతం తెనుగుసేతలో త్యక్తాలు. కొన్ని అధ్యాయాలకు అధ్యాయాలే తెనుగుసేయ లేదు. మూలత్యాగం చేసిన భాగాలు (ఏక్కువగానే ఉన్నాయనటం కన్న)తక్కువగా లేవని చెప్పవచ్చు.

## 6. అమూలకం :

తెనుగుసేతలోని ప్రధాన "కథ"లో అమూలకమైన అంశాలు అంతగా అగుపించవు. వర్ణనాత్మకమైన అంశాలలోనే అమూలకత అగుపిస్తుంది. కనుక ఈ అమూలకతలో భైరవకవి స్వీయకవితా ప్రభావాన్ని గోచరింపజేశాడు. మూల ప్రపంచనం, అమూలకత—వీటివల్ల భైరవకవి ఈ పురాణ కథను కావ్యత్వాన్ని సిద్ధింపజేశాడు.

పైన పేర్కొన్న అంశాలను బట్టి ప్రధానేతి వృత్తమగు పురాణకథను యథామూలంగ, స్వీయ కవితా పాటవాన్ని మూలప్రపంచన అమూలకాలుగ, మూలంలోని అనావశ్యకాలు పునరుక్తులు మూలత్యక్తాలుగ, ప్రధాన ఇతివృత్తేతర ఆవశ్యక భాగాలను మూలకుంచనంగ, అతిస్వల్ప భాగాలను అన్యథా ప్రకల్పనంగ శ్రీరంగ మహత్త్వ ఆంధ్రీకరణ రచన జరిగిందని తెలుస్తుంది.

## 3.4 శ్రీరంగ మహత్త్వము-కథాకథన, పాత్రచిత్రణ, వర్ణనాది వివిధాంశాలు : ఆంధ్రీకరణవిధానం

3. 4. 0 ఈ ఉపశీర్షికలో శ్రీరంగ మహత్త్వ ఆంధ్రీకరణంలో కథాకథనం పాత్రచిత్రణ వర్ణనలు అలంకారాలు రసాలు వీటిని గురించి చర్చింపబడుతుంది.

## 3.4.1. కథాకథనం :

భైరవకవి సంస్కృత గారుడోక్త శ్రీరంగ మహత్మ్యాన్ని తెలుగులో సాధ్యమైనంతవరకు సంగ్రహంగ సారవంతంగ కావ్యకళా సుందరంగ రచించేందుకు ప్రయత్నించాడు. కథల్లోని పునరుక్త భాగాలను చర్విత చర్వణం చేయక, వాటిని వదలి తెనుగుసేతలో ఔచిత్యం పాటింపబడింది.

కథార్థములకు ఉపబలకంగాలేని సన్నివేశాలను, కథాంశ వివరణలను అనువాదం చేయక కథాసంవిధాన సార్థక్యాన్ని పోషించిన భాగాలు శ్రీరంగ మహత్త్వంలో ఎక్కువగా కన్పిస్తాయి.

కథాగమన వేగానికి ఆటంకం లేనట్లుగా మూలంలోని వివిధ శాస్త్రాదుల వివరాలను అనువాదం చేయక పూర్తిగా వదలి, కొన్ని తావులలో సంక్షిప్తంగ అనువదించి భైరవకవి ఈ రచన సాగించాడు. అలా వదలిన భాగాలు కూడ అనువదింపబడి ఉంటే కథాశ్రవణ కుతూహలురైన పాఠకులకు కథయందు గల చిత్తైకాగ్రతకు భంగం వాటిల్లేది.

కథయందు సందర్భానుసారంగ వచ్చిన దేవతాస్తవాలను కొన్నిటిని వదలి, కొన్నిటిని సంగ్రహంగ కుదించి, మరికొన్నిటిని ఛాయామాత్రంగ స్వీకరించి, ఇంకా కొన్నిటిని స్వీయ కల్పనతో "చిత్ర రచనలు చొప్పడు" విధంగా ఈ ఆంధ్రీకరణ సాగింది.

శ్రీరంగ క్షేత్ర, దైవ, తీర్థ మహత్త్వాలకు సంబంధించక ఇతరత్ర వర్ణనాత్మక కథా భాగాలను వస్త్వైకసిద్ధిని పొందించేందుకుపూర్తిగ అనువదించలేదు. ఇలాంటి వాటికి మచ్చుకు కొన్ని—

మూలం ద్వితీయాధ్యాయంలో 32½ అనుష్టుప్ శ్లోకాలు ఉన్నాయి. జనకుని యాగం, యాగసభలో వ్యాసులవారుండటం, సదస్యులు కథలడుగటం, వ్యాసుడు తన సంతృప్తిని వెలిబుచ్చటం, మునులు నాగదంతుని పృశ్ఛకునిగ ముందు కూర్చుండబెట్టటం మొదలైన అంశాలు, మరియు గౌరవ సూచకంగ పదే పదే చేసే నమస్కారాలు మూలంలో అగుపిస్తాయి. మూలంలో సదస్యఋషుల పేర్లు కూడ ఉన్నాయి. ఈ అధ్యాయమంతా నాగదంతుడు వ్యాసుని ప్రశ్నించటం మొదలైన అంశాలతో ఉంది. ఇందులోని స్తుత్యాది విషయాలన్ని తెలుగుసేతలో త్యక్తమైనవి అలా త్యక్తం కాకున్న అనువాద కృతిలో ఎన్నో పద్యగద్యాలు అనవసరంగ పెరిగి కథాగమన వేగాన్ని అడ్డుకొనిఉండేవి.

కం. నావుడు హరియిట్లనునీ
భావమ్ము నెరింగి కాదె పద్మాసన యి
ట్లావిర్భ వించితిని ది
వ్యావసథము తోన కొలువు మభిమత భంగిన్ — శ్రీరంగ 1-201

పై పద్యానికి మూలంలోని ఈ క్రింది శ్లోకం మాతృక—

శ్లో. ఇదం జగజ్జన్మల యేప్యనాకులం
సదామయా యచ్చ్యుయితంచ శాశ్వతం
గృహాణ తద్ధామ సదాస్య పూజనం
కురుష్వ చేత్యేవ మధేరితం మయా

ఈ శ్లోకం శ్రీరంగ విమానాగమన కథన సందర్భాన బ్రహ్మకు విష్ణువు ప్రత్యక్షమై చెప్తాడు. పై తెనుగుసేత పద్యంలో ఈశ్లోకంలోని పూర్వపాదం అనూదితం కాలేదు. ఇలాఒకచోట కథార్థంకుదిరితే విశేషణార్థాలు పోనిమ్మని సరిపెట్టుకోవటంజరిగింది. అయినా ప్రధాన కథాకథనానికి భంగంకలుగలేదు.

మూలంలోని 22వ **అధ్యాయం మొత్తానికి** మొత్తం తెనుగుసేయబడ లేదు. ఆ అధ్యాయంలో భగవానుడు సనత్కుమారునికి యోగశాస్త్రాన్ని చెప్తాడు. అధ్యాత్మిక యోగశాస్త్రాది విషయాలు ప్రధాన కథాగమన వేగానికి నిరోధకాలే ఔతాయి భగవానుడు (మూలంలో) ఈ భాగాన్ని చెప్పి, అది గోప నీయమైనదని చెప్తాడు. భైరవుడు ఈ భాగాన్ని అనువదించలేదు.

మూలంలోని 17వ అధ్యాయంలో దేవతలకు విష్ణువు ప్రత్యక్షం కాగా వారు విష్ణువును "నమస్తే పుష్కరాక్షాయ" ఇత్యాదిగ పది శ్లోకాలలో స్తుతిస్తారు. ఈ స్తుతి సందర్భాన కథాకథన విశారదుడగు భైరవకవి ఈ క్రింది పద్యం మాత్రం రచించాడు.

కం. అప్పరమేశ్వరు గనుగొని
యప్పుడు ప్రమదంబు ఘనము సద్భూతమును లో
ముప్పిరిగొన శ్రుతిమతములు
చొప్పడ నుతియించి రడితి నుతులాసతులై — శ్రీరంగ 2-214

శ్రీరంగ క్షేత్ర మాహాత్మ్యానికి ప్రాశస్త్యానికి ఏ అధ్యాయాలు అనువదించ కున్నాకూడ తత్కథా కథనానికి భంగంవాటిల్లదో అలాంటి అధ్యాయాలను కొన్నిటిని భైరవకవి అనువదించలేదు. కథాగమనానికి పూర్తిగ నిరోధకాలవు తాయని 84, 85, 86, 87, 88, 89 అధ్యాయాలు భైరవకవి అనువదింపలేదు.

ఇలా భైరవకవి కథాకథనమందు తగుజాగరూకతతో ఔచిత్యయుక్తంగా ఏఏ భాగాలను క్లుప్తీకరించాలో ఆయా భాగాలను మాత్రమే అవిధంగా అనువ దించాడు. ఇది భైరవకవి కథాకథన చాతురికి నికషోపలం.

## 3.4.2. పాత్రచిత్రణం :

శ్రీరంగ మహత్త్వ కావ్యంలో మొదటి నుండి చివరివరకు అగుపించే ప్రధాన పాత్రలు దాదాపు లేవనే చెప్పవచ్చు. శ్రీరంగనాధుని మరియు క్షేత్ర తీర్థ మాహాత్మ్యాలను తెలిపే ఆయా కథలలో వివిధ పాత్రలు చిత్రితాలు. ఒక్కొక్క కథలో ఒక్కొక్క ప్రధాన పాత్రఉంది. కావ్యమంతటికీ ప్రధాన

పాత్ర ఏది అని ప్రశ్నించుకొంటే ఒకవిధంగ శ్రీరంగనాథుడనే చెప్పవలసి వస్తుంది. కాని, కథాదృష్టితో పాత్రచిత్రణను పరిశీలిస్తే శ్రీరంగ మాహాత్మ్య కములైన వివిధ కథల్లోని పాత్రలకే ప్రాధాన్యం ఇవ్వవలసిఉంది. అలాంటి వివిధ కథల్లోని ప్రధాన పాత్రల్లో చోరుడు, పిశాచి, చిత్రరథుడు, మాధవి, ప్రభాకరుడు మొదలైన పాత్రలు ముఖ్యమైనవి. పాత్రచిత్రణకు మచ్చుగ కొన్ని పరిశీలింతం—

## చోరుడు :

ఇతడు ఉపరకు శ్రీరంగనాథుని సేవకులగు భూతవరులకు అనుచరు డౌతాడు. నిరంతరం శ్రీరంగనాథుని సాన్నిధ్యమున స్వామివారి సేవకు అంకిత మౌతాడు. భగవత్సేవా కైంకర్యములకు అంకిత మయ్యేందుకు సుకృత విశేషం ఉండాలి. కాని, ఇతడు చోరుడు. దారులు గొట్టేవాడు. బ్రాహ్మణు లను అధ్వనీనులను హింసించి జీవించేవాడు దొంగతనంచేయుటం మహపాపం అందులో హింస చేయుటం మరీపాపం. సజ్జనులను బ్రాహ్మణులను హింసిం చటం ఘోర పాపం. ఆ చోరుని పాత్ర ఎంతో క్రూరత్వంగ చిత్రింపబడింది. అలా చిత్రించేందుకు కారణమిది– ఎంతో క్రూరుడై ఉండికూడ శ్రీరంగనాథుని దర్శించటంవల్ల చోరుడు పునీతుడయ్యాడని చెప్పటం ఇక్కడ ప్రధాన ఉద్దే శ్యం. కనుక చోరుడు ఈ కథలో ఎంతో క్రూరంగ చిత్రతమైతే అంత మహి మను శ్రీరంగనాథునికి ఆపాదించినట్లే. భైరవకవి చోరుని పాత్రను క్రూరంగ చిత్రించాడు. చోరుని స్వరూపం ఇలా చిత్రితమైనది.—

మ కనియెం గర్కశ మేచకాంగు నతిరక్త క్రూర విస్ఫార లో
చను, నుత్తీర్ణ కరాళ బర్బర కచశ్మశ్రున్ వినీలాంబరుం
ఘన కుంజాంతరింతు గతాగత జనాకార ప్రతీక్షాపరున్
హననోత్సాహు గరాగ్రలోహ వలయోన్యద్యన్కరున్ దస్కరున్

— శ్రీరంగ 3-63

సంస్కృత మూలంలో చోరుని స్వరూపాధికం ఇంతగ చిత్రితంకాలేదు. "లెక్కకు మిక్కిలిగ ద్విజావళులను చంపినవాడీ చోరుడు" బ్రహ్మహత్యా పాపాన్ని సైతం– శ్రీరంగ తీర్థ స్నానం, శ్రీరంగనాథ దర్శనం తొలగిస్తాయని పరోక్షకంగా చెప్పేందుకేచోరునిపాత్ర అతిక్రూరంగ చిత్రింపబడింది. సంస్కృత మూలంకన్న తెలుగు సేతలోని చోరుని పాత్రచిత్రణ శ్రీరంగనాథ మాహాత్మ్యాన్ని మెరుగులు దిద్దేదిగా ఉంది.

## చిత్రసేనుడు :

ఇతడొక గంధర్వుడు. ఇంద్రుని స్నేహితుడు. ఉద్దామ దర్పోదయాధికుడు. విశిష్టాద్వైత మతం వైష్ణవ ఛాయను కూడ దాటరాదని బోధిస్తుంది. అలాంటిది ఇతడు ఆకాశవీధిలో తోటి గంధర్వ గాయకులతోపాటు గానంచేస్తూ మడిగప్పిన మోహంతో మీదుగానక రంగాభ్యర్ణమును చేరి తచ్ఛాయాసముల్లంఘనం చేశాడు. తోడివారు ఆ నీడను దాటలేదు. ఇతడు మాత్రం దాటాడు. అప్పుడు అక్కడి తీర్థరక్షకులు ఇతనిని గిర గిర త్రిప్పి పారవేశారు. అతడు సముద్రానికి అవలపడ్డాడు. తేజోహీనుడై రెక్కలు విరిగిన పులుగువలెపడ్డాడు శంకరుని ప్రార్థించాడు. స్నేహితుడైన ఇంద్రుణ్ణి తనను కాపాడమని అభ్యర్థించాడు. కాని ప్రయోజనం లేదు. శ్రీరంగనాథుని శరణుజొచ్చి చంద్రపుష్కరిణిలో స్నానంచేసి పూర్వశక్తిని పొందుతాడు. ఈతని కథ (శ్రీరంగ 3–197 నుండి 3–200 వరకు నూటానాల్గు పద్యాలలో) చెప్పబడింది.

ఇతడిని తీర్థ రక్షకులు గిర గిర త్రిప్పి పారవేసిన తర్వాత ఇతడి దీనావస్థను తెలుగు పలుకుబడులతో మూలంకంటె కన్నులకు గట్టినట్లుగా భైరవకవి చిత్రించాడు. అతడి స్థితి ఇలా చిత్రితం– "మొక్కలించి రెక్కలువిరిగిన పులుగులంబోలె నాకసంబున కెగయులేక చీకాకుపడి యార్తుండగుచు మర్త్యకైవడి పుడమింబడి పొరలి యాక్రోశించుచు" —(శ్రీరంగ 3-203.)

మూలానికన్న తెనుగు సేతలో పాత్రోచితంగ చిత్ర సేనుడు చిత్రింపబడటం భైరవుని పాత్రచిత్రణకు మచ్చుతునుక. లఘిమాశక్తి హీనుడైన చిత్రసేనుడు

శంభుని లఘ్వక్షరాలతో స్తుతించటం మూలంలో కన్పడదు. సర్వ లఘ్వక్షరాలతో శంభుని చిత్రసేనునితో స్తుతింపజేయటం కూడ భైరవుని పాత్రచిత్రణ నైపుణ్యమే.

## ప్రభాకరుడు :

ఇతడొకముని. పారముట్టగా వేదాలను చదువాలనే ఆసక్తి పట్టుదల ఉన్నవాడు. మూలంలో ఇతనికథ 104వ అధ్యాయంలో ఉంది. తెనుగు సేతలో ఐదో అశ్వాసం 184వ పద్యం నుండి 242వ వచనం వరకు ఉంది.

ప్రభాకరుని తపస్సును వర్ణించే పద్యాలు అతడి అచంచల దీక్షను పట్టుదలను తెలియజేస్తుంది. ఈ సందర్భాన మూలంలో—

శ్లో. దశవర్షాణి వాయ్వాశీ తస్థౌ పంచాగ్ని మధ్యగః
నిరుచ్ఛ్వాసస్తథా పంచవర్షాణీతి చ నశ్శ్రుతమ్
స్వదక్షిణ పదాంగుష్ఠ స్థిత్వా సంవత్సర త్రయమ్
ఇత్థం ప్రకుర్వ తస్తస్య సతతం తప ఉత్తమమ్ —అని ఉంది.

పై శ్లోకాలు తెనుగు సేతలో—

కం, నాలుగు దెసలను దగ్ర
జ్వాలా భీలంబులైన వహ్నులనడుమన్
గాలియ తన కశనముగా
గ్రోలుచు పదియేండ్లు నడచె గొంచక మరియున్
— (శ్రీరంగ 5-185)

కం. కొంచెపుటూర్పును బుచ్చక
పంచాబ్దంబులు చరించి పాదాంగుష్ఠం
బించుక ధరపై నూదియ
చంచలుడై తపము మూడు సమముల్ సలిపెన్
— (శ్రీరంగ 5-186)

మూలంలో "స్వదక్షిణ పాదాంగుష్ఠస్థిత్వా" అనేది తెనుగుసేతలో "పాదాంగుష్ఠం బించుక ధరపై నూది" అని అయినది. అంటే పాదాంగుష్ఠం కూడ ఇంచుక మాత్రం ధరపై మోపినాడనటం వల్ల, మూలంలోని "నాలుగు దెసలను దగ్ర జ్వాలాభీలంబులైన" అని వహ్నులకు విశేషణం వేయటం వల్ల ప్రభాకరుని తపస్సు కఠోర ఘోరపరిస్థితిని, నియమాన్ని దీక్షను, పట్టు దలకు వ్యక్తం చేస్తుంది ప్రభాకరుని పాత్ర పట్టు వదలనిదిగా కార్యాన్ని సాధించేదిగా చిత్రితమైనది. చివరకు ప్రభాకరుడు సఫలమనోరధుడయ్యాడు.

ఇలా పాత్రచిత్రణలో భైరవకవి ఆ పాత్ర ముఖ్యోద్దేశ్యానికి స్ఫూర్తి నిచ్చే వాతావరణం, స్వభావం మొదలైన వాటినికూడ వర్ణించి పాత్రచిత్రణం సమర్థవంతంగా చేశాడు

## 3. 4. 3. వర్ణనలు

శ్రీరంగ మహత్త్వాన్ని భైరవకవి "వర్ణనల నింపు చిలుకగ జెప్పెద" అన్నాడు. అలాంటి వర్ణనలు తెనుగుసేతలో ఎలాకూర్చబడినవో అనువాద విధానాన్ని దృష్టియందుంచుకొని 1* కొన్నింటిని పరిశీలింతం—

శ్రీరంగ మహత్త్వమందు ద్వితీయాశ్వాసం 20వ పద్యం నుండి 50వ పద్యం వరకు గల మొత్తం 31 గద్యపద్యాలు హృద్యమైన ఋతువర్ణనానికి తార్కాణాలు. ఈ వర్ణనలు మూలంలోలేవు. ఇవికేవలం భైరవకవి ప్రతిభా విరచితాలు. అలాగే చతుర్థాశ్వాసంలో 256వ పద్యం నుండి 576వ పద్యం వరకు గల పురవర్ణనం కూడ భైరవకవి స్వీయ ప్రతిభా కల్పితాలే. వాటికి కూడ మూల శ్లోకాలు లేవు.

భైరవకవి శ్రీరంగమహత్త్వ పురాణకథా శరీరానికి కవిగారి వర్ణనలు కండపుష్టిని కలిగించాయి.

---

1* వర్ణనలను గురించి "శ్రీరంగ మహత్త్వము–కవితా వైభవం" అనే శీర్షికలో చెప్పబడును.

మూలంలో కావేరీనదీ వర్ణనం ఇలా ఉంది—

శ్లో. తద్ధామోభయతో గచ్ఛేత్పరిరభ్య సరిద్వరా
యథాపతిం చిరప్రాప్తం భుజాభ్యాం ప్రియమంగనా
తత్సంశ్లేషాది సంప్రీత్యా తచ్ఛృద్ధా దర్శనేపచ

పై శ్లోకం కావేరీ వర్ణనం తెనుగు సేతలో ఇలా అవతరించింది—

ఉ. ఉన్నత రంగధామ లలితోభయ పార్శ్వములం బ్రసన్నయై
యన్నది యుబ్బిపారు కలితాయత కంకణ మౌక్తికద్యుతి
చ్ఛన్న మృదు ప్రవాహములు సాచి చిరాగతు బ్రాణనాయకుం
జెన్నుగ నిండు కౌగిటికి జేర్చి చెలంగు మృగాక్షి కైవడిన్
— (శ్రీరంగ 1-103)

పై పద్యంలో రేఖాంకితమైన ఉపమానాలు మూలంలోని నదీవర్ణనను మెరుగులు దిద్దేవిగా ఉన్నాయి

కావేరీనదీ ప్రవాహ వర్ణనం మూలంలో కేవలం పది అనుష్టుప్పులలో ఉండగా అనువాదంలో (శ్రీరంగ 1-146) సుదీర్ఘమైన వచనంగా మూల ప్రపంచనంగ రమణీయంగ రచింపబడింది.

దైవస్తుత్యాత్మకమైన మూలంలోని—

శ్లో. దేవ దేవ మహా బాహో విపులా యతలోచన
అత్యం తాతిశయా చింత్య నమస్తుభ్య మితీరయన్
నిపసాదాథ వివశో రాజా తత్రమహాద్యుతి
తద్దర్శన భవానంద సుధావిప్లుత మానసః
ఉవాచ కించ ద్వచనం వాచా గద్గదయా పునః
అహోను శయనం త్వస్య సౌమ్యమేత దమానుషం
అహోను వపుషః కాంతి రహోలక్ష్మీర్విలోచనే
అహోవసన మస్యైత తన్మనో మమ హరత్యపి

అహో విలోచనే చేమే హృదయే ప్రతితిష్ఠత
అహో బాహుద్వయో కాంతి రహోవక్షో విరాజతే

—67వ అధ్యాయం

అనే శ్లోకాలు తెనుగు సేతలో ఇలా అవతరించాయి—
వ... ... ... హర్ష గద్గద కంఠుడగుచు నా రాజకంఠీరవుండు—

శ్రీరంగ 3-223

సీ. బాపురే! మృదుపాద పల్లవంబుల యొప్పు
మాయురే! యూరుల సోయగంబు
భళిరె! నితంబ బింబంబు సౌందర్యంబు
మమ్మా! కృశావలగ్నమ్ము చెలువు
అరరే! యొప్పు నీయూరు సౌభాగ్యంబు
చాగురే! బాహుల చక్కదనము
ఔర! తేనగవారు నాననాబ్జము పొల్పు
నోహో! కనుంగవ యొరపు మెరపు

తే.గీ. మేలుమే! లలకంబుల మెరయు కప్పు
అహహ! సునుపారునొసల దట్టాడు తళుకు
లనుచు ద్రిభువన మోహనంబగు తదీయ
మూర్తి వైభవమందంద పొగడి పొగడి — శ్రీరంగ 4-224

మూలంలో ఆశ్చర్యార్థకమైన అహో అనే పదం మాత్రమే వాడగా, అనువాదంలో దాని పర్యాయ పదాలైన బాపురే! మాయురే! భళిరే! మొదలైనవి ప్రతిపదానికీ ప్రయోగింపబడటంవల్ల తెలుగు పద్యంలోని వర్ణన మూలంలోని వర్ణనకు మెరుగులు దిద్దినట్లుంది. మూలంలోని భగవద్వర్ణనం ఒక క్రమ పద్ధతిలో కన్పడదు. దానిని "దేవ దేవంచ పాద్యాది కేశాంతం వర్ణయేత్-మానుషంతు (రాజానం చక్రవర్తినంవా) కేశాది పాదాంత మితిన్యాయేన" అన్నట్లు అనువాదంలో మూలవర్ణనం అన్యథాకరింపబడి శాస్త్రసమ్మతంగ రూపుదిద్దుకునింది.

ఇలా మూలంలో లేనివి మూలానికి మెరుగులు దిద్దేవి అయిన వర్ణనలు భైరవకవి శ్రీరంగమహత్త్వంలో చాలా రచించాడు.

## 3. 4. 4. అలంకారాలు :

భైరవకవి "...అలంకారములు...దనరునటుల..." (శ్రీరంగ 1-14) కావ్యం రచించాలని చెప్పాడు. తెనుగుసేతలోని అలంకారాలను గురించి ఇక్కడ *1 కొంత సంక్షిప్తంగ చర్చించబడుతుంది.

కావేరీ నదినిగూర్చి వర్ణించే సందర్భాన మూలంలో—

శ్లో. తద్దామోభయతో గచ్ఛేత్పరిరభ్య సరిద్వరా
యథాపతిం చిరప్రాప్తం భుజాభ్యాం ప్రియమంగనా
తత్సంశ్లేషాది సంప్రీత్యా తచ్ఛద్ధా దర్శనేనచ॥— అనిఉంది.

పై శ్లోకం తెనుగుసేతలో ఇలా అవతరించింది—

ఉ. ఉన్నత రంగధామ లలితోభయ పార్శ్వములం బ్రసన్నయై
యున్నది యుబ్బిపారు గలితాయుత కంకణ మౌక్తికద్యుతి
చ్ఛన్న మృదు ప్రవాహములు సాచి చిరాగతు బ్రాణనాయకుం
జెన్నుగ నిండు కౌగిటికి జేర్చి చెలంగు మృగాక్షి కైవడిన్

— శ్రీరంగ 1-103

తెనుగుసేతలో "కలితాయుత కంకణ మౌక్తికద్యుతిచ్ఛన్న మృదు ప్రవాహ...... మృగాక్షి కైవడిన్" అనే ఉపమానాలంకారాలు ఉన్నాయి. మూలంలో ఈ ఉపమానాలంకారాలు లేవు. భైరవుడిలా "అలంకార సరణులను" తన కావ్యంలో ప్రదర్శించాడు. కావ్య కన్యకకు అలంకారాలు సువర్ణాది అలంకారాల వంటివి కదా! అలాంటి అలంకారాలు శ్రీరంగమహత్త్వ కావ్య కన్యకకు సమృద్ధిగా ఉన్నాయి.

---

1* "శ్రీరంగమహత్త్వము-కవితా వైభవం" శీర్షికలో అలంకారాలను గూర్చి విపులంగ చెప్పబడును.

అర్థాలంకారాలే గాక మూలంలో లేని శబ్దాలంకారాలు కూడ తెనుగు లో అధికంగానే ఉన్నాయి మచ్చుకు—

చిత్రసేనుడు శంకరుని స్మరిస్తాడు. ఈ సందర్భం మూలంలోని 42వ ్యయంలో ఉంది మూలంలో "శంకరుని నుతించును" అని మాత్రమే ఎ. దానిని భైరవకవి శబ్దాలంకార శోభితంగ ఇలా చెప్పాడు—

ం. శంభుని నాశ్రిత రక్షా
దంభుని ఫణిరాజ కటక రాజిత ఘన దో
స్తంభుని నపహృత దానవ
దంభుని నిట్లనినుతించె దత్పర మతియై — శ్రీరంగ 3-214

మూలానికి మెరుగులు దిద్దే ఇలాంటి శబ్దాలంకారాలు కూడ తెనుగు ో చోటు చేసుకున్నాయి.

భైరవకవి అర్థాలంకారాలను కొన్నితావుల్లో మూలం నుండి గ్రహించాడు ొన్ని తావుల్లో స్వీయకల్పితాలను రచించాడు. శబ్దాలంకారాలు మాత్రం ంమందు కనపడవు. అవి కేవలం భైరవకవి స్వీయ రచితాలే.

## . 5. రసములు :

భైరవకవి "రసస్థితి......డసరు సత్కవీంద్రుని కృతి బుధసభల వెల ు" (శ్రీరంగ 1-14) అని "చెప్పెదకావ్యము రసములు చిప్పిల" (శ్రీరంగ ) అని తెలిపాడు.

శ్రీరంగమహత్త్వం గరుడ పురాణాంతర్గతం. ఇది కావ్యంగ రచింపబడి ఇందులోని కథమాత్రం పురాణమే. పురాణ కథా, కావ్యం కావటంచే ్తి దైవ, తీర్థ, క్షేత్ర మాహాత్మ్య ప్రతిపాదనైక సూత్రబద్ధమై ఉంటుంది. కథలలోని సందర్భాలనుబట్టి రసములు పోషింపబడుతాయి.

జలకేళీ సందర్భాన భైరవకవి శృంగార రసాన్ని ఈ క్రింది పద్యంలో పంతరించాడు—

తే.గీ. తడిసి యంటిన జిలుగులో దళుకు చూపు
నిజనితంబంబుపై జూడ్కి నిలుపు చక్రి
నేత్రమున లక్ష్మి చల్లిన నీరధార
యతని ముఖపద్మమున నాళమనగ వెలసె — (శ్రీరంగ 4-96)

చం. ఉరుతర పద్మ నాళముల నొండొరు వ్రేయుచు డాసి పీడ్వడం
బొరిబొరి మోములన్సలిల పూరము చిమ్ముచు నీరజంబుల౯
దొరలెడు పుష్పాదుల్ నెనయ దోయరుహంబుల జల్లినవ్వుచున్
హరియును లక్ష్మియున్ జలవిహారము సల్పిరినిండు వేడ్కలన్
— (శ్రీరంగ 4-97)

పై పద్యాల్లోని భావాలు అమూలకాలు. శృంగార రసం చొప్పించేందుకు కవికి ఇక్కడ వీలుకలిగింది. కనుక సందర్భోచితంగ అమూలకమైన పద్యాలు రచించాడు కవి.

నైమిశారణ్య వర్ణన సందర్భాన అమూలకాలైన భావాలు అనువాదంలో చోటుచేసుకున్నాయి. అవి శాంతరసాత్మకాలు.

శ్లో. న యత్రదుఃఖం నసుఖం నచింతా
నద్వేష రాగౌ నచ కాచి దిచ్ఛా
రసస్తు శాంతః...................." అనే శాంతరస లక్షణంలో చెప్పిన ద్వేషరాగ రహితమైన మైత్రి జాతివైరంగల వాటియందుకూడ చిత్రించి శాంతరసం పోషింపబడింది. అట్టి వచన భాగం ఇలాఉంది—

"వ. శిశిరకర కరనికర విశద కేసరి కిశోర కేసరంబుల్తో సరస బిసాంకుర శంకనొండొండ తుండంబుల బుడుకు శుండాలంబులును, శుండాల దండమండల కండూ నిరసన మసృణంబగు నరాళ కరాళ నఖర శిఖరంబులం గల చిత్రకాయంబులును, చిత్రకాయకుటుంబినీ స్తనస్తన్య పానపరిపుష్టాంగంబులగు కురంగలోకంబులును, కురంగ డింభిభంబులం గూడి చెరలాడు

రేచులును, రేచుగూనల నౌచిన మక్కువం బ్రక్కల డాచు బిడాలంబులును బిడాలంబుల పోరెబు సారెల దెరలక మరిగి తిరుగు గిరికలును, గిరికాని కరంబుల నిజభోగంబులం బొదివియనురాగంబొసగు నాగంబులును, నాగం బులకెండరాకుండ విరివిగల పురుల విచ్చి చేరవచ్చు మయూరంబులును గలిగి యుల్లసిల్లు" — (శ్రీరంగ-1-75)

కావ్యమందలి కథ ఇలా శాంతరసంతో ప్రారంభింపబడింది. ఇందలి ఉపాఖ్యానాలు కథలు బ్రహ్మవేత్తలగు ఋషులు చెప్పినవి. వాటిని ముము క్షువులు అడిగారు. కనుక అవి అన్నికూడ శాంతరస స్థితిలో పర్యవసించి ఉంటాయి. కనుక ఇతర రసాలు సందర్భోచితంగ చెప్పినాకూడ కావ్యంలో ప్రధానాంగ రసం శాంతమే.

ఇలా శ్రీరంగ మహత్త్వ ఆంధ్రీకరణంలో కథాకథనం, పాత్రచిత్రణం, వర్ణనలు. అలంకారాలు, రసములు సందర్భోచితంగ సంతరింపబడినవి.



# చతుర్థాధ్యాయం

## 4. శ్రీరంగమహత్త్వము: కవితా వైభవం, లాక్షణికత

4.1.0. శ్రీరంగ మహత్త్వము–కవితా వైభవం : శ్రీరంగ మహత్త్వంలోని కవితా వైభవాన్ని వివిధ దృక్కోణాలతో ఈ ఉపశీర్షిక యందు ప్రదర్శింప బడును

4.1.1. భైరవకవి–కవిత్వ లక్షణ సామర్ధ్యం :

భైరవకవి తననుగూర్చి "శతముఖముల పరిఢవించు సాహిత్యకళా ప్రతిభా సంపద పెంపున చతురుడ"ను (శ్రీరంగ 1-10) అని, కృతవిద్యా ఖురళీ పరిశ్రమకళాకేళీ విలాసు"డను (శ్రీరంగ 1-21)అని, "కల్యాణ కవిత్వ లక్షణ సమర్థుడ"ను (శ్రీరంగ 1-21) అని, "భ్రమరాంబికా మహావర సముదిత నిరవద్య హృద్య సాహిత్య కళాశ్రమ విమల ప్రతిభా చంక్రమణ క్రమ శాలియైన గౌరన సుతుడన్" (కవిగజాంకుశము-6) అని, "భైరవుడ నుభయ భాషా పారీణుడ......దుష్కవి ఘోర పిశాచుల నదల్చుకొను భైరవుడన్" (కవిగజాంకుశము-7) అని చెప్పికొన్నాడు. అలాంటి భైరవకవి కావ్య కవితా కళా వైభవం కవితా కళాభిజ్ఞులయిన సహృదయ సాహిత్యజ్ఞుల మనస్సులను అలరించి తీరుతుంది,

శ్రీరంగ మహత్త్వము అవతారికలో భైరవకవి ఇలా చెప్పాడు—

సీ. శబ్దార్థ రూఢి రసస్థితి బహువిధ<br>
వ్యంగ్య భేదములు భావములు గతులు<br>
శయ్య లలంకార సరణులు రీతులు<br>
బరిపాకములు దశప్రాణములను<br>
వృత్తులు వస్తువివేకంబు గుణములు<br>
గవి సమయము జమత్కారములును<br>
వర్ణనంబులు గణ వర్ణఫలంబులు<br>
దత్కాలంబులు నధి దైవతములు

గీ. గ్రహములును శత్రుమిత్ర యోగములు దశలు
నంశ వేధయు భూత బీజాక్షరముల
పొత్తువులు దెల్పి శాంత విస్ఫురణ దనరు
సత్కవీంద్రుని కృతి బుధసభల వెలయు — శ్రీరంగ 1-14

కం. చెప్పెద కావ్యము రసములు
చిప్పిల వర్ణనల నింపు చిలుకగ బాకం
బుప్పతిల జిత్ర రచనలు
చొప్పడ శాబ్దార్థ ఘటన సుకవులు మెచ్చన్ — శ్రీరంగ 1-27

పై పద్యాలలో మొదటి పద్యంలో గల గణ వర్ణ ఫలాదులను గురించి "లాక్షణికత" అనే ఉపశీర్షికలో చర్చింపబడుతుంది. ఇక మిగతవన్నీ కవితా వైభవానికి సంబంధించినవి. అవి శబ్దార్థరూఢి, రసస్థితి వ్యంగ్య భేదాలు. భావాలు, గతులు. శయ్య, అలంకారాలు, రీతులు, పాకాలు, దశప్రాణాలు వృత్తులు, వస్తువివేకం, గుణాలు, కవి సమయాలు, చమత్కారాలు, చిత్ర రచనలు, వర్ణనలు. ఇవిగాక పూర్వకావ్యానుకరణంకూడ చేర్చి వరుసగ ఆయా అంశాలందు గల శ్రీరంగ మహత్త్వ కవితా వైభవాన్ని చర్చింతము.

## 4. 1. 2. శబ్దార్థరూఢి :

శ్రీరంగమహత్త్వంలో శబ్దరూఢి అర్థరూఢి (శబ్దార్థరూఢి) పుష్కలంగ అగుపిస్తుంది.

కవితకు శబ్దంవల్ల శ్రవణ సుభగత్వం అలవరుతుంది. అర్థంవల్ల వ్యంగ్య గౌరవం సిద్ధిస్తుంది. శబ్దార్థాలు కావ్య శరీరం. శ్రీరంగ మహత్త్వంలో గల శబ్దరచనా వైచిత్రి మచ్చునకు—

కం. పొడగని యడలెడు భయమున
నడుగులు దడబడగ హృదయ మదరగ బెదవుల్
డడుపుచు సడకుచు వడవడ
వడకెడు నవ్విప్రుజూచి వాడుదగ్రత్తిన్ — శ్రీరంగ 3-64

పై పద్యంలో తస్కరుని చూచి భయవిహ్వలుడైన విప్రవర్ణనం చేయబడింది. వ్యక్తి అంతర్యంలోని భయవిహ్వలతను, తడబాటును. తొందరపాటును చిత్రించుటకు భైరవకవి చేసిందేమిటో మనకు ఈపద్యంలో స్పష్టంగా గోచరిస్తుంది. కవి ప్రయోగించిన శబ్దసందోహంవల్ల పాఠకుని మనస్సున భయవిహ్వలుడయిన విప్రుని పరిస్థితి సాక్షాత్కారమౌతుంది. శబ్దగతార్థాన్ని బట్టికాక శబ్దాన్నిబట్టి ఇలాంటి విధానాన్ని సాధించేందుకు సిద్ధహస్తులయిన కవులకు మాత్రమే సాధ్యమౌతుంది.

సీ. కడుబెచ్చి మిటమిట గాయు కట్టెండచే
భువనముల్ పారపార బొక్కపడియె
వేడియై బిసబిస విసరు గాడ్పుల ప్రాణి
తతులెల్ల తటతట దాక దొణగె
నొండెడ భగభగ మండు కార్చిచ్చుల
బెనుగిరుల్ పెటపెట ప్రేలజొచ్చె
బంకమై జవజవ నింకు శాదంబుల
మలమల మకరాలి మాడిపోయె

గీ. నెండ చొరకుండ గడునేచి యిరులు గొనుచు
వరలు కాంతార పంక్తులు వళ్లుపోయె
నట్టనడువేసవులను గాల్పుడలుగాక
జరుగు నేరులు నిర్జల స్థలములయ్యె — శ్రీరంగ 3-176

అనావృష్టి పీడనంవల్ల ప్రబలిన వేసవి కటకటలను ధ్వన్యనుకరణ శబ్దాలద్వార మనకు (పాఠకులకు) భైరవకవి కనులకు కట్టించాడు. శబ్దంలో నాదశక్తి ఉంటుంది. "వేడియై బిసబిస విసరు గాడ్పులు" -ఇందులోని "స" కారం వడగాలి తీవ్రతను వేగాన్ని సూచిస్తుంది. అలాగే మిగిలిన శబ్దాల నాదశక్తిని గ్రహిస్తే పద్యంలోని భావం సాక్షాత్కరిస్తుంది. శబ్దశక్తి అలాంటిది.

పద్యం అర్థంకాకపోయినా అందలి పదాల పోహళింపులోని శిల్పశక్తిచేత కవి చెప్పదలచిందేమిటో తెలుస్తుంది. కనుక శబ్ద విన్యాసం కవిత్వానికి జీవగర్ర.

కం. గజ వదనాదులు గాంచిరి
నిజరక్షిత సీమ గాలనియమిత భృత్యా
వ్రజకృత బహువిధ బాధల
గిజిగిజి యగు శూద్రభక్తు గీలిత దేహున్ — శ్రీరంగ 3-79

పై పద్యం "జ" కార ప్రాసతో నడిచింది. అంతేగాక చివరిపాదాన యమ కింకర కృత బహువిధ బాధలకు శూద్రభక్తుడు గిజిగిజ అయ్యాడని చెప్ప బడింది. ఈ జకారం శూద్రభక్తుడు ఎంతటి బాధలను పొందాడో ఊహింప జేస్తుంది. అలా ఊహింపజేసేందుకు కారణం ఈ పద్యంలోని జకారశబ్దం కీలకమైనదిగా ఉండటమే.

సీ. శిఖరాగ్రగతి హరి ప్రఖరానిశ క్రూర
నఖరాభి హత నవ్య నాగకులము
శబరీ పరిప్రస్థ కబరీ కలాప వి
క్లబరీణ ఘన భుజంగ వ్రజంబు
రహిత దోషాటోప మహిత రత్నప్రభా
సహిత బృందారక బృంద సరణి
వితత సానుస్థాన సతత నిర్ఝరజల
ప్లుతతరు ప్రత్యంత భూమికులము

గీ. బహుళ గైరిక మయ దృషత్ప్రభవరాగ
కల్పితాలిక దిపసావ గమనికాము
విపుల వార్వాహ సందోహ విభ్రమంబు
రుంద్ర కటకంబు ధరణి ధరేంద్ర మొకటి ...శ్రీరంగ 4-250

శబ్దాలను ప్రయోగించటంలో భైరవకవి సాధించిన ప్రయోజనంగొప్పది. మాటలతో పాఠకుల మస్తిష్కమందు చిత్రాన్ని నిర్మించటమేగాక ఆ చిత్రాన్ని చలింప చేయటం భైరవకవి శబ్దప్రయోగ విశిష్టత. అది శబ్దగ్రహణ పారీ ణులగు సహృదయులకు హృదయైక వేద్యం. శిఖర-ప్రఖర--నఖరాభిఘాత

అనటంచే ఆ నఖరంచేత ఎంతగా చీల్పబడిందో ద్యోతకమౌతుంది. ఇది శబ్ద ప్రయోగ చాతుర్యం. చిన్ని కంద పద్యంలోకూడ శైలాన్ని వర్ణింపవచ్చు. పెద్దదైన సీసపద్యంలో వర్ణించటంవల్ల పర్వత దైర్ఘ్యాదులు సూచితమని భావింపవచ్చు.

పద్యనామాన్ని సార్థకంగ పద్యంలో ముద్రాలంకార శోభితంగ ఇముడ్చటం, సర్వలఘు రచనలు చేయుటం మొదలైనవికూడ శబ్దవైచిత్రియే. వీటని గురించి ఈ వ్యాసంలో వేరొకచోట చెప్పటం చేత ఇక్కడ వివరించలేదు

శ్రీరంగమహత్త్వాన గల పద్యాలలో అర్థగూఢికి మచ్చుకు—

తే.గీ. తడిసి యంటిన జిలుగులో డళుకు చూపు
నిజనితంబంబుపై జూడ్కి నిలుపుచక్రి
నేత్రమున లక్ష్మి చల్లిన నీరధార
యతని ముఖపద్మమున నాళమనగ వెలసె — శ్రీరంగ 4-95

జలకేళీ సందర్భాన హరి--సిరి సరసాలు పై పద్యంలో రమణీయార్థంగ చెప్పబడినవి.

విశేషార్థాలను స్ఫురింపజేసె పద్యాలుకూడ ఔచిత్యవంతంగ ప్రయోగించినవి ఉన్నాయి. మచ్చుకు—

ఉ. మేనక విన్ననై నిలిచె, మెల్లన మోమర వాంచె రంభ, లో
నూనిన వింత నివ్వెరగు నందె దిలోత్తమ, గర్వహీనయై
దీనతనొందె నూర్వసి, మదిం జలియించె ఘృతాచి యన్యకాం
తా నిచయంబులెల్ల దపుదప్పుల నుండె భయంబు పెంపునన్
— శ్రీరంగ 2-77

ఈ పద్య విశేషార్థం ఈ వ్యాసంలో వేరొకచోట చెప్పబడింది. కనుక ఇక్కడ అర్థాన్ని వివరింపలేదు. ఇలాంటి పద్యాలు మరికొన్ని ఉన్నాయి.

"వ్యంగ్యాలు" అనే ఉపశీర్షికలో ఉదాహరించిన పద్యాలు వీటికి కూడ ఉదాహృతాలే అవుతాయి. వాటిని ఆ ఉపశీర్షికలో చూడవచ్చు.

## 4.1.3. రసస్థితి :

శ్లో. విభావై రనుభావై శ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః
— దశరూపకమ్ VI.I

విభావ అనుభావ సాత్త్విక వ్యభిచారి భావాలతో ఆస్వాద్యంగ చేయబడిన స్థాయీభావమే "రసం" అని పై కారికకు అర్థం.

శ్లో. శృంగార హాస్య కరుణా రౌద్రవీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ్యేత్యే రసాస్మృతాః
— నాట్యవేదమ్ 6-15

ఇక శ్రీరంగ మహత్త్వములో గల రసాలకు క్రమంగ లక్ష్యాలను పరిశీలింతం—

## శృంగారం :

శ్రీరంగ మహత్త్వము క్షేత్ర, తీర్థ, స్థలమహాత్మ్య ప్రతిపాదకమైన కావ్యమైనాకూడ అందులో కొంత శృంగార రసం కూడ పోషింపబడింది.

కావేరీ నదీవర్ణన సందర్భాన చెప్పిన ఈ క్రింది పద్యంలో రసనిష్యందిగ శృంగార అభివర్ణితం.—

ఉ. ఉన్నత రంగధామ లలితోభయ పార్శ్వములం బ్రసన్నయై
యున్నది యుబ్బిపొంగు కలితాయత కంకణ మౌక్తికద్యుతి
చ్ఛన్న మృదు ప్రవాహములు సాచి చిరాగతు బ్రాణనాయకున్
జెన్నుగ నింతు కౌగిటికి జేర్చు చెలంగు మృగాక్షి కైవడిన్
— శ్రీరంగ 1-103

హరి–సిరి జలకేళి సలిపే సందర్భాన గల ఈ క్రింది పద్యంలో చక్కగ శృంగార రసం పోషింపబడింది—

చం. ఉరుతర పద్మనాళముల నొండొరు ప్రేయుచు డాసి పిద్వడం
బొరిబొరి మోములన్ సలిల పూరము చిమ్ముచు నీరజంబులం
దొరలెడు పుప్పొడుల్ నెనయు దోయరుహంబుల జల్లీ నవ్వుచున్
హరియును లక్ష్మియున్ జలవిహారము సల్పిరి నిండు వేడ్కలన్
— శ్రీరంగ 4-97

మంగళ దేవతా మహావిష్ణువుల జలకేళీ విలాసం అమలిన శృంగార రస నిష్యందిగ అభివర్ణితం. శ్రీరంగమహత్త్వములో 4-96, 1-50, 4-265, 4-266 4-267 మొదలైన పద్యాల్లో కూడ శృంగార రసం పోషింపబడింది.

## హాస్యరసం :

శ్రీరంగ మహత్త్వములో హాస్యరసానికి అంతగా తావులేదనే చెప్పవచ్చు. ఇందుకు కారణం కావ్యంలోని ఇతివృత్తం అలాంటిది. హాస్యరసం అక్కడక్కడ స్వల్పంగ స్పృశింపబడింది కాని విస్తృతంగ వర్ణితం కాదు. స్వల్పంగ ఉండే హాస్యరసానికి ఒక ఉదాహరణ—

కం. "వెరపింప వచ్చి వెరవిన
తెరగున" నను గెలుతునని మదింయాని హరుం
డరిమురి గ్రోధము చేతం
బరివరియై తపము విడిచిపారడ మొదలన్ — శ్రీరంగ 2-94

భయపెట్టేందుకు వచ్చి తానే భయపడ్డాడని చెప్పటంలో కొంత హాస్యం ఉంది.

## కరుణారసం :

తస్కర పీడితులైన విప్రవర్ణన పద్యాలలో కరుణారసం కనిపిస్తుంది. ఆ పద్యాలు ఇవి—

కం. తల్రదెవ్వ నడరుటయు గడు
గలిగి మహీసురుఁడు వానిగనుగొని నన్నుం
బొలియింప నీకు నయ్యెడు
ఫలమెయ్యది రిక్తహస్తు భారుని ననదున్ —శ్రీరంగ 3-66

కం. అనవుడు దీనాననుడై
తనువు సెమర్పంగ గద్గదస్వరమున ని
ట్లను వసుధామర ముఖ్యుడు
తనునెట జననీక యేచు తస్కరుతోడన్ — శ్రీరంగ 3-68

వైభవో పేతుడగు గంధర్వుడు తేజోహీనుడై పడిపోవటాన్ని వర్ణించే సందర్భానగల కథాభాగం కరుణ రసాత్మకం.

కం. తలకొనిన శోక భయమున
నలమరుగుచు జిత్రసేనుడతి కరుణముగా
బలుమరు విలపించె నెగుల్
దలగు నుపాయములు గొన్ని తలపోసి ధృతిన్— శ్రీరంగ 3-123

## రౌద్రరసం :

వజ్రాయుధాన్ని ఛేదించేందుకు వచ్చే సుదర్శన చక్ర స్వరూపం రౌద్రా కారంగ ఇలా వర్ణితమైంది —

సీ. ప్రళయ మార్తాండ మండల చండత రసము
ద్భూత భూరి ప్రభా పుంజమగుచు
ఘన సహస్రార నిర్గత మహోగ్రానల
జ్వాలా వలీఢ దిగ్వలయు మగుచు
సహజ తేజో విశేష క్షణాంతరుద్భూత
సర్వదివ్యాస్త్ర విస్తారమగుచు
గఠిన నిర్ఘాత సంఘాత భీషణ ఘోష
నిర్భిన్న రాక్షసి గర్భమగుచు

గీ. సకల శుకముఖ్య ముని యోగి జనసమగ్ర
మహిత నిగమార్థ సంస్తూయ మానమగుచు
వచ్చెమానస వేగమై వనజగర్భ
దాస భయ కర్శనంబు సుదర్శనంబు — శ్రీరంగ 2-102

మృత్యుదేవత కృత్యాలు రౌద్ర రసాత్మకంగా ఇలా వర్ణితం—

శా. క్షుత్తృష్ణాధిక వేగతా పరిగతాసుప్రాణ శల్యావలీ
ఖిత్తాకీర్ణ మహార్ణవాంతిక మహీభృత్కందరారణ్య శు
ష్యత్తోయాశయ తీరచైత్య మరుదేవా గార రథ్యాదులన్
నృత్తంబాడుచు మృత్యుదేవత సమున్మేషించె హేలాగతిన్
— శ్రీరంగ 3-177

తస్కరుని రౌద్రాకారవర్ణనం (శ్రీరంగ 3-63), రౌద్రరసాత్మకంగ వర్ణిత మైన పిశాచ చేష్టలు మొదలయినవి కూడా ఇందుకు మరికొన్ని ఉదాహరణలు.

## వీరరసం :

యుద్ధ, దాన, దయా, ధర్మ, సత్య, పాండిత్య, క్షమా, బల అనేవి వీరరసంలోని భేదాలు. ఈ అష్టవిధ వీర రసాలలో శ్రీరంగ మహత్త్వమున కొన్నింటికి మాత్రమే లక్ష్యాలు అగుపిస్తాయి. అలాంటివి మచ్చుకు—

## యుద్ధవీరం :

నిలింప సైన్యంతో పోరాడిన హరికింకరుల యుద్ధవీరం ఇలా వర్ణితం—

"వ. సమరసముత్సాహ కుతూహలంబులై సురసందోహంబులు దగ్గ మండలాగ్ర పరిగపట్టిస ప్రాస పాశముఖ ప్రహరణ బాణపాణులై మరియుం దరు దరిమి నిజపుత్రా పాతపాహతారి కుముదుండును దత్త క్షేత్ర రక్షకుండు కింక రెట్టింప హరికింకరు లంబలించిన నా నిలింప సైన్యంబులపై గవిసి నిశిత పవి నిష్ఠురంబులగు శరంబుల నురంబుల గాఢనేసియు ప్రళయానల కరాళం బుల కంఠనాళంబులు దెగ్గవేసియు కాలోరగా భీలంబులగు శూలంబుల ఫాలంబుల నొంచియు నుదంచిత ప్రభా విహిత వియత్తంబులగు నత్తళంబుల

గత్తళంబుల జించియు గరంబు భయంకరంబగు ముద్గరంబుల శిరంబుల నొంచియు ప్రచండంబులగు గదాదండంబుల బిచండంబుల బగిల్చియు గనక పుంఖ మండిత శిఖండ జాలంబులగు భిండివాలంబుల నాడించియు దరము గాటమ్ముగ సకల నోహటించి విముక్తరణ పాండిత్యులగు నాదిత్యులు విస్మృత హరిత్తులగు మరుత్తులును విగళితగంధర్వులగు గంధర్వులు విఘూర్ణితాక్షులగు యక్షులు వితతక్షత వేదనాసాధ్యులగు సాధ్యులును వికంపితా వసువులగు వసువులునునై" — శ్రీరంగ 3-237

దా న వీ ర ం : దానవీరానికి మచ్చుకు ఒక పద్యం—

మ. చలనం బందక యీని యీని ప్రకటించంబోక నల్దిక్కులం
గలకం బారక నీరసత్వమున కాగారంబు గాకుండె నేన్
దలపన్ గల్పక కామధేను ఘన చింతారత్నముల్ సాటియౌ
నలఘుత్యాగ గుణాభిరాముడగు రామామాత్య సింగంబుతోన్
— శ్రీరంగ 1-57

ద యా వీ ర ం : దయావీరానికి మచ్చుకు ఒక పద్యం—

మ. కరుణాంభోనిధి రంగనాయకులు తద్గంధర్వ గాంధర్వ వై
ఖరి చిత్తంబున కౌతుకంబు నెరయంగా సుప్రసన్నాత్ములై
సరసోదార కటాక్ష వీక్షణ సుధాసార ప్రసారంబునన్
బరితాపంబడగించి వారికొసగెన్ భవ్యాప్త తైశ్వర్యముల్
— శ్రీరంగ 3–297

పాండిత్యవీరం : మచ్చుకు ఒక పద్యం—

కం. చెప్పెద కావ్యము రసములు
చిప్పిల వర్ణనల నింపు చిలుకగ బాకం
బుప్పతిల జిత్ర రచనలు
చొప్పడ శబ్దార్థ ఘటన సుకవులు మెచ్చన్ — శ్రీరంగ 1-27

భయానకం : తస్కరుని చూచి భీతిల్లిన విప్రుని వర్ణనం భయానక రసానికి ఒక ఉదాహరణ అవుతుంది ఆ పద్యం ఇది—

కం. పొడగని యడలెడు భయమున
నడుగులు దడబడగ హృదయ మదరగ బెదవుల్
దడుపుచు నడుకుచు వడవడ
వడకెడు నవ్విప్రుజూచి వాడుద్వృత్తిన్ — శ్రీరంగ 3-64

పిశాచిని చూచి భీతిలిన వాని వర్ణనం భయానక రసానికి ఒకఉదాహరణ—

కం. కని కనలునిగుడ నురువడి
జను కుటిల భ్రుకుటితల వికంకట భయదా
ననులగు వారల దవ్వుల
గనుగొని మడిబెగడి మేను గజగజ వడకన్ — శ్రీరంగ 3-185

భీభత్సవం : విష్ణుభటులు శమనభటులను పారద్రోలిన వర్ణనభీభత్స రసాత్మకంగా ఉంది. ఆ వర్ణనం ఇది—

వ. దురహంకార సముద్భటులగు శమన భటులంబొదివి మదమడంపం దొడంగిరప్పు డమోఘ నిర్ఘాత నిష్ఠురంబులగు ముష్టిఘట్టనంబుల వికంకటంబులగు కటంబులు పగిలి జెల్లునంబెల్లు దొరగు నెత్తుటం జొత్తిల్లి పిమ్మటి గొని బమ్మరించువారును జలవర్ష పాషాణ పాత ప్రకారంబుల గరొటి కర్పరంబులు చిద్రుపలై వికీర్ణంబులగు కర్ణ రంధ్రంబుల మెదడుగ్రమ్మిన రిమ్మగొని సొమ్మసిలువారును అక్షీణ కఫోణి ప్రయోగంబుల క్రోడభాగంబులు తండసిలు గుండెలవిసి బ్రెమొకలు నెట్టు మోవబడి బిట్టు మూల్గువారును పటు కఠిన జానుకుట్టనంబుల నత్తాలంబులగు కంకాలంబులు విరిగి యొరిగి పొరలుచు మొరలిడు వారును ప్రకట పార్ష్ణి ఘాతంబుల ప్రచండంబులగు పిచండంబులు పగిలి డగుల్చొచ్చి కళ్ళుపడి త్రెళ్ళువారును మహాయస ముసల పరిఘ పట్టిసాను శాసనంబులం బరశుఘాతంబుల గలకంబులై యసువులు పెకల వికల చిత్తులై యద్దెస దద్దరిలువారును నుదార గదా ప్రహరణంబుల జరణంబులు కరంబులు శిరంబు లవలగ్నంబులు భగ్నంబులైన నుద్విగ్నులగు వారలై బీరంబులు దక్కి బీరువోయి మారు మొగంబులిడి మానంబులెడలి పంద్రిలి పికాపికలై బెదిరి చీకాకుపడి దవుదవ్వుల దొరంగి నవ్వులకు భాజనంబై పరచిరయ్యవసరంబున — శ్రీరంగ 3-80

అద్భుతరసం : కావేరీనదీ విజృంభణం—ఆ నదీజలాలు ప్రళయాన్ని సృష్టిస్తాయని సత్యుడు సుబోధుడు అనే తాపసులు ఆపోశనంగ ఆ నదీ ప్రవాహాన్ని పాణితలాన నిల్పటం మొదలైన అంశాలుగల ఈ క్రింది పద్యాలు అద్భుత రసాత్మకాలకు ఉదాహరణలు—

కం. ఇరవుగ దొలునాడన్నది
దరినొకచో వారలిడిన దండాజిన స
త్కరుణ స్నాన పటాదులు
పరువడి యెయ్యేటినీట బడవడి నరిగెన్ — శ్రీరంగ 3-147

ఉ. అంత ననంత ధర్మ మహిమాంచిత కృత్యుడు సత్యుడా సరి
త్స్వంతత జృంభణోదయ విచార వికారత బుద్ధిబూని భా
స్వంతము విష్ణు సంజ్ఞకము సత్యము సర్వశుభప్రదంబు శ్రీ
మంతమునైన దైవము నమానుషలీల దలంచుచున్నెడన్
— శ్రీరంగ 3-148

కం. కల్పాంత తీవ్ర బాడబ
కల్పసమాన ప్రతాప ఖని యవితథసం
కల్పుడ సుబోధు డట్టి య
నల్పక్షోభంబుగని మహాద్భుత మతియై — శ్రీరంగ 3-149

శా. కాలాంబోధర గర్జిత ప్రతిభ యోగ్రధ్వాన గంభీరమున్
హేలాదర్ప విజృంభణ స్ఫురణ నిర్దేలా యవేళన్ సము
ద్వేలంబై నది యానదీ మణి కడుం వేగంబె యావేగము
ల్లోల ద్వీచి పరంపరల్ పొడువదే లోకంబు లేకంబుగాన్
— శ్రీరంగ 3-150

తే.గీ. కానదీ కికి బ్రత్యుపకార మింక
నెద్దిగల దట్టి దప్పుడూహించి చేయ
కొక నిమేష ముపేక్షించి యున్ననైన
బ్రతుక బోలునె విశ్వ ప్రపంచమునకు — శ్రీరంగ 3-151

సీ. చటుల దిక్కరి కర్ణపుట పాటన ప్రౌఢి
నొదవు నిర్భర ఘోష మదము ముడుగ
పాథోధి మండల పాణింధమముత్తైన
కల్లోల వితతుల త్రుళ్లడంగ
మకర నక్ర గ్రాహ మత్స్యకచ్ఛపకోటు
చక్రటిట్టిభసారస క్రౌంచ ముఖజల
విహగ జాలముగమి విచ్చిపరవ

గీ. నా రసాతల నిమ్నంబులైన మడువు
బట్లు పంకా విలంబులై బయలు పడగ
శిలలు గుల్లలు నిసుముచిప్పలును దక్క
నెసగి యాతోయ మీతోయ మ్మేగ్రహింతు — శ్రీరంగ 3-152

కం. అని సంరంభ విజృంభణ
మున దత్సలిలంబు సకలమును బాణితలం
బున నిలిపి లీల నాపో
శనముగ గొనిబూని దశదిశల్ గనుగొనిసన్ — శ్రీరంగ 3-153

నది అవేళ విజృంభించటం దానిని విశ్వ శ్రేయస్సుకై ఆపోశనంగా తీసుకునేందుకు పాణితలంలో గ్రహించుటం ఇక్కడ అద్భుత విషయాలు.

శాంతరసం : నయత్ర దుఃఖం నసుఖం నచింతా నద్వేషరాగౌ నచ కాచదిచ్ఛా రసస్తు శాంతః" అని శాంత రసానికి లక్షణం.

నైమిశారణ్యాన గల ముని ఆశ్రమ వర్ణనం ఈ క్రింది భాగాలు శాంత రసానికి చక్కని ఉదాహరణం ఇందులో జాతి వైరాన్ని సైతం విస్మరించి శాంతంగ పరస్పరం కలిసి ఉండే పశుపక్ష్యాదుల వర్ణనం రమణీయం—

వ.........శిశిరకర కరనికర విశద కేసరి కిశోర కేసరంబులు సరస బిసాంకుర శంకనొండొండ తుండంబుల బుడుకు శుండాలంబులును, శుండాల దండ మండల కండూ నిరసన మసృణంబులగు నరాళ కరాళ నఖర శిఖరం

బులం గల చిత్రకాయంబులును చిత్రకాయ కుటుంబినీ స్తనస్తన్యపాన పరి పుష్టాంగంబులగు కురం. లోకంబులును గురంగడిండిమంబులం గూడి చెర లాడు రేచులను, రేచుకూనలనేచిన మక్కువం బ్రక్కలడాచు బిడాలంబు లును బిడాలంబుల పొరెలు సారెల దెలరక మరిగితిరుగు గిరికలును గిరికాని కరంబుల నిజభోగంబులం బొదివి యనురాగంబొసగు నాగంబులును నాగం బుల కెండరాకుండ విరివిగల పురులవిచ్చి చేరవచ్చు మయూరంబులును గలిగి యుల్లసిల్లు. — శ్రీరంగ 1-75

ఇలా సందర్భోచితంగ రసాలు శ్రీరంగమహత్త్వములో పోషింపబడినవి.

## 4. 1. 4. వ్యంగ్యం :

వ్యంగ్యం అంటే ధ్వనిచేత సూచింపబడేది. వ్యంగ్య భేదాలు అనేకం. భైరవకవికి వ్యంగ్య రచన అంటే ఇష్టం. శ్రీరంగ మహత్త్వములో వ్యంగ్యాత్మ కాలైన కొన్ని పద్యాలు పరిశీలింతం—

యతి రూపంలో వచ్చిన భగవానుడు సనత్కుమారునికి తన తెరగును తెల్పిన సందర్భానగల ఈ క్రింది పద్యంలో వ్యంగ్యంగ తాను పరమాత్మునని చెప్పాడు. వ్యంగాత్మకమైన ఆ పద్యం ఇది—

సీ. ఇందుండి వచ్చితి నిప్పుడే ననరాదు
సకల లోకైక సంచారి గాన
నిదియది నెలవని యేర్పరింపగబోల
దెందు జూచిన వసియింతు గాన
రూపించి తల్లిదండ్రుల జూపి చెప్పగా
లేదు వారెవ్వారు లేరు గాన
వీరు బంధువులని వివరింపగూడదు
సర్వభూతములకు సముడగాన

తే. పటువు లిట్టిట్టు గతజేర వచ్చిరనగ
బొందు గాదు నిమిత్త సంభూతులగుచు
జిత్రగతమైన కావ్యంబు చేతలందు
నెరుగదగుగాక మాటలనేమి చెప్ప — శ్రీరంగ 1-114

ఊరగతల్పుడు చంద్రపుష్కరిణిలో జలధి సుతతో జలకేళి సల్పేట ప్పుడు వర్ణించిన ఈ క్రిందిపద్యాల్లో విష్ణ్వవతారాలు వ్యంగ్యంగ చెప్పబడినవి-

సీ. ఉరవడి నెదురీదు నొకచోట వెసగ్రుంకి— (మత్స్యావతారం)
తలచూప నొక్కింత తడవడంగు— (కూర్మావతారం)
నడుమను మీద వెల్వడు నెటనైనను— (వరాహావతారం)
మొనసి చీరగమారు మొగము సేయు— (నృసింహావతారం)
మేను వంచన దాచి మీదికి బదమెత్తు— (వామనావతారం)
రాజహంసల తోడ రాయిడించు— (పరశురామావతారం)
సుడివడి కమలముల్ వడి ద్రిప్ప బలమున— (రామావతారం)
నుదకంబు తనకు రానొత్తి తిగుచు— (కృష్ణావతారం)
గీ. దనరు పద్మాసనస్థుడై మునియుబోలె
నిగుడు జపమున నెక్కుడు నెప్పుజూపు (బుద్ధావతారం)

అలాగే చాగయరాఘవుని వర్ణించిన పద్యం (శ్రీరంగ 1-59), దశావ తార వర్ణనపద్యం (శ్రీరంగ 3-16), పురవర్ణన సందర్భానగల పద్యం (శ్రీరంగ 4-270) మొదలైనవి శ్రీరంగ మహత్త్వంలోని వ్యంగ్య రచనకు మరికొన్ని ఉదాహరణలు.

## 4. 1. 5. భావాలు :

శ్లో. విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీభావో రసస్స్మృతః
— దశరూపకమ్ VI-I

విభావ, అనుభావ, సాత్త్వికభావ, వ్యభిచారిభావ, సంయోగ వస్యమాన స్థాయిభావం రసం. సజాతీయ విజాతీయాలతో దేనితోకూడ తిరస్కరింపబడక రసపరిణతి వరకుకూడ నిలిచి ఉండేది స్థాయిభావం. ఈ విషయం దశరూప కంలో ఇలా చెప్పబడింది—

సజాతీయై ర్విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయీభావ ఉదాహృతః

భావయతీతి భావః– భావింపజేసేది కనుక భావం. శ్రీరంగమహత్త్వం ఒక కావ్యం. కావ్యాల్లో వర్ణనలవల్ల భావాలు ప్రకటింపబడుతాయి. కావ్యాలను చదువటంవల్ల పాఠకునికి ఒక అనుభూతి కలుగుతుంది. చిత్తానికి ఒక వికారం కలుగుతుంది. అదే భావం. ఇలాంటి భావాలు శ్రీరంగ మహత్త్వంలో చాలా ఉన్నాయి. మచ్చుకు—

ఉ. అప్పుడు పుష్పబాణు రుచిరాకృతి దప్పక చూచి చిత్తముల్
ద్రిప్పగలేక కోర్కి తరి తీపుల ప్రేమ తెలర్ప మానసముల్
దప్పి చలించి ఘర్మ సలిలంబెసగన్ బులకించి నివ్వెరల్
గప్పి విచిత్ర రూపముల కైవడి నిల్చి రమర్త్య భామినుల్
— శ్రీరంగ 3-143

మన్మధుని రుచిరాకృతిని చూచిన సురసుందరీమణులు పులకించారు.

దక్షుడు చంద్రుడిని యక్షదుర్దశ చెందగలవని శపించిన తర్వాత ఈ క్రింది పద్యం ఉంది—

చం. అని శపియించె నంత హరిణాంకుడు తత్పటురోగముగ్రమై
తన తనువందు బొంద ప్రభదప్పి కృశించి వినష్ట బుద్ధియై
ఘనభయ విహ్వలుండగుచు గ్రక్కున నక్కడబాసి భూతలం
బున గడువాసి నుల్లసిలు పుష్కరిణీతటి జేరసన్మతిన్
— శ్రీరంగ 3-143

పై పద్యంలో సత్తువ కోల్పోయి దుర్దశచెందిన చంద్రుని దైన్యం వర్ణింపబడింది. చంద్రుడు శాపంపొందేందుకు ముఖ్యకారణం అతడు రోహిణియందు అత్యంతాసక్తుడై ఉండటం వ్యభిచారి భావాలలో ఇది దైన్యం.

## 4·1.6. గతులు :

ప్రతి పద్యానికి ఏదోఒక నడక ఉంటుంది. కోట్లకొలది వృత్తాలు ఇతర పద్యాలు ఎన్ని ఉండినా కూడ వాటిలో చక్కనినడక ఉండేవి కొన్నే ఉంటాయి అలాంటి నడకకు "గతి" అనిపేరు. గతిని అనుసరించి పద్యం శ్రవణ సుభగంగా ఉంటుంది. ప్రతిభావంతుడైన కవి రచించే పద్యాల గతి (నడక) సందర్భోచితభావసమానంగ ఉంటుంది.

పూర్వ తెలుగు కవుల్లో గతులను ప్రత్యేకంగ పేర్కొన్నవాడు నన్నెచోడ కవీంద్రుడు—

కం. చతురోక్తుల "సుతపదబహు
గతుల" నలంకార భావకాంతి రసార్థ
స్నుతి గృతి నతి రసికులు వర
సతిగతి నెఱిగింప వలదె సౌభాగ్యముసన్— కుమారసంభము 1-39

పొగడదగిన మంచినడక (గతి) ఉంటాలని నన్నెచోడుని ఉద్దేశ్యం. నన్నెచోడుని తర్వాత గతులను పేర్కొన్నవాడు భైరవుడేగావచ్చు. *1.

భైరవకవి శ్రీరంగమహత్త్వములో చక్కని నడకగల సుప్రసిద్ధమైన వద్యాలనే ప్రయోగించాడు. అందులో సంఖ్యనుబట్టి ప్రథమాది స్థానాలు కంద, చంపకమాల సీస, ఉత్పలమాల, మత్తేభ, శార్దూలాదులు చెప్పదగినవి. ఇలాంటి పద్యాలు చాలామటుకు చక్కనిగతిని (నడకను) కలిగి వీనులవిందు చేసేవిగా సందర్భోచితంగ రచింపబడినవి అలాంటి వాటిలో మచ్చుకు కొన్ని—

కం. లలిత మరుసమయ సముదిత
మలయానిల చలిత మధుర మాకందసము
జ్వాల కుసుమ విసర సౌరభ
కలిత వచస్స్ఫురణ వెలయుగా నిట్లనియెన్ — శ్రీరంగ 1-23

శ్రీరంగ 2-67, 3-214, 4-78, 5-150, మొదలైన కందాలు మరికొన్ని ఉదాహరణలు.

చం. పరిచరుగాగనేలె నిరపాయ చరిత్రుని శత్రుకాసన
స్ఫురదురు వీతిహోత్రుని సముజ్జ్వలమేరు సమాన గాత్రునిన్
పరమ పవిత్రు సన్మునని సుపర్వ తతిస్తుతి పాత్రునిన్ మనో
హరఫల శేముషీ కబళితాంబుజ మిత్రుని వాయుపుత్రునిన్
— శ్రీరంగ 2-142

శ్రీరంగ 5-128 చంపకమాల ఇందుకు మరో ఉదాహరణ.

సీ. సతతత ప్రసన్నతా సదనంబు వదనంబు
వినుత సత్యామృత వేణి వాణి

---

1* శ్రీరంగ మహత్తము–పీఠిక (పుటXCVI) (1979 ఆం.ప్ర. సా. అ. ప్రతి)

శరణాగతత్రాణ సదయంబు హృదయంబు
ఘనదాన వైభవాకరము కరము
గురుధర్మ కార్యాను కూలంబు శీలంబు
సంపాదిత స్వామి జయము నయము
హరిపదారాధనా యత్తంబు చిత్తంబు
భూరి సౌభాగ్య విస్ఫూర్తి మూర్తి
గీ... ... ... ... — శ్రీరంగ 1-56

చక్రనిగతి (నడక) గల సీస పద్యాలకు మరికొన్ని ఉదాహరణలు శ్రీరంగ 1-60, 4-85, 5-254, మొదలైనవి.

ఉ. వారలు ముచ్చరంగనిరి వంశ వివర్ధనులన్ మనోహరా
కారుల నిర్వికారుల జగన్నుత నిర్మల ధర్మమార్గ సం
చారుల నృపతీప భుజసారుల శూరుల నర్థిలోక మం
దారుల వైరిదుర్మద విదారుల ధీరుల సత్కుమారులన్
— శ్రీరంగ 1-42

శ్రీరంగ 1-3 ఉత్పలమాల మరో ఉదాహరణం.

మ. శయనంబై యుపధానమై నిలయమై సచ్ఛత్రమై పాదుకా
ద్వయమై మంగళ పీఠమై మృదుల వస్త్రంబై సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్యసన్నిహిత మూర్తింబొల్చు శేషాహి న
క్షయ మేధానిధి గావ్యలక్షణ కళాచార్యుం బ్రశంసించెదన్
— శ్రీరంగ 1-2

చక్రని నడక (గతి) గల మరికొన్ని మత్తేభవిక్రీడితాలకు శ్రీరంగ 2-194, 4-240 మొదలైనవి ఉదాహరణలు కాగలవు.

శా. చంచద్వాహన కేకిపింఛ రుచులాశా మండలంబెల్ల జి
త్రించెన్ రోహణ శృంగరాజముల భాతిన్ రత్నకోటీరముల్
మించెన్ బాణ శరాది సాధనములో లింబూని దర్పంబునం
గ్రౌంచారాతియు బల్విడిన్ వెడలె సంగ్రామ క్రియాలోలతన్
— శ్రీరంగ 3-128

మరో శార్దూల విక్రీడితానికి ఉదాహరణ శ్రీరంగ 4-60

పద్యాలేగాక గద్యాలు సైతం చక్కని గతులు (నడకలు) ఉండేటట్లు రచించగల సమర్థుడు భైరవకవి లాక్షణికత అనే శీర్షికన పద్యగద్యాదుల సందర్భోచిత ప్రయోగాలనూ గురించి వివరించబడుతుంది. కనుక ఇక్కడ వాటిని వివరింపలేదు.

మొత్తంమీద భైరవుని కవితా సుందరి ప్రౌఢ నిర్భరవయః పరీపాక మదేభగమనగతిని తలపింపజేసేదిగా అలరాతుంది.

## 4. 1. 7. శయ్య :

ఎత్తుపల్లాలు లేక అనుకూలంగ ఉండే శయ్య (పడక) శరీరానికి (మనస్సుకుకూడ) సుఖనిద్రా పారవశ్యాన్ని కల్గిస్తుంది. శరీరం వంటి కావ్యానికి అందలి [కావ్యమందలి] పదాల కూర్పు పరస్పరానుగుణంగ ఉండటం శయ్య వంటిది. అంటే మనస్సుకు చెవులకు సుభావహమై తమలో అనుకు కొనె పదాల మైత్రినే "శయ్య" అనవచ్చు. "పొసగ ముత్తెపు సరుల్ పోహళించిన రీతి తమలోన దొరయు శబ్దముల కూర్పు" శయ్య. శయ్యా సౌభాగ్యం కలిగిన కవనంలో పదాలు ఒకదానినొకట విడిచి ఉండలేవు. అనగా ప్రయోగించిన ఏ పదాన్నైనా తొలగించి అదే అర్థంగల మరే ఇతర పదాన్ని చేర్చినా కూడ (శయ్యా) సౌందర్యం చెడిపోతుంది. పరపద అసహిష్ణుత శయ్య ఈ ముఖ్యలక్షణం. విశ్వనాథుడు శయ్యా లక్షణాన్ని ఇలా చెప్పాడు— "యా పదానాం పరా అన్యోన్య మైత్రీ శయ్యా" ఇందులో "పరామైత్రీ" అనే పదాలు గమనింపదగినవి. సుందరమైన తాత్పర్య స్ఫూర్తికోసం కవి సావధానంగా ఏర్చి కూర్చిన పదాల మార్పును సహింపకుండటం ఫలితార్థం. అలాంటి శయ్యలో పదాలను మార్చి వాటి పర్యాయ పదాలను చేర్చితే శయ్యా సౌందర్యానికి భంగం కలుగుతుంది. వర్ణ పద రచనాదులు పరంపరగ రసవ్యంజకాలను ధ్వనికార సిద్ధాంతాన్నిబట్టి కావ్య సామగ్రిలో శయ్యకు స్థానం ఏర్పడింది. ఇలా శయ్యా సౌష్ఠవ పరిపుష్టిగల పద్యాలు శ్రీరంగ మహత్త్వంలో చాలాఉన్నాయి. వాటిలో మచ్చుకు కొన్ని—

శా. ఆలోలామర చారుకోమల తరంగా హన్యమానోల్ల స
త్కూలా నోకహ పుంజ మంజు సుమనో గుచ్ఛావళీసుప్త మ
త్తాళివ్రాత గవేరజాత గని యందర్థిన్ గృతస్నానుడై
యాలోకించె ననంతరంబ ముని భావాసాంగమున్ రంగమున్
— శ్రీరంగ 4-60

కం. నీలమణి చంద్రశాలా
పాలిక లీలా విలోల బాలా లీలా
వాలా పాగాంలినట
త్కాలా భ్రాంతర తటిల్లతాగతి బొలుచున్ — శ్రీరంగ 4-261

శ్రీరంగ 1.141, 2-37, 5-71 మొదలైన పద్యాలు చక్కని శయ్యగల వాటికి మరికొన్ని ఉదాహరణలు.

## 4. 1. 8. అలంకారసరణులు :

అలంకారాలు కావ్య శోభా హేతువులు. పరంపరగా రసాన్ని అలంకరించేది అలంకారం. అనగా కావ్య జీవతమగు రసానికి ఉపస్కారమైనది అలంకారం. కవి కావ్యంలో అలంకారాలను సముచితంగా సమీక్షించి కూర్చుకుంటాడు. వేదవాఙ్మయం నుండికూడ అలంకార ప్రయోగాలు కన్పిస్తాలు. అలంకారాలు వేదవాఙ్మయంలో అగుపిస్తూ శాస్త్రపురాణేతిహాల్లో పరిణతి చెందుతూ లౌకిక కావ్య నాటకాలలో విస్తృతి దాల్చింది. శ్రీరంగమహత్త్వము కావ్యమే అయినా అందులోని ఇతివృత్తం గరుడోప పురాణం నుండి గ్రహింప బడింది. కనుక పురాణార్థ నిరూపణంలో సత్యాంశ ప్రతిపాదనంలో ప్రత్యేకాభినివేశం చూపించి, కావ్యంగ రచించబూనిన శ్రీరంగ మహత్త్వములో కావ్యశోభాహేతువులగు అలంకారాలను కొన్నింటిని భైరవకవి ప్రదర్శించాడు. అలాంటి వాటిని క్లుప్తముగా సమీక్షించవలసి ఉంది—

### ఉపమాలంకారం ;

"ఉపమాయత్ర సాదృశ్య లక్ష్మీరుల్ల సతిద్వయోః" అని ఉపమాలంకార లక్షణం *1 సూక్ష్మేక్షితో ప్రకృతిసౌంర్యాన్ని దర్శించిన కవి ఉపమాలం

1* చంద్రలోకమ్

కారాన్ని సమర్థవంతంగ నిర్వహిస్తాడు. భైరవకవి సందర్భోచితంగ సమర్థవంతంగ ప్రయోగించిన శ్రీరంగమహత్త్వములోని ఉపమాలంకారాలు రసజ్ఞులను అలరింపజేస్తాయి. అలాంటి వాటిలో మచ్చుకు—

ఉ. ఉన్నత రంగధామ లలితోభయ పార్శ్వములం బ్రసన్నయై
యన్నది యుబ్బిపారు గలితాయత కంకణ మౌక్తికద్యుతి
చ్ఛన్న మృదు ప్రవాహములు సాచి చిరాగతు బ్రాణనాయకుం
జెన్నుగ నిండు కౌగిటికి జేర్చి చెలంగు మృగాక్షి కైవడిన్
— శ్రీరంగ 1-103

రెండుపాయలుగ రంగధామానికి రెండువైపులా పారే కావేరీనదీ వర్ణనం పై పద్యంలో ఉపమాలంకార శోభితంగ ఉంది. నది రెండు పాయలను రెండు బాహువులుగ, పాయల నడుమగల రంగధామాన్ని ప్రాణేశ్వరునిగా నిండు కౌగిట జేర్చిన మృగాక్షివలె కావేరీనది ఉందని పై పద్యంలో కవి చెప్పాడు. ఇది భైరవకవి ప్రకృతి సౌందర్య పరిశీలనకు చక్కటి నిదర్శనం. సందర్భోచితంగ ఈ ఉపమాలంకారం ప్రయోగింపబడింది. భైరవకవి రసవత్కవితాత్మకు ఈ అలంకార వర్ణనం ఒక మచ్చుతునుక. శ్రీరంగ మహత్త్వములో ఇంకా చాలా ఉన్నాయి. విస్తరభీతివల్ల వాటినన్నింటినీ వివరించేందుకు వీలు కాదు. ఉపమాలంకారాలకు కొన్ని ఉదాహరణలు : శ్రీరంగ 3-106, 5-170 1-53, 1-59, 1-63, 1-46 (వచనంలో కొంత), 3-28, 3-55. 3-122, 3-246, 4-43, 4-99, 4-136, 4-150, 4-223 (వచనంలో కొంత), 5-68, చివరిగా మాలోపమాలంకారానికి మచ్చుకొకటి—

కం. శశిమరు దశన దివాకరి
దశన శరచ్ఛరద శారదా శరధరధా
ట్పృథుపతి విశద యశోనిధి
దశరథుడుదయించె నమితద మనోరథుడై — శ్రీరంగ 2-214

పై పద్యంలో దశరథుని కీర్తి శశి-మరుదశనాద్యనేకాల మాలతో పోల్చుటంచే ఇది మాలో పమాలంకారం.

## త్ప్రేక్షాలంకారం :

" సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతు ఫలాత్మనా
ఉక్తానుక్తాస్పదా ద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే" — చంద్రాలోకమ్
అని ఉత్ప్రేక్ష లక్షణం.

సుబోధుడు సత్యుడు కావేరీనదిని చూచిన సందర్భాన ఉండే ఈ క్రింది
ం గమనించాలి—

కం. కని తదవేక్షణ లోలత
ననిమిషత వహించి యద్భుతానందంబుల్
మనమున బిరిగొన బులకిత
తనులై ప్రణమిల్లి భక్తి తాత్పర్యములన్ — శ్రీరంగ 1-141

పై పద్యంలోని విషయం సుబోధుడు సత్యుడు కావేరీ నదిని అవేక్షణ
తతో చూడటం. ఇక్కడ విషయ తాదాత్మ్యతను విషయి సూచిస్తూంది.
క ఇది ఉత్ప్రేక్ష. ఈ అలంకారానికి శ్రీరంగ మహత్త్వములో మరికొన్ని
హరణలు 2-73, 3-228, 4-96 మొదలైనవి.

## భావోక్త్యలంకారం :

"స్వభావోక్తి స్వభావస్య జాత్యాది స్థస్య వర్ణనమ్" అని ఈ అలంకార
ణం (చంద్రాలోకమ్).

సంయమీశ్వరుల స్వభావాల్ని (స్వధర్మాలను) వర్ణించిన ఈ క్రింది
ం ఈ అలంకారానికి ఒక చక్కని ఉదాహరణ—

సీ. పల్లవారుణ జటాభారులా రచిత త్రి
పుండ్రాభిరాములు భూతిలిప్త
సర్వాంగులుజ్జ్వల స్ఫటికాక్ష సూత్రులు
రుద్రాక్షభూషణ రుచిరులమర
ఋణ్యతీర్థోదక పూర్ణకమండలు
లజినోత్తరీయు లత్యంత మృదుల
పరిధౌత వల్కల పరిధాను లభినవ
దండపాణులు దీప్త దహన తేజు

తే. లలఘు దివ్య తపశ్శక్తి కలితులఖిల
వేదవిద్యా రహస్య సంవేదుల సమ
సవనకర్తలు సంయమీశ్వరులు వచ్చి
రెలమి శిష్యప్రశిష్య సమేతులగుచు — శ్రీరంగ 1-77

ఈ ఆలంకారానికి మరికొన్ని ఉదాహరణలు శ్రీరంగ 2-213, 3-3, 3-156, 4-130, 4-142, 5-233 మొదలైనవి.

## అర్థాంతరన్యాసాలంకారం :

"ఉక్తిరర్థాంతర న్యాసస్స్యాత్సా మాన్య విశేషయోః ... గుణవద్వస్తు సంపర్గాద్యాతి స్వల్పోపి గౌరవమ్" అని ఈ అలంకారానికి లక్షణం. *1

మచ్చుకొక ఉదాహరణ—

తే.గీ. అట్లు పుంఖాను పుంఖంబు లగుచు నిగుడు
నతనుబాణ పరంపర లాన్నృలుఃపా
నిచ్చ దెరలింప జాలక విచ్చిపోయె
జగతి బువ్వుల కదియ నైజంబుకాదె — శ్రీరంగ 2-82

## శ్లేషాలంకారం :

"నానార్థ సంశ్రయః శ్లేషో వర్ణ్యా వర్ణ్యోభయాశ్రితః" అని ఈ అలంకారానికి లక్షణం. *2

బృందారక సుందరీ బృందం ఇక్ష్వాకుని తపోభంగం చేయలేక తాము పడినపాట్లు ఈ క్రింది పద్యంలో శ్లేషాలంకార శోభితంగా చెప్పబడినవి.

ఉ. మేనక విస్నసై నిలిచె. మెల్లన మోమువవాంచె రంభ, లో
నూనిస వింత నివ్వెరగునొందె దిలోత్తమ, గర్వహీనయై
దినత నొందె నూర్వసి, మదిం జలియించె ఘృతాచి, యన్యకాం
తా నిచయంబులెల్ల దవుదవ్వుల నుండె భయంబు పెంపునన్
— శ్రీరంగ 2-77

---

*1 చంద్రాలోకమ్
*2 పైదే

మేనక అనేది అప్సరోభామిని పేరేగాక హిమవన్నగానికి భార్య అయిన పర్వతానికి కూడ పేరు. విన్నసై నిలువటం వైవర్ణ్యంగ (తెల్లబారి) నిలువటం మేనక అనే పర్వతానికి సహజ లక్షణం. రంభ శబ్దం కదళీ వృక్షవాచకం కూడ. అరటిచెట్టు (మోము) కొనకొమ్మలు నిటారుగా ఉండక కిందికి వాలినట్లుగా (మోమరవాంచె అన్నట్లుగా) ఉంటాయి. తిలోత్తమ లోనూనిన వింత నివ్వెరగు నొందిందట. ఇక్కడ కవి తైలవాచక శబ్దార్థాన్ని "నూనెను" ప్రయోగించాడు. ఊర్వశి శబ్దానికి మిక్కిలి ప్రకాశించేది అనికూడ అర్థం. (ఉరు-అధికం., వష్టి-ప్రకాశత., ఇతి ఉర్వశీ-గురుబాల ప్రబోధిక) తేజస్వినులం అని మిడిసిపడేవారు పరులముందు పరాభవం పాలైనపుడు గర్వహీనులై దీనత నొందటం సహజమే. ఘృతాచి-జలవాచకం చలిచటం ఘృతలక్షణం. ఇలా అప్సరః స్త్రీల అర్థంలోనేగాక మరో అప్రకృతార్థాన్ని కూడ ఇస్తుంది పైపద్యం. ఇది ప్రకృతాప్రకృత శ్లేష ఇది విశేషోక్త్యలంకారానికి కూడా ఉదాహరణ మౌతుంది.

కం. సరివారిలోన భంగము
పాటసిన సుడిసై గలంక పాడమిన గెలనం
బరులుండిన దనజీవన
మొరులకు లోతీక మెలగుటుచితము కాదే! — శ్రీరంగ 2-17)

సరివారిలోన = తోటివారిలోన! సరి నీటిలోన., భంగము = అవమానం, అల., సుడిసై = సుడిసై, జలావర్తమై., తనజీవనము = తన బ్రతుకు, తన నీరు., ఒరులకు లోతీక = ఇతరులకు గుట్టు తెలుపక, ఇతరులకు లోతును ఇవ్వక ఇలా పై పద్యంలో శ్లేష కూర్చబడింది.

విప్రపర్ణనంలో దశావతారాలు, జలకేళీవర్ణనంలో దశావతారాలు శ్లేషగా శ్రీరంగ 4-270, 4-94 పద్యాల్లో కూర్చబడినవి.

## అపహ్నుత్యలంకారం :

"శుద్ధాపహ్నుతిరన్యస్యారోపార్థో ధర్మ నిహ్నవః" అని ఈ అలంకార లక్షణం. *1 ఇతర ధర్మాన్ని వర్ణనీయవస్తువునందు నిలుపటానికి అవస్తువు ధర్మాన్ని దానిలో లేదని చెప్పటం. ఉదా:-

*1 చంద్రాలోకమ్

కం. నీడలు మణిముకురంబుల
జూడరు పట్టణములోని సుగుణులు సురత
క్రీడా సంభ్రమ గళిత
వ్రీడాబ్జ ముఖీకపోల వీథుల దక్కన్ — శ్రీరంగ 4-262

పై పద్యంలో వర్ణనీయ వస్తువు కపోలం. మణిముకురాల ధర్మం వాటియందుగాక కపోలాలలో నిలుపబడింది. కనుక ఇది శుద్ధాపహ్నుతి.

## తద్గుణాలంకారం :

"తద్గుణస్య గుణత్యాగా దన్యదీయ గుణగ్రహః" స్వగుణాలను విడిచి అన్యగుణాలను గ్రహించటం తద్గుణమౌతుంది.

ఒక యువతి బంతి ఆట ఆడుతూంటుంది. ఆ ఇంతి కర-నఖ-దృష్టి కాంతులవల్ల బంతి ఆ మూడింటిగుణాన్ని పొందుతుంది. తద్గుణాలంకార శోభితమైన ఈ భావం ఈ క్రింది పద్యంలో రమణీయంగ చిత్రితమైంది.

కం. కరతల రుచి నరుణంబై
ధర దన నఖ కాంతిచే సితంబై దృష్టి
స్ఫురణనిడ నసిత తరమై
కరమొప్పెను బంతి మూటిగతి నొక్కటియున్ — శ్రీరంగ 2-71

## భ్రాంతిమదలంకారం :

ఒకవస్తువును (భ్రమ) భ్రాంతిచేత వేరొక వస్తువుగ భావిస్తే భ్రాంతిమదలంకార మౌతుంది.

ఈ అలంకారానికి ఈ క్రింది పద్యం చక్కని ఉదాహరణం—

మ. పురి శృంగార వనంబులన్ మెరయుచుం బూర్ణేందు బింబాననల్
విరులం గొప్పలు దీర్పవేణి యెలమిన్ వేడ్కన్వెసం గప్పు బం
ధుర నీల ప్రబలాంధకారము క్రియం దోపం భ్రమం జక్కవల్
విరహార్తిం దురపిల్లు బట్ట పగలున్ లీలాసరశ్శ్రేణులన్
— శ్రీరంగ 4-263

## ఉదాత్తాలంకారం :

"ఉదాత్త మృద్ధిశ్చరితం శ్లాఘ్యం చాన్యోప లక్షణం" సమృద్ధిని వర్ణించినను వర్ణ్యానికి మహాపురుష శ్లాఘ్య చరితం అంగముగ (ఉపలక్షణంగ) వర్ణించినను ఉదాత్తాలంకార మౌతుందని లక్షణం. ఈ అలంకారానికి ఉదాహరణలు—

శా. సేవించెన్ జగదేకబంధు గరుణాసింధున్ సమున్నిద్ర రా
జీవాక్షుం గమలా ఘనస్తన యుగ శ్రీఖండ సంవాసిత
శ్రీవత్సాంకిత వక్షు నీలమణి సుస్నిగ్ధాంగు రంగేశ్వరున్
భావాతీతు మహానుభావు ఫణిరాట్పర్యంక సంశోభితున్
— — శ్రీరంగ 5-162

మ. ధరణీనాథుడు గాంచె దప్తకనకోద్యత్పక్షు శుంభద్దివా
కరబింబ స్ఫురితాస్యు దీవ్రనఖ సంఘాతున్ బృహద్వక్షుభా
సురనాత్మ ప్రమద ప్రభూతు విహగ స్తోమావృతున్ నిమ్నగాం
తర చంచత్పులినాసనస్థుని శకుంత శ్రేష్ఠు దానొక్కరున్
| శ్రీరంగ 5-164

## పర్యాయోక్త్యలంకారం :

"పర్యాయోక్తంతు గమ్యస్య వచోభంగ్యంతరాశ్రయమ్" అని లక్షణం. ప్రకారాంతంవల్ల (మరోవిధంవల్ల) గమ్యార్థసిద్ధి అయితే పర్యాయోక్తి ఔతుంది.

ఈ క్రింది రెండు పద్యాలున్నూ ఈఅలంకారానికి ఉదాహరణలు—

సీ. తాతలతాత, నెత్తమ్మి నెయ్యపుబట్టి,
వేలుపు పెద్ద, వావెలది మగుడు,
తపసుల మొనగాడు, తపముల జెట్టికా,
డెల్లవిద్యల నెర నెరుగుబాణి
ముక్కంటి సారథి. ముల్లోకముల జేత,
నంటక చేయు విన్ననుపు కాడు,
పంచాళి రాయించ బరపి యాడెడు రౌతు,
కైలాటకపు మునిగన్న తండ్రి,

గీ. జగతి నేరికి దన ప్రాలు మిగులరాని
బిరుదు లేకరి, నేర్పుల బరగు ప్రోడ
నాల్గు మొగముల దేవు, డున్నతి దలిర్ప
నచటి కేతెంచుటయు విసయమున మ్రొక్కి — శ్రీరంగ 3-42

సీ. తొవలనాకట్టు, చందురు తోడిపెన్నుద్ధి,
తమ్ముల విందు, వేదముల ప్రోవు,
వెన్నెల పులుగుల వెరగొంగ, జక్కవ
కవల మోహపుమందు, కైటబారి
కుడికన్ను, పచ్చని గుర్రాల ధీరుండు,
మూడు మూర్తులగట్టి, వేడివేల్పు
కైవల్యముకు ద్రోవ, గ్రహముల మొగదంబు,
మునుమిడి చీకటి మూకవిప్పు,

జనుల మొక్కుజంట తేజముల నెలవు,
వరుస పండ్రెండు నామముల్ పరగుమేటి
గగన రత్నంబు, త్రిభువన కర్మసాక్షి,
భానుడేతెంచె దేదీప్యమానుడగుచు — శ్రీరంగ 5-201

## ముద్రాలంకారం :

"సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థ పరైః పదైః *1 ప్రస్తుతార్థాన్ని ఇచ్చే పదాలచేత సూచ్యార్థ సూచనమైతే ముద్రాలంకారమౌతుంది.

ఉదా :—

కం. లలిత మధు సమయ సముదిత
మలయానిల చలిత మధుర మాకంద సము
జ్వల కుసుమ విసర సౌరభ
కలిత వచస్స్ఫురణ వెలయగా నిట్లనియెన్ — శ్రీరంగ 1-23

కం. మా కందము కడునిది ర
మ్మా! కందము డాయబోయి మంజీరులకున్
మా కందగ వెరగ విసిన
మా కందము మగువ మధుర మా కంద మీలన్ —శ్రీరంగ 4-78

పై రెండు పద్యాల్లో సూచ్యార్థం కంద పద్యమని. కందమనే పదం ప్రస్తుతార్థాన్ని బోధిస్తూ పద్యమనే సూచ్యార్థాన్ని సూచిస్తుంది. కనుక పై పద్యాలు ముద్రాలంకార శోభితాలు. శ్రీరంగ 2-66 చంపకమాలకూడ ముద్రా లంకారానికి ఒక ఉదాహరణ.

## శబ్దాలంకారాలు :

ఈ అలంకారాలలో అంత్యప్రాస, లాటానుప్రాస, ముక్తపదగ్రస్తం, యమకం మొదలైన భేదాలు అగుపిస్తాయి.

అంత్యప్రాస : నన్నయాది తెలుగు కవులందరుకూడ కావ్యాల్లో ఆశ్వాసాంత పదాల్ని అంత్య ప్రాసాలంకారంగ రచించటం పరిపాటి అయింది. భైరవకవి కూడ శ్రీరంగ మహత్త్వములో ఆ మార్గాన్నే అనుసరించాడు.

ఉదా॥మాలిని॥ నమదవన విలోలా! నవ్యశృంగార జాలా!
ప్రమదకర విలాసా! భాగ్యలక్ష్మీ నివాసా!
శమదమ యుతభవ్యా! చారువిద్వాన్నిషేవ్యా
సమద రిపు విరామా! చాగమామాత్య రామా
— శ్రీరంగ 1-222 (ప్రథమాశ్వాసాంతం)

ఆశ్వాసాల చివర్లో ఉండే శ్రీరంగ 2 226, 3-305, 4-286, 5-266 మాలినీ వృత్తాలుకూడ అంత్య ప్రాసాలంకారాలకు ఉదాహరణలు. అలాగే ఆశ్వాసల మొదట్లో ఉండే ఈ క్రింది పద్యపాదాలుకూడ అంత్యప్రాసయుతాలు-

కం......కీర్తి, వ్యాపిత దిక్సీమ! చాగయ ప్రభురామా!— శ్రీరంగ 2-1
కం......చామీకర రుచిరధామ! చాగయరామా!— శ్రీరంగ 3-1
కం . ...చారు గుణాకర సుధామ! చాగయరామా!— శ్రీరంగ 4-1
కం......సుమహితమతివి, స్తారోరగసార్వభౌమ! చాగయరామా!—
శ్రీరంగ 5-1

(కృతభర్త) స్తుత్యాత్మకంగా ఉండే పై పద్యాలకు అంత్య ప్రాసాలంకారం మరింత శోభను శ్రవణ సుభగత్వాన్ని కల్పించింది.

శ్రీరంగ మహత్త్వములోని కావేరీనదీ వర్ణనం (1-40), నిదాఘ వర్ణనం (2-20), వర్షకాల వర్ణనం (2-26), వసంత వర్ణనం (2-37), మలయానిల వర్ణనం (4-85), విష్వక్సేన వర్ణనం (4-221), కదంబ వర్ణనం (5-10) మొదలైన పద్యాలు అంత్య్రప్రాస అనుప్రాసాలంకార శోభితాలు.

లాటానుప్రాస : ఎక్కడైతే ఒక తాత్పర్య విశేషం అగుపిస్తూ శబ్దార్థాలు పునరుక్తాలలవుతాయో అది లాటానుప్రాస" (అనన్వయాలంకారంలో అర్థావృత్తి ప్రధానం, కాగా శబ్దావృత్తి అప్రధానం. లాటానుప్రాసలో శబ్ద అర్థ ఉభయ పౌనరుక్త్యం తప్పనిసరి.)

కర్ణసుఖావహంగ సముచిత సరణిలో చెప్పిన ఈ క్రింది పద్యాలు లాటానుప్రాసకు ఉదాహరణలు—

సీ. హరిదివ్య నామధేయామృతం బింపార
జెలగి యాస్వాదించు జిహ్వ జిహ్వ
గోవింద కల్యాణ గుణ విశేషంబులు
పలుమారు దలపోయు తలపు తలపు
కమలాక్షు నిత్య మంగళ మూర్తి విభవంబు
సొంపార వీక్షించు చూపు చూపు
ఫణిరాజతల్పు శ్రీపాద పద్మంబులు
చేరి యర్చనసేయు సేత సేత

తే. వాసుదేవ ప్రియంబైన వ్రతము వ్రతము
దైత్యభేది నుపాసించు తపము తపము
శౌరి నారాధనము సేయు జపము జపము
విష్ణుపద భక్తి సమకొల్పు వినికి వినికి — శ్రీరంగ 1–91

ముక్తపదగ్రస్తం : ఈ క్రింది పద్యం ముక్తపదగ్రస్తానికి (ముద్రాలంకారానికి కూడ) ఉదాహరణ—

చం. తలపులనిక్క నిక్కపు ముదమ్ముల దమ్ముల సంచరించుని
య్యలులకు లోగి లోగినుక నందెద నందెద వేల "చంపకా"

వలి వలినున్న మొగ్గల నివారణ వారణ యాన కోయుమీం
పలరగ దానదేటి రసమానదు మానదు లేతపూవులన్
— శ్రీరంగ 2-66

యమకం : స్వరసహితాలైన వ్యంజనాలకు ఆ వృత్తి కలుగటమే యమకం. యమకాలకు ఉదాహరణ శ్రీరంగ మహత్త్వములో చతుర్థాశ్వాసాన 77 నుండి 83 వరకు గల 7 కందపద్యాలు. ఇవేగాక ఇంకా కొన్ని ఉన్నాయి. విస్తరభీతివల్ల ఆ పద్యాలన్నీ ఇక్కడ ఉటంకింపలేదు.

భైరవకవి అర్థాలంకారాలు శబ్దాలంకారాలు శ్రీరంగ మహత్త్వములో సార్థకంగా సందర్భోచితంగా ప్రయోగించాడు. నిరర్థకంగా వీటిని వాడినితావు కనిపించదు. ఈ కవి సార్థకమైన అలంకార సరణులు మనోహరాలు.

## 41.9. రీతులు :

"ఓజస్సు ప్రసాదము మున్నగు గుణములు గల పదముల కూర్పు రీతి యనబడును" *1 అనగా విశిష్టపద రచన రీతి. వైదర్భి, గౌడీ, పాంచాలీ అనే మూడు సుప్రసిద్ధమైన రీతులు. *2

వైదర్భీరీతి : దుస్సంధి, క్లిష్టసంధులు, పరుష వర్ణాలు, సుదీర్ఘ సమాసాలు లేని పదరచన వైదర్భి, మచ్చుకు—

ఉ. గందపు గొండ నెత్తముల కందువ నేలకి తీవ యిండ్లలో
గెందలిరాకు పాన్పున సుఖించి నితాంత రతి శ్రమంబులన్
జెందిన చెంచు గుబ్బెతల చెక్కుల జిమ్ము జవాది వాసనన్
విందులు సేయుచున్ మెలగె వేమరుగోమల గంధ వాహముల్
— శ్రీరంగ 2-50

*1 ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము – పుట 105

*2 రుద్రటుడు "లాటియా", భోజుడు "మాగధీ" "అవంతికా" రీతులను చేర్చి మొత్తం ఆరు రీతులు పేర్కొన్నారు. శారదా తనయుడు భావ ప్రకాశమున పురుషులనుబట్టి 105 రీతులున్నాయనీ అందులో 4 అంగీ కార్యాలని పేర్కొన్నాడు.

పై పద్యంలో కర్ణపరుషాలైన వర్ణాలు దీర్ఘసమాసాలు దుస్సంధి క్లిష్ట సంధులు లేవు. కనుక ఇది వైదర్భీరీతి.

గౌడీరీతి : ప్రౌఢపదాలు దీర్ఘసమాసాలు ఉండే రచనను గౌడీరీతి అంటారు. మచ్చుకు—

శా. క్షుత్తృష్ణాధిక వేగతా పరిగతా సుప్రాణ శల్యావళీ
భిత్తాకీర్ణ మహార్ణవాంతిక మహీభృత్కందరారణ్య శు
ష్యత్తోయాశయ తీర చైత్యమరు దేవాగార రథ్యాదులన్
నృత్తంబాడుచు మృత్యుదేవత సమున్మేషించె హేలాగతిన్
— శ్రీరంగ 3-130

కం. దక్షాగ్రహ జాత మహో
గ్రక్షయమున కక్షయంబు గావింపంగా
దక్షులొరు లేరియిట నలి
నేక్షణ! నీవొకటు దక్క నీవిశ్వమునన్ — శ్రీరంగ 3-152

మ. పటుధాటీ ముఖ జృంభమాణ కలహప్రౌఢార్వ సంఘార్వ వి
స్ఫుట టింఖాపుట కోటి ఘట్టన పరిక్షుణ్ణక్షమోద్య ద్విశం
కట ధూళీ పటల ప్రతోషిత మహాకర్ణాట సేనాసము
ద్భట పాథోనిధి విత్థలేంద్రు బురణింపన్ మంత్రు లేరీధరన్
— శ్రీరంగ 1-50

పాంచాలీరీతి : వైదర్భి గౌడీ రీతుల కలయికవల్ల ఏర్పడేది పాంచాలీ రీతి. శ్రీరంగ మహత్త్వములో పాంచాలీరీతి అధికంగా చోటు చేసుకుంది. మచ్చుకు కొన్ని పద్యాలు—

మ. సహజజ్ఞాన యుతంబులై సరసభాషల్ ప్రీతి జేతస్సు భా
వహముల్ గా దగ బల్కుచున్ మెలగు సత్యస్ఫూర్తి నెందేని న
య్యహి మార్జాల వృష ప్లవంగ నకుల వ్యాళిశ్వ విద్విట్కురం
గ హరి వ్యాఘ్రు మదేభ శల్య రురు ఖడ్గక్రోడ భేరుండముల్
— శ్రీరంగ 1-112

కం. అకుటిల మానస సుజన
ప్రకటిత సౌజన్య జన్య పాటిత విమత
ప్రకర మముఁగూర్చి యిచ్చట
నొక కొన్ని దినంబు లెలిమి నుండగ వలయున్—శ్రీరంగ 2-156

ఉ. అనును గాలిసోకున బ్రియం బెసగంబులు కొంకురావళుల్
మేనుల నుల్లసిల్లు మధుమేదుర వంజుల మంజరీచర
న్మానిత చంచరీక లలనా కలనాద నవీన గానముల్
వీనులవిందు సేయ నరవింద నివాసినియున్ ముకుందుడున్
— శ్రీరంగ 4-80

మ. మును బృందావన వీధి గోపవనితల్ మోదంబు సంధిల్లగా
వెనువెంటం జనుదేర గేలిగతులన్ వేడ్కన్వినోదించు కృ
ష్ణుని చందంబున దద్వనాంతర సరస్తోమాభి రామాబ్జ సం
జనితామోద సుగంధ గంధవహ సంచారానుషక్తాత్ముడై
— శ్రీరంగ 4-178

పై ఉదాహరణల్లో కొంతవరకు విడివిడి పదాలు మరికొంత సమాస ఘటితపదాలు కలిగి వైదర్భీ గౌడరీతులకు ఒక్కచోట సాహచర్యం కల్గి నట్లయింది. కనుక ఇది పాంచాలి.

## 4. 1. 10. పాకాలు :

అర్థగాంభీర్యం "పాకం" అని ప్రతాపరుద్రీయకారుడు పలికాడు. వృత్తి రీతి, గుణాల కలయికవల్ల కలిగే ఆస్వాద్యం పాకం. ద్రాక్షానారికేళాలు ప్రధానంగ ప్రచారంలో ఉండే పాకాలు. కదళీ పాకం కూడ పరిగణనీయమైనదే.

వృత్తి, రీతి, గుణ పాకాలు అన్యోన్య ఆశ్రయాలు. కనుక వీటికి ఉదాహరణలు ఆయా ఉపశీర్షికల్లో ఇవ్వటంచే మళ్లీ ఇక్కడ ఆ పద్యాలు ఉదాహరించటలేదు.

1. కైశికివృత్తి, వైదర్భీరీతి, మాధుర్యగుణం—వీటికి ఉదాహరింపబడిన పద్యాలు ద్రాక్షాపాకానికి కూడ ఉదాహరణలు.

2. ఆరభటి, గౌడి, ఓజస్సు—వీటికి ఉదాహరింపబడిన పద్యాలు నార
కేళపాకాలు.

3. సాత్త్వతి, పాంచాలి, ప్రసాదం—వీటికి ఉదాహరించిన పద్యాలు
కదళీ పాకానికి ఉదాహరణలవుతాయి.

## 4. 1. 11. దశప్రాణాలు :

"దశప్రాణంబుల సప్రాణంబై యుండవలయును కావ్యము. *1

కం. క్రమమున నౌదార్య శ్లే
షములును సుకుమారతా ప్రసాద మధురతా
సమతార్థ వ్యక్త్యోజ
స్సమాధి కాంతులును దగు దశప్రాణములై

— కావ్యాలంకారచూడామణి 4-79

ఉదారత, శ్లేషం, సుకుమారత, ప్రసాదం, మాధుర్యం, సమత, అర్థ
వ్యక్తి, ఓజస్సు, సమాధి, కాంతి – ఇవి దశప్రాణాలు.

ఉదారత : 'వికటాక్షరముల బంధము' *2

ఉదా:సీ. ఏయేటి నడుదిన్నె నేప్రొద్దు జలిగొన్న
సికతా తలంబుల జెలగి జెలగి
ఏతరంగిణి నించు కించుక వికసించు
క్రొత్తమ్మి తావుల గొసరి కొసరి
ఏనదీ క్రీడల నెసగు రాయంచల
కలకలంబుల కాత్మనలరి యలరి
ఏసరిత్తటమున నేచిన కల్పక
మేదురచ్ఛాయల మెచ్చి మెచ్చి

---

*1 కుమార సంభవము—ఉపోద్ఘాతము (పుట 30) ఉపోద్ఘాతకర్త: కోరాడ
మహాదేవశాస్త్రి. 1987

*2 ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము.

గీ. నేడు నొకనాడు బాయకున్నాడు శౌరి
యత మనోహరి ని|శ్రేయసాను కారి
వివిధ తాపనివారి భూవినుతవారి
కలిత కావేరి భవకరి కలభవైరి — శ్రీరంగ 1-101

"పద్యపాదములొక విధమైన ఒయ్యారపు తూగుతో వెలయునట్లుకూర్పు గలిగి యుండుటయే వికటాక్షర బంధత్వము. అదియే బంధ గతమైన ఉదారత" *1 పై పద్యంలో ఒక విధమైన ఒయ్యారపుతూగు కూర్పుబడింది.

శ్లేషం, "పెక్కుపదము లొండింటితో గలిసి మెలిసి యొకపదము వలె భాసిల్లుట" *2

ఉదా:- మహా|స్రగ్ధర—

బహుభాస్వద్భా సమాన ప్రభలు నభము నంబర్వ వార్వాహగర్వా
సహ నీలాంగ ద్యుతుల్ భూషణ మణితతిమించన్ లసద్వైజయంతీ
సహితోరః కౌస్తుభాంశుల్ జడిగొన గనకాచ్ఛాదనంబొప్ప శౌర్యా
వహ చంచద్దోస్సహస్రావలి మెరయ బలిధ్వంసి ప్రత్యక్షమయ్యెన్
— శ్రీరంగ 1-169

పై పద్యాన్ని చదివేటప్పుడు సంధివశాన పదాలు ఒకదానితో ఒకటికలిసి ఒకే పదంవలె భాసించటంవల్ల ఇది శ్లేషం.

సుకుమారత : "కోమల పదములును సానుస్వారములునగు అక్షరముల పదముల కూర్పు" *3 మచ్చుకు—

కం. ఇందిర కుంతముల తుద
లం దొరగెడి జలకణంబు లమరెం భ్రమరీ
బృందమతిపాన వశమున
గ్రందుగ మకరంద రసము గ్రక్కెడు మాడ్కిన్ —శ్రీరంగ 4-99

ఇందిర శిరోజ సౌకుమార్యం అనుస్వార సహితమైన కోమల వర్ణాలుగల పదాలచేత పై పద్యం వర్ణింపడింది.

1, 2, 3. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము.

ప్రసాదం : ఇది "గుణాలు" అనే ఉపశీర్షికలో చెప్పబడును కనుక ఇక్కడ దీనిని గురించి వ్రాయలేదు.

మాధుర్యం : ఇదికూడ "గుణాలు" అనే ఉపశీర్షికలో చెప్పబడును కనుక దీనిని గురించి ఇక్కడ వ్రాయలేదు.

సమత : పాదాలు అన్నింటిలోకూడా వైషమ్యం లేకుండటం సమత*1

ఉదా:మ. సతతానేక మునీంద్ర బృందకృత పూజా వందనం – జందనా
గత మందానిల కందలీకృత తరంగ స్పందనం – ధీరసం
గత మాకంద మరంద బిందు సహితార్క స్యందనం – గాంచిర
య్యతు లింపొంద గవేర నందనా ద్రిలోకానంద – నానందనన్
— శ్రీరంగ 1-40

రమ్యార్థ సంపన్న పదాలు వైషమ్యంగ కూర్పబడ్డాయి కనుక పైపద్యం సమతకు ఉదాహరణమైంది.

అర్థవ్యక్తి: "నిరాకాంక్షమై సంపూర్ణార్థమునిచ్చు వాక్యము" *2

ఉదా:శా. శ్రీవిభ్రాజితు, డుల్ల సద్గుణ మణిశ్రేణీ సుధాంభోధి, వి
ద్యావాణీపతి, యన్యరాజ సచివోద్యద్ధ్వాంత వంశాటవీ
దావజ్వాలి, ముకుంద పాదకమల ద్వంద్వార్చనోత్సాహి, యా
గోవింద ప్రభుడొప్పు బంధుజనచక్షుః పూర్ణిమా చంద్రుడై
— శ్రీరంగ 1-37

ఓజస్సు : ఇది "రీతులు" అనే ఉపశీర్షికలో చెప్పబడింది (పుట 183)

సమాధి : ఒక వస్తువునందలి ధర్మములను వేరొక వస్తువునందారోపించుట*3

ఉదా- కం. నీడలు మణి ముకురంబుల
జాడదరు పటణములోని సుగుణులు సురత
క్రీడా సంభ్రమ గళిత
వ్రీడాబ్జ ముఖీ కపోల వీథుల దక్కన్ — శ్రీరంగ 4-462

కాంతి : "ఉజ్జ్వలమగు బంధము కలిగియుండు వాక్యము" *4

1, 2 3 4 ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము.

ఉదా: కం. కలుగు ధన మఖిల దిశలను
వెలుగు యశం బతిశయించు విద్యలు ప్రీతిన్
జెలగు సుధీతతి యెడనెడ
దలగు శివేతర చయంబు దగుకృతి జెప్పన్ — శ్రీరంగ 1-12

## 4. 1. 12. వృత్తులు :

రసానుగుణమైన అర్థాలతో కూడిన పదసముదాయం వృత్తి. మనస్సుకు వికాస సంకోచాలు కలిగించేది కనుక ఇది వృత్తి అనబడింది. ప్రకాశవర్షుడు వృత్తిని ఇలా నిర్వచించాడు—

రసోచితార్థ సంబద్ధ పద సంతాన శాలినీ
మనోవికాస సంకోచ వర్తనాత్ వృత్తిరుచ్యతే॥
— రసార్ణవాలంకారమ్ III-24.

వృత్తులు రసోపస్కారాలు. అయారసవ్యంజకాలుగ నియతమైన వర్ణాలతో కూడిన వాక్కుల వ్యాపారం వృత్తి. వృత్తులవల్ల అనుభవం అందుబాటుకు వస్తుంది. కైశికి, ఆరభటి, స్వాతతి, భారతి అని వృత్తులు నాలుగు రకాలు. అవి నాట్యాంశయాలు. ఈవృత్తులు రీతులకు అంగభూతాలు. కనుక వైదర్భి, గౌడీ, పాంచాలీ రీతుల ఉదాహరణాలే కైశికి, ఆరభటి, స్వాతతీ, వృత్తులకు లక్ష్యాలుగ గ్రహింపవచ్చు. కొందఱులాక్షణికులుభారతినిపేర్కొలేదు.

కైశికి, రుచిరమైన వస్త్రాద్యలంకార భూషితం, స్త్రీ పాత్రయుతం కామోపభోకజన్యం. బహువిధవృత్త గీత సహితం అయిభాసించేది కైశికి.

ఉ. అప్పుడు పుష్పబాణు రుచిరాకృతి దప్పక చూచి చిత్తముల్
ద్రిప్పగలేక కోర్కితరి తీపుల ప్రేమలెలర్ప మానముల్
దప్పి చలించి ఘర్మ సలిలంబెసగం బులకించి నివ్వెరల్
గప్పి విచిత్ర రూపముల కైవడి నిల్చి రమర్త్యభామినుల్
— శ్రీరంగ 2-54

(వైదర్భీరీతికి ఇచ్చిన ఉదాహరణం కైశికి వృత్తికికూడా లక్ష్యంగా అవుతుంది.) పై పద్యంలో రుచిరాకృతిగల మన్మథుణ్ణి సురలోక సుందరులు పులకితులై "కోర్కితరి తీపుల ప్రేమలెలర్ప జూచిరి" అనే అత్యంత సుకుమారమైన అర్థ సంగతిని శృంగార రసం నిబద్ధింపబడటంచే ఇది కైశికి.

ఆరభటి : రౌద్ర భీభత్స రసాలు పెళుసుగ వర్ణింపబడితే ఆరభటి అవుతుంది. ఉదా—

చం. కని కడునల్గి బిట్టవరి కన్నుల దిట్టవు కెంపుబర్వ ద
ర్జనములు గర్జనంబులు విశంకట భంగి జెలంగ దాకి క
న్కని బరిఘాసి చక్ర శరఖడ్గ గదా ముసలాది ఘోర సా
ధనముల బిట్టునొంప గడు దల్లడ మందుచు బారి రందరున్
— శ్రీరంగ 3–224

గౌడీరితికి ఇచ్చిన ఉదాహరణలు ఆరభటి వృత్తికి కూడా సరిపోతాయి.

సాత్వతి : "ఈష ప్రౌఢములైన వీరభయానకరసములను ఈష ప్రౌఢ సందర్భమున వచించిన సాత్వతియగును" *1

ఉదా-శా. శుంభ ద్రోషమునం దిశల్ పగుల నక్షుద్రజ్వాల జ్వాలికా
సంభూతస్ఫుట విస్ఫురద్విస్ఫుమరస్ఫాయత్స్ఫులింగ వ్రజం
బంభోవాహ పదంబు గప్పికొన జంభారాతి వైచెన్ రణా
రంభో జృంభితమైన వైష్ణవ భట వ్రాతంబుపై వజ్రమున్
— శ్రీరంగ 3–238

కొన్ని పరుష వర్ణాలతో వీరం వర్ణింపబడటంచేత ఇదిసాత్వతిఅవుతుంది

భారతి : ఈషన్మృదు వర్ణబంధంతో అద్భుత రసం ఉపనిబద్ధమైన ఈ క్రింది పద్యం భారతీ వృత్తికి లక్ష్యం ఔతుంది—

చం. అని మధురోక్తులొప్ప దమకందరకుం బ్రియమాచరించు న
మ్మనుజ వరేణ్యు ధైర్యగతిమంబునకున్ వెరగంది యొండొరుం
గనుగొని సమ్మదంబు మతికంపము విన్నదనంబు లజ్జయుం
బెనగొన నంతరంగమున బిమ్మిటిగొంచు రహస్య భాషలన్
— శ్రీరంగ 2–90

*1 ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము.

## 4.1.13. వస్తువివేకం :

వస్తువు కథాంశం లేక ఇతివృత్తం. వస్తువివేకం-కథాంశాన్ని ఎంపిక చేసుకోవటంలోని నేర్పు. ఏకవికాని తాను రచించే గ్రంథానికి ఇతివృత్తాన్ని ఎంపిక చేసుకోవటంలో (సూక్ష్మబుద్ధి) నేర్పుకలిగి ఉండాలి. అలా ఉంటేనే వర్ణనలు మొదలైన వాటిచే అ వస్తువుకు మెరుగులు పెట్టి ఉత్తమ రచనగా వెలార్చేందుకు వీలవుతుంది.

సౌపర్ణ పురాణాంతర్గత శ్రీరంగ మహత్త్వాన్ని చాగయరాఘువుని కోరిక మేరకు భైరవకవి కావ్యంగసంతరించాడు. ఇందులోని ఇతివృత్తానికి (వస్తువుకి) మూలకందాలు శైవభక్తి, మతవిశ్వాసం, ముక్తిమార్గం.

శ్రీరంగ మహత్త్వ కావ్యంలో స్థల, దైవ, తీర్థ మాహాత్మ్య ప్రతిపాదకాలైన కథలు వస్తువు. అయా మాహాత్మ్యలను ఉగ్గడించే ఉపాఖ్యానాలు, కథలు భైరవకవి తన కల్పనా చాతుర్యంతో చక్కగా వెలార్చాడు. దానికితోడు భైరవకవి రచింపదలచిన కావ్యంలోని వస్తువు (ఇతివృత్తం) ఉత్తమోత్తమం పవిత్రం అయినది కావటంవల్ల శ్రీరంగ మహత్త్వము ఒక చక్కని చిక్కని కవితాసుధకు నిలయంగా ఉంది. వస్తువు లేక కేవలం కల్పనా చమత్కృతులు మాత్రమే కృతుల్లో ఉంటే అలాంటి కృతులు నిండుదనాన్ని కలిగి ఉండవు, అలాంటి ప్రయత్నంకూడ నేలవిడిచి సాముం చేయటమే ఔతుంది.

శ్రీరంగం వైష్ణవ క్షేత్రాల్లో ప్రాముఖ్యమైంది. నూటా ఎనిమిది దివ్య తిరుపతుల్లో ప్రథమగణ్యమైంది. ఇక్కడిఅర్చామూర్తి స్వయంభువు. ఇక్కడి దైవం శ్రీరంగనాయకులు. శ్రీరంగధామం బ్రహ్మకుపూజార్థం శ్రీమన్మహావిష్ణువు ఇచ్చాడు. బ్రహ్మ ఇక్ష్వాకునికి అవంశీయుడైన శ్రీరామచంద్రుడు విభీషణునికి ఇచ్చాడు. ధర్మవర్మ కోరిక మేరకు శ్రీరంగధాముడు కావేరితీరాన విలసిల్లాడు. క్షేత్ర, దైవ, మాహాత్మ్యలను తెలిపే కథలు ఈ కృతిలో చాలా ఉన్నాయి. అందులో దైవ మహిమను తెలిపే ఉపాఖ్యానాలు కుశలుని కథ మరియు ప్రభాకరుని కథ.

కావేరీ, చంద్రపుష్కరిణీ, బిల్వ, జంబూ, అశ్వత్థ, పలాశ, పున్నాగ పకుళ, కదంబ, రసాల తీర్థాలను గురించి తెలిపే మాహాత్మ్య కథలు ఈ కృతిలో ఉన్నాయి.

దీనినిబట్టి శ్రీరంగ మహత్త్వములోని వస్తువు అనల్పమైనది అని తెలుస్తుంది. అనల్ప వస్తువు గల కావ్యాన్ని భైరవకవి అనల్ప కల్పనా చాతుర్య మాధుర్యధుర్యంగా దిద్దితీర్చాడు.

## 4. 1. 14. గుణాలు :

గుణాలు కావ్యోత్కర్షకు హేతువులు. "కావ్య శోభయా కర్తారో గుణాః" అని వామనుడు. భామహుడు గుణాలు మూడే అన్నాడు. వామనుడు పది గుణాలను చెప్పాడు. భోజరాజు–విశ్వనాధుడు గుణాలు ఇరవై నాలుగు అని పరిగణించాడు. చమత్కార చంద్రికలో విశ్వేశ్వరుడు గుణాలు ఇరవైమూడు అని చెప్పాడు. ఎన్నికగా పలికిన కావ్యగుణాలు ముఖ్యంగ మూడే. అవి 1. ప్రసాదం, 2. మాధుర్యం, 3. ఓజస్సు. "మాధుర్యౌజః ప్రసాదాఖ్యాస్త్రయస్తేన పునర్దశ" అని మమ్మటాచార్యుడు జగన్నాథ పండితరాయలు మూడు గుణాలనే పరిగణించి మిగతావన్నికూడ వీటియందే అంతర్భూతాలవుతాయని చెప్పారు. కనుక ప్రసాద, ఓజః, మాధుర్య గుణాలు–వాటికి శ్రీరంగ మహత్త్వానగల లక్ష్య భూతాలైన పద్యాలను మచ్చుకుకొన్ని ప్రదర్శింపబడును—

మాధుర్యం : చక్కని విడివిడి పదాలతో విరాజిల్లే రచన మాధుర్యం అనబడుతుంది. మచ్చుకు కొన్ని—

చం. మిలమిల మంచు మించు చలి మించుల ముద్దులచందమామ కాం
తుల దులదూగు క్రొమ్మొలక తూడుగొనం గబళించి త్రుంచి వి
చ్చలవిడి మేసి గబ్బుకొని సమ్మద నాదము లొప్పజేసి లీ
లల మలసెం గొలంకుల కెలంకుల రాజ మరాళ దంపతుల్
— శ్రీరంగ 2-47

ఉ. చల్లని తావులెందు వెదజల్లగ మవ్వపుజాపు మొగ్గ చా
లల్లన విప్పుచుం గిసల యావళి శ్రీవెలయంగ దెల్పుచున్
మెల్లన జంతుజాల మెలమిం బొదలం బరిపాటిమై ప్రవ
ర్తిల్లుసుగాని గాలి తన తీవ్రత సూపగనోడు నీయెడన్
— శ్రీరంగ 3-35

చం. జలనిధి కన్యతే గురులు షట్పద పంక్తులు, గ్రాలు కన్నులుం
గలువలు, నవ్వుదేరెడి మొగంబును బద్మము, బాహుయుగ్మమున్
నలికపు దూడు దీవలు, ఘనస్తన కుంభ యుగంబు జక్రవా
కలు దనలోన వీడువడి కన్నుల పండువొనర్చె జక్రికిన్
— శ్రీరంగ 4-62

పై పద్యాలు కలకండ ఖండాలవంటి పదాలతో కూడుకొని ఉన్నాయి. అంతేగాక లకారం. ద్విత్వలకారం ప్రాసకలిగి ఉండటం మరింత సౌకుమార్యాన్ని సొగసుదనాన్ని కూర్చింది.

ఓజస్సు: అర్థప్రౌఢికలిగి సుదీర్ఘ సమాసఘటితమై అలరారే రచన ఓజోగుణ ప్రధానమైనది.

మ. సతతానేక మునీంద్ర బృందకృత పూజావందనం జందనా
గత మందానిల కందలీకృత తరంగ స్యందనం దీరసం
గత మాకంగ మరంద బిందు సహితార్క స్యందనం గాంచిర
య్యతులింపొంద గవేరనందన ద్రిలోకానందనా నందనన్
— శ్రీరంగ 1-140

పరమ పవిత్రమైన కావేరీనదిని దృశ్యమానం చేయజాలిన దీర్ఘసమాస ఘటనం ఓజోగుణ విలసితంగా ఉంది.

మ. సమభూమిం బరమోత్సవంబున బ్రతిష్ఠాపించె శ్రీరంగముం
గమనీయావృత నారకేళ కదళీ ఖర్జూరనా రంగమున్
విమలార్థ ప్రతివాక్య విశ్రుతవనీ విశ్రాంత సారంగమున్
సమభావార్య విలోకతాభినవ మోక్షశ్రీనటీ రంగమున్
— శ్రీరంగ 2-111

అంత్యప్రాసాలంకార శోభితమైన దీర్ఘసమాసఘటనంలో శ్రీరంగ క్షేత్రాన్ని సాక్షాత్కరింపజేసే పై పద్యం ఓజోగుణ విలసితం.

ప్రసాదం: ప్రసిద్ధాలై సుళువుగ అర్థమయ్యే పదాలు కలిగి ఉండటం ప్రసాద లక్షణం. ఉదా–

అ.వె. సర్వ శక్తిమయము జగతి శ్రీరంగంబు
సర్వతీర్థమయము చంద్ర సరసి
సర్వపుణ్యమయము చర్చింప నీతావు
సర్వవేదమయుడు శార్ఙ్గపాణి — శ్రీరంగ 3-112

కం. శ్రీరంగమునకు నరుగుడు
శ్రీరంగంబనుచు జపము సేయుడు మదిలో
శ్రీరంగము దలపుడు భవ
భారముల హరింపనోపు బగలును రేయున్ — శ్రీరంగ 1-133

పై పద్యాల్లో సులువుగా అర్థమయ్యే పదాలు ఉండటంవల్లపద్యాలు ప్రసాదగుణ శోభితంగా ఉన్నాయి.

## 4. 1. 15. కవి సమయాలు :

"అశాస్త్రీయ మలౌకికంచ పరంపరా యాతం య మర్థము పనిబధ్నంతి కవయః స కవిసమయః" అశాస్త్రీయం, లోక విరుద్ధం, పరంపరా యాతం అయిన అర్థాన్ని (విషయాన్ని) కవులు కూర్చుతారో అది కవిసమయం. కావ్యాల్లో కవులు అయా వర్ణనలు చేసేటప్పుడు నియతంగ అయా అంగాలను అయా వస్తువులతో ఉపమిస్తుంటారు. అవే కవిసమయాలు. కవి సమయాలను ఏరుకోవటంలో కూడ కవిగారి నేర్పరితనం ప్రతిభా పాండిత్యాలు విశదమౌతాయి. వర్ణనలు మొదలైన వాటిలో కవిసమయాలు విపులంగ కన్పిస్తాయి. కావ్య జగత్తులో కవిసమయాలు రసానుభూతికి కారణంగ ఉంటాయి. కనుక కవిసమయాలను కవులందరూ తమ కావ్యాల్లో చేర్చారు. భైరవకవికూడ కవి సమయాలను శ్రీరంగ మహత్త్వములో చక్కగాకూర్చాడు. వాటిని సంక్షిప్తంగా పరిశీలించవలసిఉంది—

నదులలో పద్మోత్పలాలు ఉన్నట్లు వర్ణించటం : జలాశయాల్లో పద్మోత్పలాలుండటం ప్రకృతిసిద్ధం. నదుల్లో పద్మాలుఉండవు. అయినాకూడ నదుల్లో పద్మాలు ఉండేటట్లు చెప్పటం కవిసమయం. ఈ కవిసమయం శ్రీరంగ మహత్త్వములో కావేరీనదీ వర్ణన సందర్భాన ఇలా ఉంది—

సీ. ఏ తరంగిణి నించు కించుక వికసించు
కొత్తమ్మి తావుల గొసరి కొసరి — శ్రీరంగ 1-101

సీ. అనువైన తామరపాకు జప్పరముల
నలరి గ్రీడించు రాయంచకవలు — శ్రీరంగ 2-151

కావేరీనదిలో తామరపాకు చప్పర్గాలు ఉన్నాయట. కనుక తామరలు కూడా ఉన్నాయని భావం.

సీ. రాజిల్లు కల్వపూ గాజుటో వరులలో
దవిలి పాయని యళిద్వంద్వములును — శ్రీరంగ 2-251

కావేరీనదిలో కలువపూల గాజుటోవరులు ఉన్నాయట. కనుక ఉత్పలాలు కావేరీనదిలో ఉన్నాయని చెప్పటమే.

సరస్సుల్లో హంసాది పక్షులు లేకున్నకూడ ఉన్నట్లు వర్ణించటం :

సరోవరం కేవలం జలపూరితమై ఉండటం అహ్లాదాన్ని కలిగింపదు. ఆ జలాశయ సౌందర్యాన్ని ఇనుమడింపజేసేందుకు హంససారసాది పక్షులు అక్కడ ఉన్నట్లు చెప్పటం కవిసమయం.

శ్రీరంగ మహత్త్వములో ఊర్ధ్వగతల్పుడు జలధిసుతతో చంద్రపుష్కరిణిలో జలకేళి సలిపే సందర్భాన– "రాజహంసలతోడ రాయిడించి" (శ్రీరంగ 4-64) అని ఉంది. అంటే ఆ సరోవరంలో రాజహంసలు ఉన్నాయని చెప్పాడు కవి.

పర్వతాల్లో గైరికాది ధాతువులు ఉన్నట్లు వర్ణించటం : పర్వతాలన్నింటిలో స్వర్ణ రత్నాలు గైరికాది ధాతువులు ఉండవు. అవి ఏవోకొన్ని పర్వతాల్లోనే ఉంటాయి. అయినాకూడ పర్వత వర్ణనంలో గైరికాది ధాతువులు ఆ పర్వతంలో ఉండేటట్లు చెప్పటం కవి సమయం. శ్రీరంగ మహత్త్వములో ఈ కవి సమయం ఇలా పాటించబడింది:–

సీ. తే.గీ. బహుళ గైరికమయ దృషత్ప్రభవరాగ
కల్పితాలీక దివసావ గమనికామ
విపుల వార్వాహ సందోహ విభ్రమంబు
రుంద్ర కటకంబు ధరణి ధరేంద్ర మొకటి — శ్రీరంగ 4-250

గజరహిత పర్వతాన్ని గజసహిత పర్వతంగ చెప్పటం : కొండలన్నింటి లోను ఏనుగులు ఉండవు. అయినాకూడ తామువర్ణించే కొండల్లో ఏనుగులు ఉన్నట్లు చెప్పటం కవులకు పరిపాటి. అదొక కవిసమయం. అలా చెప్పటం వల్ల పర్వత సౌందర్యాదికం భీకరాదికం ఇనుమడిస్తుంది. శ్రీరంగమహత్త్వములో ఈ కవిసమయం ఇలా పాటింపబడింది.—

సీ. శిఖరాగ్ర గతి హరి ప్రఖరా శనిక్రూర
నఖరాభిహత నవ్య నాగకులము" — శ్రీరంగ 4-250

వెన్నెలను ద్రవపదార్థంగ అంజల్యాది గ్రాహకంగ వర్ణించటం :

వెన్నెల ఘన, ద్రవ, వాయు పదార్థాలలో దేనికి చెందిందికూడ కాదు. అది కేవలం ప్రకాశ విశేషం. అలాంటిదాన్ని అంజల్యాది గ్రాహ్య ద్రవపదార్థంగ అభివర్ణించటం కవిసమయం. శ్రీరంగమహత్త్వములో ఈ కవిసమయం ఇలా చెప్పబడింది—

ఉ. సారవుదేట వెన్నెల రసంబులు మేలిమి నల్ల గల్వపూ
గోరల నించి...... — శ్రీరంగ 2-49

వెన్నెల రసాన్ని నల్లకలువ అనే కోర (పాత్ర, పళ్లెం) తో నించినట్లు పై పద్యంలో కవిసమయం పాటింపబడింది.

చక్రవకవ రాత్రివేళల్లో వియోగాన్ని అనుభవించేటట్లు వర్ణించటం :

చక్రవాకలు రాత్రుల్లో కరుణావిలమైన ధ్వనులు చేస్తుంది. ఆ ధ్వని విరహ బాధగా వ్యంజించి చెప్పటం కవి సంప్రదాయం.

మ. పురి శృంగార వనంబులన్ మెరయుచుం బూర్ణేందు బింబాననల్
విరులం గొప్పుల దీర్ప వేణి యొలమిం వేశ్యన్వేసం గప్పు బం
ధుర నీల ప్రబలాంధకారము క్రియం దోపం భ్రమం జక్రవల్
విరహార్తిం దురపిల్లు బట్టపగలున్ లీలా సరశ్శ్రేణులన్
— శ్రీరంగ 4-263

అతివలవేణి నీలప్రబలాంధకారం వలె కనిపించగా రాత్రి అని భ్రమించి క్రవలు విరహంతో దురపిల్లినవట. ఇక్కడ కవి సమయం అలంకార యుక్తంగా చక్కగా పాటింపబడింది.

అయశాన్ని పాపాన్ని నల్లగా వర్ణించటం : యశస్సును, పుణ్యాన్ని తెల్లగా ఉన్నట్లు వర్ణించటం కవిసమయం. వాటికి విరుద్ధాలైన అయశాన్ని పాపాన్ని నల్లగ ఉన్నట్లు వర్ణించటం కూడ కవిసమయం. అయశస్సును గూర్చే పాపాల్నిచేసే వాడిని నల్లగా వర్ణించటం కూడ కవిసమయం.

ఉదా– "మ. కనియెం గర్కశ మేచకాంగు......వినీలాంబరున్...... తస్కరున్–శ్రీరంగ 3-63 పైపద్యం దొంగను వర్ణిస్తుంది. దొంగ పాపపుపనుల్ని చేసేవాడు. వాడి శరీరం చీకటివలె నల్లగాఉన్నట్లు చెప్పటం పాపపు పురుషుని నల్లగా వర్ణించాలనే కవిసమయ సంప్రదాయానుసరణమే ఔతుంది.

క్రోధాదుల్ని రక్తవర్ణంగా చెప్పటం : తస్కరుడిని వర్ణించే సందర్భాన "అతిరక్త క్రూర విస్ఫారలోచను" (శ్రీరంగ 3-63)అనటంలో ఈ కవిసమయం పాటింపబడింది. ప్రతాపాన్ని ఎర్రగా ఉన్నట్లు వర్ణించటం కూడ కవిసమయమే. "వీతిహోత్ర ప్రతాపా" (శ్రీరంగ 5-266) వీతిహోత్రుడు (అగ్ని) ఎర్రగా ఉంటుంది.

వృక్ష దోహదాలు : పద్మినీజాతి స్త్రీల స్పర్శాదులవల్ల ఆయా వృక్షాలు వికసిస్తాయని చెప్పటం కవిసమయం. భైరవకవి ఈ కవిసమయాన్ని ఈక్రింది పద్యంలో ప్రయోగించాడు.

సీ. పాణిపల్లవ మృదు స్పర్శ జాతంబుల
సుకరాంఘ్రి హతుల నశోకములను
కలభాషణంబుల గర్జి కారంబుల
వదనాసవంబుల వకుళములను
బరిరంభణంబుల గురువక ప్రతతుల
దృగ్విలాసంబుల దిలకములను
దరహాసకాంతి సంతతి సురపొన్నల
సమదరాగంబుల చంపకముల

తే॥గీ॥ నసమ సమగీత లహరి బ్రియాళములను
చారుముఖ గంధముల సింధు వారములను
ప్రొఢనఖరాంకుర క్రీడ బాటలముల
నాతరాంబార నందంద బ్రోదిచేసి — శ్రీరంగ 2-61

వృక్షదోహదాలయిన ఈ సమయాన్ని కొందరు కవులు కించిద్భేదంతో చెప్పినట్లు తెలుస్తుంది. *1 భైరవకవి చూత, అశోక, వకుళ, కురువత, తిలక నమేరు (సురుపొన్న), చంపక, ప్రియాళ, సింధువార, పాటల అనే పదకొండు వృక్షాలను దోహద కవిసమయాలను చెప్పాడు.

## మన్మథుని ధనుర్గుణాలను భ్రమర పంక్తిగ వర్ణించటం :

పుష్పాలు మన్మథుని బాణాలయినపుడు ఆ పుష్పాలను ఆశ్రయించిన భ్రమరపంక్తి అతనుని వింటినారి కావటం సమంజసమేకదా! కనుకనే కవులు భ్రమరపంక్తిని మన్మథుని కోదండ"జ్యా"గ వర్ణించారు. భ్రమరఝుంకారాలు మదన ధనుష్టంకారంలని వ్యంజింపబడినవి. "అలిజ్యావల్లి సంధించి" (శ్రీరంగ 2-81) మన్మథుడు బాణాలు వేశాడని చెప్పటం కవిసమయం.

*1 శ్లో. స్త్రీణాం స్పర్శాత్ ప్రియంగు వికసతి వకులం సీధుగండూష సేకాత్
పాదాఘాతా దశోక స్తిలక కురువకౌ వీక్షణా మాలింగనాభ్యాం
మందారో నర్మవాక్యాత్ పటలమ్మృదు హసనాచ్చంపకో వక్త్రవాతాత్
చూతోగీతాన్నమేరు ర్వికసతి చ పురోనర్తనాత్ కర్ణికారః
— మేఘదూతమ్ (2-18) మల్లినాథవ్యాఖ్య

శ్లో. అశోకశ్చరణా హత్యా వకుళోముఖ సీధునా
ఆలింగనాత్కురువక స్తిలకో వీక్షణేనచ
కరస్పర్శేన మాకందో ముఖరాగేణ చంపకః
సల్లాపతః కర్ణికార స్సింధువారో ముఖానిలాత్
గీత్యా ప్రియాళు ర్నితరాం నమేరుర్హాసి తేనచ

అనగా నశోక వృక్షము పాదతాడనము చేతను. బొగడ చెట్టుమిఃయుట చేతను, నెఱ్రపువ్వుల పెద్దగోరింట యాలింగనము చేతను, దిలకవృక్షము చూచుటచేతను, మామిడి హస్తస్పర్శముచేతను, సంపెంగచెట్టు ముఖరాగము చేతను. గొండగొగుచెట్టు సల్లాపము చేతను, వావిలిచెట్టు ముఖవాయువుచేతను, ప్రేంకణవుచెట్టు గానము చేతను, సురపొన్న నవ్వుటచేతను, బుష్పించుచున్నవి. అనగా నాయావృక్షము లాయాదోహదములచేత నకాలమందును బుష్పించుచున్నవని శాస్త్రప్రసిద్ధము. — వసుచరిత్ర వ్యాఖ్యానము

<u>మదనుడి చాపాన్ని బాణాలను పుష్పాలుగ చెప్పటం</u> : మన్మథుడికి పుష్పబాణుడని పేరు. అతడి బాణాలను పుష్పాలుగ వర్ణించటం కవిసమయం ఈ క్రింది పద్యాల్లో ఈ కవిసమయం పాటింపబడింది—

ఉ. అప్పుడు "పుష్పబాణు" దుదురాకృతి... ... — శ్రీరంగ 2-54
మ. సరి "కెందామర మొగ్గనారస" మలిజ్యావల్లి సంధించి
— శ్రీరంగ 2-81

కం. చిత్తములు గలగ విరహుల
మొత్తపుల గదల్చ వేయ మొనయు మరునకుం
"గ్రొత్తమ్ములైన తమ్ముల"
నెత్తములై మెరయు తేటినికరము గంటే — శ్రీరంగ 4-89

<u>కోకిలలు వసంతంలోనే కూసేటట్లు వర్ణించటం</u> : హేమంతం, శిశిరం తప్ప అన్ని ఋతువుల్లోను కోకిల కూజితాలు వినబడుతాయి. కానీ వసంతమందే కోకలలు కూస్తున్నట్లు వర్ణించటం కవిసమయం.

శ్రీరంగమహత్త్వము ద్వితీయాశ్వాసంలో వివిధ ఋతువర్ణనలు చేయబడినవి. అందులో వసంత వర్ణనంలో మాత్రమే కోకిలలు కూసినట్లు చెప్పటం కవిసమయాన్ని పాటించటమే. ఆ పద్యం ఇది—

చం. గునియుచు గుజ్జుమావి నెలగొమ్మల నిమ్మల వ్రాలి సోగలే
గొనలు దెమల్చి కెంజిగురు గుంపులు లంపులుమేసి క్రొవ్వి పీ
కున నొగరెక్క డగ్గుపడ కుత్తుకలం గొదలేని నూతన
స్వనములు పంచమ శ్రుతుల జట్టికొనం జరతించె కోవెలల్
— శ్రీరంగ 2-44

<u>మగ కోకిలలే కూస్తాయని వర్ణించటం</u> : "సీ. మగకోవెలలు పంచమ స్వరంబున నింపు-పుట్టించు మరుగుల పొరుగులందు"- (శ్రీరంగ 4-198)

---

మల్లినాథ వ్యాఖ్యానానికి, వసుచరిత్రలోని (3-149) వృషభగతి రగడ కుగల పై వ్యాఖ్యానానికి కించిద్భేదం ఉంది. భైరవుని వృక్షదోహద విధంగానే వసుచరిత్ర వ్యాఖ్యానంలో చెప్పబడింది.

మగకోకిలలు మాత్రమే కూస్తాయని చెప్పటంవల్ల బాహ్యవనాల్లో కేవలం మగ కోకిలలే ఉంటాయని చెప్పటం కూడ ఉంది. "సీ. పుంస్కోకిలంబుల భోజన శాలలు" (శ్రీరంగ 4-273) అని బాహ్యవన వర్ణనంలో చెప్పబడింది. ఆడ కోకిలలకుకూడ బాహ్యవనాలు భోజనశాలలే. కానీ అలా చెప్పటం కవిసమయంకాదు.

మయూరాలు వర్షకాలమందే నృత్యాదుల్ని చేస్తాయని వర్ణించటం :

నెమళ్ళు పురులువిప్పి అన్ని ఋతువుల్లోను నాట్యంచేసే సందర్భాలు న్నాయి. కానీ వర్షకాలంలోనే అవి మత్తిల్లి నృత్యంచేస్తాయనటం కవిసమయం.

వివిధ ఋతువుల్ని శ్రీరంగమహత్త్వములో వర్ణించిన భైరవకవి వర్షకాల వర్ణనమందే మయూర నృత్యాలను వర్ణించాడు. ఆ పద్యం ఇది—

మ. జలదాటోప విశాల మింద్ర ధనురంచ ద్వారుణీకూల ము
త్కలి కాలంబ కదంబ సాల వనమధ్య స్ఫార సవ్యావళీ
కలనావాల ముదార కేతన పరాగవ్యాళ ముక్ష్వీధర
స్థల "నృత్యన్మద కేకిజాలమగు వర్షాకాల మొప్పెంగడున్"
— శ్రీరంగ 2-26

ద్వాదశాదిత్యులకు ఐక్యం చెప్పటం : అదితేరపత్యం అదిత్యః అని వ్యుత్పత్తి. ద్వాదశ ఆత్మానం మూర్తయః యస్య యస్య ద్వాదశాత్మా. అతడు (అదిత్యుడు) పన్నెండు మూర్తులు కలవాడు. ఈ ద్వాదశాదిత్యుల్ని ఒక్క సూర్యునిగానే చెప్పటం కవిసమయం (ఆ పన్నెండు పేర్లుకూడ సూర్యునిపేర్లు గనే చెలామణి అవుతున్నాయి)

సీ. పంద్రెండు నామముల్ పరగుమేటి......
భానుడేతెంచె దేదీప్యమానుడగుచు. — శ్రీరంగ 5-201

క్షీరసాగర సాగరాలకు ఐక్యం చెప్పటం : వాస్తవ ప్రపంచంలో క్షీర సాగరం కన్పించదు. నీరసాగరం ఉండటంనిజం. క్షీర నీరసాగరాలకు ఐక్యం చెప్పటం కవిసమయం. విష్ణుడు పాలకడలి నివాసి అని పురాణ ప్రసిద్ధం. కడలిని నివాసంగా గల విష్ణువును సందర్శించేందుకు దేవతలు వెళ్ళిన సంద ర్భాన సాగరాన్ని క్షీరసాగరంగ పేర్కొన్నాడు భైరవకవి (శ్రీరంగ 2-209 వచనం).

మన్మథుడికి మూర్తత్వ అమూర్తత్వాలు ఉండేటట్టు చెప్పటం:

కాముడు అనంగుడు. అనంగడిని మూర్తత్వం కలవాడిగ వర్ణించటం కవిసమయం. ఈ క్రింది పద్యంలో భైరవకవి మన్మథుడిని రూపుకట్టించాడు-

సీ. కప్పారు నెరివెండ్రుకలకొప్పు కొప్పుగా
బారిజాతంపు బూబంతి మెరయ
రతి పదాలక్త కాంకితమైన నొసలిపై
నిలువు గస్తురి బొట్టు చెలువు మిగుల
గేయూర ముద్రలు గీల్కొన్న గళమున
మౌక్తికంబుల కంఠమాలయమర
చెదరు గంధపు బూత జెన్నొందు నురమున
పద్మరాగంబుల పదక మొలయ

గీ. సరస సంభోగ శృంగార సహజ మహిమ
లలిత యౌవన లావణ్య లక్ష్మిబెనుప
ననుపమాన జగన్మోహనైక మూర్తి
దర్పకుడు వచ్చె నింద్రు నాస్థానమునకు — శ్రీరంగ 2-52

కం. వలరాజు రూప రేఖా
విలసనములు దనవి సనక వీక్షించెడివో
నిలువెల్ల గన్నులగుటకు
ఫలమెల్లను గలిగె నమరపతిపాలునకున్ — శ్రీరంగ 2-53

మన్మథుడి మూర్తత్వానికి పై పద్యాన్ని పోలిన వర్ణన ఉండేవి కావ్య ప్రపంచంలో అరుదు.

దేవతల్ని పాదాలు మొదలుకొని శిరస్సు వరకు వర్ణించటం :

ఇది కవిసమయం కాకున్నకూడ ఒకహితోక్తి. పూజావిధాన ధర్మనిర్దేశం దేవతల్ని పాదాలనుండి శిరస్సు వరకు వర్ణించటం సంప్రదాయం. భైరవకవి ఈ సంప్రదాయాన్ని పాటించాడు.

విష్ణు స్తుత్యాత్మకమైన దండకంలో "సరోజధ్వజచ్ఛత్ర చక్రాదిచిహ్నైః పదైరంకితాభ్యాం" అని పాదవర్ణనతో ప్రారంభించి "సముద్భాసి కోటీర

చారూత్తమాంగం" అని శిరస్సువరకూగల వివిధ అవయువాల వర్ణనం చేయ బడింది. (శ్రీరంగ 1-167 దండకం).

అలాగే చతుర్థాశ్వాసంలో శ్రీరంగనాయకవర్ణన సందర్భాన– "కెందమ్మి సిరుల గరువంపు జెన్నునకు వన్నె యొసంగు కెంజాయల రంజిల్లుచు జక్ర చామర తామరస కులిశ పద్మఝష చాప కలశాది రేఖలం గల తలంబుల మెరసి మెరుంగు జుక్కల చందంబునకు నూరుపు నెరపు నఖమణి రమణీయంబులై నమదమరేంద్ర బృంద మందార మాలికా పరిమళ పరంపరా వాసితంబులై వాసవ ధనుర్లీలా విలాసంబులకు వాసి మిగిలి వివిధ మణిద్యుతి వ్యతికర మంజులంబులగు మంజీరంబుల బొలుపు మీరి శుకసనకాది యోగీంద్ర ధ్యాన గమ్యంబులై రమ్యంబులగు చరణంబులును"– అని చరణాల వర్ణనతో ప్రారంభించి వివిధావయవాలను వరుసగా వర్ణిస్తూ– "లలిత లావణ్య రస లవంబులన నమర చెమట చిత్తడి గరంగు హరినీల శిఖరంబు నుంబోలె బద్మరాగ ప్రభాటోప వికంకట ముకుట సంగతంబగు నుత్తమాంగంబును గలిగి"–అని శిరోవర్ణనం చేయబడింది. ఈ వచనం నఖశిఖ పర్యంత వర్ణనాత్మకం (శ్రీరంగ 4-223)

చంద్రుడిలోని హరిణ శశాలకు ఐక్యం చెప్పటం : చంద్రుడిలో అగుపించే మచ్చను పలురకాలుగా చెప్పుకుంటారు.

చం. హరిణమటంచ్రుడు కాదు వటమందురు భూప్రతిబింబ మంద్రుడసా
గరతల పంక మంద్రుడు శశకందని యందురులో కులందడన్
— శ్రీరంగ 4-260

ఇన్నిరకాలుగా చెప్పుకున్నకూడా చంద్రుడు మృగాంక/శశాంకుడుగానే ప్రసిద్ధుడు. వటాంకుడు అని కానీ భూప్రతిబింబాంకుడు అనికానీ సాగర తలపంకాంకుడు అనికానీ చంద్రుడినిపిలువరు. మృగాంక, శశాంకులనటం ప్రసిద్ధి, కవిసమయం. ఈ కవిసమయానికి ఉదా:– "శశిధర"–శ్రీరంగ 1-44.

"చందురు మచ్చయిర్రి" —శ్రీరంగ 1-44

కం. పురసౌధ శిఖర నికర
స్ఫురదురు మరకత మయూర పుంజములకళా
ధరమధ్య బింబ హరిణము
తరుణ తృణభ్రాంతి దవ్వు దవ్వుల గముచున్"—శ్రీరంగ 4-259

కీర్తిని, హాసాన్ని తెల్లగా వర్ణించటం : కీర్తికి, హాసానికి మూర్తిలేదు. వర్ణంలేదు. అయితే వాటికి శ్వేతవర్ణాన్ని చెప్పటం కవిసమయం. ఇందుకు భైరవకవి పద్యాలు—

కం. అంధ్రగభపుని సుకవి
చందన మందార కుంద శశధర పురభి
న్మందిర నిర్మల యశుజె
ప్పందగు నరసింహదేవ పండితు నెందున్ — శ్రీరంగ 1-44

శా. ... ... ... కరిదంత క్షీరతారామరు
ద్గోహీ రామల కీర్తి జెప్పదగునా గోవింద మంత్రీశ్వరున్
— శ్రీరంగ 1-47

సీ. చటుల సంధ్యా నటత్పటి మధూర్జటి జటా
ఘటిత గంగాఫేన పటలి దెగడి
పూర్ణచంద్రా తపస్ఫురణ సముద్ధూత
దుగ్ధాబ్ధివీచి పంక్తులనదల్చి
భారతీ వక్షోజ భారార్పితోదార
కర్పూరహార లేఖల హసించి
చందనా చల మరుచ్చలిత నిర్ఝర తరు
ప్రసవ గుచ్ఛావలి భంగపరచి

గీ. వెలయు నేమంత్రి శేఖరు విశదయశము — శ్రీరంగ 1-60
... ... ...

శా. ... ... ... శశ్వన్నభ
స్సింధుక్షీర పటీర నిర్మలయశః శ్రీహాసితా శాంతరా—శ్రీరంగ 1-220

కం. ... శశివిశదకీర్తి —శ్రీరంగ 2-1

వ. ముత్యంపు మొలకల పొలుపున దెలుపెసగు దశన కాంతులు గలిగి
వెలయు నెలనవ్వు వెన్నెలల జెలువు మిగిలి (హాసవర్ణనం)
— శ్రీరంగ 4-223

వ. ఇందు కాంత దర్పణ విదగ్ధస్నిగ్ధ కపోల మాలికాభ్యర్ణ విక్షిప్త
వాలుకాసక్త ముక్తాఫల కాంతా గళిత మందస్మిత సాంద్రచంద్రి
కాసదన వదన చంద్ర మండలామ్ — శ్రీరంగ 5-221

ఇలాంటి కవిసమయాల్ని భైరవకవి రసోచితంగా పాటించాడు. విస్తర భీతివల్ల ఇక్కడ అవయవ వర్ణనల్లో చెప్పబడే ప్రసిద్ధ ఉపమాసామగ్రి కవి సమయాలను పేర్కొలేదు. అవన్నికూడ కావ్యాల్లో సాధారణంగ ఉంటాయి.

దేవతలకు ఘర్మసలిలాలు పులకాంకురాలు ఉండకపోవటం :

ఇది పరంపరగా అభిజ్ఞుల ఉవాచ. అయినకూడ భైరవకవి—

ఉ. అప్పుడు పుష్పబాణు రుచిరాకృతి దప్పక చూచి చిత్తముల్
ద్రిప్పగలేక కోర్కితరి తీపుల ప్రేమలెలర్ప మానముల్
దప్పిచలించి "ఘర్మసలిలం బెసగం బులకించి" నివ్వెరల్
గప్పి "విచిత్ర రూపముల" కైవడినిల్చి "రమర్త్య భామినుల్"
— శ్రీరంగ 2-54

అని చెప్పాడు. దేవతలకు ఘర్మసలిల పులకలు ఉండవు. ఉండనిది ఉండేటట్లు చెప్పటమే కవిసమయంగా తలచికాబోలు అమర్త్యభామినులకు కూడ ఘర్మ సలిలాదుల్ని కలిగించి వారిని విచిత్ర రూపాలతో నిల్చినట్లు చెప్పాడు భైరవకవి.

భైరవకవి కవిసమయాలను చక్కగా పాటించాడనేందుకు పైన పేర్కొన్న ఉదాహరణలు నిలువుటద్దాలు.

## 4.1.16. చమత్కారాలు :

సారస్వత మహద్రష్టలైన మన అలంకారికులు చమత్కారాల స్వరూపాన్ని బహుధా సంభావించారు. "నహి చమత్కార విరహితస్య కవేః కవిత్వం కావ్యస్య వా కావ్యత్వం" అని క్షేమేంద్రుడు తీర్మానించాడు. కవి శబ్దవాచ్యులకు అందరకు కూడ అంతో ఇంతో చమత్కార ప్రియత్వం అనేది సహజ లక్షణం. వివిధ చమత్కార విస్ఫురణతో ప్రతిభావంతులగు కవులది అందె వేసిన చేయి అవుతుంది. వారి జిహ్వకు అది నైసర్గిక గుణం. అలాంటి చమత్కారాలు కావ్య ప్రపంచంలో అనేక విధాలుగ గోచరిస్తాయి. అవి స్థూలంగ ప్రధానంగ శబ్ద అర్థ భేదాలని రెండు రకాలుగా చెప్పవచ్చు. వాటిలో మళ్లీ అనేక అవాంతర భేదాలు ఉన్నాయి. శ్రీరంగ మహత్త్వములో గల శబ్దార్థ చమత్కారాలు వాటిలోని అవాంతర భేదాలు పరిశీలించాలి—

శబ్ద చమత్కారం : శబ్దాన్ని ఆశ్రయించి ఉండే చమత్కారం శబ్ద చమత్కారం. "ఈ శబ్దచమత్కారము ప్రధానముగా నాలుగు రీతుల బలుక దగును. శ్లేష, చిత్ర, గర్భ, బంధ కవిత్వము లనునవి. అనార్లు *1" వీటికి శ్రీరంగమహత్త్వము నుండి కొన్ని ఉదాహరణలు—

శ్లేషచమత్కారం : కం. సరివారిలోన భంగము
పారసిన సుడియై గలంక పాడమిన గెలనం
బరులుండిస దనజీవన
మెరులకు లోతీక మెలగుటుచితముగాదే
— శ్రీరంగ 2-179

పై పద్యంలో "సరివారిలోన – భంగము–సుడియె – జీవనము–లోతీక" అనే పదాలు శ్లేషార్థాన్ని కలిగి ఉన్నాయి.

ఇలాంటి శ్లేష చమత్కారాలు ఈ కావ్యంలో అక్కడక్కడ గోచరిస్తాయి అలాంటి పద్యాల్ని ఈ శీర్షికలో వేరేచోట ఉదాహరించటంచేత ఇక్కడ ఆ పద్యాల్ని మళ్లీ ఉదాహరించలేదు.

చిత్రకవితా చమత్కారం : చిత్రకవిత అనేకవిధాలు. వాటిలో శ్రీరంగ మహత్త్వములో ఉన్న చిత్రకవితా చమత్కారాలకు కొన్ని ఉదాహరణలు *2—

సర్వలఘువులు : గురువిరహితంగ పద్యమంతా లేక గద్యమంతా సర్వలఘువుగా రచించటం ఒక చిత్రం. శ్రీరంగమహత్త్వములో 2-25, 3-64 3-304 కందాలలో కొంత సర్వలఘురచన అగుపిస్తుంది. తృతీయాశ్వాసంలో శంభుస్తుత్యాత్మకమైన "లయహరి"సర్వలఘు రచనలు (వీటిలోకొన్ని ఈఅధ్యాయంలో వేరొకచోట ఉదాహరింపబడినవి.)

---

*1 ఆంధ్ర సాహిత్యము–చమత్కార వైభవము,
డా॥ పొన్నికంటి హనుమంతరావు (1982)

*2 "చిత్రకవితలు" అనే ఉపశీర్షికలో వీటిని వివరంగ చర్చించటంవల్ల ఇక్కడ వీటిని గురించి స్పృశించటం మాత్రం జరిగింది.

అవృత్తులు : అవృత్తి అంటే చెప్పినదానినే మళ్లీచెప్పటం. ఇది ఒక్క శబ్దాలంకార చమత్కారం. దీనిని లాటానుప్రాస అంటారు.

ఉదా: సీ. హరిదివ్య నామధేయామృతం బింపార
జెలగి యాస్వాదించు జిహ్వ జిహ్వ *1 — శ్రీరంగ 1-91

అనుకరణం : ఒక ప్రసిద్ధ పద్యాన్ని లేదా గద్యాన్ని తలపింపజేస్తూ దాని నడకతో అడుగువేస్తూ రచనను నడిపించే సందర్భాలుంటాయి. అదికూడ ఒక చమత్కారం అని విజ్ఞుల అభిప్రాయం. ఇలాంటి చమత్కారాలు ఈ అధ్యాయంలో "పూర్వకవ్యను కరణం" అనే ఉపశీర్షికలో సాదాహరణంగ ఇవ్వబడ్డాయి. కనుక వాటిని ఇక్కడ ప్రదర్శించలేదు.

ప్రాసక్రీడా చమత్కారాలు : వీటిని గురించి అలంకార సరణులు ఉపశీర్షికలో చూడవచ్చు. పునరుక్తియౌతుందని భీతివల్లకూడ వాటిని మళ్లీ ఇక్కడ పేర్కొనలేదు.

ముక్తపదగ్రస్తం : వదలిన పదాన్ని మళ్లీ గైకొనటం ముక్తపదగ్రస్తం వీటిని "అలంకార సరణులు" ఉపశీర్షికలో చూడవచ్చు

**అచ్చతెనుగు** : "అచ్చతెనుంగు వద్దెమొకటైనను కబ్బములోన నుండి నన్ హెచ్చని యాడుచుందురు *2" కావ్యాల్లో అచ్చతెనుగు పద్యాలను చెప్పటం కూడ ఒక చమత్కారమేఅని పండితుల అభిప్రాయం. శ్రీరంగమహాత్త్వములో అచ్చతెనుగు పద్యాలకు ఒక ఉదాహరణం—

కం. కొమ్మలగెడ మాసికపుం
గమ్మల క్రొమ్మెరుగు లడరగా నలవేల్పుం
గొమ్మలు మలతురు పుత్తడి
బొమ్మల గతి వేరకోట బొగడగనేలా — శ్రీరంగ 4-256

పై పద్యంలో త్రిప్రాస పాటింపబడటంకూడ ఒక చమత్కారమే.

---

*1 "అలంకార సరణులు" అనే ఉపశీర్షికలో ఈ పద్యం పూర్తిగ ఇవ్వబడింది.

*2 పొన్నికంటి తెలగన్న ప్రణీత "యయాతి చరిత్రము" 1-12

బంధకవితా చమత్కారం : వీటిని గురించి "చిత్రకవితలు" అనే ఉపశీర్షికన ఈ అధ్యాయంలో చర్చింపబడును. కనుక ఇక్కడ కేవలం శ్రీరంగ మహత్త్వములోని బంధకవితల పేర్లుమాత్రం పేర్కొనబడును.

చక్రబంధం— శ్రీరంగ 5-263 (శా. నవ్యశ్రీకపరాతి......)

నాగబంధం— శ్రీరంగ 5-264 (చం. వరగుణ రత్నహేమ......)

గోముత్రికాబంధము— శ్రీరంగ 5-265 (కం. హరిపద సరసిజ......)

పైన పేర్కొన్నవన్నీ శబ్దచమత్కారాలు, ఇక అర్ధ చమత్కారాలు పరిశీలనం—

అర్థ చమత్కారం : అర్థాన్ని ఆశ్రయించి ఉండేది అర్థచమత్కారం. ఇలాంటి చమత్కార భేదాలు అనేకం. శ్రీరంగ మహత్త్వములోని అర్థచమత్కారాలు స్థాలీపులాక న్యాయంగ ప్రదర్శింపబడును—

అవిచారిత రమణీయం : వర్ణ్యమాన వస్తు స్వరూప స్వభావములు అశ్రమముగా అలవోకగా ఆస్వాద్యములగుట అవిచారిత రమణీయము. *1

కం. ఇందిర కుంతలములల తుద
లందొరగెడి జలకణంబు లమరెంభ్రమరీ
బృంద మతిపాన వశమున
గ్రందుగ మకరందరసము గ్రక్కెడు మాడ్కిన్ — శ్రీరంగ 4-99

జలకేళి అనంతరం లక్ష్మీదేవి శిరోజాల చివరన అమరిన జలకణాలు పై పద్యంలో వర్ణితం. ఆ జలకణాలు అతిపాన వశాన తుమ్మెదలు క్రక్కే మకరంద బిందువులవలె ఉన్నాయట. ఈ ఉపమానంవల్ల లక్ష్మీదేవి కురులు తుమ్మెదలవలె ఉన్నాయని జలకణాలు మకరంద బిందులవలె ఉన్నాయని అవిచారిత రమణీయ చమత్కారంగ వర్ణింపబడింది.

విచార్యమాణ రమణీయం : పద్యాన్ని/గద్యాన్ని చదివిన వెంటనే అందులోని రమణీయకం స్ఫురించక, కొంచెం ఆలోచించిన తర్వాత అలరించటం విచార్యమాణ రమణీయ చమత్కారం.

*1 ఆంధ్ర సాహిత్యము–చమత్కార వైభవము— పుట 125

ఇక్ష్వాకుడిని తపోభంగం చేయలేక అప్సరసలు పొందిన భంగపాటును భైరవకవి విచార్యమాణ రమణీయ చమత్కారంగ ఇలాచెప్పాడు—

ఉ. మేనక విన్ననై నిలిచె, మెల్లన మోమురవాంచె రంభ, లో
నూనిన వింత నివ్వెరగు నొందె దిలోత్తమ, గర్వహీనయై
దీనతనొందె నూర్వశి, మదిం జలియించె ఘృతాచి, యన్యకాం
తానిచయంబులెల్ల దవుదవ్వుల నుండె భయంబు పెంపునన్
— శ్రీరంగ 2-77

సమస్త సూక్తవ్యాపి : "పద్యప్రతిపాద్యమగు సర్వార్థము నాశ్రయించి యుండు రామణీయకమును సమస్త సూక్తవ్యాపి యనదగును. *1

ఉదా: మ. శయనంబై యుపధానమై స్వచ్ఛత్రమై పాదుకా
ద్వయమై మంగళపీఠమై మృదుల వస్త్రంబై సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్యసన్నిహిత మూర్తింబొల్చు శేషాహి స
క్షయ మేధానిధి గావ్యలక్షణ కళాచార్యున్ బ్రశంసించెదన్
— శ్రీరంగ 1–2

చక్రికి నిత్యసన్నిహితుడయిన శేషుని ప్రశంస పై పద్యంలో చేయబడింది. శేషుని ప్రశంసను ఒకపదమైన పరిహార్యంగాక అన్వర్థమౌతూ, శేషుని గొప్పదనాన్ని పలుకగలిగేవిగా ఉన్నాయి.

సూక్తైక దేశ దృశ్యమాన రమణీయం : "ఒకే పదమునే పలుమారులు అవృత్తి చెందించుచు ప్రతిపాద్యమును రమణీయ మొనర్చుట సూక్తైక దేశ్య దృశ్య రమణీయమనబడును *2"

ఉదా: కం. శ్రీరంగమునకు నరుగుడు
శ్రీరంగంబనుచు జపము సేయుడు మదిలో
శ్రీరంగము దలపుడు భవ
భారముల హరింపనోపు బగలును రేయున్ — శ్రీరంగ 1-133

1. 2 ఆంధ్ర సాహిత్యము-చమత్కార వైభవము.

శ్రీరంగానికి వెళ్లటం, శ్రీరంగాన్ని జపించటం. శ్రీరంగాన్ని తలపోయటం పై పద్యంలో చెప్పబడింది. అలా చెయటంవల్ల భవభారాలు హరింపబడు తాయి. "శ్రీరంగం" అనే పదం మూడుసార్లు చెప్పటం చేత ఆ విషయాన్ని ఎంతగా నొక్కిచెప్పేది ప్రకటనమౌతోంది.

శబ్దగత చమత్కారం : ఈ చమత్కారాలు ఈ శీర్షికలో వేరొకచోట విపులంగ ప్రదర్శితమైనవి. కనుక ప్రస్తుతం ఇక్కడ ఒక లక్ష్యం మాత్రం ఇవ్వబడుతుంది.

మ. త్రిజగత్పావన తీర్థసారములు శక్తిశ్రీ నిజాకారముల్
భజదిచ్ఛాఫలద ప్రచారములు శుంభన్మంగళాకారముల్
కుజనవ్రాత విదూరముల్ మధుర నిర్ఘోషాది గంభీరముల్
విజితాఘౌఘ వికారముల్ దలప గావేరీపయః పూరముల్
— శ్రీరంగ 2-196

అర్థగత చమత్కారం : ప్రతిపాద్య వస్తుతత్వానికి ఊహాశక్తిని జోడించి కవి అర్థచమత్కారాన్ని వెలయిస్తాడు.

ఉ. ఉన్నత రంగధామ సలిలోభయ పార్శ్వములం బ్రసన్నయై
యున్నది యుబ్బిపారు గలితాయత కంకణ మౌక్తికద్యుతి
చ్ఛన్న మృదుప్రవాహములు సాచి చిరాగతు బ్రాణనాయకుం
జెన్నుగనింతు కౌగిటికి జేర్చు చెలంగు మృగాక్షి కైవడిన్
—శ్రీరంగ 1-103

రంగధామానికి ఉభయ పార్శ్వాల్లో పారె కావేరీనది రెండు బాహువుల్ని సాచి (రంగధామం అనే) ప్రియుడిని కౌగిలించిన మృగాక్షివలె ఉందని చెప్పటం మనోహరం, మధురోహ.

శబ్దార్థగత చమత్కారం : శబ్దం-అర్థం రెండింటినీ ఆశ్రయించి శైలీ విన్యాసంతో మనోహరమైన అర్థాన్ని అందించేది.

ఉదా: సీ. శిఖరాగ్రగతి హరి ప్రఖరా శనిక్రూర
నఖరాభి హత నష్ట నాగకులము
శబరీ పరిప్రస్థ కబరీ కలాప వి
క్లబరీణ ఘన భుజంగ ప్రజంబు
రహిత దోషాటోప మహితరత్న ప్రభా
పిహిత బృందారక బృంద సరణి
వితత సానుస్వాన సతత నిర్ఝరజల
ప్లుత తరు ప్రత్యంత భూమికులము

గీ. బహుళ గైరికమయ దృషత్ప్రభవరాగ
కల్పితాలీక దివసాపగమ నికామ
విపుల వార్వాహ సందోహ విభ్రమంబు
రంధ్ర కటకంబు ధరణీ ధరేంద్రమొకటి — శ్రీరంగ 4-250

సీసం నిడివిగల పద్యం. పర్వతం ఎత్తును (నిడివిని) సూచించే విధంగ ఈ వర్ణనకు సీసపద్యం స్వీకరింపబడింది. పద్యంలోని శబ్దార్థాలు పర్వతవర్ణనకు ఎంతో అతికినట్లుగా ఉన్నాయి.

అలంకార గత చమత్కారం : ఇది ఈ అధ్యాయంలోని "అలంకార సరణులు" అనే ఉపశీర్షికలో ప్రదర్శింపబడింది. పునరుక్తి పౌతుందని ఇక్కడ మళ్లీ చెప్పలేదు.

రసగత చమత్కారం, "రసస్థితి" అనే ఉపశీర్షికలో ఈ విషయం చర్చింపబడింది.

ప్రఖ్యాతవృత్తి గతాలు : "ప్రతిపాద్య వస్తుస్వభావ సిద్ధమయిన ప్రకృతి నందించునట్లు రచించుట యందీ ప్రఖ్యాత వృత్తిగతమైన చమత్కారముం డును. ప్రసిద్ధములయిన పాత్రలు మనములందు మెదలుట తోడనే వానివాని సహజమగు ప్రకృతులు ప్రత్యక్షమగుచుండును. ఆ సహజ ప్రకృతులను హృదయములందు నిలుపజాలిన వర్ణనములు సహృదయ హృదయ రంజకములగును. *1"

---

*1 ఆంధ్ర సాహిత్యము చమత్కార వైభవము-పుట 161

ఉదా: మ. కనియెం గర్కశ మేచకాంగు నతిరక్త క్రూర విస్ఫార లో
చను నుత్తీర్ణ కరాళ ఖర్పరకచశ్మశ్రున్ వినీలాంబరున్
ఘన కుంజాంతరితుం గతాగత జనాకార ప్రతీక్షాపరున్
హననోత్సాహు గరాగ్రలోహ వలయోన్యద్యస్కరున్ దస్కరున్
— శ్రీరంగ 3-184

పై పద్యంలో పాఠకులకు తస్కర స్వరూపం సాక్షాత్కారమౌతుంది.

మహాస్రగ్ధర: కనిరాభూతేశు లత్యుత్కట శకట మశూక ప్రతీకాశ కేశీం
జనితో దన్వోపతాప శ్లథమలిన వపుర్జాత మాంసాగ్ర గంధిన్
ఘన కావేరీ జలౌఘగ్రసన వివృత వక్త్రస్ఫురద్భూరి దంష్ట్రా
శని సంఘర్ష ప్రభూత జ్వలదనల శిఖాజాల శాచిం బిశాచిన్
— శ్రీరంగ 3-184

పై పద్యంలో పిశాచ స్వరూపం కన్నులకు కట్టినట్లు వర్ణింపబడింది.

సమాసగత చమత్కారం : వస్తు స్వరూప సాక్షాత్కారం చేసే దీర్ఘ సమాస రచన చమత్కారోపేతంగా ఉంటుంది.

ఉదా: మ. హతుగావించె సపుత్ర మిత్రముగ దీప్తాస్త్రంబులం గాంచన
క్షితిభృద్ధన్వి ధరాధరోద్ధరణ శక్తిప్రౌఢ దోర్దండ సం
గత భాస్వద్ఘన చంద్రహాస నిశితోగ్ర క్రూర ధారాసమా
హత భీత ప్రపలా యితాది తిసుతేంద్రారావణున్ రావణున్
— శ్రీరంగ 2-149

పై పద్యంలో మొదటి పాదానఉండే కాంచన శబ్దంనుండి పద్యం చివరి వరకూ ఒకే సమాసంగ రచింపబడింది. ఈ దీర్ఘసమాసం రావణుడి బలదోర్ప న్నతిని సూచిస్తుంది. అంతటి బలసంపన్నుడిని హతుని చేసినవాడు మరెంతటి బలవంతుడగునో చమత్కారంగా చెప్పక చెప్తుంది.

కవిసమయ గత చమత్కారం . ఈ అధ్యాయంలో "కవిసమయాలు" అనే ఉపశీర్షికలో ఈ చమత్కారం ప్రదర్శింపబడింది

గుణగత చమత్కారం : ఈ అధ్యాయంలో "గుణాలు" అనే ఉపశీర్షికలో ఈ చమత్కారం ప్రదర్శింపబడింది

రీతిగత చమత్కారం : ఈ అధ్యాయంలో "రీతులు" అనే ఉపశీర్షికలో ఈ చమత్కారం ప్రదర్శింపబడింది (పుట )

వృత్తిగత చమత్కారం : ఈ అధ్యాయంలో "వృత్తులు" అనే ఉపశీర్షికలో ఈ చమత్కారం ప్రదర్శింపబడింది.

పాకగత చమత్కారం : ఈ అధ్యాయంలో "పాకాలు" అనే ఉపశీర్షికలో ఈ చమత్కారం ప్రదర్శింపబడింది.

శయ్యాగత చమత్కారం : ఉ అధ్యాయంలో "శయ్య" అనే ఉపశీర్షికలో ఇది ప్రదర్శింపబడింది

వస్తుగత చమత్కారం : ఈ అధ్యాయంలో "వస్తువివేకం" అనే ఉపశీర్టికలో ఈ అంశం చర్చింపబడింది.

శ్రీరంగ మహత్త్వము బహువిధ చమత్కారయుతంగ ఉందని పై పరిశోలనంవల్ల తెలిసింది.

## 4. 1. 17. చిత్రరచనలు :

శ్రీరంగమహత్త్వములో భైరవకవి "చెప్పెద కావ్యము......చిత్రరచనల చొప్పడ" (శ్రీరంగ 1-27) అన్నాడు. రసభావాల మధ్య వాటికి అడ్డంతగలని విధంగ పరిమితప్రయోజనాలతో చిత్రకవితను అనేకకవులు కావ్యాల్లో ప్రయోగిలచారు. కవి తన ప్రజ్ఞాపాటవంచేత వ్యుత్పత్త్యభ్యాసాది గుణాఢ్యం వల్ల శబ్దగత పాండిత్య ప్రకర్షవల్ల రసపోషణం చేస్తూ అక్కడక్కడ చిత్ర కవిత్వాన్ని వెలయిస్తూ కావ్యాన్ని నిర్మిస్తాడు. సామాన్య కవికి అలా కుదరక పోవచ్చు. చిత్ర కవితా రీతులు అనేకం. వాటిలో ఏవి ఎక్కడ ప్రయుక్తమైతే సమంజసంగ ఉంటుందో సుకవి గుర్తించగలడు. సందర్భోచితంగ ప్రయుక్తమైన చిత్రకవితలు కావ్యానికి శోభను చేకూరుస్తాయి.

పెక్కు రీతులుగా విలసిల్లిన చిత్రకవితల్లో శ్రీరంగ మహత్త్వములో భైరవకవి కొన్నింటిని ప్రయోగించాడు. వాటినివరుసగ పరిశీలించవలసిఉంది.

సర్వలఘు చిత్రరచనం : గురు విరహితంగ అంటే కేవలం లఘువుల్తో పద్యాన్ని లేదాంగద్యాన్ని రచించటం ఒకచిత్రం.

ఈ క్రింది పద్యంలో కొంత సర్వలఘు రచన పాటింపబడింది—

"కం. పొడగని యడరెడు భయమున
నడుగులు దడబడగ హృదయమదరగ జెదవుల్
దడపుచు నడుకుచు వడవడ
వడకెడు" — శ్రీరంగ మ. 3-64

భయంతో చిన్నబోయిన విప్రుని (చిన్న అక్కరాలతో) సర్వలఘువుల్తో వర్ణించటం సమయోచిత చిత్రరచనం.

తృతీయాశ్వాసంలో శంభు స్తుత్యాత్మకమైన సర్వలఘు రచనా ప్రాపిణ్యానికి మచ్చుతునుక (ఈ గద్యలో మధ్యన మూడుగురువులు ఉన్నాయి.)

పంచమాశ్వాసంలో సూర్య స్తుత్యాత్మకంగా ఉండిన రచన లయహారిలో ఉంది. లయహారి సర్వలఘు రచన.

ఇలా సర్వలఘు చిత్ర రచనలు శ్రీరంగ మహత్త్వములో చోటు చేసుకున్నాయి.

శబ్దాలంకార చిత్రాలు : వీటిని గురించి ఈ అధ్యాయంలో "అలంకార సరణులు" అనే ఉపశీర్షికలో చెప్పటంచే (పుట ) మళ్లీ ఇక్కడ చెప్పలేదు.

బంధ కవిత : వార్తాకవి రఘునాథయ్య లక్షణదీపికలో బంధ కవిత్వాన్ని చిత్రకవితలోని భాగంగా చెప్పాడు. భైరవుడి స్వస్థలానికి సమీపప్రాంతమైన ఉమామహేశ్వరంలో గల శాసనాల్లో ఇలాంటి చిత్ర కవితలు ఉన్నాయి. భైరవుడికి ముందు బంధ కవిత్వం చెప్పిన వారున్నారు. ఇలాంటి ప్రభావం వల్ల భైరవకవి శ్రీరంగ మహత్త్వములో బంధ కవిత్వాన్ని ప్రయోగించాడని భావించవచ్చు.

భైరవకవి శ్రీరంగ మహత్త్వములో రచించిన బంధాలు మూడు. అవి-చక్ర, నాగ, గోమూత్రికా బంధాలు. బంధ కవితా భేదాల్లో ఎన్నో ఉన్నాయి. అయితే భైరవకవి ఈ మూడు బంధాలనే స్వీకరించి రచించటంలోని ఉద్దేశ్యం

ఇదైఉంటుంది.— శ్రీరంగ నాయకులు (సుదర్శన) చక్రధారి. కనుక చక్ర బంధాన్ని ప్రయోగించి ఉంటాడు. ప్రత్యేకంగా సుదర్శన చక్రాన్ని వర్ణించే సీసపద్యం శ్రీరంగ మహత్త్వములో (2-102) రచించటం కూడ గమనార్హం. ఇక నాగబంధానికి శేష బంధం అనికూడ నామాంతరం. వైష్ణవంలో శేషునికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఆ ప్రాముఖ్యాన్ని ఎరిగినవాడు కావటంవల్లనే భైరవకవి కృత్యాది రెండో పద్యంలోనే శేషుని స్తుతించాడు. కనుక శేషబంధాన్ని భైరవుడు ఈ వైష్ణవ కృతిలో రచించి ఉంటాడు. శ్రీరంగ నాయకులు గోవిందుడు. గోశబ్దానికి ఎన్నో అర్థాలున్నాయి. వాటిలో ధేనువు అనే అర్థం ఒకటి. గోవింద కథాత్మకమైన కావ్యంలో గోముత్రికా బంధం రచించటం సందర్భోచితం. ఇలా ఈ మూడు బంధాలను కూడ భైరవకవి శ్రీరంగ మహత్త్వములో ఎంతో ఔచిత్యంగా ప్రయోగించాడనవచ్చు.

## చ క్ర బ ం ధ ం :

ఈ పద్యంలోని కొన్ని పదాలకు పూర్వముద్రిత ప్రతుల్లోని పాఠాలు ఇలా ఉన్నాయి. చరన్నాకిద్రుమా 1912, చరన్నారద్రుమా 1979, భావ్యాళీన సురాభవాగ్విభవ 1912, భావ్యాళీన సురాదిశౌ విభవ 1912, ప్రాముఖ్యనందేందుభా 1912, 1979. వాసవతతః, 1912, 1979 సురాభవాగ్విభవ 1979

1* 2* 3* 3 2 1

శా. నవ్యశ్రీ కప రాతి భైవర చరన్నాకిద్రుమావర్ష భాగ్
భవ్యారంభక షుష్మ రస్త వశుచి స్వాంత ప్రపూర్ణ ప్రభా
భవ్యాంగ ప్రసవాం కవత్సరతతః ప్రాముఖ్యదానం దభా
భావ్యాళీన సురాభ గీర్విభవ శోభాభద్ర భాస్వన్ని భా–శ్రీరంగ 5-263

పై పద్యంలోని మొదటి మూడు పాదాల్లో మందంగా అచ్చువేయబడిన అక్షరాలవల్ల ఈ క్రింది ఉద్ధారాలు ఏర్పడుతాయి.

1) 1*+1 = శ్రీరంగ వర్ణనం
2) 2*+2 = రాఘవాంకితము
3) 3*+3 = భైరవ రచితః

పై పద్యంలోని పదాలను అవసరమైనచోట చిరుమార్పు చేసి ఉద్ధారాలకు సరైన అర్థంవచ్చేలా సరిదిద్దినవారు డా॥ దేవళ్ల చిన్నికృష్ణయ్యగారు

పై పద్యాన్ని ఇమడ్చిన చక్రబంధ చిత్రం ఇలా ఉంటుంది.



పై చక్రబంధ చిత్రంలో వెలుపలనుండి మూడోవలయంలో "శ్రీరంగ వర్ణనం" అనీ, ఆరవ వలయంలో "రాఘవాంకితము" అనీ. ఎనిమిదో వలయంలో "భైరవ రచితః" అనీ ఉద్ధారాలు ఉండటం ఈ బంధంలోని చిత్రం. భైరవకవికి పూర్వం చక్రబంధాన్ని కావ్యాల్లో/గ్రంథాల్లో రచించిన తెలుగు కవులు బంధంలో రెండు ఉద్ధారాలు వచ్చేటట్లుగా రచించారు. మూడుఉద్ధారాలు వచ్చేటట్లు చక్రబంధాన్ని రచించిన కవుల్లో భైరవుడే ఆద్యుడు. ఈ బంధంలో రెండు ఉద్ధారాలను మాత్రమే పరిశోధకులు ఇంతవరకు గుర్తించారు. "రాఘవాంకితము" అనే మూడో ఉద్ధారం బంధంలో ఉన్నట్లు ఇదివరలో ఎవ్వరూ తెలుపలేదు. *1

*1 ఈ విషయాన్ని గుర్తించి ప్రప్రథమంగా తెలిపిన వారు వైద్యం వేంకటేశ్వరాచార్యులు (కర్నూలు).

## నాగ / శేషబంధం :

భైరవకవి ఈ బంధాన్ని చంపకమాలలో రచించాడు. ఆ పద్యమిది—

1 2 3 4 5 5* 6 7 8 9
చం. వర గుణ రత్న విశ్రుత సువర్ణ వతంససబాల సత్వర
10 11 12 1* 13 13* 14 3* 15 6*
స్ఫురిత మరాల శ్రీగురువచోవశ చిత్త విలాస వాసవా
16 8* 17 10* 18 18* 19 12* 2* 14*
వరజ సమాంగ వైరి కరి వారి ధరా నిల దిరమాంచితో
4* 15* 7* 16* 20 20* 9* 17* 11* 19*
తర సళు భానురక్త తత తత్పరచాగయ మున్త్రి రాఘవా

చంపకమాలలో 84 అక్షరాలుంటాయి. నాగబంధ చిత్రంలో 20 సంధి స్థలాల్లో 20 అక్షరాలు రెండుసార్లు ఆవృత్తి ఔతాయి. కనుక చిత్రంలో మనకు 64 అక్షరాలుగా కన్పడుతాయి. ఈ నాగబంధ చిత్రం ఇలా ఉంటుంది—



నాగద్వయ బంధంగా కూడా చిత్రాన్ని గీయవచ్చు. నాగద్వయ బంధంలో కూడ ఈ పద్యం ఇముడుతుంది *1. ఆ చిత్రం ఇలాఉంటుంది.

## నాగద్వయ బంధము



పై బంధాలలో తల, తోకలలో రెండేసి అక్షరాలు ప్రక్క కుండలులలో ఒక అక్షరం క్రింది కుండలిలో రెండేసి అక్షరాలు ఉన్నాయి. కొన్ని నాగబంధంలోని అక్షరాలు మరోవిధంగా కూడా ఇముడ్చటం ఉంది.

పై చిత్రాలలో 20 సంధిస్థలాలలో రెండుసార్లు ఆవృత్తి అయిన అక్షరాలు పై పద్యంలో మందంగా ఉండే అక్షరాలలో గుర్తింపబడినవి. వాటి వివరణ ఇది —

---

*1. వైద్యం వేంకటేశ్వరాచార్యులు గారు ఈవిషయాన్ని గుర్తించి నాగద్వయ బంధాన్ని పటం గీసి అందులో పై పద్యాన్ని ఇమడ్చి అందించారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | వరగుణ | (మొదటిపాదం) | —1* | శ్రీగురు | (రెండోపాదం) |
| 2. | రత్న | ( ,, ) | —2* | ధీర | (మూడోపాదం) |
| 3. | విశ్రుత | ( ,, ) | —3* | విలాస | (రెండోపాదం) |
| 4. | విశ్రుత | ( ,, ) | —4* | తర | (నాల్గోపాదం) |
| 5. | సువర్ణ | ( ,, ) | —5* | వతంస | (మొదటిపాదం) |
| 6. | వతంస | ( ,, ) | —6* | వాసవా | (రెండోపాదం) |
| 7. | సభాల | ( ,, ) | —7* | శుభానురక్త | (నాల్గోపాదం) |
| 8. | సత్వర | ( ,, ) | —8* | సమాంగ | (మూడోపాదం) |
| 9. | సత్వర | ( ,, ) | —9* | తత్పర | (నాల్గోపాదం) |
| 10. | స్ఫురిత | (రెండోపాదం) | —10* | వైరి | (మూడోపాదం) |
| 11. | మరాల | ( ,, ) | —11* | మన్త్రి | (నాల్గోపాదం) |
| 12. | మరాలి | ( ,, ) | —12* | ధరానిల | (మూడోపాదం) |
| 13. | వచో | ( ,, ) | —13* | వశ | (రెండోపాదం) |
| 14. | చిత్త | ( ,, ) | —14* | రమాంచితో | (మూడోపాదం) |
| 15. | విలాస | ( ,, ) | —15* | సశుభాను | (నాల్గోపాదం) |
| 16. | వరజ | (మూడోపాదం) | —16* | రక్త | (నాల్గోపాదం) |
| 17. | సమాంగ | ( ,, ) | —17* | చాగయ | (నాల్గోపాదం) |
| 18. | కరి | ( ,, ) | —18* | వారి | (మూడోపాదం) |
| 19. | ధరానిల | ( ,, ) | —19* | రాఘవా | (నాల్గోపాదం) |
| 20. | తత | (నాల్గోపాదం) | —20* | తత్పర | (నాల్గోపాదం) |

## గోమూత్రికాబంధం :

కం. హరి పద సర సిజ మధుకర సురభి దసిత మూర్తి రామ
భోగసురావరా
కరి రదసురకుజ విధుకర శరదుదసిత కీర్తి ధామ
చాగయ రావరా

గోమూత్రం బొట్లు బొట్లుగా పడటాన్ని కవులు గుర్తించారు. ఆ బొట్లు ఈ బంధం చివరలో ఉన్నాయి. మధ్యలో కూడా ఉండేటట్లు బంధాన్ని వేయవచ్చు.

బంధ చిత్రం—



పై మూడు బంధాల్లో కూడా కృతిభర్త పేరు వచ్చింది. చక్రబంధంలో కూడా ఉద్ధారంలో కృతిభర్త పేరు వచ్చింది.

ముక్తపదగ్రస్తం మొదలైన శబ్దాలంకార చిత్రాలు అలంకార సరణులు అనే ఉపశీర్షికలో ప్రదర్శితమైనవి.

ఇలా భైరవకవి "చిత్రరచనలు చొప్పడ" గా శ్రీరంగ మహత్త్వమును రచించారు.

## 4. 1. 18 వర్ణనలు :

ప్రాచీన అలంకారికుడు దండి తన కావ్యాదర్శంలో—

"శ్లో. నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనం
ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనం
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయానిచ
ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్య మిష్యతే"—అని

నగరం సముద్రం మొదలైన అష్టాదశ (18) వర్ణనలతో ఉండేది కావ్యమని చెప్పి- "ఏషామష్టాదశానాం యేః కైశ్చిదూన మపిష్యతే" అని ఆ పద్దెనిమిదింటిలో మూడు నాల్గు వర్ణనలు లేకున్నాకూడ మహాకావ్యమే ఔతుందని తెలిపాడు.

అప్పకవీయంలో పై 18 వర్ణనలేగాక వేట మున్యాశ్రమం కన్యాంగ సౌందర్య కథనం దౌహృదం అనే నాలుగు వర్ణనలతో 22 వర్ణనలు ఉండేది మహాకావ్యమని చెప్పబడింది.

సాహిత్య దర్పణంలో దండిచెప్పిన పద్దెనిమిదింటిలోని జలక్రీడా ద్యూత నాయకాభ్యుదయాలు మూడున్నూ వదలి అప్పకవి అధికంగా చెప్పిన వేట, మున్యాశ్రమ, కన్యాంగ సౌందర్య (కథన), దౌహృద వర్ణనలను నాల్గింటిలో మృగయా మున్యాశ్రమ వర్ణనలు రెండు మాత్రమే స్వీకరించి కొత్తగ-స్వర్గ యాగ, సంధ్యా, రాత్రి, ప్రదోష, ధ్వాంత, వాసర వర్ణనలు ఏడుచేర్చి మొత్తం 24 వర్ణనలు మహాకావ్యంలో ఉండాలన్నట్లు కలదు.

అలంకార శేఖరంలో కావ్యాదర్శోక్తములలోని కుమారోదయ మంత్ర ద్యూత వర్ణనలు మూడున్నూ, అప్పకవి అధికంగచెప్పిన నాల్గింటిలోని కన్యాంగ సౌందర్య దౌహృద వర్ణనలు రెండున్నూ వదలి-రాజ, రాజ్ఞీ, దేశ, గ్రామ, నదీ, సరో, వన, హయ, గజ, స్వయంవర, పుష్పాపచయ, కళా, వయస్సంధి, ధాతు వర్ణనలు గ్రహింపబడి మొత్తం ముప్పైరెండు వర్ణనలు మహాకావ్యాల్లో ఉంటా లని కలదు.

శ్రీరంగ మహత్త్వమును భైరవకవి "వర్ణనల నింపు చిలుకగ చెప్పెద" అన్నాడు. పూర్వోక్త లక్షణ గ్రంథాల్లో చెప్పబడిన వర్ణనలు ఏవేవి శ్రీరంగ మహత్త్వంలో చోటుచేసుకున్నాయో పరిశీలింతం—

నగర వర్ణనం : శ్రీరంగ మహత్త్వము చతుర్థాశ్వాసంలో 256 పద్యం నుండి 276వ వచనం వరకు (20 పద్యాలు, 1వచనం) నగర (పుర) వర్ణనం రమణీయంగ చేయబడింది.

కం. ఏ పట్టణంబు కంటెను
నా పురవర మమరు విభ్రమాలస లలనా
నూపుర రవ మంజులమణి
గోపురమై విభవ విజిత గోపురమగుచున్ — శ్రీరంగ 4-256

నగరవర్ణనం పైపద్యంతో ప్రారంభమై కోట, పరిఖ, మేడలు, గోపురాలు, చంద్రశాలలు, అబ్జముఖులు, శృంగార వనాలు, సరోవరాలు, ఉద్యానవనాలు, విలాసినులు, వారసతులు, మదవారణాలు, ఖర్జులాణాలు, విప్రులు, రాజకుమా రులు, వైశ్యులు, బాహ్యవనాలు, మలయానిలం మొదలైన వర్ణనలు కలిగి ఈ క్రింది వచనంతో పురవర్ణనం ముగింపబడింది—

"వ. మరియు రిపుహృదయ పుటభేదనంబగు నప్పుట భేదనం బమరావతీ పురంబునుంబోలె ననిమిషానందకరంబై. యలకా పట్టణంబునుంబోలె ధనదనివాసంబై, మధురాపురం బునుంబోలె నుల్లసత్పుండరీకంబై పుండరీకంబునుంబోలె బురుషోత్తమా వాసంబై, పురుషోత్తమా వాసంబయ్యును వీరభద్ర స్థల విహారంబై, వీరభద్ర స్థల విహారంబయ్యును దక్షయాగ మహోత్సవంబై దక్షయాగ మహోత్సవంబయ్యును సర్వమంగళాభి రామంబై యమరు, నందు సుందరుల నయనంబుల యందు శ్రుతి సీమాలంఘనోద్యోగంబును. పంగుల యందు పదహీనతయు, గరులయంద మదోద్రేకంబును, తరులయంద శాఖా చలనంబును, ప్రబంధంబులయందు వర్ణబంధంబులును, శుకశారికాదుల యందు పక్షపాతంబులును, గోకులంబుల యందు భంగంబులును. భృంగంబుల యందు మధుపాన ప్రసంగంబులును, వృద్ధ దౌవారికాదులయందు దండ గ్రహణంబులును, దక్క దక్కడల లేక యొప్పును"— శ్రీరంగ 4-276

ద్వితీయాశ్వాసంలో 109 నుండి 112 వరకు గల పద్యాల్లో స్వల్పంగ పట్టణ వర్ణనం రమణీయంగ రచింపబడింది.

సముద్ర వర్ణనం : ద్వితీయాశ్వాసంలో సముద్ర వర్ణనం చేయబడింది మచ్చుకు రెండు పద్యాలు—

మహాస్రగ్ధర: ... ...అత్యుద్భట ఖదుర ధురాపాత భీతావనీ భృ
త్కుల సంరక్షావినిద్రుం గుపిత జలచర క్రూర సంఘట్ట నోద్య
జ్జల నిర్ఘోషాది రౌద్రుంజనితమణీ సుధాచంద్ర లక్ష్మీసురద్రుం
ప్రళయాంతస్సుప్త విశ్వంభర భరితకృపా ప్రాప్తభద్రున్ సముద్రున్
— శ్రీరంగ 2-145

మ. అరవింద ప్రభవుండు గన్గొనియె మధ్యస్థాన సుప్తాంబుజో
దర పర్యంక భుజంగ పుంగవ సముద్యద్భూరి భోగాగ్రవి
స్ఫురితానేక నిరర్ఘ దివ్యమణి సంభూత ప్రభాపుంజ పం
జర జాతాక్ష పద భ్రమాకులిత భాస్వత్సారధిన్ నీరధిన్
— శ్రీరంగ 2-207

ద్వితీయాశ్వాసంలో 208వ వచనంలో సముద్ర వర్ణనం సుదీర్ఘంగా అత్యద్భుత మనోహరంగ రచింపబడింది.

శైల వర్ణనం : శ్రీరంగ మహత్త్వము చతుర్థాశ్వాసంలో 250వ పద్యంలో "శిఖరాగ్రగతి హరి ప్రఖరాశని క్రూర నఖరాభిహత నవ్య నాగకులము" ఇత్యాదిగా శైల వర్ణనం చేయబడింది. ఈ పద్యం ఈ అధ్యాయంలో మరోచోట ఉదాహరింపబడటంచే విస్తరభీతిచే పద్యాన్ని పూర్తిగ ఇవ్వలేదు.

ఋతువర్ణనం : ద్వితీయాశ్వాసంలో 20వ పద్యం నుండి 50వ పద్యం వరకు ఋతువర్ణన హృద్యంగా చేయబడింది. మచ్చుకు—

వర్షాకాల వర్ణనం—

మ. జలదాటోప విశాల మింద్ర ధనురంచ ద్వారుణీకూల ము
త్కలి కాదంబ కదంబ సాలవన మధ్యస్ఫార సవ్యావళీ
కలనావాల ముదారకేతక పరాగవ్యాళ ముర్వీధర
స్థల నృత్యన్మద కేకిజాలమగు వర్షకాల మొప్పెంగడున్
— శ్రీరంగ 2-26

హేమంత వర్ణనం—

సీ. ప్రత్యూష జృంభిత ప్రాలేయ దుర్లక్ష్య
మాణ పద్మ భవాండ మండలంబు
సంకుల ద్వాపర సమయ మందిర భవ
ద్యోత ఖద్యోత భానూత్కరంబు
వితత నిశీథినీ వేళా సహస్ఫీత
శీతదృగ్బింబ విజృంభణంబు
శీతాంశు దుర్దిన వ్రాత సంచిత కరీ
షాగ్ని ధూమావృతా శాంతరంబు

తే. నగుచు నంతంత కెగెసె నీహార ధరణి
ధర సముద్ధూత నిబిడ శీతల సమీప
ణాభి సంపాత జాత మా యాతభీత
జంతు సంతానమగుచు హేమంతమంత — శ్రీరం 2-33

వసంత వర్ణనం—

సీ. కలకంఠ మధుర వాగ్వైఖరీ కారణ
మహిత సారస్వత మంత్రవిద్య
నానావనీజాత నవయౌవన ప్రదాం
చిత రసాయన యోగసిద్ధ ఘటిక
కుసుమసాయక నిరంకుశ రాజ్య సప్తాంగ
సన్నాహ వైభవా స్థానసీమ
మందమందాగత మలయానిలాంకుర
వ్యాపార సుఖ ఘంటా పథంబు

తే. చేతనద్వంద్వ సౌఖ్య సంజీవకరణి
విరహి దశమద నావేశ విషయవేళ
శిశిరమదకుంభి సంరంభ సింహమూర్తి
లీల నేతెంచె మధుమాస కాలమంత— శ్రీరంగ 2-39

సూర్యోదయ వర్ణనం : శ్రీరంగ మాహాత్మ్యములో ప్రత్యేకంగ సూర్యోదయ వర్ణన లేదు అయితే సూర్యుడు ఒకభక్తునికి ప్రత్యక్షం కావటం వర్ణింపబడింది. (శ్రీరంగ 5-201)

ఉద్యానవన వర్ణనం : చతుర్థాశ్వాసంలో 11 పద్యాల్లో (76-86) ఉద్యానవన (విహార) వర్ణనం రమణీయంగ రచింపబడింది. మరియు శృంగారవన వర్ణనం (4-263), బాహ్యవన వర్ణనం (4-273) కలదు. మచ్చుకు—

సీ. మధు షట్పదంబుల మధుపాన భూములు
రాజకీరంబుల రచ్చపట్లు
పుంస్కోకిలంబుల భోజన శాలలు
మలయానిలంబులు మలయు నెడలు
నవ మయూరంబుల నాట్యరంగంబులు
మకరకేతను సభా మంటపములు
విట విటీజనముల విరుల చప్పరములు
మధులక్ష్మి నైపథ్య మందిరములు

తే. అలవసంతుని లీలా విహారసీమ
లిట్టలంబగు వలపుల పుట్టినిండ్లు
చిర పరిశ్రాంత పథిక సజీవనములు
పావనములప్పురంబున బాహ్యవనులు — శ్రీరంగ 4-273

జలక్రీడా వర్ణనం : లక్ష్మీదేవి–రంగనాయకుల జలక్రీడాభి వర్ణనం శ్రీరంగ 4-91 నుండి శ్రీరంగ 4-100 వరకు మనోహరంగ చేయబడింది. మచ్చుకు—

సీ. ఉరువడి నెదురీదు నొకచోట వెస్నగ్రుంకి
తలచూప కొక్కింత తడవడంగు
నడుమను మీద వెల్వొడు నెటనైనను
మొనసి చీరగ మారు మొగము సేయు
మేనువంచన దాచి మీదికి బదమెత్తు
రాజహంసల తోడ రాయిడించు
సుడివడి కమలముల్ వడ్డిపెప్ప బలమున
నుదకంబు తనకు రానొత్తి తిగుచు

తే. దనరు పద్మాసనస్థుడై మునియుబోలె
నిగుడు జపమున నెక్కుడు నేర్పుచూపు
నురగ తల్పుడు చంద్రపుష్కరిణి యందు
జలధి సుతగూడి జలకేళి సల్పునపుడు. — శ్రీరంగ 4-94

పై పద్యంలో జలకేళితోపాటు దశావతార వర్ణనం కూడ శ్లేషగా చెప్ప బడింది. జలకేళి వర్ణనకు మరోపద్యం మచ్చుకు—

తే. తడిసి యంటిన జిలుగులో దళుకు చూపు
నిజ నితంబంబుపై జూడ్కి నిలుపు చక్రి
నేత్రమున లక్ష్మిచల్లిన నీరధార
యతని ముఖపద్మమున నాళమనగ వెలసె — శ్రీరంగ 4-95

ప్రయాణ వర్ణనం : ద్వితీయాశ్వాసంలో మన్మథుని ప్రయాణం అత్య ద్భుతంగ మనోహరంగ వర్ణింపబడింది. ఆ వర్ణనగల వచనం ఇది—

"వ. ముక్కంటి మగతనంబు సగంబుగా బెనంగిన నెరజోదు ప్రమోదంబున బ్రయాణ సమయ సముచిత సన్నాహ సంరంభ విజృంభితుండై బొండు మల్లెల బొమిడికంబును, గొజ్జంగి వజ్రాంగియు జొన్నగుబ్బెలరాగె వల్లులను మెరయ హరినీల జాలంబుల డాలునేలు నలువునం బొలుపు మిగుల కొదమ తుమ్మెద గొనయం బెక్కించి మించుగా దొడిగిన యించు విల్లునం బెల్లునిగిడి పల్లవుల యుల్లంబుల గాడి పారు కోరచూపులుగల కళావతుల కలికి కనుజిలుకడల ధగధగలం బొలయు మెరుగులు గురిగొన బననికుసుమ్మరసముం గులికి పులుగడిగి గరులుదీర్చి వంకలొత్తిన గ్రొత్తలై యున్న మదన మోహన వశీకరణ సంతాపనాభి ధానంబుల నొప్పారు సహకార సారసాశోక శిరీష కోరక ప్రదరంబులు నిలచి సవరించిన కవదొనలు ధరియించి కట్టాయితంబై విరిదమ్మి బండి కండ్లును బిసకాండపుటిరుసులును బొగడ మొగడల చీలలును దొగల నొగలును మొగలి రేకుల పలుకయు గలువకాడియు గురువేరు వాగరంబులును సంతరించి వసంత సారథి తిన్ననైయున్న క్రొన్నన మునికోల గదల్చి యదల్చినం గెరలి బెరలి కొట్టుచు మిన్నులపై బారు చిలుకవారువంబుల రయంబున దళతళం బొలయుదిక్కుల బిక్కటిల్ల వెన్నెలనెదచల్లు వెల్లియు గలిగి తనరు తన రథంబు రతసమేతంబుగా నెక్కి మధు మధుర సపాన సంభ్రమద్భ్రమర ఝుంకార కాహళరావంబుల జెల గనుభయపార్శ్వంబుల గదలివచ్చు కలకంఠ వీరభట పటలంబుల నంతకంతకు సంతసం బొలయ సేనా ముఖంబునం గలయబొలయు మలయానిలంబు చేతనాధూతంబులగు తరువ్రాతంబుల నెసగు కుసుమ పరాగంబు నభోభాగంబున బర్వి సర్వంబు పదిలంబగు నిజ ప్రతాపానల స్ఫులింగ జాలంబు ననుకరింప నరుంధతిపతి యాశ్రమంబు పొత్తించె యచ్చుట" — శ్రీరంగ 2-78

యుద్ధ వర్ణనం : విష్వక్సేన కరులకు దేవ సందోహానికి జరిగిన యుద్ధం శ్రీరంగ 3-230 నుండి 3-241 వరకు 12 పద్య గద్యాల్లో అత్యద్భుతంగ వర్ణింపబడింది. మచ్చుకు—

"వ. సురసందోహంబు లుదగ్ర మండలాగ్ర పరిఘ పట్టిస ప్రాస పాశ ముఖ ప్రహరణ బాణపాణులై-మరి మురదరం దరిమి నిజ ప్రతాపాతపాహతారి కుముదుండగు కుముదుండను దత్క్షేత్ర రక్షకుండు కంక రెట్టింప

హరికింకరుల బంపిన నా నిలింప సైన్యంబులపై గవిసి నిశితపవి నిష్ఠురంబులగు శరంబుల నురంబులు గాడనేసియు బ్రలయానల కరాలంబుల కంఠనాళంబులు దెగ్రవేసియు గాలోరగా భీలంబులగు శూలంబుల పాలంబుల నొంచియు నుదంచిత ప్రభాపిహిత వియత్తలంబులగు నత్తళంబుల గత్తళంబుల జించియు గరంబు భయంకరంబులగు ముద్గరంబుల శిరంబులు నొంచియు బ్రచండంబులగు గదాదండంబుల బిచండంబుల బగిల్చియుగనక పుంఖ మండిత శిఖండ జాలంబులగు భిండివాలమ్ముల నాడించియు దరము గాటమ్మునకు నోహటించి విముక్త రణ పాండిత్యులగు నాదిత్యులు విస్మృత హరిత్తులగు మరుత్తులును,విగళిత గంధర్వులగు గంధర్వులును,విఘూర్ణితాక్షులగు యక్షులు వితతక్షత వేదనా సాధ్యులగు సాధ్యులును, వికంపితాసువులగు వసువులునై రివ్విధంబున......" — శ్రీరంగ 3-237

మున్యాశ్రమ వర్ణనం : నైమిశారణ్యం మునులకు ఆశ్రయమైనది. అలాంటి నైమిశవన వర్ణనంలో మున్యాశ్రమ వర్ణనం (శ్రీరంగ 1-74, 1-75) గోచరిస్తుంది.

వాసరం : విష్ణువాసర వర్ణనం ఇలా చేయబడింది—

సీ. పటుఘోర పాతక పటల మహారణ్య
చటుల సముజ్జ్వల జ్వలన కీల
దుర్వార దారుణ దుష్కృత సంఘాత
మేఘ సంవర్త సమీరణంబు
భూరి భీషణ పాపపుంజ సముత్తుంగ
భూమి భృన్నిశిత దంభోళి ధార
దుస్సహ దురిత సందోహ నిరంతర
ధ్వాంత ప్రచండ మార్తాండ హేతి

గీ. క్రూర కల్మష కుంభి కంఠీ రవంబు
భీకరా ఘౌఘ పవన కుంభీనసంబు
కుటిల కిల్బిష పాథోధి కుంభసూతి
శ్రీ విష్ణు వాసరంబు — శ్రీరంగ 5-103

రాజ వర్ణనం : రాజపరమేశ్వరుడగు రాఘవ వర్ణనం (శ్రీరంగ 4-271 2-135), సుకీర్తి నరేంద్ర వర్ణనం (శ్రీరంగ 4-277), సోమక మహీచక్రేశ్వర వర్ణనం (శ్రీరంగ 5-58), కుశల నృపకుంజర వర్ణనం (శ్రీరంగ 5-128) మొదలైనవి రాజవర్ణనకు ఉదాహరణలు,

గ్రామ వర్ణనం : చతుర్థాశ్వాసంలో 211వ పద్యంలో అగ్రహార వర్ణనం చేయబడింది.

నదీ వర్ణనం : సీ. ఏ యేటి నడుదిన్నె నేప్రొద్దుజలిగొన్న
సికతా తలంబుల జెలగి చెలగి
యే తరంగిణీ నించు కించుక వికసించు
క్రొత్తమ్మి తావుల గొసరి గొసరి
యేనదీ క్రీడల నెసగు రాయంచల
కలకలంబుల కాత్మనలరి యలరి
యే సరిత్తటమున నేచిన కల్పక
మేదురచ్ఛాయల మెచ్చి మెచ్చి

గి. నేడు నొకనాడు బాయకున్నాడు శౌరి
యది మనోహరి స్వశ్రేయ సానుకారి
వివిధ తాపనివారి భూ వినుతవారి
కలిత కావేరి భవకరి కలభవైరి — శ్రీరంగ 1-101

శ్రీరంగ 1-102వ సుదీర్ఘ వచనంలో కావేరీ నది వర్ణనం రమ్యంగా చేయబడింది. మరియు శ్రీరంగ 1-102, 1-146, 1-89, 1-87, 1-140, 1-142 1-142, 1-144, 1-150, 2 194 పద్యాల్లోను నదీవర్ణనం చేయబడింది.

సరోవర వర్ణనం : చంద్ర సరోవర వర్ణనం, ప్రస్తావిత ఉద్యానవన మంటలి సరోవర వర్ణనలు ఉదాహరణ కాగలవు.

అరణ్య వర్ణనం : నైమిశారణ్య వర్ణనం సుదీర్ఘంగనే గాక రమణీయంగా కూడ రచింపబడింది. శ్రీరంగ 1-74, 1-75.

అశ్వ వర్ణనం :

చం. వెస గదలించి హెూయనిన వ్రేల్మిడిలోనన నిల్చి గంధరం
బుసుమక బిట్టదల్చినను ఘోరన సాగరమైన దాటు బ
ల్వసమున తాగలం దరిమి వాగె వదల్చిన జువ్వనం జవం
బెసగ గాలి మీరు భువినెన్ని కకెక్కిన ఖర్తులాణముల్
— శ్రీరంగ 4-269

గజ వర్ణనం :

చం. తనపగ వాతిలో గొనిన తప్పున కప్పత నాధుడాద్యులం
బెనుపగు కింక సంకెలల బెట్టిన భీతిగ గన్కనింగనీ
కనముల ముట్టి గట్టెడును గైవతి నెందు నమంద బృంహిత
ధ్వనులు దలిర్ప నొప్పు మదవారణముల్ జయకారణంబులై
— శ్రీరంగ 4-268

కళా వర్ణనం :

"వ. నాద సముద్భవంబులై మంద్ర మధ్యమ తాళభేదంబుల దమ
వలస నేకవింశద్విథంబులైన శ్రుతులకు నాధారంబులై మయూరాది రుతంబుల
చేత సంకేతంబగు షడ్జాది సప్తస్వరంబుల పరస్పర మేళనంబున నభిరామం
బగు గ్రామత్రయంబు నవలంబించి మతంగి తుంబురునారద కోలాహలోదితం
బులగు మతంబుల ననేక ప్రకారంబులైన మూర్ఛనల నింపుగడలొత్తు చతు
రుత్తరాశీతి తానంబుల ననూనంబులై సంపూర్ణ షాడబ సమేతంబులగు పంచ
దశ జాత్య వయవంబుల బరిశీలించి స్థాయిసంచారి ప్రముఖులగు చతుర్వ
ర్ణంబుల నాశ్రమంబుగా నెన్నబడిన ప్రసన్నాది ప్రభృతి కాలంకారంబులు
పశుమూడును బరిస్ఫురింప గంపిత స్ఫురితాహ తాందోళితంబుల లోనుగ
గల సప్తగమకంబులు మెరయ నష్టాదశజాతి ప్రభూతంబులై శుద్ధభిన్న గౌళ
దేసరి సాధారితోప రాగ సంజ్ఞల ప్రసిద్ధంబులైన శుద్ధ రాగంబులు ముప్పది
యారును రాగాంగంబు లిరువదియును భాషాంగంబుల నలువదియేడును
నుపాంగంబులు ముప్పది యొక్కటి త్రయాంగంబులు మూడునుగా బదిత
రంగుల నూటముప్పది యేడగు రాగంబులు వేళా విభాగంబులతో నాల

పంబు సేసి సమతాళపదక్రమ బంధురంబులగు నా సింధుర వరదు బిరుదాంకి తంబులైన ప్రబంధంబులు పాడ దొడంగె నపుడు కర్ణామృతాయ మానంబగు గంధర్వ రాగంబు నాకర్ణించి — శ్రీరంగ 3-295

సీ. సెలవులంబులు రాల జెవులొగ్గి మృగములు
తరలక మేపులు దలగి నిలిచె
గగన వీధుల బారుఖగము లుపాంత భూ
జములపై వ్రాలి నిశ్చలత నొందె
సురభి మంజుల ప్రాసాద మణికుట్టిమంబులు
గరిగి నీరై జాలు గట్టిపారె
దరులతా పంక్తులు మరల బ్రాయమువచ్చి
చిగురు గెమ్మోవుల జెలువు మిగులె

నచటి జనులెల్ల నితర కార్యములు దక్కి
సంతతానంద పరవశ స్వాంతులగుచు
జిత్రరూపుల కైవడి జేష్టలుడిగి
యున్నవారున్న చోటనె యుండిరపుడు — శ్రీరంగ 3-296

మరియు శ్రీరంగ 2-72, 2-73 పద్యాలుకూడా ఇందుకు ఉదాహరణలు

పుష్పాపచయం: పుష్పాపచయం శ్రీరంగ 2-61 నుండి 2-69 వరకు గల పద్యాల్లోను, శ్రీరంగ 4-76 సుదీర్ఘ వచనంలో మరియు శ్రీరంగ 4-77 నుండి 4-83వ పద్యం వరకు రమణీయంగ వర్ణితం మచ్చుకు—

కం. కావలియై మధుకర కృప
కావలి చరియించు నిలతాగ్రంబుననీ
కావలి విరులేటికి మన
కావలిదెస చంపకముల కరుగుదమబలా — శ్రీరంగ 4-82

కం. కలవాణి ప్రెంఖణము ప్రమో
కల వాసంతికల గోయగా నిక్కెదు నీ
కలవాటుగాదు ప్రాకం
గలవా చెలువారు వాని కడ కొమ్మలకున్ — శ్రీరంగ 4-83

పై వర్ణనలేగాక శ్రీరంగ మహత్త్వములో రతోత్సవం (శ్రీరంగ 4-267), వివాహం (శ్రీరంగ 1-40), కుమారోదయం (శ్రీరంగ 2-114, 5 247 1-41, 1-52, 1-64), మంత్రం (శ్రీరంగ 2-18, ధాతువర్ణనం (శ్రీరంగ 4-12), వృక్ష వర్ణనం (శ్రీరంగ 1-75, 4-76, 4-103, 4-134, 4-140, 5-10) మొదలైనవి సూత్రప్రాయంగ స్మరింపబడినవి.

మరియు కథానాయకుడగు రంగనాయక స్వామివారి అంగ వర్ణనం (శ్రీరంగ 4-223), సరస్వతీ వర్ణనం (శ్రీరంగ 5-221), హంస–చకోర–కందుక క్రీడా వర్ణనలు, బ్రహ్మ (శ్రీరంగ 3-42), మన్మథ, తపోవర్ణనలు కూడా ఉన్నాయి. "వర్ణనలనింపు చిలుకగ" ప్రబంధాలు రచించాలనే భావాలు ఉండినవాడు కావటంవల్ల భైరవకవి పురవర్ణన సందర్భానగల (శ్రీరంగ 4-276) వచనంలో "ప్రబంధంబులయందు వర్ణబంధంబులును" అని చెప్పాడు. విస్తర భీతివల్ల పూర్వోక్త వర్ణనలకు ఉదాహరణ పద్యగద్యాలు తక్కువగా ఇవ్వటం జరిగింది.

## 4. 1. 19. పూర్వకవి అనుకరణాలు :

ఇతరులు ఎలాప్రవర్తిస్తారో ఏంచేస్తారో చక్కగ పరిశీలించి సరిగా అలాగే చేయటం అనుకరణం. సూక్ష్మంగ పరిశీలిస్తే పిపీలికాది బ్రహ్మ పర్యంతం ఈ అనుకరణం సహజమనిపిస్తుంది. పిపీలికా పంక్తిలో నాయకమగు చీమ ఏ వైపునకు వెళుతుందో సరిగా అదేవరుసలో మిగిలిన చీమలు అనాలోచనంగ దానివెంటనే వెళ్ళుతాయి. ఈ గమనంలో పూర్వ పూర్వాన్ని వెనుకటివి అనుస రించటమేకదా! ఇలాగే అనంతమైన సృష్టిలోని ప్రతి జంగమ ప్రాణికూడ తన పూర్వప్రాణిని అనుసరిస్తూనే ఉంటుంది. పోనీ ఈ సృష్టికంత కూడా కర్త అయిన బ్రహ్మ స్వతంత్రుడా? అని పరిశీలిస్తే "ధాతా యథాపూర్వమ కల్ప యత్" అంటూంది శ్రుతి.

వాఙ్మయ ప్రపంచంకూడ ఇంచుమించుగ అనుకరణం చేతనే అభివృద్ధి పొందిందనవచ్చు. స్వతంత్రులు అని ఎంచబడుతున్న కాళిదాస భవభూతి ప్రముఖులగు మహాకవులు తమకు పూర్వులగు వాల్మీకి వ్యాసులు వారికి పూర్వమైన శ్రుతి స్మృతులను ఆధారంగా చేసుకుని వాఙ్మయ స్రష్టలయ్యారు.

స్మృతికారులు స్వతంత్రులేమో అంటే "శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్" అనినట్లు శ్రుతిసమ్మతం కాని స్మృతి అప్రమాణం. కనుక స్మృతులు వేదానుకరణలు.

ఒకప్పుడు పూర్వకావ్యాల పోలికలు నవీన కావ్యాల్లో కనబడుతుంటాయి అంతమాత్రంచేత అది గ్రంథ చౌర్యం అనరాదు. "సంవాది వ్యోమేధా వినాం బుద్ధయః" అంటే ప్రతిభావంతుల బుద్ధులు ఒకప్పుడు పరస్పరం పోలివుండ వచ్చు అని. అంతమాత్రాన అదిదోషంకాదని కావ్యమీమాంసలో రాజశేఖరుడు చెప్పాడు. ఈ అనుకరణం ప్రతిబింబాకార సంవాదం, ఆలేఖ్యాకార సంవాదం, దేహాంతరతుల్య సంవాదం అని మూడు రకాలు. వీటిలో ప్రతిబింబాకార సంవాదం అంటే ఇంచుమించు "మక్కికి మక్కిగా" రచించటం. ఇదిసర్వథా త్యాజ్యం, హీనంకూడ. మిగతవి మధ్యమోత్తమాలు. భైరవకవి అనుకరణల్లో చివరి రెండు రకాలు అగుపిస్తాయి. మచ్చుకు కొన్ని—

నన్నయ భారత పద్యాలకు అనుకరణలు :—

చం. విమలమతిం బురాణములు వింటిననేకము లర్థధర్మ శా
స్త్రముల తెరంగెరింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పం పూజ్యములైన యాగ్నిహో
గమములయందు నిల్పితి ప్రకాశముగా హృదయంబు భక్తితోన్
— భారత–అది–ప్రథ 10

పై పద్యాన్ని ఈ క్రింది పద్యం స్మరణకు తెస్తుంది—

చం. చదివితినెల్ల వేదములు శాస్త్రములున్ బహుధర్మ మర్మముల్
విదితముగా గవింట బహువిత్తములిచ్చితి విప్రకోటికిన్
సదమలబుద్ధి జేసితి ప్రశస్త మఖంబులు జీవలోక సౌ
ఖ్యదములుగా వనంబులు జలాశయముల్ కడుబెక్కు నర్చితిన్
— శ్రీరంగ 5–64

నన్నయ్యగారి సౌపర్ణోపాఖ్యానంలో "ఉద్యానవనంబునుంబోలె బహు విద్రుమలతాలంకృతంబై" ఇత్యాదిగాఉండే ఉచ్చైశ్రవ సముద్రాది వర్ణనల్ని

శ్రీరంగ మహత్త్వములో గల "అశ్వరత్నంబుసుంబోలె నసమసుధాసారంబై" ఇత్యాది రచన భాగాలు దృష్టికి తెస్తాయి.

తిక్కనను అనుసరించిన తావులకు మచ్చుకు—

మ. కలగెం దోయధి సప్తకంబు... — భారతం

మ. జలధుల్ పిండలి వండుగా గలిగె — శ్రీరంగ 1-54

ఎఱ్ఱనను అనుకరించిన తావులకు మచ్చుకు— భైరవకవి అనుకరించిన పూర్వకవుల్లో ఎఱ్ఱన పోతనలు ముఖ్యులు. వారిద్దరు నృసింహ, భాగవత పురాణాలను ఆంధ్రీకరించారు. భైరవకవికూడ విష్ణు కథాత్మకమైన గారుడ పురాణాన్ని ఆంధ్రీకరించాడు. వారిద్దరుకూడ శైవులు, భైరవకవి కూడ శైవుడే. ఎఱ్ఱన నృసింహ పురాణాన్ని భైరవకవి అనుకరించిన తావులను మచ్చుకు పరశీలింతం—

నృసింహ పురాణంలో షష్ఠ్యంతాల తర్వాత ఉండే కథా ప్రారంభ వచనంలో "పురాణకథకు ప్రారంభం బెట్టిదనిన" అని తర్వాత నైమిశ వర్ణనం ప్రస్తావింపబడింది. భైరవకవి కూడ షష్ఠ్యంతాల తర్వాత ఉండే వచనంలో "పురాణ కథకు ప్రారంభం బెట్టిదనిన" అని తర్వాత నైమిశ వర్ణనం చేశాడు. వచనంలో ఎఱ్ఱన–భైరవుడు ఇద్దరున్నూ "పురాణకథకు ప్రారంభం బెట్టిదనిన" అన్నారు. కనుక వారు పురాణ "కథకు" ప్రాధాన్యత ఇచ్చారనటం ఆయా గ్రంథాలను పరిశీలించటంవల్ల తెలుస్తుంది.

కం. కన్నులు జాత్యంధునకున్
గన్నియకును జారుభర్త గర్భిణికి సుతుం
డున్నత విద్య విమూఢున
కు న్నిజముగ నమ్మి నన్ను గొలిచిన నొదవున్— నృసింహ 5-167

పై పద్యాన్ని ఈ క్రింది పద్యం తలపింపజేస్తుంది—

మ వినవేర్చుం జెవిటైన మూఢుడయినన్ విద్వాంసుడౌ వెఱ్ఱియై
నను విజ్ఞానియగున్ ఖలుండు నతిశాంత స్వాంతుడౌ వక్రుడై
నను సౌమ్యాకృతి దాల్చు బాపరతుడైనన్ దోషనిర్ముక్తుడౌ
ఘన పుణ్యంబగు నేప్రదేశము చొరంగా గల్గు మాత్రంబునన్
— శ్రీరంగ 1-115

సీ. తరితాల్పు బొక్కటి తమ్మి కమ్మని తావి
యల్లనల్లెసలను జల్లి చల్లి
పరమాత్ము పదముల దొరగి పారెడు నేటి
తరగలపై లీల దాటి దాట
శౌరి కౌగిట జొక్కు చపలాక్షి పులకల
చెలువంబునకు బ్రోదిజేసి చేసి
హరిమ్రోల వినతాంగుడై యున్న యురగారి
యెరకలు పలుమారు గిరిపి గిరిపి

గి. కొలువు తరిగోరు సంభ్రమాకులత బారు
తెంచు వేల్పుమూకల సేద దేర్చి తేర్చి
వెన్ను నగరిలోపల నెల్ల వెంటలకును
దానయై యొప్పు బుతము మందానిలంబు — నృసింహ 1-54

పై పద్యానికి ఈ క్రింది పద్యం అనుకరణవలె ఉంది—

సీ. పరిపాండు కేసర పరిణాహ కేసర
ప్రసవ పరాగంబు కొసరి కొసరి
వర్ధిత కాసార వరవీచి కాసార
శిశిర శీకరముల జెలగి చెలగి
గుణవతీ ఘనసార కుచలిప్త ఘనసార
బహుళ సౌరభముల బలసి బలసి
కమనీయ మణిజాల ఖచిత సద్గృహజాల
మాలికాంతరముల మలసి మలసి

గీ. ... ... ... .
మలయ పవనుండు పురిలోన గలయ బొలయు — శ్రీరంగ 4-275

పై రెండు పద్యాలు కూడ మలయానిల వర్ణన సందర్భంలో చెప్పినవే. ఎర్రనగారి సీసపద్య పాదోత్తర భాగాన్ని రచనా విధానంలో భైరవకవి అనుకరించాడు. పూర్వపాదాన్ని స్వీయప్రతిభతో రచించాడు. భైరవకవి అనుస రించటంలోకూడా మెరుగులు దిద్దుకున్నా ఇలాంటి అనుకరణలు భైరవకవి ప్రతిభా పాటవాన్ని చాటుతాయి.

దనివాసంబై. మధురాపురం బునుంబోలె నుల్ల సత్పుండరీకంబై, పుండరీకం బునుంబోలె బురుషోత్తమా వాసంబై,- "పురుషోత్తమా వాసంబయ్యును వీరభద్ర విహార స్థలంబై. వీరభద్ర స్థల విహారంబయ్యును దక్షయాగ మహోత్సవంబై, దక్షయాగ మహోత్సవం బయ్యును సర్వమంగళాభి రామంబై"- యమరు నందు సుందరుల నయనంబుల యంద శ్రుతిసీమా లంఘనోద్యోగం బును, పంగుల యంద పదహీనతయు, గరులయంద మదోద్రేకంబును, దరుల యంద శాఖాచలనంబును, ప్రబంధంబులయంద వర్ణబంధంబులును, శుకశారి కాదుల యంద వక్షపాతంబులును, గోకులంబులయంద భంగంబులును, భృంగంబులయంత మధుపాన ప్రసంగంబులును, వృద్ధ దౌవారి కాదుల యంద దండ గ్రహణంబులును దక్క దక్కెడల లేక యొప్పునందు" — శ్రీరంగ 4-276

| " "— ఈ గుర్తులుండిన తావులలో రెండు వచనాలలో కూడా విరోధాభాసంగా రచన సాగింది.

ఎర్రన నృసింహ పురాణంలో 1-26 నుండి 1-37 వరకుగల పద్యాలలో సముద్ర వర్ణనం విస్తృతంగ చేయబడింది. దానిని భైరవకవి శ్రీరంగ మహత్త్వములో కొంత అనుకరించి ప్రపంచించినట్లు గోచరిస్తుంది. ఆ ప్రపంచనం శ్రీరంగ మహత్త్వములో పద్యాల్లోగాక గద్యమందు సాగింది (శ్రీరంగ 2-208).

నృసింహ పురాణంలోని (3-14) అంగ వర్ణన వచనంతో శ్రీరంగ మహత్త్వములోని (4-223) అంగవర్ణన వచనం పోలివుంది. రెండు వచనాలు కూడ భగవద్దివ్య రూపాభి వర్ణనాత్మకాలే.

శ్రీనాథుడిని కూడ భైరవకవి అక్కడక్కడ అనుసరించాడు. మచ్చుకు-

సీ. మెరుగు కోరలతోడి మృత్యుదేవత నోరు
ధట్టించి యరకాల ధట్టినాడు — భీమఖండము

సీ. మెరుగు కోరలతోడి మృత్యుదేవత గర్వ
మడచితే వెందేని యద్భుతముగ — శ్రీరంగ 5-80

పోతనార్యుని భాగవతాన్ని అనుకరించిన తావులు :— పోతనార్యు ప్రభావం భైరవకవిపై అధికంగా ఉంది. శ్రీరంగ మహత్త్వములో భాగవ పద్యాల్ని అనుకరించిన తావులు ఎన్నో ఉన్నాయి. మచ్చుకు—

శా, పుట్టంబుట్ట శరంబునన్...... — భాగవతం

ఉ. పుట్టకుబుట్టి కోమలికి బుట్టిన ప్రాగపులాదరంచి— శ్రీరంగ 1-2

కం. పుణ్యంబై మునివల్లభ–గణ్యంబై కుసుమఫల నికాయోద్ధిత సా
ద్గుణ్యమయి నైమిశాఖ్యా–రణ్యంబు నుతింపదగు నరణ్యంబులలో
— భాగవత 1-38

కం. సారంబై మోక్షపదా–ధారంబై పుండరీక దళనయననిజా
గారంబై మహిబరగిన–శ్రీరంగ మహత్త్వమతి విచిత్రము దలపన్
— శ్రీరంగ 1-82

సీ. పల్లవ వైభవా స్పదములు పదములు
గనక రంభా తిరస్కారులూరు
లరుణ ప్రభా మనోహరములు గరములు
కంబు సౌందర్య మంగళము గళము
మహిత భావా భావ మధ్యంబు మధ్యంబు
చక్షు రుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందు పటలంబు నిటలంబు
జిత మత్త మధుకర శ్రేణి వేణి

గీ. భావజాశుగముల ప్రావులు చూపులు
కుసుమ శరుని వింటి కొమలు బొమలు
చిత్త తోషణములు చెలువ భాషణములు
జలజనయనముఖము చంద్ర సఖము— భాగవత 10 స్కం–17

పై పద్యానికి ఈ క్రింది పద్యం అనుకరణ—

సీ. సతత ప్రసన్నతా సదనంబు వదనంబు
వినుత సత్యామృత వేణి వాణి
శరణాగత త్రాణ సదయంబు హృదయంబు
ఘన దాన వైభవాకరము కరము
గురుధర్మ కార్యానుకూలంబు శీలంబు
సంపాదిత స్వామి జయము నయము
హరిపదారాధనాయత్తంబు చిత్తంబు
భూరి సౌభాగ్య విస్ఫూర్తి మూర్తి — శ్రీరంగ 1-56

... ... ...

అదే ఫక్కికలో భైరవకవి రచించిన మరోపద్యం—

సీ. కలుష పంకజ కళికాతమి గౌతమి
సకల సజ్జనమాన్య జహ్నుకన్య
జంతు సంతత మనశ్శర్మద నర్మద
శమిత తాపత్రయ దమన యమున
శ్రితసాధు జన్మలబ్ధ జీవిక దేవిక
సత్వసం విద్యోగ చంద్రభాగ
సతత జన్మాచలాశని భవనాశని
దూరీకృత క్షుద్ర తుంగభద్ర

గీ. బహుల సౌభాగ్య సంపన్న పెన్న
భగ్న దుర్మోహ పాశ విపాశయనగ — శ్రీరంగ 1-80

... ... ...

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు

మధువైరి దగిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

గీ. దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరు మనియెడి తండ్రి తండ్రి భాగవ 7 స్కం-169

పై పద్యానికి అనుకరణం ఈ క్రింది పద్యం—

సీ. హరిదివ్య నామధేయామృతం బింపార
జెలగి యాస్వాదించు జిహ్వ జిహ్వ
గోవింద కల్యాణ గుణ విశేషంబులు
పలుమారు దలపోయు తలపు తలపు
కమలాక్షు నిత్యమంగళమూర్తి విభవంబు
సొంపార వీక్షించు చూపు చూపు
ఫణిరాజ తల్పు శ్రీపాద పద్మంబులు
చేరి యర్చనసేయు సేత సేత

గీ. వాసుదేవ ప్రియంబైన వ్రతము వ్రతము
దైత్యభేది నుపాసించు తపము తపము
శౌరి నారాధనము సేయు జపము జపము
విష్ణుపద భక్తి సమకొల్పు వినికి వినికి — శ్రీరంగ 1-91

కం. అడిగెదనని కడువడి జను...... — భాగవ

కం. పొడగని యడరెడు భయమున ......— శ్రీరంగ 3-64

భైరవకవి తన తండ్రిఅయిన గౌరనరచించిన నవనాథచరిత్ర హరిశ్చంద్రోపాఖ్యానములను తప్పక చదివి ఉంటాడు. ఆ కావ్యాల్లోని కొన్ని వర్ణనల్ని భైరవకవి అనుకరించాడు. మచ్చుకు అలాంటివి—

ద్విపద: కలయంగ బదనింకి కడపళ్ళువాడి
జిగితప్పి చెరగులు చిరుబీట లెత్తి
పగులుచు బిరుసనై పలికిననాట
దొడిమెలు వాడివాడ దుదగోలి దూలి
కడువడి నందంద కారాకురాలె
—* నవనాధచరిత్రము 1 ఆశ్వా పుట 11

పై ద్విపద భాగాలకు ఈ క్రిందిపద్యం అనుకరణం అనిపిస్తుంది—

ఆ.వె. పసిమి బాసి ముటిరి పసరింకి పరుసనై
పరపు మిగిలి తుదలి పగిలి తలకి
పండి తొడిమెలెడల నెంతుచు కారాకు
డుల్లె దరుల దపము పెల్లుగాగ — శ్రీరంగ 2-40

ద్విపద: పరగునేలా లతా భవనాంతరమున
నరుణ ప్రవాళ శయ్యలమీద ప్రియుల
గొసరుచు నుపరతి గూడి క్రీడించి
యసురు సురైయున్న యుప్సరః స్త్రీల
చెక్కుల నెసగు లేజెమట లార్పుచును
జొక్కమై వీతెంచె సోమతి గాలి —నవనాధ 1ఆ-13పుట

మందానిల వర్ణనాత్మకమైన పై ద్విపద భాగాల్ని భైరనకవి ఇలా అను
కరించాడు —

ఉ. గందపు గొండ నెత్తముల కందువ నేలకి తీవ యిండ్లలో
గెందలి రాకు పాన్పున సుఖించి నితాంత రతి శ్రమంబులం
జెందిన చెంచు గుబ్బెతల చెక్కుల జిమ్ము జవాది వాసనల్
విందులు సేయుచున్ మెలగె వేమరు కోమల గంధ వాహముల్
— శ్రీరంగ 2 50

---

* ఆం.ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ 1984

గిరిజా హరుల జలకేళీ సందర్భాన నవనాథ చరిత్రలోగల ఈ క్రింది ద్విపద పంక్తుల్ని శ్రీరంగమహత్త్వమున లక్ష్మీ నారాయణుల జలకేళి వర్ణనం అనుకరిస్తుంది. ఆ వర్ణనలు ఇవి.—

ద్విపద: దరినీరు సొచ్చు నత్తరి దన్ముఖమున
నరవిందమును దేంట్లు నలకపంక్తియును
గలికి కన్నులు నల్ల కలువలు నలరు
తెలినవ్వు నురువును దియ్యమోవియును
బిసములు జక్కవల్ బిగువు జన్నులను

— నవనాథ–1అ–18పుట

వ. సరసి దరియం జొచ్చు సమయంబున — శ్రీరంగ 4-91

చం. జలనిధి కన్య లేగురులు షట్పద పంక్తులు, గ్రాలు కన్నులుం
గలువలు నవ్వు దేరెడు మొగంబును బద్మము, బాహుయుగ్మమున్
సలికపు దూడు తీవలు, ఘనస్తన కుంభ యుగంబు జక్రవా
కలు దనలోన వీడువడి కన్నులపంటు వోనర్చె జక్రికిన్

— శ్రీరంగ 4-92

ఇలాంటి అనుకరణలు మచ్చుకు మరికొన్ని—

ద్విపద: కోటలు నట్టిళ్ళు కొలువు కూటములు —నవనాథ–1అ–32పుట

సీ. కోటలు నట్టిళ్ళు గోపురములు — శ్రీరంగ 2-112

ద్విపద: కొదమ సింగములను గోరి తుండముల
ముదమున నొయ్యన బుడుకు నేనుగులు
వాని చెక్కుల తీట వక్రనఖాళి
బూని గోకుచునున్న పులులను వాని
కూనలకును జన్నుగుడిపెడు లేళ్ళ
వానితో జెరలాడవచ్చు రేచులును
వానితో గ్రీడించి వరలు ముంగిసలు
వానితో బ్రాకెడు వరపన్నగములు
వానికి నీడగా వ్రాలు నెమళ్ళు

—* హరిశ్చంద్రోపాఖ్యానము–పుట 65

* ఆం.ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ 1967

పై పంక్తుల్ని భైరవకవి ఇలా అనుకరించాడు—

"వ. ... ... కేసరి కిశోర కేసరంబులు సరస బిసాంకుర శంకనొందం దంత తుండంబుల బుడుకు శుండాలంబులును, శుండాల దంత మండల కండూ నిశసన మస్సృణంబులగు నరాళ కరాళ నఖర శిఖరంబులంగల జిత్రకాయంబులును జిత్రకాయ కుటుంబినీ స్తనస్తన్యపాన పరిపుష్టాంగంబులగు కురంగ లోకంబులును, కురంగ డింభకంబులంగూడి చెరలాడు రేచులును రేచుగూనల నేచిన మక్కువం బ్రక్కలడాచు బిడాలంబులును, బిడాలంబుల పోరెలు సారెకు వెరలక మరిగి తిరుగు గిరికలును గిరికానికరంబుల నిజభోగంబులంబొదివి యనురాగంబొసగు నాగంబులును, నాగంబులకెండ రాకుండ విరివిగల పురులు విచ్చి చేరవచ్చు మయూరంబులును గలిగి"

— శ్రీరంగ 1-75

ద్విపద: మరి మయూరాదులు మహి నెలుగింప
బరగు షడ్జాది సప్త స్వరంబులును
గ్రామ త్రయములు మూర్ఛనలు ముయ్యేడు
నా ముప్పదియు రెండు నైన రాగములు
వాని మిశ్రంబులు వాని భేదములు
వానికి వేళలు వరుసతో దెలిసి
తగ మంద్ర మధ్యమ తాళమానముల
మొగియు గాయక దోషములు దొలంగించి
యాలాపములు సేసి యారాజుమీది
సూళాదు లింపుగ సాగియు బాడుటయు — హరిశ్చంద్రో-పుట 73

పై ద్విపద భాగాలు భైరవకవి అనుకరించి ప్రపంచనం చేశాడు. ఆ అనుకరణ ప్రపంచన వచన భాగం ఇలా ఉంది—

వ. మొదల నాద సముద్భవంబులై మంద్రమధ్యమ తాళ భేదంబుల దమషలన నేకవింశ ద్విధంబులైన శ్రుతులకు నాధారంబులై మయూరాది రుతంబులచేత సంకేతంబగు షడ్జాది సప్త స్వరంబుల పరస్పర మేళనంబున నభిరామంబగు గ్రామత్రయంబున వలంబించి మతంగ తుంబురు నారద కోలా

హలోదితంబులగు ననేక ప్రకారంబులైన మూర్ఛనల నింపు గడలొత్తు చతురుత్తరా శీతి తానంబుల ననూనంబులై సంపూర్ణ షాడబ సమేతంబులగు పంచదశ జాత్యవయవంబుల బరిశీలించి స్థాయి సంచారి ప్రముఖులగు చతుర్వర్ణంబుల నాశ్రయంబుగా నెన్నబడిన ప్రసన్నాది ప్రభృతి కాలంకారంబులు పదుమూడును బరిస్ఫురింప గంపిత స్ఫురితాహ తాందోళితంబులు లోనుగా గల సప్త గమకంబులు మెరయ నష్టాదశ జాతి ప్రభూతంబులై శుద్ధ భిన్న గౌళ దేసతీ సాదారితోపరాగ సంజ్ఞల బ్రసిద్ధంబులైన శుద్ధరాగంబులు ముప్పది యారును రాగాంగంబు లిరువదియును భాషాగంబులు నలుపది యేడును నుపాంగంబులు ముప్పది యొక్కటి త్రయాంగంబులు మూడునుగ బదితెరంగుల నూటముప్పది యేడు రాగంబులు వేళా విభాగంబులతో నాలాపంబు సేసి సమతాళ పదక్రమ బంధురంబులగు నా సింధుర వరదు బిరుదాంకితంబులైన ప్రబంధంబులు పాడబోడంగె — శ్రీరంగ 3-295

ఇలా భైరనకవి పూర్వ కవుల్ని అనుకరించాడు. అయినా కూడ అనుకరణలోను స్వీయ ప్రతిభా పాండిత్యాదుల్ని గోచరింపజేశాడు భైరవుడు.

# 4.2. శ్రీరంగ మహత్త్వము లాక్షణికత

4.2.0 భైరవకవి కాలం నాటికి ఆంధ్ర భాషకు ఛందో వ్యాకరణాది లక్షణాలను నిర్దేశించే గ్రంథాలు చాలా తక్కువ. *1 ఉన్న కొద్దివాటిలోకూడ

---

1. "పోతననాటికి నాంధ్రభాషకు లక్షణములు నిర్దేశించు వ్యాకరణములుకొన్ని యున్నను వానికి సమగ్రత్వముగాని బహుళ ప్రచారముగాని ఈ కాలము నందుండి యుండదనుట నిర్వివాదము"

— శ్రీ మద్భాగవతాను శీలనము – డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి పుట 382

పోతనకు కొంచెం అర్వాచీనుడైన భైరవకవి కాలం నాటికి కూడ అదే పరిస్థితి ఉండి ఉంటుందనటం నిశ్చయం.

పేర్కొనదగినవి నన్నయ భట్టారకుని ఆంధ్ర శబ్దచింతామణి, మరికొన్ని సంస్కృత గ్రంథాలు, *2 నన్నయ కృతిగా రంగకవి తన లక్షణ గ్రంథంలో ఉదాహరించిన లక్షణసారము; మల్లయరేచనచేత రచింపబడి భీమన ఛందంగా ప్రసిద్ధి పొందిన కవిజనాశ్రయము, కేతన ప్రణీత ఆంధ్రభాషా భూషణము, విన్నకోట పెద్దన ప్రణీత కావ్యాలంకార చూడామణి, అనంతామాత్యుని ఛందోదర్పణము, గౌరన (భైరవుని తండ్రి) రచించిన లక్షణ దీపిక. ఈ లక్షణ గ్రంథాలన్నింటినీ భైరవకవి చూచిఉంటాడని నిర్ధారింపలేము. కాని తనకాలం నాటికి వెలువడిన "సుప్రసిద్ధమైన" సంస్కృతాంధ్ర లక్షణ గ్రంథాలను భైరవకవి ఎరిగి ఉంటటం నిస్సంశయం. లక్షణ జ్ఞానానికి ముఖ్యంగ మహాకవుల కావ్యాలు నిదానాలు. కనుక తనకాలం నాటికి వెలువడిన సుప్రసిద్ధమైన కావ్యాల్లోని ఛందోవ్యాకరణ భాషావిశేషాది ప్రయోగాలను భైరవకవి బాగా అధ్యయనం చేసి ఉంటాడు.

భైరవకవి లక్షణ గ్రంథకారుడగు గౌరన కొడుకు. గౌరన "సరస సాహిత్య లక్షణ విచక్షణుడు"గా "సరససాహిత్య లక్షణవివేకము కలవాడు"గా హరిశ్చంద్రోపాఖ్యాన నవనాథ చరిత్రలలో చెప్పబడింది. అలాంటి గౌరనకు కొడుకు భైరవుడు. భైరవుడు "కవిగజాంకుశము" అనే లక్షణ గ్రంథాన్ని రచించాడు. "దుష్కవి ఘోర పిశాచముల నదల్చుకొను భైరవు"*1డీ భైరవకవి "తొల్లిటి సత్కవుల్ కృతులు దొంతులు పేర్చిన మాటలూతగాజల్లి పదంబులూడుకొని సంధులు దూటుచు నొక్కజాదుగా నల్లిన కబ్బముల్ సభల నార్యులు నవ్వ బఠించు దుష్కవుల్ హొల్లమువారిచేత దుదముట్టనె భవ్యములైన కావ్యముల్"*2 అని దుష్కవి తిరస్కృతిని చేశాడు భైరవకవి.

లక్షణ గ్రంథకారుని కొడుకు, స్వయంగ లక్షణ గ్రంథాన్ని రచించినవాడు. దుష్కవిఘోర పిశాచాలను అదల్చుకొను భైరవుడు, దుష్కవి

2. జయదేవ చ్ఛందాదులు (జయదేవ చ్ఛందమును మల్లియ రేచన కవిజనాశ్రయంలో పేర్కొన్నాడు.)

*1 కవిగజాంకుశము – 7వ పద్యం (వావిళ్ల ప్రతి)

*2 శ్రీరంగ మహత్త్వము 1–19 (ఆం. సాహిత్య అకాడమి ప్రతి)

కావ్యాల్ని మెచ్చనివాడు అయిన భైరవకవి కవిత్వం సలక్షణంగానే ఉంటుంది. అలాంటి భైరవకవి లాక్షణికతను ఈ ఉపశీర్షికలో 1 ఛందః ప్రయోగ విశేషాలు, 2 భాషా వ్యాకరణ ప్రయోగ విశేషాలు ప్రదర్శింపబడును.

## 4. 2. 1. ఛందః ప్రయోగ విశేషాలు :

కృత్యాది శ్రీకారం :- "శ్రీ"తో కృతిని ప్రారంభించటం తెలుగు కవుల సంప్రదాయం. అది సర్వ సామాన్యమే అయినా కవిత్వ శుభాశుభ ఫలాలను నిర్దేశించే "కవిగజాంకుశము"ను రచించిన భైరవుడు – శ్రీరంగ మహత్త్వము వైష్ణవ మత సంబంధి కావటంవల్ల ఈకృతిని "శ్రీమన్మూర్తి రుచుల్ తటిద్ద్యుతి ఘనశ్రీ" అని శ్రీకారంతో ప్రారంభించటం అతని లాక్షణికతను సత్సంప్రదాయత్వాన్ని వైష్ణవ మతాభి నివేశాన్ని తెలియ జేస్తుంది. ఈ క్రింది అంశాల్ని పరిశీలిస్తె శ్రీరంగ మహత్త్వ కృత్యాదిని భైరవకవి శ్రీకారం ప్రయోగించటంలో గల ఔచిత్యం తెలుస్తుంది.

శ్రీరంగ మహత్త్వము శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన కృతి. శ్రీవైష్ణవ సంప్రదాయంలో శ్రీ శబ్దానికి ఎంతో వైశిష్ట్యం ఉంది. యామునాచార్యులవారు "శ్రీరిత్యే వచనామితే" అని చతుశ్శ్లోకిలో శ్రీశబ్ద వైశిష్ట్యాన్ని ప్రవచించారు, రహస్య త్రయసారంలో "శ్రయతీం శ్రియమాణాంచ" మొదలైన శ్లోకాలు గొప్పగా వ్యాఖ్యానింపబడినవి. శ్రీరంగంలోని దైవం శ్రీరంగేశుడు అయిన శ్రీమన్నారాయణుడు అష్టాక్షరి స్వరూపుడు. అష్టాక్షరికి విశిష్టాద్వైతంలో ఎంతో వైశిష్ట్యం ఉంది. విశిష్టాద్వైతము శ్రీ సంప్రదాయం ఒక్కటే.*1 శ్రీరంగ మహత్త్వము శ్రీకారంతో ప్రారంభించటంవల్ల భైరవకవి ఆ సంప్రదాయాన్ని ఎరిగిన వాడని భావింపవచ్చు.

"శ్రీకారము గల పద్యము ప్రాకటముగ లచ్చియొసగి పతికనవరతాస్తోక జయము లొనగూర్చును." అని భైరవునికి ప్రాచీనులైన కవులుతెలిపారు, (మల్లియ రేచన–కవిజనాశ్రయము). శ్రీరంగమహత్త్వ కృతిపతిఅయిన చాగయ రాఘవుడు అనెక యుద్ధాల్లో పాల్గొన్నాడు. (ఈ విషయం తర్వాత విపులీకరింప

*1 శ్రీరంగ మహత్త్వము (1978) పీఠిక. పుట LXXXVI

బడుతుంది. యుద్ధాల్లో పాల్గొనేవారు జయాన్ని కాంక్షించటం సహజం. "శ్రీకారము– పతికన వరతా స్తోక జయము లొనగూర్చును." అని లాక్షణికుల నమ్మకం. కృతిపతి చాగయ రాఘవునికి ''ఆహవ జయశ్రీ" నాకాంక్షించి కూడ ఈ కృతి ప్రారంభంలో శ్రీకార ప్రయోగం చేయబడిందని భావింపవచ్చు.

శ్రీకారంతో కృతిని ప్రారంభించటం తెలుగు కవుల్లో సర్వ సామాన్యమే అయినాకూడ పై అంశాల్ని పరిశీలిస్తే శ్రీరంగమహత్త్వ కృత్యాది శ్రీకార ప్రయోగం – భైరవకవి సత్సంప్రదాయాను సరణాన్ని, వైష్ణవ మతాభి నివేశాన్ని తెలుగు లాక్షణికత్వాన్ని వ్యక్తం చేస్తుంది.

వర్ణనిర్ణయము–పద్యముఖ స్థితతారః లాక్షణికుడగు భైరవుడు కవిగజాంకుశములో...

కం. పతి తారకు పద్యముఖ
స్థిత తారకు గీడుమేలు జింతింపక దు
ర్మతి గవిత జెప్ప దొడగెడు
నతడుసుమీ కవిపిశాచ మారయ నుర్విన్

ఉ. వర్ణము నిర్ణయించి కృతివక్త్రమునం గదియింప నాయకుం
డర్ణవ వేష్టితావని సమస్తము నేలు గవీశ్వరుండు నా
పూర్ణ మనోరథుండగుచు బొల్చు సుఖస్థితి గావ్యముల్ బుధు
ల్వర్ణన సేయ నొప్పు దిశలన్వసుధేశ సభాంతరంబునన్

అని చెప్పాడు. పై పద్యాల్లో చెప్పిన లక్షణాల్ని భైరవకవి శ్రీరంగ మహత్త్వములో ఎంతవరకు అనుసరించాడో పరిశీలించాలి—

కృతిపతి పేరు రాఘవ సచివుడు. "రాఘవ సచివాగ్రణికి నిరత సద్గుణికిన్" (శ్రీరంగ 1-72) అని షష్ఠ్యంతాలలో ఉంది. కృతిపతి పేరును ఇమిడ్చింది కృతిలో చక్రబంధం (శ్రీరంగ 5-263) ఆ బంధం వెలుపల నుంచి ఆరోవలయంలో "రాఘవాంకితము" అనిఉంది. కనుక కృతిపతి "రాఘవ" అనటం స్పష్టం. పతితార అంటే రాఘవ సచివునితార చిత్తా నక్షత్రం. పద్యముఖ స్థితతార శ్రీకారానికి చిత్తానక్షత్రమే ఔతుంది. జ్యోతిశాస్త్ర ధోరిణిలలో ఈవిధంగ

పరిశీలిస్తే కూడ కవిగజాంకుశం లక్షణోక్తంగ శుభప్రదమే. ఔతుంది. కనుక భైరవకవి "వర్ణము నిర్ణయించి కృతి వక్త్రమునంగదియించి" నాడనటంస్పష్టం.

కృత్యాది పద్య గణసంయోగం: పద్య ప్రారంభంలో ఏగణం ఏగణంతో సంయోగిస్తె ఎలాంటి ఫలితం కలుగుతుందో భైరవకవి తన కవిగజాంకుశములో తెలియజేశాడు, దానిని శ్రీరంగ మహత్త్వములో ఎలా అనుసరించాడో పరిశీలించాలి—

"శ్రీమన్మూర్తి రుచుల్" (UUU మగణం–IIU సగణం) అని శ్రీరంగ మహత్త్వములోని కృత్యాది పద్య ప్రారంభంలో భైరవకవి మగణాన్ని సగణాన్ని సంయోగించాడు, మగణ–సగణ సంయోగాన్ని గురించి భైరవకవి కవిగజాంకుశంలో ఇలా చెప్పాడు.—

కం. ముందట నిలిపిన మగణము
క్రిందట జగణంబు గదియ గీలించిన మే
లొందును సగణము నటువలె
బొందించిన విభుడు రిపుల బోర జయించున్.

చాగయ రాఘవుడు "విక్రమాపాదితానేక విమత దుర్గలబ్ధ సామ్రాజ్య లక్ష్మీ విలాస ఖాని" (శ్రీరంగ *-56). "పటుబాహు విక్రమ విజిత విమతనృప సమానీత మణి రమణీ హయాది బహువిధోపాయ నాంచిత ప్రాంగణుండు రణజయోల్లాసి" (శ్రీరంగ 1–59): "రణదివ్య బిరుద నిర్వాహకుండు ప్రకట సంగ్రామ నిర్భంగ ఫల్గుణుండు" (శ్రీరంగ 1-60), "ఉపసంహృత కర్ణాటకటక జననాథ చమూరంహుడు" (శ్రీరంగ 1-70), "దర్పాంధారాతి వసుంధరా భరణ దుష్టామాత్య నీతిక్రియా సంధాన ప్రబలాంధకార పటలీ సప్తాశ్వుడు" (శ్రీరంగ 1-220), "ధాటీ సంభ్రమ జృంభమాణ నిజయోధ వ్యూహుడు" (శ్రీరంగ 3-303), "భాహ ధనుర్జ్యాటంకార విశంకట ధ్వని విశేష ధ్వస్తుడు" (శ్రీరంగ 3-303)"నిస్తంద్ర కర్ణాటోదీర్ణ బలార్ణవార్భటి తురంగా రోహణోదారుడు'(శ్రీరంగ 3-305), "దివ్యరాహుత పదోన్నత నతారి బృందుడు" (శ్రీరంగ 3-304), "వైరి కరివారి ధరానిలుడు" (శ్రీరంగ 5-264), "విమత భయ కోపుడు" (శ్రీరంగ

5-266), "సమర పరశురాముడు" (శ్రీరంగ 5-266) అని వర్ణింపబడ్డాడు. ఈ వర్ణనాన్ని బట్టి చాగయరాఘవుడు యుద్ధాల్లో పాల్గొనేవాడని శత్రువుల్ని అణచి వేసేవాడని తెలుస్తుంది, యుద్ధాల్లో పాల్గొని శత్రు నిర్మూలనం చేసే చాగయ రాఘవుడు శ్రీరంగ మహత్త్వ కృతిభర్త కనుక భైరవకవి తన కృతిభర్తకు యుద్ధంలో జయం కలుగాలని కోరి తాను చెప్పిన (ముందట నిలిపిన మగణము...) లక్షణం ప్రకారం మగణాన్ని సగణాన్ని సంయోగించి కావ్యారంభం చేశాడు.

శ్రీకారం కృతిపతికి అనవతాస్తోక జయాన్ని కలిగిస్తుందని ఇదివరలో చెప్పబడింది. శ్రీకారాన్ని భంగణలో కూడ ప్రయోగించి ఉత్పలమాలాది పద్యాలు రచించవచ్చు. కాని కవి అలాచేయక శ్రీకారాన్ని మగణంలో చెప్పి ఆ మగణానికి సగణాన్ని కలుపటంవల్ల కవి కృతిపతికి రిపు జయాన్ని కోరి అలా రచించాడని చెప్పవచ్చు. మగణం శుభప్రదమైనది కూడ అనేందుకు "మా శుభంబు" (ఛందో దర్పణం 1-23) అనే పూర్వకవుల లక్షణం కూడ ప్రమాణాలు. *1

పుం–స్త్రీ–నపుంసక గణవిచారం : య–మ–త–ర–జ–భ–న–స అనే ఎనిమిది గణాల్లో మగణ నగణాలు పురుష గణాలు అనీ, జగణ రగణ సగణాలు స్త్రీ గణాలు అనీ. యగణ తగణ భగణాలు నపుంసక గణాలు అనీ లాక్షణికుల నిర్ణయం. స్త్రీ–నపుంసక గణాలు కానీ, పుం–నపుంసక గణాలు కాని ఒకచోట చేర్చి కవిత్వం ప్రారంభిస్తే కృతిపతి కష్టాలపాలవుతాడని లాక్షణికులు చెప్పారు. పుం–స్త్రీ గణాల కలయిక కృతిభర్తకు మంచిని కలిగిస్తుందని లాక్షణిక మతం. శ్రీరంగ మహత్త్వ కృత్యాదిలో కవి "శ్రీమన్మూ–ర్తి రుచుల్" అని మగణ–సగణాలు అనగా పుం–స్త్రీగణాల సంయోగాన్ని చేశాడు.

---

*1 "మగణముతో బద్యాదిని.. సగణము గదిసిననుగీర్తి జగముల వెలయున్"
— సులక్షణసారము

సరసాన్నమును కూడ కూర్చును మగణము — కవిగజాంకుశము

క్షేమం సర్వ గురుర్దత్తే మగణో భూమి దేవతః— చమత్కారచంద్రిక

లాక్షణికుడైన భైరవకవి కృతిపతికి శుభాన్ని కోరి కృత్యాదిలో గణ ప్రయోగం చేశాడు. "మసలం౧ జేర్చినను విభుడు మండల మేలున్" అని లక్షణం.

ఇలా అన్నివిధాలా ఆలోచించి శ్రీకారాన్ని, మగణాన్ని. మగణ సగణ సంయోగాన్ని కృత్యారంభంలో కూర్చి భైరవకవి శ్రీరంగ మహత్త్వాన్ని రచించాడు. దీనివల్ల కృతిభర్తకు ఆయువు. సంపద, కీర్తి విజయం కల్గుతుందని వివిధ లక్షణ గ్రంథాల్లో చెప్పబడింది. కనుక లాక్షణికుడగు భైరవకవి పైన చెప్పిన విధంగ కృతిని ప్రారంభించి "ఇంపెనయ దెనుంగుబాస రచియించితి నాయువు శ్రీయు గీర్తియుం ఘన విజయంబు నీకెపుడు గల్గగ జాగయ మంత్రి రాఘవా'' (శ్రీరంగ 5-262) అని చెప్పాడు.

కృతికి సంబంధించిన మరికొన్ని విశేషాలు : ఏ గణంతో కృతిని ప్రారంభించాలని కవి అనుకుంటాడో ఆ గణాన్ని దానికి నిర్దేశింపబడిన జాములోనే ప్రయోగించాలని లక్షణకారుల మతం. లక్షణకారుడు కూడ అయిన భైరవకవి శ్రీరంగ మహత్త్వాన్ని మగణంతో ప్రారంభించాడు. మగణం మొదటి జాములో ప్రయోగించాలని లాక్షణికమతం. కనుక లాక్షణిక మత ప్రకారం లాక్షణికుడైన భైరవకవి శ్రీరంగమహత్త్వ కృతిని మొదటిజాములో ప్రారంభించి ఉంటాడని భావింపవచ్చు.

శ్రీరంగ మహత్త్వ రచనా ప్రారంభ తిథివార నక్షత్రాలు తెలిసిఉంటే, భైరవకవి కవిగజాంకుశాన ఉండే లక్షణాలతో శ్రీరంగ మహత్త్వ ప్రారంభ వర్ణ గణాది విషయాలను మరికొంత సమన్వయించి పరిశీలించేందుకు అవకాశం ఉండేది.

కృతిభర్త అయిన చాగయ రాఘవునిది కాశ్యప గోత్రం. కృతి కన్యకాజనకునిది అంటే భైరవకవిది గౌతమగోత్రం. కనుక రాఘవ భైరవులు సగోత్రియులు కారు. ఈ దృష్టితో చూచినాకూడ భైరవకవి తన కృతికన్యను చాగయ రాఘవునికి అంకితం ఇవ్వటంలో సంప్రదాయాను సారంగ ఔచిత్యాన్ని పాటించటం జరిగింది. (సాహితీ ప్రపంచాన గల కృతులన్నింటికీ ఇది వర్తించక పోయినకూడ కాకతాళీయంగ భైరవకవి కృతికి సరిగ వర్తించింది.)

శ్రీరంగ మహత్త్వాన్ని పద్య గద్యాత్మకంగ (చంపువుగ) రచించేందుకు కారణం : శైవకవులు ద్విపద, రగడ మొదలైన ఛందో భేదాలలో తమరచనల్ని సంతరించి ఉండటం సాహిత్యజ్ఞులకు సువిదితం. శైవుడగు గౌరన హరిశ్చంద్రో పాఖ్యానాన్ని, నవనాథ చరిత్రను ద్విపదచ్ఛందస్సులోనే రచించాడు. గౌరన పుత్రుడగు భైరవకవి ద్విపదాదిఛందాలను స్పృశించనేలేదు. "నవనాథ చరిత్ర రచనా కాలమునకే వీరశైవ మతము యొక్క పట్టు కొంచెము తగ్గినదనియు గౌరనయట్టి కేవలవీరశైవ సంప్రదాయములోనివాడు కాడనియు దలంపవలసి యున్నది" అని పండితుల అభిప్రాయం.*1 భైరవకవికూడ తండ్రివలె కేవలం వీరశైవ సంప్రదాయంలోనివాడు కాడనేందుకు వైష్ణవ సంబంధి కృతి అయిన శ్రీరంగ మహత్త్వాన్ని అతడు రచించటం ఋజువు చేస్తుంది.

గౌరన నవనాథ చరిత్రను వీరశైవుడయిన ముక్తికాంత భిక్షావృత్తి రాయుని కోరిక మేరకు ద్విపదగా రచించాడు. భైరవుడు శ్రీరంగ మహత్త్వాన్ని విష్ణు భక్తుడు అయిన చాగయ రాఘవుని కోరిక మేరకు రచించాడు. కేవల శైవుడు కాని భైరవుడు ద్విపద మొదలైన ఛందస్సుల్లో గాక వివిధ ఛందో భేదాలచే ఒప్పారేటట్లు చంపువుగ శ్రీరంగ మహత్త్వాన్ని రచించాడు.

శ్రీరంగ రాజసేవా పారంగతుడగు (శ్రీరంగ 4-1) విష్ణు భక్తుడయిన చాగయ రాఘవుడు భైరవకవిని "శ్రీరంగమహత్త్వంబు మదంకితంబుగా నాంధ్ర భాషా కౌశలంబు బచరించి రచింపవలయు" నని (శ్రీరంగ 1-25) కోరాడు. అలదుకు అంగీకరించిన భైరవుడు తన కావ్యాన్ని "చిత్ర రచనలు చొప్పడగ" (శ్రీరంగ 1-27) రచించగలనని చెప్పాడు. "ఆంధ్రభాషా కౌశలంబు బచరించి "చిత్ర రచనలు చొప్పడు"నట్లు రచించేందుకు ద్విపద కావ్యంకన్న వివిధ ఛందో భేదాలతో గద్య పద్యాత్మకంగా ఒప్పారే చంపూ కావ్యంలోనే ఎక్కువ అవకాశం ఉంటుంది. అందువల్లకూడ భైరవకవి శ్రీరంగ మహత్త్వాన్ని ద్విపదాదుల్లో గాక గద్య పద్యాత్మకంగా రచించి ఉంటాడు. భైరవకవి శ్రీరంగ మహత్త్వములోని కవిస్తుతిలో (శ్రీరంగ 1-8) "హరిభక్తిదంబులై వెలయు పురాణ సత్కథలు వేడ్కరిచించి జగత్ప్రసిద్ధులై పొలుచు మహాత్ములన్ సుకవి పుంగ

*1 నవనాథ చరిత్ర-పీఠిక (పుట 17)-తుమ్మపూడి కోటేశ్వరరావు (1984)

వులన్ బ్రఋతిం"చాడు. భైరవకవికి పూర్వం తెలుగులో హరిభక్తిదములు అయిన పురాణ కథల్ని రచించిన ప్రసిద్ధులగువారు ఎర్రన పోతనలు. ఎర్రన నృసింహ పురాణాన్ని, పోతన భాగవత పురాణాన్ని రచించాడు. వీరు ఇద్దరు కూడ శైవులే. అయినాకూడ విష్ణు కథాత్మకాలు అయిన పురాణాలను ద్విపదాదుల్లో గాక చంపూ కావ్యాలుగ ఆంధ్రీకరించారు. భైరవకవి కూడ శైవుడయి ఉండికూడ విష్ణు కథాత్మకమైన గారుడోక్త శ్రీరంగ మహత్త్వాన్ని ద్విపదాదుల్లో గాక చంపూ పద్ధతిలో ఆంధ్రీకరించాడు భైరవకవి ఎర్రన పోతనలను మార్గదర్శకంగా తీసుకున్నాడనేందుకు శ్రీరంగమహత్త్వములోని అనేక పద్యగద్యాలు ప్రజల సాక్ష్యంగ ఉన్నాయి. *1

భైరవుడు ద్విపదలోగాక తదితరమైన పద్యగద్యాల్లో చంపువుగ శ్రీరంగ మహత్త్వాన్ని ఎందుకు రచించాడో పై కారణాలు కొంతవరకు సమాధానం ఇస్తున్నాయి.

గౌరన భైరవులకు పూర్వుడు శ్రీగిరికవి అతడుకూడ శైవుడే. శ్రీగిరికవి నవనాథ చరిత్ర, శ్రీరంగ మహత్త్వము అనే రెండు రచనల్ని చేశాడు (అయితే నేడు అవి అలభ్యాలు) శైవుడగు శ్రీగిరికవి రచించిన నవనాథ చరిత్ర శ్రీరంగ మహత్త్వములనితే ఇతివృత్తాలో ఉండేకావ్యాలను అదేపేర్లతో గౌరన భైరవులు రచించటం గమనార్హం.

## శ్రీరంగ మహత్త్వము. ఛందో విశేషాలు :

"ఛందమశ్వము, కవియాశ్వికుడు, గమ్యమైన కావ్య పరమార్థమున కభిముఖముగ స్వేచ్ఛానుసారముగ దానిని నడిపించి ప్రతిభా శాలియైన కవి యిష్టార్థ సాధనమున గృతార్థుడగును. నానారసమయమైన మహాకావ్యపథమున విహరించు కవియొక్క ప్రక్రమములకే యొక్క ఛందమును జాలదు. వివిధ సామర్థ్యములను సమగ్రముగ నెరింగి స్వప్రతిభా సామర్థ్యమున వానికి సామ

---

*1 పూర్వకవి అనుకరణం అనే ఉపశీర్షికలో ఇలాంటి పద్య గద్యాలకు కొన్ని ఉదాహరణలు ఇవ్వబడినవి.

ర్థ్యాతిశయాను ధ్యానమును గావించి మహాకవి కావ్య ప్రస్థానము చేయును*1"
పరమ లాక్షణికుడు, మహాకవులకోవకు చెందినవాడు అయిన భైరవకవి శ్రీరంగ
మహత్త్వములో తాను ప్రయోగించిన వివిధఛందాలను స్వప్రతిభా సామర్థ్యంతో
అయా సందర్భానుగుణంగా ఉపయోగించి కావ్య పరమార్థాన్ని వ్యక్తీకరించ
టంలో కృతార్థుడయ్యాడు.

ఎర్రన పోతనల నృసింహ భాగవత పురాణాలలో ఉన్నట్లు భైరవకవి
శ్రీరంగ మహత్త్వములో ఛందో వైవిధ్యం అంత ఎక్కువగా అగుపించదు. *2
శ్రీరంగ మహత్త్వములో ప్రయోగింపబడిన వృత్తాలు, మాలికా వృత్తాలు–
జాతులు–ఉపజాతులు–శ్లోకాలు కలిసి మొత్తం 17. ఉత్పలమాల, చంపక
మాల, శార్దూల విక్రీడితం, మత్తేభ విక్రీడితం, తరల. మాలిని, మత్తకోకిల
మహాస్రగ్ధర అనే ఎనిమిది వృత్తభేదాలను., సీసం, తేటగీతి, ఆటవెలది, అనే
దేశ్యచ్ఛందో భేదాలను మూడింటిని., అనుష్టుప్ శ్లోకం ఒకదానిని మొత్తం 17
ఛందో భేదాలను భైరవకవి శ్రీరంగ మహత్త్వములో ప్రయోగించాడు. ఇవిగాక
వచనాలు /గద్యలు /ఉన్నాయి.

*1 ఆంధ్ర మహాభారతము–ఛందః శిల్పము (పుట 91–92)–
పాటిబండ మాధవశర్మ.

*2 "నన్నయాదులవలె పోతనయందు ఛందోవైవిధ్య మెక్కువగా గానరాదు"
— శ్రీమద్భాగవతానుశీలనము (పుట 435).
కర్త. ధూళిపాళ శ్రీరామమూర్తి

# శ్రీరంగ మహాత్త్వము - కవితావైభవం, లాక్షణికత

## * శ్రీరంగమహాత్త్వములో ఉండే పద్యగద్యాల పట్టిక *

| వరుస సంఖ్య | పద్య భేదం | ప్రథమాశ్వాసం | ద్వితీయాశ్వాసం | తృతీయాశ్వాసం | చతుర్థాశ్వాసం | పంచమాశ్వాసం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ఉత్పలమాల | 12 | 26 | 21 | 27 | 25 | 111 |
| 2 | చంపకమాల | 14 | 24 | 21 | 34 | 39 | 132 |
| 3 | మత్తేభ విక్రీడితం | 21 | 16 | 22 | 10 | 13 | 082 |
| 4 | శార్దూల విక్రీడితం | 11 | 09 | 11 | 06 | 13 | 047 |
| 5 | తరల | — | 01 | — | — | 01 | 002 |
| 6 | మాలిని | 01 | 01 | 01 | 01 | 01 | 005 |
| 7 | మత్తకోకిల | — | — | 01 | — | — | 001 |
| 8 | మహాస్రగ్ధర | 01 | 01 | 01 | — | — | 003 |
| 9. | లయగ్రాహి | — | — | 01 | — | — | 001 |
| 10 | లయహారి | — | — | — | — | 01 | 001 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 11 | దంతకం | 01 | — | — | — | — | 001 |
| 12 | కందం | 72 | 59 | 117 | 114 | 97 | 459 |
| 13 | ఉత్సాహ | — | — | 01 | — | 01 | 002 |
| 14 | సీసం | 28 | 27 | 24 | 27 | 20 | 126 |
| 15 | తేటగీతి | 13 | 10 | 19 | 14 | 09 | 065 |
| 16 | ఆటవెలది | 08 | 08 | 12 | 12 | 09 | 049 |
| 17 | (సామాన్య) వచనం | 38 | 44 | 52 | 43 | 38 | 215 |
| 18 | గద్య (చూర్ణిక) | — | — | 01 | — | 01 | 002 |
| 19 | అనుష్టుప్ శ్లోకాలు | 01 | — | — | — | 01 | 002 |
| | మొత్తం | 221 | 226 | 305 | 288 | 266 | 1306 |

* ఆం.ప్ర. సాహిత్య అకాడమి వారి శ్రీరంగమహత్త్వము—పీఠికలో (పుట CII) కూడ ఈ కృతిలోని వివిధ ఛందస్సుల జాబితా ఇవ్వబడింది. దానిని ఇది యథాతథం కాదు. ఆ జాబితాలో 3వ ఆశ్వాసంలో మత్తకోకిల లేదు. 3వ ఆశ్వాసంలో చూపవలసిన లయగ్రాహి 2వ ఆశ్వాసంలో చూపబడింది. ప్రథమాశ్వాసంలో స్రగ్ధర చూపబడింది. స్రగ్ధరను భైరవుడు వాడలేదు. పంచమాశ్వాసంలో లయహారి అని ఉండాలి కాదా లయగ్రాహి అని పేర్కొనబడింది. ఈ అనుష్టుప్పు మూలం నుండి యథాతథంగ గ్రహించాడు భైరవకవి.

పై పట్టికను బట్టి భైరవకవి (పోతనవలె) సంస్కృత చ్ఛందో భేదాలనే ఎక్కువగా ప్రయోగించాడని స్పష్టమౌతోంది. ఇతడు ప్రయోగించిన సాంస్కృతిక చ్ఛందో భేదాలు (వృత్తాలు + మాలికావృత్తాలు + అనుష్టుప్పు) పదకొండు కాగా దేశీయ చ్ఛందో భేదాలు మూడు. సాంస్కృతిక చ్ఛందాలను ఆశ్రయించి రచింపబడిన పద్యాల సంఖ్య 387. కాగా దేశీయ చ్ఛందాలతో రచింపబడిన పద్యాలసంఖ్య 240. ఈ లెక్కనుబట్టి భైరవకవి, దేశ్య చ్ఛందో విశేషాల కంటే సాంస్కృతిక చ్ఛందోభేదాలైన వృత్తాలను ప్రయోగించటంలోనే మక్కువ ఎక్కువ అని విశదమౌతోంది. సాంస్కృతిక చ్ఛందో భేదాలలో సామాన్య **వృత్తాలు :** చంపకమాల, ఉత్పలమాల, మత్తేభవిక్రీడితం, శార్దూల విక్రీడితం అనేవి ఉన్నాయి., విశేష వృత్తాలలో మాలిని, మహాస్రగ్ధర, తరల, మత్తకోకిల దండకం, లయగ్రాహి. లయహారి ఉన్నాయి. మొత్తం పద్యాల్లో కందాల వినియోగం నలభైరెండు శాతానికి అధికంగా ఉంది. పద్యసంఖ్యనుబట్టి ఆయా పద్యభేదాల ప్రథమాది స్థానాలు ఇలా ఉన్నాయి.—

ప్రథమ స్థానం—కందాలు—459 పద్యాలు
ద్వితీయ స్థానం—చంపకమాలలు—132 పద్యాలు
తృతీయ స్థానం—సీసాలు—126 పద్యాలు
చతుర్థ స్థానం—ఉత్పలమాలలు—111 పద్యాలు
పంచమ స్థానం—మత్తేభ విక్రీడితాలు—082 పద్యాలు
షష్ఠ స్థానం—తేటగీతులు—065 పద్యాలు
సప్తమ స్థానం—ఆటవెలదులు—049 పద్యాలు
అష్టమ స్థానం—శార్దూల విక్రీడితాలు—047 పద్యాలు
నవమ స్థానం—మాలినీ వృత్తాలు—005 పద్యాలు
దశమ స్థానం—మహాస్రగ్ధరలు—003 పద్యాలు
ఏకాదశ స్థానం—తరల + ఉత్సాహ—2 + 2 పద్యాలు
ద్వాదశ స్థానం—మత్తకోకిల + దండకం + అనుష్టుప్పు + లయగ్రాహి + లయహారి } 1 + 1 + 1 + 1 + 1 పద్యాలు

గద్యాలు (చూర్ణికలు) + వచనాలు = 2 + 215 = 217. కనుక కందాల తర్వాత స్థానం వచనాలకే లభించింది.

ఇక భైరవకవి ప్రయోగించిన విశేష చ్ఛందాలను, సామాన్య చ్ఛందాలను, వచనాలను (గద్యలుకూడ) గురించి క్రమంగా పరిశీలించాలి—

విశేష చ్ఛందాలు : శ్రీరంగ మహత్త్వములో భైరవకవి ఉపయోగించిన విశేష చ్ఛందాలు (అకారాను క్రమంగ) ఇవి: 1 అనుష్టుప్ శ్లోకం, 2 ఉత్సాహ 3 తరల, 4 దండకం, 5 మత్తకోకిల, 6 మహాస్రగ్ధర, 7 మాలిని, 8 లయగ్రాహి 9 లయహరి. ఈ తొమ్మిది ఛందాలు ఈ కృతిలో ఆయా తావులలో ప్రయోగించటంలోని ఔచిత్య విశేషాలను పరిశీలించాలి—

అనుష్టుప్ శ్లోకం : అనుష్టుప్ఛ్లోకం సంస్కృతంలో సుప్రసిద్ధం. (సంస్కృత) పురాణేతిహాస శాస్త్రాదులలో సర్వత్ర ఈ శ్లోకమే ప్రయుక్తం. ఇది ప్రతిపాదానికి ఎనిమిది అక్షరాలుగల వృత్తవిశేషం. కాని నాల్గుపాదాల్లోనూ సమాన గణాలు ఉండవు. కనుక దీనిని స్వస్థాన విషమ వృత్తమని అంటారు అనుష్టుప్ శ్లోక సామాన్య లక్షణం ఇది—

శ్లో. పంచమం లఘు సర్వత్ర సప్తమం ద్వి చతుర్థయోః
షష్ఠం గురు విజానీయా దేతచ్ఛ్లోకస్య లక్షణమ్॥

శ్రీరంగమహత్త్వములో రెండుఅనుష్టుప్ శ్లోకాలున్నాయి. ఒకటి ప్రథమాశ్వాసంలో (198), మరొకటి పంచమాశ్వాసంలో (108) ఉంది. వీటిలో రెండోది (శ్రీరంగ 5-108) సంస్కృత మూలంలో 90వ అధ్యాయం నుండి యథాతథంగ స్వీకరింపబడింది. ప్రథమాశ్వాసంలోని శ్లోకం (198) మూలంలో కన్పించదు. కనుక ఇది భైరవకవి రచన.

కవిగజాంకుశ రచనా కాలం నాటికే "ఉభయ భాషా పారీణుడ"గు (కవిగజాంకుశము—7) భైరవకవి శ్రీరంగ మహత్త్వములో అక్కడక్కడ సందర్భోచితంగ సంస్కృత రచనా పారీణతను వెల్లడించాడు.

ప్రథమాశ్వాసంలో శ్రీరంగేశుని స్తుతిని బ్రహ్మనోట శైవకవి సంస్కృత దండకాన్ని పలికించాడు. ఆ వెనువెంటనే "శ్రీరంగే రుచిరాయస్య శ్రీరంగే రుచిరాయతా-స దైవతః శరణ్యోనః సదైవత ముపాస్మహే" (శ్రీరంగ 1-198) అని బ్రహ్మనోట భైరవకవి సంస్కృత శ్లోకాన్ని పలికించాడు. అనుష్టుప్ శ్లోకంకూడ (దండకం వలె) స్తుతికి సముచితమైన ఛందస్సు.

ఉత్సాహ : ప్రతిపాదంలో ఏడు సూర్యగణాలు చివరన ఒక గురువు, 4 గణాలమీద (అనగా 5వ గణం మొదటి అక్షరం) యతి, ప్రథమ పాదంలో ఉన్న నగణ లేదా హగణనగణ క్రమమే తక్కిన మూడు పాదాల్లో ఉండాలనే నియమం లేదు. ఐచ్ఛికంగ సూర్యగణాలను (న-హ గణాలు) కూర్చవచ్చు. ఒకేగణం మాత్రం ప్రయోగింపరాదు. నగణ హగణాలు రెండున్నూ ప్రయోగించాలి. హగణ నగణాల సమ్మేళనమే ఉత్సాహ. అన్నిగణాలు హగణాలు ప్రయోగిస్తే విచికిలిత (తరళము) ఔతుంది.

నామ సామ్యాన్నిబట్టి ఉత్సాహ చ్ఛందము ఉత్సాహస్థాయి వ్యంజకమని విశ్వసింపబడుతుంది. *1 శ్రీరంగమహత్త్వ తృతీయాశ్వాసంలో (43) ఒక ఉత్సాహ, పంచమాశ్వాసంలో (168) ఒక ఉత్సాహ ఉంది.

ఉ. ఆ సనత్కుమారుడనియె నఖిల లోకనాథ భూ
మీ సురేంద్రు డొకడు తెంపు మిగుల శిష్య సహితుడై
నా సమీపమునకు వచ్చి నాకు బ్రహ్మవిద్య
తోస మెసగ జెప్పి చనియె దోన నెను మరచితిన్ —శ్రీరంగ 3-43

దగ్గరకు వచ్చిన తన తండ్రి బ్రహ్మతో సనత్కుమారుడు పై వాక్యాల్ని ఉత్సాహంతో పలుకుతాడు. సనత్కుమారునికి బ్రహ్మవిద్య ఎరిగాను అనే ఉత్సాహం ఉండికూడ ఆ వెంటనే దానిని మరచి ఉంటాడు. అలాంటి సందర్భాన మానసిక అందోళనలో ఉన్న సమయాన, బ్రహ్మరాగానే సనత్కుమారునికి తన తండ్రి తనకేమైన బ్రహ్మవిద్యను పొందే ఉపయాన్ని ఎరిగిస్తాడనే

---

1 మహాభారతము-ఛందః శిల్పము-(పుట 356) పాటిబండ మాధవశర్మ

ఉపాయం పెల్లుబికింది. ఆ ఉత్సాహవ్యంజకంగ భైరవుడు సందర్భోచితంగ ఇక్కడ ఉత్సాహ పద్యాన్ని ప్రయోగించాడు.

ఉ. అనఘు సోమవంశ తిలకుడైన తీర్థధరుని నం
దనుడ జయధరుండనంగ దనరువాడ లోకపా
వన విచిత్ర మహిమ గలుగువాడ నేసగు పుష్కరం
బునకు దీర్థ మాడవచ్చి భోగిరాజ తల్పునిన్ — శ్రీరంగ 5-168

పై ఉత్సాహ జయధరుడనే రాజు ఖగముఖ్యానికి తననుగురించి తెలియ జేసే సందర్భాన చెప్పబడింది. శ్రీరంగేశుని దర్శించి భూరిజ్ఞాననిధి అయిన ఖగముఖ్యాన్ని చూచి జయధరుడు అమితోత్సాహంతో తనను గురించి తెలియ జేయటాన్ని భైరవకవి ఉత్సాహ పద్యంలో రచించటం జయధరుని ఉత్సాహ వ్యంజకద్యోతకంగా ఉంది. నూతనంగ పరిచయమైన వారితో తనను గురించి తెలుసుకునే సందర్భాన ఉత్సాహాన్ని ప్రకటించటం మానవనైజం. కనుక జయధరుని నోట భైరవకవి ఉత్సాహను పలికించాడు.

శ్రీరంగ మహత్త్వములోని ఉత్సాహ పద్యాలు రెండున్నూ ఉత్సాహ వ్యంజకాలే. ఈ పద్యాలు ద్రుతగతులు. ద్రుతగతికూడ ఉత్సాహద్యోతకమే.

తరల : ఇది పంతొమ్మిదవ ఛంధమైన అతిధృతి ఛందంలో పుట్టింది పాదానికి పంతొమ్మిది అక్షరాలు. న–భ–రస–జ–జ–గ అనేవి ఈ పద్యంలోని గణాలు. 11 అక్షరాలమీద యతి. తరలం అంటే చంచలం, తరంగితం అని అర్థాలు. తరల వృత్తగతికూడ అలాంటిదే. "హర్షాదులవల్ల హృదయగతి చంచలమైన యవస్థను వర్ణించుటకు తరలము తగియుండునని చెప్పవచ్చును." శ్రీరంగ మహత్త్వములో రెండు తరల వృత్తాలు ప్రయోగింపబడినవి.

త. అనుచు నీగతి భక్తవత్సలుడైన యాహరి కర్ణమో
హన సుధామధురోక్తులం దగ నానతిచ్చిన ప్రీతుడై
ముని జనోత్తము డా సుబోధుడు పూని తద్వచన క్రమం
బున జరించు నుండె దోషవిముక్త సాత్విక వర్తనన్
— శ్రీరంగ 2–196

త. అవధరింపుము లోకనాథ! ప్రభాకరుండను భూసుర
ప్రవరు డిప్పుడొకండు తీవ్రతపం బొనర్చుచునున్న వా
డవిరళోంబగు తత్తపః ప్రభవాగ్ని కీలల వేడిమిన్
భువనముల్ పరితాప వేదన బొందియున్నవి గావునన్
— శ్రీరంగ 5–189

ద్వితీయాశ్వాసంలో సుబోధుడుఅనే మహర్షికి శ్రీమన్నారాయణుడు ప్రసన్నుడై కర్ణమోహన సుధామధురోక్తులచేత మాట్లాడగా అతడు ప్రీతుడై నారాయణోక్త ప్రకారంగ చరిస్తాడనే సందర్భంలో తరల ప్రయోగింపబడింది. నారాయణుడు ప్రత్యక్షం కావటం, మాట్లాడటం సుబోధుని మానసం హర్షాతిశయ తరంగితమైంది. కనుక ఇక్కడ తరల వృత్తం ప్రయోగింపబడింది.

(పంచమాశ్వాసంలో) సూర్యుని దేవతలు ప్రార్థించే సందర్భాన "తరల" చెప్పబడింది. ప్రభాకరుడు అనే విప్రుని తపస్సు ప్రభవాగ్ని కీలల వేడిమికి భువనాలు పరితాప వేదనను పొందాయని సూర్యునికి దేవతలు "తరల"లో విన్నవిస్తారు. తరల అంటే కంపితం అనిఅర్థం. భూసురుని తపః ప్రభవాగ్ని కీలలకు కంపితులయిన దేవతలుతరలివెళ్ళి తరణిని (సూర్యుని) తరల వృత్తం లోస్తుతించటం సందర్భోచిత . ప్రభాకరుడు అనే విప్రుని పేరుచేచ్చ ప్రభాకరుని (సూర్యుని) స్తుతించటం మరో విశేషం.

దండకం : ఇది ఉద్ధురమాలా వృత్తాలకు చెందినది., స్తుతికి అనువైన ఛందో విశేషం. స్తుతిమయత్వం దీని ప్రధాన లక్షణం. భైరవకవి శ్రీరంగ మహత్త్వములో (1–197) శ్రీరంగేశ స్తుత్యాత్మక దండకాన్ని బ్రహ్మదేవుని నోట దేవభాషలో పలికించాడు ప్రాయికంగ తెలుగు దండకాలు తగణ దండకాలు. ఈ కృతిలోని దండకం సంస్కృతంలో రచింపబడింది. సంస్కృత లక్షణం ప్రకారం ఉందీదండకం. నగణ ద్వయంపై రగణాలు ఉండటం సంస్కృత దండక సామాన్య లక్షణం. "ఏకపాద, ద్విపాద, చతుష్పాద దండకాలు తెలుగు కావ్యాల్లో అగుపిస్తాయి. మచ్చుకు నన్నయ భారతంలోని దండకం ఏకపాది, నందితిమ్మన పారిజాతాపహరణం లోనిది ద్విపాద దండకం,

శ్రీనాథుని శృంగార నైషధంలోనిది చతుష్పాద దండకం. అయితే భైరవుని శ్రీరంగ మహత్త్వంలోని దండకం త్రిపాదిగ అగుపిస్తుంది. శ్రీరంగ మహత్త్వ ముద్రిత ప్రతులను విశతంగపరిశీలిస్తే అకృతి చాలాతావుల్లో గ్రంథ పాఠానికి గురైనట్లు కన్పిస్తుంది. ఈ దండక భాగంకూడ గ్రంథ పాతానికిగురై దండకం త్రిపాదిగ లభించిందని భావిచవలసి ఉంది. ఇలాభావించేందుకు కారణాల్లో త్రిపాద దండ కాలు సంస్కృతాంధ్ర సాహిత్యంలో మృగ్యం కావటంకూడ ఒక కారణం. ఈ దండకంలో ఒకపాదం గ్రంథ పాతానికి గురై ఉంటుంది." *1 ఈ దండకంలోని పాదాల ఆద్యంతాలు ఇలా ఉన్నాయి.—

జయజయ జగదేక కల్యాణ పారీణ నిష్కారణా పారకారుణ్య రత్నాకరా...... ... దేవ తుభ్యం నమః — (ప్రథమపాదం)

కలశజలధి మధ్య చంచత్సిత ద్వీప రత్నాగ్ర వైకుంఠ.. ... ...... భావానువర్తీ భవాన్ —(ద్వితీయ పాదం)

పరమ పురుషస్త్వాం నజానాతి కశ్చిత్కథం విస్తరేణ స్తుతిం...... ......దేవప్రసిద్ధ పాహిమాం పాహిమాం పాహిమామ్ —(తృతీయ పాదం)

గ్రంథాంతర్గత దండకాలలో ఎక్కువగ స్తుత్యాత్మకదండకాలే ఉన్నాయి భైరవుడు కవిస్తుతిలో స్తుతించిన ఎర్రన, పోతనలు తమ నృసింహ, భాగవత పురాణాలలో దండకాలను స్తుతి సందర్భాలలో రచించారు, భైరవుడు వారి మార్గాన్నే అనుసరించాడు. *2

---

*2 తెలుగు దండక వాఙ్మయము (అముద్రితం).

కర్త : వైద్యం వేంకటేశ్వరాచార్యులు (కర్నూలు)

*1 ఆం ప్ర. సాహిత్య అకాడమివారు ప్రచురించిన శ్రీరంగ మహత్త్వ ముపీఠికలో (పుటలు CXXVI-CXXVIII) ఈ దండకాన్ని గురించి సవరణమ సూచిస్తూ ఇలా ఉంది, "కలశ జలధిమధ్య చంచత్సిత ద్వీప రత్నాగ్ర-శ్రీరంగనాయక స్వామి వర్ణన-క్షీరాబ్ధి ఇచటముఖ్యము. సంస్కృతములో పెద్ద దండకమిది. దండకమంతయు తగణములతో కలదు. మధ్యన కలశ జలధి (నగణములు పడినవి) కుదరదు. దీనిని పాథోధి మధ్యస్థ-లేదా-క్షీరాబ్ధి మధ్య

మత్తకోకిల : ఇది పద్దెనిమిదవది అయిన ధృతి చ్ఛందంలో పుట్టింది. ఇందులోని గణాలు రసజజభర. పది అక్షరాలమీద యతి. "హృదయము మధుర భావావేశమున ఇంచుక త్వరిత గతియైన స్థితిని వ్యంజించుటకీ వృత్త ముతగియున్నదని భావింపవచ్చును." *1

దక్షుని కుమార్తెలయిన అశ్విని మొదలయిన వారిని అందరనూ చంద్రుడు సమభావంతో చూడక రోహిణిని మాత్రం ఎక్కువ ప్రేమతో చూస్తూ ఉంటాడు. భార్యలందరినీ సమంగా చూడాలని దక్షుడు ఒకసారి చంద్రుడిని మందలిస్తాడు. అయినకూడ రోహిణిపై అమితమైన ప్రేమను కలిగి ఉంటాడు. అశ్విన్యాదులు "వగ పగ్గలింపక వెండియున్" తండ్రితో తమభర్త పద్ధతిని తెలుపగా దక్షుడు చంద్రుని పిలిపించి దండిస్తాడు. వగపగ్గలింపబడిన అశ్విని మొదలైన వారు తండ్రికి తమ పరిస్థితిని తెల్పటం వెంటనే అతడు చంద్రుని పిలిపించి దండించటం మొదలైనవన్నీ త్వరితంగ ఈవృత్తంలో వర్ణితం. ఎర్రన నృసింహ పురాణంలో (2-145) "రండు పాదము లెండువేగమ" అని ప్రయాణ త్వరాన్ని తెలిపేందుకు మత్తకోకిల వృత్తాన్ని ఎంపిక చేసుకున్నాడు. త్వరిత గతిని వ్యంజించేందుకు భైరవకవి కూడ ఇక్కడ ప్రాచీన కవిమార్గాన్ని అనుసరించి మత్తకోకిలను ప్రయోగించాడు.

మహాస్రగ్ధర : ఇది ఇరవైరెండవది అయిన ఆకృతిఛందంలో పుట్టింది. పాదానికి ఇరవైరెండు అక్షరాలు ఉంటాయి. గణాలు : స-త-త-న-స-ర-రగ. ఎనిమిది-పదైదు అక్షరాలమీద యతులు. ఇది పద్యలక్షణం.

స్త-అని సవరించినచో గణభంగము బాధతప్పి-అర్థసమన్వయము కాగలదు." ఈసవరణను గురించి తెలుగుదండక వాఙ్మయములో (అముద్రితము) వైద్యం వేంకటేశ్వరాచార్యులు గారు ఇలా వ్రాశారు......."కలశ జలధి అనునదిగణ భంగమ్ము కాదు. అది దండకమందలి మరొకపాద ప్రారంభ భాగము. కనుక నగణ ద్వయముతో ప్రారంభింపబడినది. దండకమంతయు తగణములతో కలదనుట పొరపాటు. ఈ దండకము నగణద్వయముపై రగణములతో చెప్ప బడినది. దండకమందలి మరోపాదము పరమ పురుష అని ప్రారంభింప బడినది......"

---

*1 మహాభారతము-ఛందః శిల్పము.

శ్రీరంగ మహత్త్వంలో ప్రథమ, ద్వితీయ, తృతీయ అశ్వాసాల్లో ఒక్కొక్కదానిలో ఒక్కొక్క మహాస్రగ్ధర చొప్పున మొత్తం మూడు మహాస్రగ్ధరలు ఉన్నాయి.

ప్రథమాశ్వాసంలో సుబోధుడు అనే మహర్షికి విష్ణువు ప్రత్యక్షమైన సందర్భాన మహావిష్ణువు స్వరూపాది వర్ణనం మహాస్రగ్ధరల్లో చేయబడింది. ఆపద్యం ఇది—

బహుభాస్వద్భాసమాన ప్రభలు నభమునం బర్వ వార్వాహ గర్వా
సహ నీలాంగ ద్యుతుల్ భూషణ మణితతి మించన్ లసద్వైజయంతీ
సహితోరః కౌస్తుభాంశుల్ జడిగొన గనకాచ్ఛాదనస్ఫు బొప్ప శౌర్యా
వహ చంచద్దోస్సహ స్రావలి మెరయ బలిధ్వంసి ప్రత్యక్షమయ్యెన్
— శ్రీరంగ 1–169

స్రక్ధర అంటే మాలను ధరించునది అనిఅర్థం. మహాస్రగ్ధర అంటే గొప్పదయిన మాలను ధరించునది. మహావిష్ణువు గొప్పదయిన వైజయంతీ మాలను ధరించును, అట్టి "లసద్వైజయంతీ సహితోరః కౌస్తుభాంశుల్ జడిగొన"గా ప్రత్యక్షమైన విహావిష్ణువును మహాస్రగ్ధరలో వర్ణించాడు కవి. మహావిష్ణువు "శౌర్యావహ చంచద్దోస్సహ స్రావలి మెరయగా" ప్రత్యక్షమయ్యాడు. ఆయన "బలిధ్వంసి" అనికూడా పద్యంలో పేర్కొనబడ్డాడు. "వీరస్య భుజ దండానాం వర్ణనే స్రగ్ధరాభవేత్" అని కాత్యాయనోక్తిగా అభినవ గుప్తపాదులు నాట్యశాస్త్రంలో ఉదాహరించారు. స్రగ్ధరకు మహాస్రగ్ధరకు రసాది ఔచిత్యంలో ఎన్నదగిన భేదంకన్పించదు. ప్రాచీనోక్త మార్గాన్ని అనుసరించి వృత్త ప్రయోగ ఔచిత్యాన్ని పాటించి పై మహాస్రగ్ధర రచింపబడిందనటం స్పష్టం.

శ్రీరంగ మహత్త్వము ద్వితీయాశ్వాసంలో (145) సముద్ర వర్ణనాత్మకమైన మహాస్రగ్ధర ఉంది. "సావేగ పవమానాదీనా వర్ణనే స్రగ్ధరామతా" అని సువృత్త తిలకంలో (3–22) క్షేమేంద్రుడు, "రౌద్రే స్రగ్ధరాదయః" అనిభోజుడు శృంగార ప్రకాశము (కావ్యానుశాసనము—పుట 336)లో స్రగ్ధర ప్రయోగ ఔచిత్యాన్ని గురించి చెప్పారు. కనుకసాగరవర్ణనం ప్రాచీన మార్గానుసారముగ ఎర్రన అరణ్యపర్వంలోను స్రగ్ధరను ప్రయోగించాడు. ప్రాచీనమార్గానుగుణం

గనే "రౌద్రం" డగు "సముద్రు"ని భైరవకవి మహాస్రగ్ధరలో అనుప్రాస శోభి తంగ (రక్షావినిద్రుం-నిర్ఘోషాది రౌద్రుం-లక్ష్మీ సురద్రుం-కృపాపాత్రభద్రున్ సముద్రున్ వర్ణించాడు.

"రౌద్రే స్రగ్ధరాదయః"అని భోజుడు "కదా చిద్వీర రౌద్రాభ్యాం" అని భరతముని మొదలగువారు చెప్పినట్లుగా రౌద్రాకారంగల పిశాచిని తృతీయా శ్వాసంలో భైరవకవి మహాస్రగ్ధరలో వర్ణించాడు.

మాలిని : ఇది పదైదవ ఛందమగు అతిశక్వరి ఛందంలో పుట్టింది. పాదానికి పదైదు అక్షరాలుంటాయి. గణాలు: న-న-మ-య-య ఎనిమిది అక్షరాలమీద యతి. "కుర్యాత్ సర్గస్యపర్యంతే మాలినీం ద్రుతతాలవత్"అని మాలినీవృత్త వినియోగాన్ని గురించి క్షేమేంద్రుడు సువృత్త తిలకంలో తెలి పాడు. అనగామాలినీ వృత్తాన్ని సర్గాంతంలో ద్రుతతాలవంతం అయ్యేటట్లుగా నిబంధించాలని భావం. ఆశ్వాసాంతంలో మాలినీ వృత్తాన్ని ప్రయోగించే నియ మాన్ని చాలామంది తెలుగుకవులుపాటించారు. వారిలో భైరవకవికూడఒకడు.

నమ దవన విలోలా ! నవ్య శృంగార జాలా!
ప్రమదకర విలాసా ! భాగ్యలక్ష్మీ నివాసా!
శమదమ యుతభవ్యా ! చారువిద్యా న్నిషేవ్యా!
సమదరిపు విరామా ! చాగయా మాత్యరామా! — శ్రీరంగ 1-22

పై పద్యం శ్రీరంగమహత్త్వం ప్రథమాశ్వాసాంతంలో ఉంది. ప్రతిపాదం సమఖండాలై అనుప్రాస యుక్తంగా ఉంది. పై పద్యంలో ద్విప్రాస కూడ పాటింపబడింది. మిగతా ఆశ్వాసాంత పద్యాల్లోకూడ మాలినీవృత్తాలు ప్రయో గింపబడినవి. అవికూడ ప్రతిపాదం సమఖండాలై అనుప్రాస యుక్తంగా ఉన్నాయి. ఈ మాలినీ వృత్తాలు ఐదుకూడ చివరన "చాగయమాత్య రామా" అని కృతిభర్త నామధేయ సంబోధకంగా ఉన్నాయి. ఈ మాలినీ వృత్తాలన్నీ కృతిపతి (స్తుత్యాత్మక) సంబోధనాత్మకాలు.

లయగ్రాహి : ఇది మాలికా వృత్తాలకు చెందినది. పాదానికి ముప్పై అక్షరాలుంటాయి. గణాలు: భ-జ-స-న-భ--జ-స-న-భ-య 8-16-24 అక్షరాలమీద యతి. ప్రాసయతులుంటాయి. యతి స్థానంలో ఈ వృత్తంలో

ప్రాసయతులనుపాటించటం తెలుగుకవుల ప్రత్యేక విశిష్టత. కనుకలయగ్రాహి దేశీయచ్ఛందమని పండితుల భావన.*1

దీనమానసుడయిన చిత్రసేనుడుఅనే గంధర్వుడు నటరాజుఅయిన నీల కంధరుని కొలిచాడు అనిచెప్పే సందర్భాన (శ్రీరంగ 3-253) ఈ లయగ్రాహి ప్రయోగింపబడింది.

సింధురనిశాట మద-సింధుఘట జన్మసుర
సింధు కనకాంబురుహ-గంధ విచలత్ప్ర
ష్పంధయ వితీర్ణసిత-బంధురజాటా పటల
బంధవిల సత్క్రముద-బంధు ప్రమదా సం
బంధ లలితాంగునను-సంధిత జగత్క్రశలు
కంధర వినీలతర-కంధరునుదార
స్కంధ వృషవాహనుక-బంధ మథనప్రియు జ
లంధరహు గొల్చెనత-డంధక విరోధిన్ — శ్రీరంగ 3-253

గంధర్వులు లయాన్వితమైన తాళరాగాదులను బాగా ఎరిగిఉంటారని ప్రతీతి. అలాంటి గంధర్వుడు నీలధరుని (నటరాజును) కొలిచాడని తాళలయా న్వితమైన లయగ్రాహిలో చెప్పటం, అదికూడ బిందుపూర్వక ధకార ప్రాసయతి యుక్తంగ చెప్పటం గంధర్వుని చిత్త ఏకాగ్రతను సూచిస్తుంది.

లయహరి : ఇదికూడ ఉద్ధురమాలా వృత్తమే. పాదానికి 37 అక్షరాలు. గణాలు : పదకొండు నగణాలు ఒక సగణం ఒక గురువు. పాద ద్వితీయా క్షర ప్రాసతో కలిపి ప్రతిపాదానికి నాలుగు ప్రాసలుంటాయి. యతిస్థానంలో ప్రాసయతులు పాటించటంవల్ల పాదానికి 39 మాత్రలు ఉండి మాత్రా ఛంద స్సుకు చేరువగా ఉండటంవల్ల దీనిని దేశ్యచ్ఛందంగా భావించవచ్చునని పండి తులు భావించారు. *2 కానీ లాక్షణికులు దీనిని సంస్కృత సమవృత్తాల్లో చెప్పారు.

*1 తెలుగుభాషలో ఛందోరీతులు - రావూరి దొరస్వామిశర్మ,

దేవతా స్తుతుల్లో తాలలయాన్వితమైన లయహారి చిత్త ఏకాగ్రత సంపాదకమై మిక్కిలి సముచితంగా ఉంటుంది. కనుకనే నన్నెచోడ, అనంతామాత్యాది కవులు కుమార సంభవ, భోజరాజీయాదుల్లో స్తుతి సందర్భాల్లో లయహారిని ప్రయోగించారు. వారి పిమ్మట తెలిసినంతలో లయహారిని ప్రయోగించిన తెలుగుకవి భైరవుడే ఇతడుకూడ వారివలెనె లయహారిని స్తుతి సందర్భంలోనే ప్రయోగించాడు. ప్రభాకరుడు అనే విప్రుడు సూర్యుని స్తుతించే సందర్భాన లయహారి ప్రయోగింపబడింది. (శ్రీరంగ 5-203)—

"జయజయ సకల దివిజచయ ముకుట ఘటిత
మణిచయ రుచిర పదయుగళయ కలపద్మ
ద్వయనిబిడ తరతిమిర లయ కరణచణ
హరితహయ వినుత సుజన భవభయ శమన నానా
మయ విపిన దహనఫణి శయన వరచరణవృతని
యమముని నుతనిగమమయ సరసిజాతి
ప్రియదురిత హరనిరతిశయ మహిమ వితత
రథరయ విహగ విభవ కువలయ వనదినేశా"

సప్తాశ్వ సమారూఢుడై విశాల వియత్పథంలో ఎల్లప్పుడు ఒకేరీతిగ చలించక లయను ఎరిగి గ్రహించి చరించేవాడు కావటంవల్ల ప్రభాకరుడు అనే విప్రుడు ప్రభాకరుని లయహారిలో వినుతించటం సమంజసం. పై పద్యంలోని మొదటిపాదం చివరన గీతగీచిన తావున రెండు అక్షరాలు లోపించాయి. ప్రతి పాదానికి 37 అక్షరాలు ఉండగా ప్రథమపాదాన 35 అక్షరాలే ఉన్నాయి. *1 అది ముద్రణదోషమో లేక ముద్రణ మూలమైన వ్రాతప్రతలో లేఖకదోషమో అయిఉంటుంది.

[] సామాన్య చ్ఛందాలు []

---

*1 మానవల్లి వారి ప్రతిలో (1912) మరియు ఆం.ప్ర. సాహిత్య అకాడమి వారి ప్రతిలో (1979) పద్య ప్రథమం పాదం ఇలాగే ఉంది. అకాడమి ప్రతిలో ఈ పద్యాన్ని లయగ్రాహి అని పేర్కొనటం సరికాదు.

శ్రీరంగ మహత్త్వములో భైరవకవి ప్రయోగించిన సామాన్య చ్ఛందాలు: చంపకమాల. ఉత్పలమాల, మత్తేభవిక్రీడితం, శార్దూల విక్రీడితం, కందం, సీసం. తేటగీతి, ఆటవెలది.

ఎఱ్ఱన నృసింహ పురాణములోని ఛందో విశేషాలను గురించి వ్రాస్తూ దివాకర్ల వేంకటావధాని గారు ఇలా వ్రాశారు.– *1 "సాధారణములైన శార్దూల మత్తేభ చంపకోత్పలమాలా సీసగీత కందపద్య ప్రయోగములలో వెఱ్ఱన యంతగా ప్రత్యేకత చూపెనని చెప్పుట కవకాశము లేదుకాని క్రొత్త వృత్తములను (విశేష చ్ఛందములను) వాడుటలో మాత్రము రసానుకూలత పాటించినట్లు గోచరించును" ఎఱ్ఱనను అనుసరించిన భైరవకవికి కూడా పై వాక్యాలు వర్తిస్తాయి. ఇక శ్రీరంగ మహత్త్వములోని సామాన్య చ్ఛందాలు వరుసగా పరిశీలించాలి—

చంపకమాల : శ్రీరంగ మహత్త్వములో వివిధ పద్యాల ప్రయోగ సంఖ్యనుబట్టి చంపకమాల ద్వితీయ స్థానంలో ఉంది. అశ్వాసానుక్రమంగ చంపకమాల ప్రయోగ సంఖ్య ఇలా ఉంది. ప్రథమాశ్వాసం 14, ద్వితీయాశ్వాసం 24, తృతీయాశ్వాసం 21, చతుర్థాశ్వాసం 34, పంచమాశ్వాసం 39, మొత్తం 132.

కృతిలోని 132 చంపకమాల వృత్తాల్లో రెండువృత్తాలు కృతిపతి సంబోధనాత్మకంగ ఆశ్వాసాంతాన రచింపబడినవి (శ్రీరంగ 5-262, 2-264). అందులో ఒకటి (శ్రీరంగ 2-264) నాగబంధం రచింపబడింది. కదమ 130లో 23 చంపకమాలలు వర్ణన సందర్భాన ప్రయుక్తం. కాగా మిగిలిన చంపకమాలలన్ని కూడ కథా కథన సందర్భాన రచింపబడినవి. దీనిబట్టి భైరవకవి చంపకమాలా వృత్తాలను కథాకథన సందర్భంలో ఎక్కువగా ప్రయోగించాడని స్పష్టమైనది.

ఉత్పలమాల: ఆశ్వాసానుక్రమంగ ఈకృతిలోని ఉత్పలమాలా వృత్తాల సంఖ్య ఇలా ఉంది. ప్రథమ 12, ద్వితీయ 26, తృతీయ 21, చతుర్థ 27,

---

*1 ఆం.ప్ర. సాహిత్య అకాడమి ప్రచురణ: నృసింహ పురాణము–పీఠిక– పుట–56 (1967)

పంచమాశ్వాసం 25, మొత్తం 111. కృతిలోని 111 ఉత్పలమాల వృత్తాల
దాదాపు సగం పద్యాలు వర్ణనల సందర్భాన మిగిలిన సగం పద్యాలు క
కథన సందర్భాన ప్రయోగింపబడినవి. వర్ణనాత్మకమైన కొన్ని ఉత్పలమాల
అంత్యానుప్రాస శోభితంగ రచింపబడినవి.

మత్తేభ విక్రీడితం: ఆశ్వాస క్రమాన శ్రీరంగ మహత్త్వములోని మత్తే
విక్రీడిత పద్యాల సంఖ్య ఇలా ఉంది — ప్రథమాశ్వాసం 21, ద్వితీయ 1
తృతీయ 22, చతుర్థ 10, పంచమాశ్వాసం 13, మొత్తం 82.

భైరవకవి శేషుని, పరమ భాగవతోత్తములను స్తుతించే సందర్భా
మత్తేభ విక్రీడితాన్ని ప్రయోగించాడు. ప్రథమాశ్వాసంలోని కృతిపతి వ
వర్ణనాన్ని సాలంకారమైన ఐదు మత్తేభ వృత్తాల్లో రచించాడు కవి. మత్తే
వృత్తాలను భైరవుడు అంత్య ప్రాసలతో రచించటంవల్ల పద్యాల్లో విశ్రా
శ్రవణ మాధుర్యం సంతరించుకున్నాయి.

సముద్ర వర్ణన సందర్భాన రచింపబడిన మత్తేభం (శ్రీరంగ 2-20
క్షీరసముద్రం నుండి వచ్చిన చతుర్దంతిని తలపిస్తుంది. కావేరీప్రవాహ వ
సందర్భానగల మత్తేభం (శ్రీరంగ 2-194) ఆ ప్రవాహం మత్తేభయానా
పోలిఉందని తెలిపేటట్లుంది. మత్తేభాలు ఉండే అడవిని (శ్రీరంగ 1-11
దంతావళారూఢుడైన వ్యక్తిని (శ్రీరంగ 2-58) మత్తేభవిక్రీడితాల్లో వర్ణించ
భైరవకవి ఔచిత్యాన్ని సూచిస్తాయి. ఈకవి శార్దూలంకన్న మత్తేభాన్నె ఎక
వగా ప్రయోగించాడు. స్వీయ ప్రతిభావర్ణన సందర్భానకూడ కవి మత్తేభా
ప్రయోగించటం అతనికి మత్తేభ రచనపైగల మక్కువను సూచిస్తుంది.

శార్దూల విక్రీడితం : ఆశ్వాసాను క్రమంగ శ్రీరంగ మహత్త్వము
శార్దూల విక్రీడితాల సంఖ్య ఇలా ఉంది. ప్రథమాశ్వాసం 11, ద్వితీయ
తృతీయ 11, చతుర్థ 6, పంచమ 13, మొత్తం 47.

శ్రీకారం మగణం ఈ రెండున్నూ కావ్యారంభంలో ప్రయోగించ
శుభప్రదమని లాక్షణికుల మతం. కనుక లాక్షణిక గ్రంథకారుడగు భైరవ
కూడ కృత్యాదిలో శ్రీకారం మగణం ప్రయోగించేందుకు అనువైన ఛం
అయిన శార్దూల విక్రీడితాన్నే రచించాడు.

"శౌర్తేస్తవే నృపాదీనాం శార్దూల విక్రీడితమ్"అని క్షేమేంద్రుడు శార్దూల విక్రీడత ప్రయోగ విధిని సూచించాడు. కృతిపతి అయిన చాగయ రాఘవుని వంశ వర్ణన సందర్భాన (శ్రీరంగ 1-37, 1-47, 1-49) శార్దూల వృత్తాలను ప్రయోగించి క్షేమేంద్రుని సూచనను కవి అనుసరించాడు. ఆశ్వాసాంతాలలో ఉండే (శ్రీరంగ 2-220, 2 303, 4-284, 5-263) శార్దూల విక్రీడితాలు కూడ ఈ నియమాన్ని పాటించినవే ఔతాయి: వీటిలో చివరిది చక్రబంధంగా రచింప బడింది.

యమకింకరుల భయోద్వేగాన్ని (శ్రీరంగ 3-121) శార్దూలంలో రచించ టం ఆ సందర్భానికి అతికినట్లుంది. యుద్ధసంరంభంలో రెండు శార్దూలాలను ప్రయోగించటం (శ్రీరంగ 3–217, 18) సందర్భ శుద్ధిని కలిగిఉంది. రణారం భోజ్జృంభితమైన జంభారాతి వజ్రాన్ని ప్రయోగించిన సందర్భానగల శార్దూలం (శ్రీరంగ 3-238) కూడ క్షేమేంద్రుడు చెప్పిన "శౌర్యస్తవే" అనే నియమాను సారంగా రచింపబడిందనిపిస్తుంది.

భైరవకవి శార్దూలాలను వర్ణనా సందర్భంలోనూ కథాకథన సందర్భం లోనూ ఔచిత్యంగా ప్రయోగించాడు.

కందం : ఆశ్వాసానుక్రమంగ శ్రీరంగ మహత్త్వములోగల కందపద్యా లసంఖ్య ఇలాఉంది— ప్రథమాశ్వాసం 72, ద్వితీయ 59, తృతీయ 117, చతుర్థ 114, పంచమాశ్వాసం 97, మొత్తం 459.

శ్రీరంగమహత్త్వములోని వివిధ పద్యాల మరియు వచనాల వినియోగాన్ని బట్టి కందాలకు ప్రథమస్థానం లభిస్తుంది, పోతనార్యుని భాగవత పద్యాలను అనుకరించిన భైరవుడు కందపద్య వినియోగంలోకూడ పోతనవలె కందానికి ప్రథమస్థానం కల్పించాడు. తనయందు సతతానురక్తుడైన కవినోట కంద పద్యం అత్యంత శక్తివంతమై ప్రసరిస్తుంది. కందాన్ని సమర్థవంతంగ నడిపించ గలవాడే కవి అనిఅనటం అందుకే కాబోలు! "కందమును వ్రాసినవాడు కవి పందిని వేసినవాడు బంటు" అనే సామెత ఏర్పడింది అందుకే.

శ్రీరంగ మహత్త్వములో గల వివిధ పద్యాల మొత్తం సంఖ్యలో నలపై రెండు శాతానికి కొంచెం ఎక్కువగానే కందాలు ఉండటంవల్ల కంద పద్యంపై

ప్రదర్శనకు ఎంతటి అధికారం, అనురక్తి ఉండేది ఊహించవచ్చు. కేవలం అను రక్తి మాత్రమే ఉంటే ప్రయోజనం ఉండదు, దానితోపాటు ఆపద్యాన్ని అను సందర్భోచితంగ నడిపించటంలో కవిసిద్ధహస్తుడై ఉండాలి. సందర్భోచితంగ భైరవకవి రచించిన కందాలు అతడు ఎంతటి సిద్ధహస్తుడో తెలియజేస్తున్నాయి. కొన్ని కందాల ప్రాసక్రీడలు అలంకార శోభితాలు.

శ్రీరంగ మహత్త్వ సంస్కృత మూలం ఎక్కువభాగం అనుష్టుప్ శ్లోకాలతో రచింపబడింది. అనుష్టుప్ ఛందంయొక్క ఉపయోగాన్ని గురించి క్షేమేంద్రుడు సువృత్త తిలకంలో (iII 6, 9, 16, 29) చెప్పిన అంశాలన్నీ తెలుగు కందానికి కూడ చక్కగ వర్తిస్తాయి. ఈ ఛందోమర్మాన్ని ఎరిగినవాడు కనుకనే భైరవకవి అనుష్టుప్పులలో ఉండే మూలాన్ని తెలుగు చేయటంలో కంద పద్యాలనే ఎక్కువగా వినియోగించాడు.

గూఢ ముద్రాలంకార శోభితాలైన కందాలు శ్రీరంగ 1-23, 4-78.

చక్కని చిక్కని శైలిగల వచనాలవలె కూడ భైరవకవి కందాలను నడిపిస్తాడు. మచ్చుకు—

కం. దివసాగమ వికసిత నవసారసదళ విశాల నయనంబులదా
నవసామజ పంచానన భవసాగర మగ్ను నన్ను బాలింపు హరీ!
— శ్రీరంగ 1–173

ఇలాంటి పద్యాలు కవిగారి వచన స్ఫురణను వ్యక్తం చేయుటంతోపాటు కవికి సర్వలఘు రచనలోగల అభిమానాన్ని అధికారాన్ని తెలియజేస్తాయి.

బ్రాహ్మణుడు చోరునికి భయపడి వికలహృదయుడై తడబడునని చెప్పు సందర్భాన ఉంటే—

కం. పొడగని యడలెడు భయమున
నడుగులు దడబడగ హృదయమదరగ బెదపుల్
దడుపుచు నడుకుచు వడవడ
వడకెడు నవ్విప్రుఁజూచి వాడు దృప్తిన్ — శ్రీరంగ 3.64

అనే పద్యం విప్రుని తడబాటును వడకును కన్నులకు సాక్షాత్కరింప జేస్తుంది. ఈ పద్యం నన్నెచోడుని కుమార సంభవంలోని "తగుదగదని మన మునమును" (10-136)అనే పద్యాన్ని, పోతనార్యుని భాగవతంలోని "అడిగెద దని కడువడిజను" (8–103) అనే పద్యాన్ని జ్ఞప్తికి తెనస్తుంది.

భైరవకవి ద్విప్రాస, త్రిప్రాస, అంత్యప్రాస, అనుప్రాస కందాలను ఈ కృతిలో చాలాచోట్ల రచించాడు, (వీటిని ఈ అధ్యాయంలోని "ప్రాసలు" అనే ఉపశీర్షికలో ప్రదర్శింపబడును.)

శ్రవణ సుకరానందాలయిన కందాలకు మచ్చుకు కొన్ని—

కం. శరదమల కమలలోచను
దరదళిత సరోజధాము ధామశ్యామున్
దరహస వికసితానను
గరుణానిధి శేషశాయి గామితదాయిన్ — శ్రీరంగ 4–62

కం. దవనము, వనలక్ష్మి వినో
ద వనము, సదవనము–విరహ తాపాంధులకున్
భువనము లలరగ మెలగెడి
భవనమున కపూర్వజన్మ భవనము తన్వీ! — శ్రీరంగ 4–80

ఇలా భైరవుని కందాలు శూకతాళ్వాల వలెగాక కళ్ళెంపట్టి నడిపించిన కర్త్రాణంవలె సందర్భోచితంగా సాగి ఆనందాన్ని కల్గిస్తుంటాయి,

సీసాలు: ఆశ్వాస క్రమంలో శ్రీరంగ మహత్త్వమునగల సీసపద్యాల సంఖ్య ఇలాఉంది—ప్రథమాశ్వాసం 28, ద్వితీయ 27, తృతీయ 24, చతుర్థ 27, పంచమాశ్వాసం 20, మొత్తం 126. ఈ126 సీసాలలోని ఎత్తుగీతులలో 120 సీసాలకు తేటగీతులు మిగిలిన 6 సీసాలకు ఆటవెలదులు ఉన్నాయి. కనుక భైరవకవికి సీసపద్యాల ఎత్తుగీతులుగ తేటగీతులు రచించటం ఇష్టమని స్పష్టమౌతోంది.

సీసపద్య పుటెత్తు గీతిగ ఆటవెలదులు రచించిన వాటి వివరాలు ఇవి– శ్రీరంగ 1-45. 3-25, 4-246, 5-115, 5-184, 5-211. ఇక కేవలం తేటగీ

తులు ఆటవెలదులలోకూడ తేటగీతుల సంఖ్యనే అధికం. పోతనార్యుడు కూడ భాగవత సీసాలలో ఆటవెలదులకన్న తేటగీతులనే ఎక్కువగ రచించాడు. పోతన సీసాలను. తేటగీతులను, ఆటవెలదులను యతులతోనే రచించాలనే నియమం గలవాడు. (యతులు + ప్రాసయతులు కలిపి ప్రయోగించరాదనే నియమం). ఈ నియమాన్ని భైరవకవికూడ కొంతవరకు పాటించాడు. శ్రీరంగ మహత్త్వములోని 126 సీసాలలో కేవలం యతులతోనే రచించిన సీసాలు 20 ఉన్నాయి. మిగత సీసాలన్నింటిలోను మొత్తంమీద ప్రాసయతులకన్న యతులే ఎక్కువగా రచింపబడినవి.

కేవల యతిసీసానికి మచ్చుకు ఒకటి—

సీ. శబ్దార్థరూఢి రసస్థితి బహువిధ
వ్యంగ్య భేదములు భావములు గతులు
శయ్యలలంకార శరణులు రీతులు
పరిపాకములు దశప్రాణములును
వృత్తులు వస్తువివేకంబు గుణములు
కవి సమయము చమత్కారములును
వర్ణనంబులు గణవర్ణ ఫలంబులు
దత్కులంబులు నధిదైవతములు

తే.గీ. గ్రహములును శత్రుమిత్ర యోగ్యములు దశలు
అంశ వేధయు భూతభేదాక్షరములు
పొత్తువులు దెల్పి శాంతి విస్ఫురణ దనరు
సత్కవీంద్రుని కృతి బుధ సభల వెలయు — శ్రీరంగ 1–14

ఇలా కేవలం యతులనే పాటించి రచించిన సీసపద్యాలు ఇవి—

శ్రీరంగ 1-14, 1-56, 1-91, 1-114, 1–185, 2-68, 2-72, 2-112, 2-135, 2-213, 3-14, 3-26, 3-109, 3-169, 4-188, 4-191, 4–211, 4-272, 5-58, 5-158.

*1 సమగ్రాంధ్ర సాహిత్యం–5వ సంపుటం–పుట 248–249 (1965ము).

సీసపద్యాల రచనా విధానంలోనే గాక కవితాశైలిలోకూడ పోతనార్యుని తలపింపజేసె సీసాలను కొన్నింటిని భైరవుడు రచించాడు. "హరదివ్య నామ ధేయామృతం బింపార జెలగి యాస్వాదించు జిహ్వజిహ్వ" (శ్రీరం.గ 1-91) మొదలైనవి కొన్ని ఉదాహరణలు (పూర్వకవి అనుకరణము అనే ఉపశీర్షికలో కొన్ని పద్యాలు ఉదాహరింపబడినవి)

ఈ కృతిలో సీసపద్యాల వినియోగం ఎక్కువగ వర్ణనల సందర్భంలో అగుపిస్తుంది. కథాకథన సందర్భాన వేదాంత విషయాలను చెప్పేటప్పుడు కూడ కొన్ని సీసపద్యాలు రచింపబడినవి.

తేటగీతి : అశ్వాసానుక్రమంగ ఈ కృతిలోని తేటగీతుల సంఖ్య ఇలా ఉంది— ప్రథమాశ్వాసం 13, ద్వితీయ 10, తృతీయ 19, చతుర్థ 14, పంచమాశ్వాసం 9. మొత్తం 65. ఈ 65 తేటగీతులలో 40 తేటగీతులు కేవలం యతితో రచింపబడినవి కాగా మిగిలిన తేటగీతులు ఈవిధంగా ఉన్నాయి: ఒకపాదంలో మాత్రమే ప్రాసయతి ఉండేవి 18, రెండు పాదాల్లో ప్రాసయతి ఉండేవి 6. ఈ పరిశీలనంవల్ల ప్రాసయతులకన్నకూడ యతులు ప్రయోగించి తేటగీతులు రచించటం భైరవకవికి ఎక్కువ అని తెలుస్తుంది. పోతనార్యుడు కేవలం యతులతోనే భాగవతంలోని తేటగీతులు రచించాడు. భైరవకవికూడ తేటగీతులలో యతుల వినియోగమందు చాలావరకు పోతన మార్గాన్ని అనుసరించాడు.

ఆటవెలది : ఆశ్వాసానుక్రమంగ శ్రీరంగ మహత్త్వములోని ఆటవెలదుల సంఖ్య ఇలాఉంది- ప్రథమాశ్వాసం 8, ద్వితీయ 8, తృతీయ 12, చతుర్థ 12, పంచమ 9, మొత్తం 49 ఈ 49 ఆటవెలదులలో 24 ఆటవెలదులు కేవలం యతులతోనే రచింపబడినవి కాగా 25 ఆటవెలదులు ఈ క్రింది విధంగ ప్రాసయతులతో రచింపబడినవి ఒకపాదంలో ప్రాసయతిగలవి 15, రెండు పాదాలలో ప్రాసయతిగలవి 7, మూడు పాదాలలో ప్రాసయతిగలవి 3. ఈ పరిశీలనంవల్ల కూడ భైరవకవి ప్రాసయతులకన్న యతులు వినియోగించి ఆటవెలదులు రచించటంలో భైరవకవికి ఇష్టమని తేలినది.

వచనం/గద్యం : ఆశ్వాసానుక్రమంగ ఈ కృతిలో వచనాల/గద్యాల సంఖ్య ఇలా ఉంది- ప్రథమాశ్వాసం 38, ద్వితీయ 44, తృతీయ 52+1, చతుర్థ 43, పంచమ 38+1, మొత్తం 215+2.

ఈ కృతిలో సామాన్య వచనాలు 215 కాగా గద్యాలు (చూర్ణికలు) 2, మొత్తం 217.

కావ్యంలోని కథాగమనమున గల పద్యాలలో నిబద్ధాలయిన వాక్య ప్రతివాక్యాలను సంధించేందుకు ఉద్దేశించిన లఘుఖండాలయిన వచనాలు కొన్ని ఉన్నాయి. అలాంటి సంధివచనాలు తరచుగ- "అనియు, మరియును, అప్పుడు, అదిగావున, అంత, ఎట్లనిన, అవియుంగాక, అనివిత్కరించి, కావున, అనిననతండిట్లనియె" అనేరీతిగా ఉంటాయి. ఇలాంటి లఘుఖండ వచనాలు దాదాపు ఇరవైఐదు ఉంటాయి,

శ్రీరంగ మహత్త్వములోని వచనాలను స్థూలంగ ఇలావిభజించవచ్చు—

| | |
|---|---|
| కథాకథనాత్మక వచనాలు ... ... ... | 177 |
| పద్యాల్లో నిబంధించిన వాక్యప్రతివాక్యాలను నిబంధించేందుకు ఉద్దేశింపబడిన లఘుఖండ వచనాలు | 25 |
| వర్ణనాత్మకమయిన సుదీర్ఘ వచనాలు/చూర్ణికలు(గద్యాలు)... | 13+2 |

గద్యభేదాలు నాలుగు. అవి: ముక్తకం, పద్యగంధి (వృత్తగంధి) ఉత్కలికాప్రాయం, చూర్ణిక (చూర్ణకం). వీటిలో భైరవకవి పద్యగంధులను చూర్ణికలను ఈ కృతిలో రచించాడు.

పద్యపుమెత్తుగడలవలె ఉండేటట్లు వచనాలను రచించే అలాంటి వచనాలను పద్యగంధులు అంటారు. భైరవకవి రచించిన పద్యగంధి వచనాలకు మచ్చుకు కొన్ని —

శార్దూల విక్రీడితం వలె ప్రారంభించబడిన వచనం- "ఈ శూద్రుండత్తి పాపకర్మ..." (శ్రీరంగ 3-113)

కందపద్యంవలె ప్రారంభించబడిన వచనాలు :

"కావున భువనైక కథా ... ..." —(శ్రీరంగ 1-17 )
"అని ప్రార్థించిన నాశ్రిత ... ..." —(శ్రీరంగ 1-184)
"అని నిర్దేశించిన ... ..." —(శ్రీరంగ 1-194)
"కని యప్పరమేశ్వరుని-త్యనిరతిశయనిరుపమ" —(శ్రీరంగ 1-196)
"అనియానతిచ్చి యాశ్రిత ... ..." —(శ్రీరంగ 1.219)
"అనియానతిచ్చి గావున ... ..." —(శ్రీరంగ 2-134)
"అనిచెప్పి యప్పరాశర-తనయుడు సనయుఁడగు నాగవంతమునీ"
—(శ్రీరంగ 3-216)
"ఇట్లు గనుంగొని గుబ్బున ... ..." —(శ్రీరంగ 3–80)
"ఇట్లరిగిన సకలదురిత ... ..." —(శ్రీరంగ 3-216)
"కని విస్మయంబునొంది ... ..." —(శ్రీరంగ 3-295)
"అని పలికి ధర్మవత్సలు ... ..." —(శ్రీరంగ 4–36)
"అని పలికినంత నంతక ... ..." —(శ్రీరంగ 4–49)
"అని యుపదేశించిన ... ..." —(శ్రీరంగ 4-134)
"అనియానతిచ్చి ... ..." —(శ్రీరంగ 4-148)
"ఒక్క శుభముహూర్తంబున ... ..." —(శ్రీరంగ 4-214)

గీతపద్యంవలె ప్రారంభించబడిన వచనాలు :

"ఇట్లువచ్చు సమ్మహస్త్రంరాజంబుతే-జంబు ..." —(శ్రీరంగ 2-103)
"ఇట్లు తండొసచ్చు సముచిత సత్కార ... ..." —(శ్రీరంగ 2-168)
"ఇమ్మహాతీర్థ రక్షకులై విధాతృ ... ..." —(శ్రీరంగ 3–58)
"అప్పుడు మధ్యాహ్న సమయంబగుటనతండు ...—(శ్రీరంగ 3-127)
"అంతనంతయు వినియుమాకాంతుడఖిల ......"—(శ్రీరంగ 3-227)
"సకల ధర్మంబులందున సాత్వికంబు-పరమ ధర్మంబిది"
—(శ్రీరంగ 3-268)
"అదిగనుంగొని తల్లడ మడరబాక-శాసనుండువారి"—(శ్రీరంగ 4-137)
"మంత్రతంత్రంబు లెవ్వియుందోపకున్న ... " —(శ్రీరంగ 5–22)

సీసఖండాలవలె ప్రారంభించిన వచనాలు :

"అనిచెప్పి యప్పద్మవాహినీ సహచరుం
యనుచర సహితుడై యల్లనల్ల" — శ్రీరంగ 4–75

"అనిన నామాటలు సమ్మతింపక భార
తీ కాంతుడం తర్హితు..." — శ్రీరంగ 5-197

ద్విపదవలె ప్రారంభించిన వచనాలు :

"ఆరాజశేఖరు డాత్మగతంబు" — శ్రీరంగ 2-4

"కాలాత్మకుండును కాలచక్ర ప్ర
వర్తకుండునునగు విష్ణుదేవుండు" — శ్రీరంగ 3-97

"అనిపల్కి యారాజ పంచాననుండు
పంచరాత్రాగమ... .." — శ్రీరంగ 5-237

"అని యుపదేశించి యారాజుచేత
బూజితుండై నిజా ... ..." — శ్రీరంగ 5-253

గద్యభేదం అయిన చూర్ణికలు శ్రీరంగ మహత్త్వములో రెండుఉన్నాయి. వాటిలోఒకటి తృతీయాశ్వాసంలో మరొకటి పంచమాశ్వాసంలో ఉంది. చూర్ణికలు సామాన్యంగ స్తుత్యాత్మకాలుగానే రచింపబడుతాయి. శ్రీరంగమహత్త్వములోని రెండు చూర్ణికాలు కూడ స్తుత్యాత్మకాలే. ఒకటి శివస్తుత్యాత్మకం కాగా మరొకటి సరస్వతీ స్తుత్యాత్మకం. శివస్తుత్యాత్మకమైన చూర్ణిక సర్వలఘువుగ రచింపబడింది (శ్రీరంగ 3-215). గంధర్వుడు తన మహత్త్వాన్ని పోగొట్టుకుని శంభుని స్తుతిస్తాడు. మహత్త్వ రహితుడై లఘువుగా మారిన గంధర్వుడు సర్వ లఘు చూర్ణికలో స్తోత్రం చేయుటం సందర్భోచితంగ ఉంది శైవుడైన భైరవకవి వైష్ణవ కృతిఅయిన శ్రీరంగ మహత్త్వములో తన శివభక్తిని చూపించేందుకు సందర్భోచితంగ కుదిరింది. సరస్వతీ స్తుత్యాత్మకమయిన మరోచూర్ణిక పంచమాశ్వాసంలో ఉంది. గీర్వాణ భాషామతల్లి అయిన వాణిని గీర్వాణవాణిలో స్తుతించటం భైరవుని ఔచిత్యానికి నిలువుటద్దంవంటిది. వర్ణనాత్మకమయిన భైరవుని గద్యాలు పద్యాలను మించిన హృద్యమైన ప్రౌఢకవితా శైలిని కలిగి ఉన్నాయి.

"గద్యం కవీనాం నికషం వదంతి" అని వామనుడు చెప్పాడు. శ్రీరంగ మహత్త్వములోని పదమూడు వర్ణనాత్మక వచనాలు రెండు స్తుత్యాత్మకమగు చూర్ణికలు భైరవకవి వచన రచనా పాటవానికి గీటుఱాళ్లు. ఈ కృతిలోని కొన్ని వచనాలు శబ్దార్థ ముక్తపదగ్రస్త విరోదాభాసాద్యలంకారాం సుందరాలై ఒప్పాడు

తున్నాయి. పద్యరచనను మించిన ప్రతిభ గద్యరచనలో పరిస్ఫుటమౌతుంది. అలాంటి గద్యాలన్నికూడ వర్ణనాత్మకంగ ఉన్నాయి. బాణుని కాదంబరిని తలపింపజేసే వచనాలు భైరవకవి ప్రౌఢకవితా ప్రాభవాన్ని చాటుతున్నాయి. ఇలాంటి వచనరచనలో భైరవుడు ఎర్రన పోతనలను అనుకరించాడు. శ్రీమన్మహావిష్ణువు అంగవర్ణన వచనం (శ్రీరంగ 4-222) ఎర్రన నృసింహ పురాణమందలి అంగవర్ణన వచనాన్ని (3–14) స్మరణకు తెస్తుంది.

యతులు : "కవిత నేరుపు యతికూర్పు కైపుదెలుపు" అన్నట్లు భైరవ కవి యతులను సాధారణంగ సలక్షణమయినవాటినే ప్రయోగించాడు. అయితే కొన్ని తావులలో మాత్రం అఖండ యతిని, ఋ–రు యతిని, సంయుక్త విశేష ప్రాసయతులను ప్రయోగించాడు.

అఖండయతి : ఈ యతిని కొందరు లాక్షణికులు సమ్మతించలేదు. అయితే ప్రాచీన అర్వాచీన కవుల రచనల్లో చాలప్రయోగాలు అగుపిస్తున్నాయి.

"ర, త్నాకర వేష్టితావని వినంబడదాతడు. ఇందు భైరవుడు అఖండ యతిని కూర్చినాడు." —(తెలుగుభాషలో ఛందోరీతులు—చావూరి దొరస్వామిశర్మ

ఋ–రు యతి : "తృణముగాలినట్లు త్రుంగిపోవు" (శ్రీరంగ 5.112) త్రుంగు అనే రూపం ఉంటే సరిపోతుందని పండితమ్మన్యులు అనవచ్చు. కానీ త్రుంగు రూపంలేదు. భారతంలో "తురగ స్యందన వారణ ప్రకరముల్ ద్రుంగన్ విజృంభించెదన్" (ద్రోణపర్వం 5-359) అని తిక్కనగారి ప్రయోగం దిద్దేందుకు వీలుకాని యతిస్థానంలో ఉంది. కనుక భైరవకవి ప్రమాదవశాన తృ–త్రు (ఋ–రు) లకు యతినికూర్చాడు. లాక్షణిక సమ్మతం కాకపోయిన కూడ పూర్వకవులు కొందరు అక్కడక్కడ ఇలాంటి యతులను కూర్చారు. మచ్చుకు—

"క్రూరార్ధ చంద్రాస్త్ర–కృత్తోరు బాహులై"

— భాస్కర రామాయణము 1448

"తృణకణాంశంబు వజ్రమై–త్రుంచునట్లు"

— ఘడికి సింగన వాసిష్ఠ రామాయణము 3-230

వృద్ధివళి : వృద్ధిసంధి జరిగిన అక్షరాన్ని యతిస్థానంలో ప్రయోగి... అది వృద్ధివళి. ఈ యతి లాక్షణిక సమ్మతం. ప్రాచీనకవుల లక్ష్యాలక్ష... ఉన్నాయి. ఇలాంటి యతులను భైరవకవి ప్రయోగించాడు. మచ్చుకు—

"అచ్చెరువంది సంయమికులైక భూషణ"

ప్రాదియతి : "ప్రాణములుగాచి రక్షింపుమనిన యతని"–శ్రీరంగ 3–67
"ఆదరించి తనకు బ్రాణంబుకంటె" –శ్రీరంగ 4-232

ప్ర+అన = ప్రాణ. ప్రాదులకు అచ్చుచేర్పటంవల్ల విర్పడేసంధుల... ఉభయ విధాలుగా యతి చెల్లుతుంది.

ఓంధుయతి :

ఈగతిం, బర్వీన నవ్వయెయ్యది సమస్తము — శ్రీరంగ 2-21
మహిమం, బరగెడి తత్తీర్థమున సముంచిత — శ్రీరంగ 4-0...
ఉం. ధన మొనరింపగా మరచి నల్లడలన్ — శ్రీరంగ 5-4...

ఇలాంటివి శ్రీరంగ 5-17, 5-252 పద్యాలలో కూడా ఉన్నాయి. ... యతులన్ని కూడ లాక్షణిక సమ్మతాలు.

ప్రాసలు : ర–ఱ ప్రాసలు. భైరవకవి శ్రీరంగ మహత్త్వములో సాధ... రేఫ శకటరేఫలకు ప్రాసను కూర్చాడు. ఈప్రాసను చాలామంది లాక్షణికులు ఒప్పుకునలేదు. అయితే మహాకవుల రచనలలోకూడ ఇట్టి సాంకర్యం కనబడు...స్తుంది. అందువల్ల సాధు–శకటరేఫ మైత్రిని ఎందరో కవులు అంగీకరించారు. అప్పకవి ఈ ప్రాసను సమ్మతించకున్నను అప్పకవీయంలో (ప్రమాదవశాన నేమో) సాధు–శకటరేఫ సాంకర్యం ఉంది. సాధుశకటరేఫ ప్రాస ప్రయోగా... లకు పూర్వకవుల ప్రయోగాలలో మచ్చుకు ఒకటి.

తరువులలోలి దప్పక–నఱుకం జిక్కె — హరివంశము పూర్వ...

భైరవకవి మచ్చుకు— 6–5 (వి...)

చం. అరవిరి కమ్మదమ్మి ... ... ...న
బ్బురముగ ... ... ... ...లో

గుఱ్ఱావులు వారి ... ... ...ము
మ్మరముగ ... ... ... —శ్రీరంగ 2-46

కం. నిరవధిక-హరికీర్తన...మఱిలేదుపాయ మీవు-పుష్కరిణి
— శ్రీరంగ 3–57

చం. మెఱసిన ..దరలక ...ఎఱిగియు...తెఱగున — శ్రీరంగ 3-246

కం. దురితానల...నేఱిజెడి...ఇరవుగ...బొరయుదురు
— శ్రీరంగ 3-283

కం. ఇఱువురము .. అఱుదెంచి...అరసి...మఱి — శ్రీరంగ 4-173

ఇలాగాక సాంకర్యరహితంగ కూర్చిన ప్రాసలుకూడ ఉన్నాయి. వాటిలో సాధురేఫ ప్రాసలకు శకటరేఫ ప్రాసలకు చాలా ఉదాహరణలు అగుపిస్తాయి. శకటరేఫ ప్రాసకు మచ్చుకు ఒకటి—

కం. వెఱ్ఱవకు...ఒఱ్ఱవకు...చఱ్ఱవకు...మఱ్ఱవకు

ఖండాఖండబిందుప్రాస : అర్ధబిందు నిర్బిందుప్రాస సాంకర్యం ఉండే పద్యాలు మహాకవుల ప్రయోగాలలో కన్పిస్తాయి. కనుక భైరవకవిక్కూడ ఈ ప్రాసను ప్రయోగించాడు. మచ్చుకు—

ద్వాదశ...మోదంబున...గాఁదద్విలోకనౌత్సుక...ద్వైదివ్య
— శ్రీరంగ 1–76

అటుకొంత . పటువిక్రమ...పటుడగు విభీషణుని కా...తఁట
— శ్రీరంగ 2–9

ఏకమనస్కులై...శ-కారులై...బ-ల్కాఁకలు...వివేకుని-క్ష్వాకు
— శ్రీరంగ 2–57

ఈతగు...వీతెలి-వీతాలిమి-భూతలపతి...మన-చేఁతలు
— శ్రీరంగ 2–91

ఇలాంటి ప్రాసలు అనేకం. గ్రంథ విస్తరభీతివల్ల అన్నింటిని ఇక్కడ పేర్కొనలేదు. నాలుగు పాదాల్లోకూడా అర్ధబిందువు ఉండేటట్లు ప్రాసను కూర్చిన పద్యాలు ఉన్నాయి. మచ్చుకు—

కా(డితడు–వే(డిమి–లే(డను నిత్తెరగుననవు–గా(డని — శ్రీరంగ 4-68

సంయుక్త విశేష ప్రాస : ప్రాచీన కవులు తమ కృతులలో పద్య ప్రథమ పాదంలో ఎన్నిహల్లులు సంయుక్తంగా ఉంటాయో అన్నిహల్లులు సమంగ తక్కిన పాదాల్లో ప్రాసస్థానంలో సంయుక్తాలయి ఉండేటట్లు పద్య రచన చేశారు. అయితే కొందరు ప్రాచీన కవులు కూడ కొద్దిగా "హల్సామ్యం" ఉంటేచాలు అని సంయుక్త విశేష ప్రాసలను ప్రయోగించారు. ఇలాంటి ప్రాసలను భైరవకవి ప్రయోగించాడు—

మార్గవశమున కావేరి – డగ్గరుటయు — శ్రీరంగ 3-126

ఇలాంటి ప్రాసలు పూర్వకవులవి మచ్చుకు ఒకటి—

భర్గుండు–తర్గంగా–నుగ్గాడన్–మ్రగ్గెతురు

— కుమారసంభవ 11-34

ఇలాంటి ప్రాసను మరొకదానిని భైరవకవి ప్రయోగించాడు. అది—

అవ్వియుబుధ–నవ్వుదొలంకు– మీ, రెవ్వరు - పర్వెన

ఉభయప్రాస : కవిత్రయం తర్వాతగల కవులు "న--ణ"లకు ప్రాసను కూర్చారు. భైరవుడు కూడ ఇలాంటి ప్రాసలను కూర్చాడు. మచ్చుకు—

విని...మహాతరం-గిణి-ఘన...ని-స్వన — శ్రీరంగ 3 223

నానావిధ--మేన్నులు--మానక--ప్రాణులు — శ్రీరంగ 3-134

అభేదప్రాసలు : "ల--ళ" ప్రాసలు.

ఏలావన... చందన--జాలాభినవ--జాలానిల... లీలా--దోళిత

— శ్రీరంగ 1-178

లీలందావొక్కని--హేళిన్ హేమ...ను--త్తాల...కం--రాలిం

— శ్రీరంగ 1.143

బలిమిం--కులసం--జల--ప్రళయా — శ్రీరంగ 2-145

ఆలోలామల...ప-త్కులానోహక ...మ--త్తాళివ్రాతము-యాలోకించె

— శ్రీరంగ 4-60

చోళీ... నే–పాళీ–బం, గాళీ--పాం, చాలీ — శ్రీరంగ 4-286

సంధిగత ప్రాసలు : ప్రాసలో వ్యంజనం ప్రధానం. కనుక సంధివల్ల నిలిచిన ఆగమాదేశ వ్యంజనాలకే ప్రాసమైత్రి పాటింపబడుతుంది. ఇలాంటి ప్రాసవిశేషాలను పూర్వకవులందరుకూడా విరళంగా ప్రయోగించారు. మచ్చుకు భారత ప్రయోగాలు—

సింగంబాకటితో...మా-తంగ...వచ్చునో-జంగాంతార...వ-చ్చెంగుంతీసుత

ఓజన్ + కాంతార = ఓజం + కాంతార = ఓజంగాంతార అయిప్రాస సిద్ధించింది. అలాగే వచ్చెను + కుంతీసుత - ద్రుతముమీది సరళా దేశసంధిచే వచ్చెంగుంతీసుత అయినది. అనంతామాత్యుడు దీనిని బిందుప్రాసఅని పేర్కొన్నాడు. ఇలాంటి ప్రాసలు భైరవకవి కూడ ప్రయోగించాడు: మచ్చుకు—

సందర్శించుచు జని కని
యెంద్రడనంతర
చెందిన...వసి--గం ద్రుణీ — శ్రీరంగ 4-53
ఇందిర...తుద--లంద్రొరగెడి — శ్రీరంగ 4-99

జంబూదుంబర-జంబీరామ్ర-జంబూకాహ్వయ...భ-క్తింబ్రాజించె — శ్రీరంగ 4-140

పైన చూపిన ప్రాసలు సంధిగత ప్రాసలు, ఇక బిందువుతేని సంధిగత ప్రాసలకు మచ్చుకు—

గండపు - కెందలిరాకు--జెందిన--విందులు — శ్రీరంగ 2-50

ఇందులోని ద్వితీయపాదాన కెంపు + తలిరాకు కెందలిరాకు అయి సంధి వల్ల సిద్ధించిన రూపానికి ప్రాసచెల్లింది. ఇలాంటివి ఇంకాకొన్ని ఉన్నాయి. గ్రంథ విస్తరభీతివల్ల అన్నింటిని పేర్కొలేదు.

## 4. 2. 2. భాషావ్యాకరణ విశేషాలు :

కం॥ భైరవుడ నుభయభాషా
పారీణుడ లోభిభవన భవభూమి వ్యా

పార సవికార దుష్కవి
ఘోర పిశాచుల నదల్చుకొను భైరవుడన్ — కవిగజాంకుశము-7
— రత్నపరీక్ష-5 (కొద్దిమార్పుతో)

కం. కిదుకుచు లక్షణ మెరుగక
కొదుకుచు వడిబ్రాస యతిని గూడక ఖిన్నుల్
వెదుకుచు బదసంధుల బెత
నదుకుచు నరకపత జెప్పున తడంగవియే! — కవిగజాంకుశము-9

పై పద్యాలలో కీ్రగీతలు ఉంచిన భాగాలనుబట్టి భైరవకవి ఉభయ భాషల్లో అంటే సంస్కృతాంధ్రల్లో ప్రావీణ్యుడని, దుష్కవులనదల్చువాడని పదాల సంధులను చెడనదుకుతూ సగం కవిత్వం చెప్పేవారు కవులా అని, భాషావ్యాకరణాలను సరిగ ఎరుగని కవులను ఈసడించేవాడని తెలుస్తున్నది. దీనిని అనుసరించి భైరవకవి ప్రాచీనాంధ్ర భాషావ్యాకరణ సంప్రదాయాను గుణంగ సలక్షణంగ (తదనంతర రచన అయిన) శ్రీరంగ మహత్త్వమును రచించి ఉంటాడని భావించవచ్చు.

శ్రీరంగ మహత్త్వములో కేవలం సంస్కృతంలో దండకం (శ్రీరంగ 1-197), శ్లోకం (శ్రీరంగ 1-198), చూర్ణికలు (శ్రీరంగ 3-215, 5-220) మొదలైనవి రచించాడు. అవి భైరవకవికిగల సంస్కృత భాషా పారీణతకు నికషోపలాలు. ఇక భైరవకవికిగల ఆంధ్రభాషా ప్రావీణ్యం శ్రీరంగ మహత్త్వములో సర్వత్ర కన్పిస్తుంది.

భాషా వ్యాకరణాలను దృష్టిలో ఉంచుకుని శ్రీరంగ మహత్త్వమును పరిశీలిస్తే అక్కడక్కడ "నిరంకుశాః కవయః" అనే సూక్తికి ఉదాహరణగ కొన్ని ప్రయోగాలు అగుపిస్తాయి. వీటిని పరిశీలించాలి—

తాలవ్య హల్లునకు పరములో అత్వానికి ఎత్వం :

ఆ.వె. ... ... గరుడధ్వజుని చేతి
చెక్రమైన వారి జేరకంత — శ్రీరంగ 3-248

దిద్దేందుకు వీలుకాని యతిస్థానంలో చక్రము అనేందు చెక్రము అని ప్రయోగింపబడింది. ఈ ప్రయోగం వ్యవహారంలోని ఉచ్చారణనుబట్టి ప్రయోగింపబడి ఉంటుంది.

సంస్కృతంలో "చక్రవాకి" పదం తెలుగులో చక్రవాకములు లేదా చక్రవాకులు అని ఉండాలి. ఈ పదాన్నికూడ దిద్దేందుకు వీలుకాని యతి ప్రాస స్థానాలలో "చక్రవాకలు" అని ప్రయోగించాడు కవి. ఆ పద్యభాగం ఇది—

చం. ... ... ... చక్రవా
కలు దనలోన వీడువడి కన్నులపండువొనర్చె జక్రికిన్
— శ్రీరంగ 4–92

సంఖ్యా వాచకాలలో ఒకదానిని అనేందుకు "ఒకటిని" అని ప్రయోగింపబడింది—

గీ. తవిలి భూలోకసారమై తనరు నగ్ర
హార మొకటిని దనపేర నారచించి — శ్రీరంగ 4-211

చిన్నయసూరి "బాలవ్యాకరణం – అచ్చిక పరిచ్ఛేదం 31వ సూత్రంలో నూరు–నూటిని–నూరిటిని" ఉదాహరణలుగా ఇచ్చాడు. కనుక ఒకటినికూడా సాధువే ఔతుంది.

"కువర్ణకంబు పరంబగునపుడు డుకారబు కారంబులకు నగాగమంబగు" –(బాలవ్యాకరణము–తత్సమపరి–28 సూత్రము). ఈసూత్రానికి వ్యతిరేకంగ చాలా ప్రయోగాలు శ్రీరంగ మహత్త్వములో అగుపిస్తాయి. మచ్చుకు—

పురంబుకు — శ్రీరంగ 2-185
కైలాసముకు — శ్రీరంగ 3-280
తీర్థముకు — శ్రీరంగ 4-103
మనసుకు — శ్రీరంగ 5-180
కైవల్యముకు — శ్రీరంగ 5-201
త్రిదివముకు — శ్రీరంగ 5-249
పట్టణంబుకు — శ్రీరంగ 2-150
సముదయంబుకు — శ్రీరంగ 4-13
యోగంబుకు — శ్రీరంగ 4-141
కాలముకు — శ్రీరంగ 5-180
పదముకు — శ్రీరంగ 5-249

యడాగమానికి మారుగ ద్రవిడ భాషలోవలె వకారాగమం వచ్చుట వ్యాకరణ సిద్ధంకాదు. కాని భైరవకవి త్రిప్రాస కందంలో తలమావులుకక అని ప్రయోగించాడు. ఆ పద్యం ఇది—

కం. ఎల మావులు వలరాయని
యల మావులు శుకపికంబులాగిన వేల్పుం
బొల మావులు విరహార్తుల
దల మావులుకక చరింప దరుణీ యిచటన్ — శ్రీరంగ 2–67

పై పద్యంలోని "తలమా వులుకక" అనే పదాన్ని గురించి సాహిత్య అకాడమివారు ప్రచురించిన శ్రీరంగమహత్త్వ పీఠికలో (CXX VIII) "దీనిని తలమా యులుకక అని సవరించిన బాగు. (మానవల్లి రామకృష్ణ) కవిగారెందుకు మార్చలేదో?" అనిఉంది. మానవల్లివారు ఈ పదాన్ని లక్షణ విరుద్ధమైనదని గుర్తించికూడ దిద్దేందుకు వీలుండికూడ మార్చలేదు. తలమా యులుకక అనిదిద్దితే త్రిప్రాస సౌందర్యం చెడుతుంది. కనుక భైరవకవి నిరంకుశంగానే తలమా వులుకక అని ప్రయోగించి ఉండవచ్చు. ప్రాస సౌందర్యం కోసం ఇలాచేసిన కొన్ని ఇతర ప్రయోగాలు పూర్వకవులవి పోతనామాత్యుని వంటి వారివి అగుపిస్తున్నాయి.

పై ప్రయోగాలను గురించి మానవల్లి రామకృష్ణ కవిగారు తాను ప్రచురించిన శ్రీరంగ మహత్త్వ పీఠికలో (పుటలు VII-VIII) ఇలా చెప్పారు— "భైరవుడు గొప్పలాక్షణికుడని ప్రఖ్యాతి వహించియు నాంధ్ర వ్యాకరణ దోషములు పెక్కులు పరిహరింపజాలడయ్యెను. "తలమా వులుకక" యిత్యాది స్థలముల యడాగమమునకు మారుగా ద్రమిళ భాషలోవలె వకారాగమంబు వచ్చుట వ్యాకరణ సిద్ధముగాదు- "స్వర్గముకు" మొదలగుచోట్ల నగాగమంబు రామి శ్రవణ సుభగముగాదు. "భరద్వాజ మునికి నెరింగించిన యీ వినుతేతిహాస పతసము"–ఇట్టి ప్రయోగములు దీనిలో బెక్కులుగలవు. ప్రౌఢవ్యాకరణమ్ములో నుదాహరింపబడిన నన్నయభట్టారక ప్రయోగములకును దీనికిని జాలభేదము గలదు. ఆంధ్రమున లాక్షణికులే లక్ష్యైక వేదులగు కవులకలె

నెక్కుడప ప్రయోగములు కూర్చి వానికి సాధుత్వముపపాదింప ప్రయత్నించిరి. ఇట్టి దోషముల సూచించుట కర్తవ్యమని చూపితికాని నేటికాలమున పాణిని పతంజలుల యంతరంగమును గుర్తించి విచిత్రవ్యాఖ్యాన వైఖరీ ప్రవాహంబున మునిత్రయమును మునిసప్తకంబుగా జేయజాలిన గ్రామ్య భాషోద్ధారకులకివి హాస్యభాజనములుగాక తక్కవు"

కొన్ని సంస్కృత పద ప్రయోగాలు : తారకాది గణాలలో గతార్థాలు కాని "ఇత" ప్రత్యయాన్నిచేర్చి ప్రయోగించిన పదాలు కొన్ని పూర్వకవులవలె భైరవకవి కూడా ప్రయోగించాడు. ఆకృతి గణంవల్ల వీటికి సాధుత్వాన్ని చెప్పవచ్చు. *1

ఘనతర : కం. ఘనతర పరితాపభీతి గడలని కరణిన్ — శ్రీరంగ 2-23

దరదరుణతర – శ్రీరంగ 5-221 గద్యం

క్యజ్ ప్రత్యయాన్ని చేర్చటంవల్ల భృశ మొదలగునవి చేరినపేర్లు ధాతువులుగ ఔతాయి. అలాంటి పేర్లపై క్యజ్ ప్రత్యయం చేరినందువల్ల నిష్పన్నమయ్యే క్రియారూపాలు వర్తమానార్థకంగా ఉంటాయి. *2 మచ్చుకు

| | |
|---|---|
| సత్కీర్తి జయ శ్రీరాజమాను | — శ్రీరంగ 1-4 |
| అకలుషమాన | — శ్రీరంగ 1-102 |
| యౌవన భ్రాజమాన | — శ్రీరంగ 4-64 |
| తిలకాయమాన | — శ్రీరంగ 5-221 |
| శఫరాయమాన | — శ్రీరంగ 5-221 |
| జేగీయమాన | — శ్రీరంగ 5-221 |
| దేదీప్యమాన | — శ్రీరంగ 5-221 |

వైదిక ప్రయోగాలు : "శుచిషత్తు" "కం. సుచిర క్రతువొసగు బ్రియము శుచిషత్తునకున్"— శ్రీరంగ 5-45. యాగపద్ధతి దాని విశిష్టతనుగూర్చి చెప్పే సందర్భాన ఈ పదం ప్రయోగింపబడింది. "శుచిసత్" "శుచిసత్తు" కావాలి.

*1 తెలుగుకవుల సంస్కృత ప్రయోగాలు. డా॥ జాస్తి సూర్యనారాయణ (పుట 52) 1981.

*2 పైదే

ఇందులో సకారానికి షత్వం రాదు. అందుకు కారణం సకారం లౌకిక పదాలకే పరిమితమవుతుంది శుచౌ ఆవిముక్తాది పుణ్యక్షేత్రేషు సీదతి తిష్ఠతీతి–శుచిసత్ అని *1 వైదికం అయిన విశిష్టపద ప్రయోగానికి ఇదొక ఉదాహరణం.

కొన్ని పదాలలో భైరవుడు "క" ప్రత్యయాన్ని వాడినాడు.

ఉదా:- అనఘాత్మక–శ్రీరంగ 4–4, పాపాత్మకాలు–శ్రీరంగ 5-139

పదమధ్య అక్షేపం : పద మధ్యంలో కొన్నివర్ణాల (హల్లుల) మీది అచ్చులకు లోపం కలిగేటట్లు కొన్ని పదప్రయోగాలు ఉన్నాయి:

ఉదా :– నాల్గు–శ్రీరంగ 2-105, కల్గు–శ్రీరంగ 2-185, విన్కి–శ్రీరంగ 2-188, కిన్కరప–శ్రీరంగ 3-93, పల్కు–శ్రీరంగ 3-117, కల్గదె–శ్రీరంగ 4-167 నల్లుపు శ్రీరంగ 4-176, కొల్తురు 4-246, తిల్కు–శ్రీరంగ 4–25, నల్గడలన్–శ్రీరంగ 5-43, వెల్వొల–శ్రీరంగ 5-118.

అపూర్వైన కొన్ని పదప్రయోగాలు : భైరవుడు కొన్ని అరుదైన పదాలను ప్రయోగించాడు. తెలిసినంతలో వాటికి ప్రయోగాంతరాలు కన్పడవు. "నివ్వటిల్లు" అనేందుకు "నివ్వగిల్లు" అని ప్రయోగింపబడింది.

సీ. క్రేలుసాచిన నివ్వగిలు కళికాంతులు — శ్రీరంగ 2-69

ఇలాంటిదే మరో ప్రయోగం-

వ...జలంబులు వెడవెట్టి "నివ్వగిలిన" జువ్వననెగయు–శ్రీరంగ 1-146

"తేవగిలు" పదంకూడ ప్రయోగింపబడింది.

సీ. కలికి రాయంచ రెక్కల "తేవగిలు" మాడ్కి — శ్రీరంగ 2-48

"నివ్వగిలు" పదానికి ప్రయోగాంతరం కానరాదని సూర్యరాయాంధ్ర నిఘంటువు కూడ పేర్కొంది.

"ఇలు" ప్రత్యయంగల మరికొన్ని ప్రయోగాలుకూడ శ్రీరంగమహత్త్వములో ఉన్నాయి. అయితే ఇవి ఇతర గ్రంథాల్లోకూడ కన్పడుతాయి.

---

*1 శ్రీరంగ మహత్త్వము (1979)–పీఠిక–పుట CVIII

ఉదా:- వికసిల్లు — శ్రీరంగ 1-89 కుప్పతిల్లు — శ్రీరంగ 2-48
దుసికిలు — శ్రీరంగ 2-79 ఉల్లసిల్లు — శ్రీరంగ 3-3
ఉల్లసిలు — శ్రీరంగ 2-91

మరికొన్ని అరుదైన ప్రయోగాలు :

అరచించు = (రచించు, ఏర్పరచు) — శ్రీరంగ 4-211
అరరే! = (ఆశ్చర్య ప్రశంసాదులను తెలుపుతుంది)— శ్రీరంగ 4-224
ఈడ = (వృక్షవిశేషం, ఎఱ్ఱకిత్తలి) — శ్రీరంగ 2-59
కల్లెడ = (తరంగం, ప్రయోగాంతరం కన్పడదు) — శ్రీరంగ 2-59
తవగించు = (ఒప్పు ఎసగు) — శ్రీరంగ 1-149
పంచాళి = (వడరుబోతు) — శ్రీరంగ 3-42
పాతపు = (ఇంపైనది) — శ్రీరంగ 2-94
పొత్తువు = (పాదిక) — శ్రీరంగ 1-14
బకలము సేయు = (తొలగించు)— శ్రీరంగ 1-190

ధ్వన్యనుకరణ పదాలు :

మిటగాయు — శ్రీరంగ 3-176 పొరపొరబొక్కు — శ్రీరంగ 3-176
విసవిసరు ,, తటతటదాక — ,,
భగమండు ,, పెటపెటబ్రేల ,,
జవనింకు ,, మలమలమాడు ,,
గజవడకు — శ్రీరంగ 3-185

లోకోక్తులు–సామెతలు :

పదారు పన్నెబంగారొరబట్టు ... ... — శ్రీరంగ 1-89
తిలల దైవమునుబోలె వ్యాపించి .. ... — " 1-204
వెళపింపవచ్చి వెరచిన తెరగున... ... ,, 2-94
అడగుసలిలములలో నలవబాశాలనుబోలె ,, 3-55
కాలవశంబగు నింతయు కాలము దానన్యవశముగాదు ,, 3-96
అనలము నిజసంగతినల కనకాదుల కందు జెరుచుగతి ,, 3-106

సుడికారాలు, పలుకుబళ్లు, జాతీయాలు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| ంచె | ,, | 2-85 | వేంచేయు | ,, | 2-134 |
| డకంటికెరుపువచ్చు | ,, | 2-137 | పెండ్లిపెద్ద | ,, | 2-137 |
| వంక | ,, | 2-169 | దేవరచిత్తంబు | ,, | 2-219 |
| గబట్టి | ,, | 3-65 | త్రోవ సంబడము | ,, | 3-65 |
| జగిజయగు | ,, | 3-79 | చేసినచేతలు | ,, | 3-90 |
| ాటలు వేయునేటికి | ,, | 1-90 | నిండు కౌగిటికి | ,, | 1-103 |
| ిమానుషలీల | ,, | 1-148 | తేటపడ | ,, | 1-157 |
| ాగిలిమ్రొక్కి | ,, | 1-181 | కడకంటిచూపు | ,, | 1-199 |
| ల్యాణకరంబు | ,, | 1-261 | అలవికాక | ,, | 2-10 |
| ంటాపథము | ,, | 2-39 | మంత్రవిద్య | ,, | 2-39 |
| ద్ధఘుటిక | ,, | 2-39 | సంజీవకరణి | ,, | 2-39 |
| ీటవెన్నెలరసంబు | ,, | 2-49 | విందులుసేయు | ,, | 2-50 |
| ృణీకరించు | ,, | 2-56 | మ్రాన్పడియుండెన్ | ,, | 2-83 |
| ్శలకలుజాదుకొన | ,, | 2-117 | నట్టిళ్లు | ,, | 2-112 |
| గధగిత | ,, | 2-108 | పిపారు | ,, | 2-157 |
| లపుల పెంటలు | ,, | 4-76 | నవ్వుదేరెడి మొగంబు | ,, | 4-92 |
| న్నులపండువొనర్చు | ,, | 4-92 | తోడునీడసుజోతె | ,, | 4-136 |
| పెన్నిధిగన్న పేదగతి | ,, | 4-143 | పులుగడిగిన ముత్తెంపు తళుకులు | ,, | 4-269 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| అరచేతిలోనివివో | ,, | 5-233 | బట్టెముక | ,, | 3-80 |
| తడబడ | ,, | 5-25 | బుడిబుళ్లువోవ | ,, | 5-25 |
| చిడిముడిపాటు | ,, | 5-25 | మొగము వెల్వెలబారగ | ,, | 5-118 |
| భాగవతులు | ,, | 1-189 | తల్లిగతి | ,, | 1-204 |
| ఉపకారబుద్ధి | ,, | 2-8 | ఇముడగొను | ,, | 2-84 |
| విందారి | ,, | 2-43 | మిలమిల | ,, | 2-47 |
| ముద్దుల చందమామ | ,, | 2-47 | తులదూగు | ,, | 2-47 |
| వెల్లివిరిసె | ,, | 2-48 | తళతళన | ,, | 2-70 |
| తడబడంగ | ,, | 2-72 | దవుదవ్వుల | ,, | 2-73 |
| కీలెరిగి | ,, | 2-124 | జడివట్టి | ,, | 2-166 |

| | | | |
|---|---|---|---|
| జడివట్టి | శ్రీరంగ 2-166 | రంతుల్ | శ్రీరంగ 2-177 |
| తర్జనములు గర్జనంబులు | 3-214 | మూడులోకములనేలు ,, | 4-149 |
| పుట్టించిన దైవము ,, | 4-163 | ధగద్ధగయును ,, | 4-177 |
| రంతులుగాగ ,, | 4-198 | రంతులు మ్రోయు ,, | 4-282 |
| కర్ణరసాయనము ,, | 4-202 | వేయునేటికి ,, | 5-126 |
| వేయుమాటలు నేలా ,, | 5-150 | మదికింపుగాని మాటలు ,, పదివేలును చెప్పనేల ,, | 5-197 |

భైరవకవి సందర్భోచితంగ తన పేరును కృతిలో అక్కడక్కడ పేర్కొనటం అతని భాషా వైదుష్యానికి నిదర్శనం—

ఉదా :- **అవనీత** కుజన "భైరవము" రవము — శ్రీరంగ 1-142
**హరనటనటన** పాటహమహా "భైరవ" క్ష్వేడారవ—శ్రీరంగ 1-146
పరాతి "భైరవ" — శ్రీరంగ 5-263
తర్జన భర్జవ "భైరవం"బైన "భైరవంబు" — శ్రీరంగ 3-77

ఫలితాంశం : భైరవకవి లాక్షణికుడై ఉండికూడ కొన్ని వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు చేశాడు. అయినను అట్టిప్రయోగాలు ఇతరకవుల గ్రంథాలలో కన్పడటంవల్ల అవి నిరంకుశాః కవయోః అనేదానికి ఉదాహరణలవుతాయి సామెతలు లోకోక్తులు, జాతీయాలు, నుడికారాలు, పలుకుబళ్లు భైరవకవి అధికంగానే ప్రయోగించాడు.



# శ్రీరంగమహాత్త్వము విశిష్టాద్వైత సమన్వయం

5. 1. 0. ఈ అధ్యాయంలో శ్రీరంగమహత్త్వ కావ్యాన్ని విశిష్టాద్వైతంతో సమన్వయం చేయబడును.

## 5. 1. 1. విశిష్టాద్వైతం :

భారతీయ ఆస్తికమతాల్లో సనాతనధర్మాలను ప్రబోధించే ద్వైత, అద్వైత విశిష్టాద్వైతాలు ముఖ్యమైన శాఖలు. ఈ మతశాఖలకుకూడ వేదాలు ఉపనిషత్తులు బ్రహ్మసూత్రాలు భగవద్గీత మొదలైన పవిత్ర గ్రంథాలు ఆధారాలు. ఈ మూడు శాఖలుకూడ అత్యంత ప్రాచీనమైనవే.

ఆత్మ వేరు పరమాత్మ వేరు అని చెబుతుంది ద్వైతం. ఆత్మే పరమాత్మ అని చెబుతుంది అద్వైతం. పరమాత్మ చిదచిద్విశిష్టుడు అని చెబుతుంది విశిష్టాద్వైతం.

విశిష్టాద్వైతాన్ని ప్రప్రథమంగ ప్రబోధించినవారు శ్రీమహావిష్ణువు దివ్యాంశతో అవతరించిన శ్రీవిఖనో మునీంద్రులని తెలుస్తోంది. ఇందుకు మచ్చుకు కొన్ని ప్రమాణాలు—

"శ్లో. విశిష్టాద్వైత సిద్ధాంత గురోరస్మద్గురోర్మతమ్।
విశిష్టాద్వైత వాదీచ విఖనా బ్రహ్మవిత్తమః॥
విశిష్టాద్వైత ముత్పన్నం విఖనాద్యైర్మహర్షిభి।
విశిష్టాద్వైత సిద్ధాంత మూలభూతాయ మంగళమ్॥ *1"

"వైఖానసం రామానుజీయ మతంకంటె చాలా ప్రాచీనము. ఎంత ప్రాచీనమో తెలిసినవారు లేరు." *2. శ్రీరంగంలో అనాదినుండికూడ రామానుజుల

---

*1 ఈ శ్లోకాలు తి తి. దేవస్థానం వారు (1985) ప్రచురించిన "దేవాలయ ములు–తత్త్వవేత్తలు" అనే గ్రంథం నుండి గ్రహింపబడినవి. కర్త : వి.టి. శేషాచార్యులు.

*2 చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారి "కథలు–గాథలు"లోని "వైఖానసులు–వైష్ణవులు" అనే వ్యాసం.

వారి కాలంవరకు విశిష్టాద్వైతులయిన వైఖానసులే అర్చకులు. ఈ విషయం "కోయిల్ ఒళుగు" (శ్రీరంగ క్షేత్ర మాహాత్మ్యము) అనే తమిళ గ్రంథంలోను, "శ్రీ వేంకటేశ్వరేతిహాసమాల" అనే గ్రంథంలోనూ ఉంది.

విఖనోముని సిద్ధాంతాలను భృగు, మరీచి, అత్రి. కశ్యపులు వ్యాప్తికి తెచ్చారు. వారితర్వాత విశిష్టాద్వైతాన్ని ప్రభోధించిన వారు తెలుస్తున్నంతలో ఆళ్వారులు. ఆళ్వారుల తర్వాత ఆచార్యులు విశిష్టాద్వైతాన్ని వ్యాప్తికి తెచ్చారు.

ఆచార్యుల్లో రామానుజాచార్యులవారు ముఖ్యులు. "ఉనిష ద్వేదాంతము నెకాక వైఖానసపాంచరాత్రాగములలోను, ఆళ్వారుల రచనలగు ద్రావిడ వేదములలోనుగల యంశములనుగూడ రామానుజులు సమన్వయము గావించినారు. అందుకే విశిష్టాద్వైతము ఉభయ వేదాంతమనబడుచున్నది" *1

వైఖానసులు, ఆళ్వారులు, ఆచార్యులు మొదలైన విశిష్టాద్వైత ప్రబోధకులందరికీ శ్రీరంగ క్షేత్రం కొంకిపట్టుగా ఉండింది విశిష్టాద్వైతం శ్రీమన్నారాయణుని పరదైవతంగ చెప్తుంది. అర్చామూర్తులకు విశిష్టాద్వైతంలో ఎంతో ప్రాముఖ్యం ఉంది. శ్రీరంగంలో వెలసినది సాక్షాత్తు శ్రీవిష్ణువుయొక్క స్వయం వ్యక్త అర్చామూర్తి. కనుక అలాంటి శ్రీరంగ క్షేత్రాన్ని గురించి చెప్పేగ్రంథం విశిష్టాద్వైత పరంగనె చెప్పబడి ఉంటుంది.

"సంస్కృత శ్రీరంగ మాహాత్మ్యం ఎప్పుడు వ్రాయబడి ఉంటుంది? అనే ప్రశ్నకు ఈఉపపురాణం శ్రీమద్రామానుజుల కాలంలోనో (క్రీ.శ. 1017–1137) లేక తర్వాతనో వ్రాయబడి ఉంటుందని చెప్పవచ్చు.......విల్సన్ కూడ ఉపపురాణాలు Latter Additions అని అభిప్రాయపడ్డారు *2" అని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. అంతకు పూర్వమే అంటే రామానుజుల వారికి పూర్వమే శ్రీరంగ మహత్త్వమును గురించి చెప్పే గరుడోప పురాణం

*1 వైష్ణవాంధ్ర వాఙ్మయము–(పుట–42) 1986– వేటూరి ఆనందమూర్తి.
*2 శ్రీవిజయరంగ చొక్కనాయక విరచిత శ్రీరంగమాహాత్మ్యము పీఠిక –2,3 పుటలు పీఠికాకర్త : డా॥ ముదివేడు ప్రభాకరరావు 1988. SVORI ప్రచురణ.

రచింపబడి ఉండినాకూడా అప్పుడుకూడ శ్రీరంగంలో విశిష్టాద్వైతులైన వైఖాన సులు అర్చకులుగాఉండటంవల్ల సంస్కృత శ్రీరంగ మాహాత్మ్యం విశిష్టాద్వైత సమన్వయంగనె రచింపబడి ఉంటుందనటంలో విప్రతిపత్తి ఉండదు.

పై అంశాలన్నీ పరిశీలిస్తే సంస్కృత శ్రీరంగ మహత్త్వం విశిష్టాద్వైత పరంగానే రచింపబడి ఉంటుందని తెలుస్తుంది. దాని ఆంధ్రీకృతి అయిన భైరవుని శ్రీరంగ మహత్త్వముకూడ విశిష్టాద్వైత పరంగానే ఉంటుంది. కనుక శ్రీరంగ మహత్త్వ కావ్యం విశిష్టాద్వైతంతో సమన్వయ మౌతుంది. విశిష్టాద్వైత మతసిద్ధాంతాలు, సంప్రదాయాలు మొదలైన ప్రధానవిషయాలను కొన్నింటిని శ్రీరంగ మహత్త్వ కావ్యంలోని అంశాలతో సమన్వయం చేయటం ఈ అధ్యా యంలో ప్రధానాంశం.

## శ్రీరంగమహత్త్వ కృతి రచనా హేతువు - విశిష్టాద్వైత ప్రభావం :

శ్రీరంగ మహత్త్వము విష్ణుపారమ్య కథాత్మక కావ్యం. ఇది గరుడ పురాణానికి తెనుగుసేత గరుడ పురాణం వైష్ణవ పురాణం. కనుక తదాంధ్రీ కృత కావ్యంకూడ వైష్ణవమేఅని వేరుగా చెప్పనవసరంలేదు. శ్రీరంగమహత్త్వ కృతి రాచకొండ సంస్థానం నుండి వెలువడింది కృతి ప్రేరయిత, కారయిత, స్వీకర్త (భర్త) చాగయ రాఘవుడు. కృతికర్త భైరవకవి.

కృతిభర్త–వైష్ణవం : శ్రీరంగ మహత్త్వ కృతిభర్త చాగయ రాఘవా మాత్యుడు పరమ వైష్ణవాభిమాని అని వైష్ణవుడని ఈక్రింది వాక్యాలు ప్రత్యక్ష ప్రమాణాంగా అగుపిస్తున్నాయి

| | |
|---|---|
| "తామరసాక్షధ్యానాను రాగరంజిత మానస పద్మునకు" | –శ్రీరంగ 1-68 |
| "శ్రీపతి కల్యాణ గుణాలాప" | –శ్రీరంగ 2-1 |
| "శ్రీమాధవ పదకోమల తామరసార్చన విధానతత్పర" | –శ్రీరంగ 3-1 |
| "శ్రీ రంగరాజ సేవా పారంగత" | –శ్రీరంగ 4-1 |
| "శ్రీరఘునాయక మృదుపద వారిరుహభ్రమర" | –శ్రీరంగ 5-1 |
| "హరిపద సరసిజ మధుకర" | –శ్రీరంగ 5-265 |
| "కమలనయన సేవా కౌతుకాధీన భావా" | –శ్రీరంగ 5-266 |

పై వాక్యాలు చాగయరాఘవుని వర్ణించేవి. వీటివల్ల చాగయ రాఘవుడ వైష్ణవుడని తెలుస్తుంది. అంతేగాక అతడు వైష్ణవులు ఆచరించే ఏకాదశీ ద్వాద వ్రతాలను చేసినట్లు ఈ క్రింది పద్యాలు తెలియజేస్తున్నాయి—

మ. బసగెన్ చాగయ రాఘవుండు వినయంబొప్పన్ బ్రతిద్వాదశిన్
వసుధా మండలిగల్గు విప్రతతికిన్ వాంఛను రూపంబుగా
రసవన్ముఖ్య పదార్థజాల పరిపూర్ణంబైన యన్నంబును
ల్లసితానేక విధంబరంబులా ననల్పస్వర్ణ నిష్కంబులున్
— శ్రీరంగ 1-61

మ ... ... ... .. సద్ద్వాదశీ
వ్రత సంకల్పిత గోహిరణ్యమణి భూ వస్త్రాన్న దానాభి త
ర్పిత ధాత్రీ సురబృంద! ... ... ... -శ్రీరంగ 2-224

చాగయ రాఘవుని తండ్రి తాతలు మొదలైన పూర్వులుకూడ విష్ణుపూజా రతులుగా ఉన్నట్లు ఈ క్రింది పద్యపాదాలు తెలియజేస్తున్నాయి—

"శా. ... .... ముకుందపాద గమల ప్రేంద్వార్చనోత్సాహి యౌ
గోవింద ప్రభుడొప్పు..." — శ్రీరంగ 1-37

"సీ. లక్ష్మీనృసింహ లీలావైభవ ధ్యానబద్ధానురాగ ప్రసిద్ధబుద్ధి"
— శ్రీరంగ 1-39

"కం. హరిపదాంబుజ సేవారతుడు......గోవిందార్యుండు -శ్రీరంగ 1-46

చాగయ రాఘవుని కొడుకు నాగనాథుడుకూడ "లక్ష్మీనృసింహార్చనార తుడు" (శ్రీరంగ 1-65)గా వర్ణింపబడ్డాడు. పై అంశాలను పరిశీలిస్తే చాగయ రాఘవుని పూర్వీకులు మరియు చాగయ రాఘవుడు, ఆతని కొడుకు మొదలైన వారందరుకూడ విష్ణుసేవా తత్పరుల స్పష్టమౌతోంది *1.

---

*1 చాగయరాఘవుని వంశీయులపేర్లు కేశవుడు, మాయదేవుడు, చాగయదేవుడు గోవింద పండితుడు. నరసింహుడు, విఠలుడు, నాగనాథుడు మొదలైనవి కలవు. ఈపేర్లు పండరి పాండురంగస్వామివారి భక్తుల పేర్లుగా కనబడుతాయి.

చాగయ రాఘవుడు వైష్ణవాభిమాని కావటం చేతనే శ్రీరంగ మహత్త్వాన్ని అంధ్రీకరింపజేశాడు. శ్రీరంగ మహత్త్వ కృత్యవతారికలో చాగయ రాఘవుడిని వర్ణిస్తూ భైరవకవి ఒకపద్యంలో శ్లేషగాక్రమాలంకారంలో ఇలాచెప్పాడు—

"సీ. బల ధర్మధైర్య శోభన మహత్త్వంబుల
గరికాల నరదేవ గరిమ బొదలి" — శ్రీరంగ I–59

బలానికి కరి, ధర్మానికి కాలుడు, ధైర్యానికి నరుడు (అర్జునుడు), శోభన మహత్త్వాలకు దేవగరిమలు చెప్పాడు. మరియు బలధైర్య శోభన మహత్త్వాలకు కరికాలనరదేవ గరిమ కలవాడనికూడ (కరికాలుడు అనే రాజుగారి గరిమ గలవాడు) చెప్పవచ్చు. కరికాలుడు కశ్యప గోత్రీయుడు. చాగయ రాఘవుడు కూడ కశ్యప గోత్రీయుడే. కరికాలుడు కావేరీనదికి అనకట్ట కట్టించటం చారిత్రక ప్రసిద్ధమైన విషయం. కశ్యప గోత్రీయుడే అయిన చాగయరాఘవుడు కావేరీనదీ వర్ణనాత్మక యుక్తమైన శ్రీరంగమహత్త్వాన్ని రచింపజేశాడు. శ్రీరంగ మహత్త్వములోకూడ కశ్యప ప్రస్తావన ఉంది. శ్రీరంగ మహత్త్వాన్ని అంధ్రీకరించిన ఇతర కవులగు కట్టా వరదరాజు, ముకుందయోగి మొదలైనవారు కూడ కశ్యప గోత్రీయులే కావటం గమనింపదగిన అంశం. ఇలా చాగయరాఘవునికి శ్రీరంగానికి ఏదోసంబంధం ఉంటుందనిపిస్తుంది. ఏదిఏమైనా చాగయ రాఘవుడు వైష్ణవుడు అనటం మాత్రం పూర్వోదాహృతాలైన శ్రీరంగ మహత్త్వములోని పద్య భాగాలనుబట్టి స్పష్టమౌతోంది. కనుక వైష్ణవుడగు చాగయ రాఘవుడు శ్రీరంగ మహత్త్వాన్ని అంధ్రీకరింపజేసేందుకు చాగయ రాఘవునిపై విశిష్టాద్వైత వైష్ణవం ప్రభావంకూడ ఉంటుంది

కృతికర్తపై వైష్ణవ ప్రభావం : శ్రీరంగ క్షేత్రంలో వైఖానసులు మరియు ఆళ్వారులు మొదలైనవారు విశిష్టాద్వైతాన్ని ప్రబోధించారు. వారితర్వాత రామా

---

పాండురంగ భక్త విజయంలోని పాండురంగస్వామి భక్తుల పేర్లలో ఇవన్నీ ఉన్నాయి. ఆ భక్తులపేర్లే వీరికికూడ పెట్టిఉండవచ్చు. చాంగదేవుడు ఒక భక్తుడు. ఆపేరే చాగయదేవుడు అని మార్పుచెంది ఉంటుందేమో! చాగయ రాఘవుని వంశీయులు పాండురంగస్వామివారి భక్తులేమో! ఏదిఏమైనా చాగయ రాఘవుడు శ్రీరంగ భక్తుడనటం నిజం.

నుజులవారు పాంచరాత్రాగమ పద్ధతిని అనుసరించి విశిష్టాద్వైత సిద్ధాంతాల
ప్రబోధించారు. రామానుజులవారి తర్వాత ఎందరో మహనీయులు విశిష్టాద్వై
ప్రచారాన్ని చేశారు. వారిలో వేదాంత దేశికులవారు ఒకరు. "ఒక్క మాట
చెప్పాలంటే వీరు (వేదాంత దేశికులవారు) అవతరించకపోతే విశిష్టాద్వైతమత
ఇంతగా దేశంలో వేర్లు తన్నుకుని పాదుకుని వుండేదికాదు. *1

వేదాంత దేశికులవారి కుమారులు మరియు శిష్యులు అయిన నైనా
ర్యులు అనే నామాంతరంగల వరదాచార్యులవారు రాచకొండ సంస్థానానికి వె
అక్కడి పండితులతో వాదించి శైవుడైన శాకల్య మల్లనను ఓడించి అక్క
ప్రభువులను కవిని శ్రీవైష్ణవులుగ మార్చి విశిష్టాద్వైత మత ప్రచారం చేసినట్ల
చారిత్రికుల వ్రాతలు సాక్షమిస్తున్నాయి. *2 వరదాచార్యుల వారి కాల
(14వ శతాబ్దం) నుండి తెలంగాణలో శ్రీవైష్ణవం విస్తరించి వెలమ, రెడ్డి ప్రభ
వులు "శ్రీమతే రామానుజాయనమః" అంటూ విశిష్టాద్వైతాన్ని అవలంబించార
వరదాచార్యులవారి ప్రభావంవల్ల భట్టరు–కందాళ–తిరుమల–నల్లాన్ చక్ర
ర్తుల మొదలైన పీఠాలు ఏర్పడినవి. వీరి ప్రభావంవల్లనే విష్ణుగాథాపూరితాలై
రచనలు విరివిగా చేయటం జరిగిందనవచ్చు. తెలంగాణలో శ్రీరంగనాయక
స్వామివారి ఆలయాలు వెలిసేందుకు కూడ ఇదే కొంత ప్రోద్బలమైంది అ
విధంగ రాచకొండవారిపై పడిన శ్రీవైష్ణవ ప్రభావం ఆ ప్రాంతపు కవులకుకూడ
తప్పలేదు. అందుకే భైరవకవికూడ శ్రీరంగ మహత్త్వమును వ్రాశాడు *3.

రాచకొండ సంస్థాన ప్రాంతంలో ఉండిన చాగయ రాఘవుని ఆస్థానంలో
"సచమత్కార కారణ గుణానుబంధ బంధుర ప్రబంధ రచనా నిస్తంద్రులగు
కవీంద్రులు" *4 ఉండేవారు. వారిపైకూడ పూర్వోక్తమగు విశిష్టాద్వైత వైష్ణవ
ప్రభావం ప్రసరించి ఉంటుంది, అందులో భైరవకవి ఒకడు. చాగయరాఘ
వుని ఆస్థానంలో అంతమంది కవులుఉంటే భైరవకవినే శ్రీరంగ మహత్త్వాన్ని
అంగీకరించమని చాగయరాఘవుడు కోరేందుకు కారణాన్ని ఇలా భావించ
వచ్చు. శ్రీగిరికవి రచించిన నవనాథచరిత్రమును అనుసరించి భైరవకవి తండ్రి

*1 "వైరాగ్యపంచకము"–వ్యాసము. కర్త: ఎన్.సి.వి. నరసింహాచార్యులు
సప్తగిరి (పత్రిక) అక్టోబరు 1990.

*2 శ్రీరంగమహత్త్వము–పీఠిక–శ్రీరంగాచార్య. *3 పైది. *4 శ్రీరంగ 1-17

అయిన గౌరన ద్విపద కావ్యంగా నవనాథచరిత్రను రచించాడు. గౌరన కుమారుడగు భైరవుని శ్రీగిరికవి రచించిన శ్రీరంగ మహత్త్వాన్ని రచించమని చెప్పటంలో కొంత ఔచిత్య, సంబంధాలు అగుపిస్తుంది. గౌరన శైవుడైనప్పటికీ వైష్ణవద్వేషి కాదనేందుకు అతడి కావ్యాలలోని శ్రీరామ స్తుత్యాత్మక ద్విపదలు సాక్ష్యమిస్తున్నాయి. అలాగే భైరవుడుకూడ శైవుడైనా వైష్ణవద్వేషికాదని శ్రీరంగ మహత్త్వ కృతి సాక్ష్యమిస్తుంది. వైష్ణవద్వేషి కాకపోవటమేగాక వైష్ణవ ప్రభావానికి గురిఅయిన రాచకొండ ప్రాంతీయుడగు భైరవుని కవితా సామర్థ్యాన్ని గుర్తించి చాగయరాఘవుడు శ్రీరంగ మహత్త్వమును ఆంధ్రీకరించమని భైరవ కవిని కోరి ఉంటాడు.

ఇలా కృతిభర్త, కృతికర్తలపై రాచకొండ సంస్థానంలో వేదాంత దేశికుల వారి ప్రచారాదులవల్ల వ్యాపించిన విశిష్టాద్వైత ప్రభావం అగుపిస్తుంది. ఇక గ్రంథాంతర్గతమగు విషయాలను విశిష్టాద్వైతంతో సమన్వయించాలి.

## 5.3. శ్రీరంగమహత్త్వ కృత్యాది - విశిష్టాద్వైత సమన్వయం :

శ్రీకారంతో కావ్యాన్ని ప్రారంభించటం దాదాపు తెలుగు కృతుల్లో సర్వసామాన్యం. శ్రీరంగమహత్త్వము విశిష్టాద్వైత వైష్ణవానికి సంబంధించిన కావ్యం కనుక ఈ కావ్యాన్ని శ్రీకారంతో ప్రారంభించి కావ్యంలో తాను రచించే వైష్ణవ సంప్రదాయాత్మక విషయాలను భైరవకవి "శ్రీకారం చుట్టాడని" చెప్పవచ్చు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో "శ్రీ"కి విశిష్టస్థానం ఉంది. శ్రీ శబ్దం సంపదాదులను తెలిపేదిమాత్రమెగాక అది పెరియపిరాట్టి నామధేయంకూడ.*1 పెరియపిరాట్టి (మహాలక్ష్మి) సర్వేశ్వరి. ఆమెది మాతృస్థానం ఆమె చేతనునకు తల్లి, నారాయణునికి భార్య. కనుక చేతనుని రక్షింపమని భర్తకు దయకలిగేటట్లు చెప్తుంది. అందువల్ల చేతనుడు శ్రీలక్ష్మి నారాయణులను ఇద్దరిని ఉద్దేశించే ప్రార్థించాలి. పెరియపిరాట్టి చేతనే ఫలం ఔతుంది. అనగా ఈమె పురుషకారమైననేగాని భగవంతుడు కార్యము నెరవేర్చడు. కనుక పరోక్షంగ కృత్యాది

---

*1 'ముముక్షుప్పడి. సాంధ్ర ద్రావిడ వ్యాఖ్యానం పుట-115, వేదాంత ముద్రాక్షరశాల మద్రాసు-1927.

పద్యంలో ప్రారంభాన విశిష్టాద్వైతమున అత్యంత ప్రాధాన్యం, వైశిష్ట్యంగా పెరియపిరాట్టిని భైరవకవి స్తుతించాడు. లక్ష్మికి లక్ష్మీ పద్మాలయా పద్మా మతా శ్రీహరిప్రియా అనే పేర్లు ఉన్నాయి. ఆపేర్లలో ఇతరమైనవాటిని ప్రయోగింపక కేవలం శ్రీ నామాన్నే ఎందుకు ప్రయోగించాడు అనే శంకకు "శ్రీరితి ప్రథమం నామలక్ష్మ్యాః" అనే వచనం ప్రకారం "శ్రీ" అనే పేరు లక్ష్మీదేవికి ప్రథమ నామధేయం. కనుకనే శ్రీకార ప్రయోగం చేయబడింది. యామునాచార్యులవారు చతుశ్శ్లోకిలో "శ్రీరిత్యే వచనామతే" అని శ్రీశబ్ద వైశిష్ట్యాన్ని ప్రవచించారు. "రహస్యత్రయ సారము"లో "శ్రయతీం శ్రయమాణాంచ" ఇత్యాది శ్లోకాలు గొప్పగా వ్యాఖ్యానింపబడినవి. శ్రీరంగేశుడు సాక్షాద్విష్ణువు. నారాయణుడు అష్టాక్షరీస్వరూపుడు. శ్రీ సంప్రదాయము విశిష్టాద్వైతము ఒక్కటే. కనుక శ్రీకారమును కవి ఉపయోగించెను.*1 "విశిష్టాద్వైతము సశ్రీకము. అనగా ఇందు శ్రీకి ప్రధాన్యమున్నది. ఆమె పరమేశ్వరుని కల్యాణ గుణములచే స్వామికి నిత్యానపాయినియైనది......భగవంతుడు అనంతకల్యాణ గుణాలయుడై కృపాక్షీరాబ్ధియై లోకములనుద్ధరించి శ్రీదేవితో సుఖించుచున్నాడు. అటి శ్రీమన్నారాయణతత్త్వమే శ్రీవైష్ణవ మారాధించునది *2" అందుకే భైరవకవి కృత్యారంభంలో దయాంభోనిధి యైన శ్రీరంగ నాయకుని స్తుతించే సందర్భాన "శ్రీమన్మూర్తి రుచుల్ తటిద్యుతి ఘన శ్రీనామతింపన్" అని వర్ణించాడు. ఈ పద్యంలో శ్రీకారత్రయం ప్రయోగింపబడింది. ఇలా కృతిప్రారంభంలో శ్రీని ప్రధానంగా ప్రయోగించటంచేత కవి ఈ కావ్యంలో విశిష్టాద్వైతం ప్రతిపాద్యం అని సూచించాడనవచ్చు.

ఇక కావ్యంలోని రెండో పద్యంలో శేషుని ప్రశంసింపబడ్డాడు. ఆపద్యమిది–

మ. శయనంబై యుపధానమై నిలయమై సచ్ఛత్రమై పాదుకా
ద్వయమై మంగళపీఠమై మృదుల వస్త్రంబై సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్యసన్నిహిత మూర్తింబొల్చు శేషాహి న
క్షయ మేధానిధి గావ్యలక్షణకళా చాతుర్యన్ బ్రశంసించెదన్

— శ్రీరంగ 1–2

*1 శ్రీరంగ మహత్త్వము–పీఠిక–పుట LXXXVI (1978)
*2 ఆముక్తమాల్యదా సౌందర్యము. డా॥ తు. కోటేశ్వరరావు.

పై పద్యంలో శేషుని దేహాది వర్ణనలుగాక శేషుడు తనను విష్ణువుకు సంపూర్ణంగా ఎలా సమర్పించుకున్నాడో వర్ణింపబడింది. విశిష్టాద్వైతంలో ప్రవచింపబడిన శేషశేషి సంబంధాలు ఎరిగినవాడు కావటంవల్ల కవి ఇలాంటి వర్ణనలను చేశాడు. విశిష్టాద్వైతంలో శేషశేషి సంబంధం విపులంగ ప్రవచింపబడుతుంది. రాచకొండ సంస్థానంలో. వేదాంత దేశికులవారి కుమారుడైన వరదాచార్యులవారు శేషశేషి సంబంధాన్ని ప్రవచించి ఉంటారు. ఆ ప్రభావం ఆ ప్రాంతపు కవులపైకూడ ఉంటుందనక తప్పదు. కనుక భైరవుడుకూడ ఆ ప్రభావానికి గురైనవాడే కావటంవల్ల భగవంతునికి తనను సంపూర్ణంగ అర్పించుకున్న శేషుని ప్రశంసించాడు. స్తోత్ర రత్నంలో—

"నివాస శయ్యాసన పాదుకాంశుకో పధాన వర్షాతప వారణాదిభిః
శరీరభేదైః స్తవశేషతాం గతైః యథోచితం శేషఇతే వితేజనైః"

అనిఉంది. గద్యత్రయంలోని వైకుంఠ గద్యలో భగవద్రామానుజులవారు "శేషశేషా సనాది సర్వం పరిజనం" అన్నారు. యమునాచార్యులవారు శేషునికి ప్రథమస్థానాన్ని ఇచ్చారు. ఇలా శ్రీవైష్ణవ-విశిష్టాద్వైతాల్లో శేషునికి అత్యంత ప్రాముఖ్యం ఉంది. "శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణోద్ధబావు"డగు భగవద్రామానుజులవారు శేషాంశ జన్ముడని సంప్రదాయ గ్రంథాలు తెలియజేస్తున్నాయి. కనుక పరోక్షంగ ఇందులో రామానుజ స్తుతికూడ చేసినట్లవుతుంది, ఇలా కృత్యాది ద్వితీయ పద్యం విశిష్టాద్వైత మత సమన్వయానికి సరియైనదిగా ఉంది. కావ్యంలోని మూడోపద్యంలో గరుడాళ్వారులు అంటే గరుత్మంతుడు ఇలా స్తుతింపబడ్డాడు—

ఉ. ఆయత చండతుండన హతాహి నికాయుని దప్తహాటక
చ్ఛాయుని సర్వవేదమయ సన్నుతకాయుని దేవదానవా
జేయుని నప్రమేయుని నశేష విహంగ కులాధిపత్య ధౌ
రేయుని బ్రస్తుతింతు సుచరిత్ర విధేయుని వైనతేయునిన్

— శ్రీరంగ 1–3

గరుడాళ్వారులు విష్ణువాహనం. కనుక వీరికి వైష్ణవంలో ప్రత్యేకస్థానం ఉంది. కనుకనే విశిష్టాద్వైత ప్రబోధకులలో ఒకరైన వేదాంత దేశికులవారు

గరుడ దండకాన్ని గరుడ పంచాశత్తును రచించారు. భైరవకవి కూడ గరుడ పురాణానికి ఆంధ్రీకృతియగు ఈ కావ్యంలో గరుడాళ్వారులను ప్రత్యేకంగ కృత్యాదిని సన్నుతించాడు.

కావ్యంలోని నాల్గో పద్యంలో భైరవకవి విష్వక్సేనుని తలచాడు. ఆ పద్యం ఇది—

కం. శ్రీరమణ చరణసేవా చార నిరూఢావధాను సత్కీర్తి జయ
శ్రీరాజమాను దానవ వీర ఖగశ్యేను దలతు విష్వక్సేనున్
— శ్రీరంగ 1–4

శ్రీమన్నారాయణుడు ఈ సంప్రదాయాన్ని మొదట లక్ష్మికి ఉపదేశిస్తే ఆమె విష్వక్సేనుల వారికి ఉపదేశించింది, విష్వక్సేనులవారి ప్రత్యేకతలో ఇదొకటి. విశిష్టాద్వైత వైష్ణవేతరులు విష్వక్సేనుని ఇంతగా ప్రత్యేకించి స్తుతించటం అరుదు. ఈ కావ్యం విశిష్టాద్వైత సంబంధి కనుకనే విశిష్టాద్వైత వైష్ణవ సంప్రదాయానుగుణంగ కృత్యాదిలో విష్వక్సేనుడు స్తుతింపబడ్డాడు.

కృత్యాది పంచమ పద్యం ఇది—

మ. వినుతింతున్ హరిభక్తి పెంపున జగద్విఖ్యాతులై పుణ్యకీ
ర్తనులైనట్టి పరాశరుం గపిలు వేదవ్యాసు బ్రహ్లాదు న
ర్జును రుక్మాంగదు నంబరీషుని వశిష్ఠుం బుండరీకున్ మరు
త్తనయున్ భీష్ము విభీషణున్సురమునిన్ దాల్భ్యున్ శుకున్శౌనకున్
— శ్రీరంగ 1–5

పై పద్యంలో పరమ భాగవతోత్తమ స్మరణ జరిగింది. విశిష్టాద్వైత మతంలో భాగవతుల నామకీర్తనానికి ప్రత్యేకత ఉంది. భగవద్రామానుజుల వారు "భగవన్నామ కీర్తనమునందు వలెనే భగవద్భక్త నామకీర్తనమునందును ప్రీతియుంచవలయును. ఎల్లప్పుడు భక్తుల నాశ్రయించుట భగవత్ప్రాప్తికి కారణము అనియెంచి భక్తులనాశ్రయించవలయును, భాగవతులను సంతోషపెట్టుట కంటె మోక్షహేతువగు కార్యము వేరొక్కటిలేదు. *1" అని భాగవతులను

*1 శ్రీమద్రామానుజ చరిత్రము (–పుట 135-138)
కర్త: సరస్వతి రంగాచార్యులు.

గురించి చెప్పారు. పరమ భాగవతులను శ్రీవైష్ణవులు అనుదినం ఇలా స్మరిస్తారు—

ప్రహ్లాదనారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి.

పై శ్లోకానికి అనువాదంగ భైరవుడు కృత్యాది పంచమ పద్యాన్ని రచించాడు. శ్లోకంలో లేని కపిలుడు, ఆంజనేయుడు కూడ భైరవుని పద్యంలో ఉన్నారు. ఇలా భైరవకవి విశిష్టాద్వైత సంప్రదాయానుగుణంగ పరమ భాగవత స్మరణ చేశాడు.

కృత్యాదిలో ఉండే మొదటి ఐదుపద్యాల తర్వాత "సపరిచ్ఛదంబుగా అభీష్ట దేవతావందనంబొనర్చి" అనే వచనంఉంది ఆ వచనాన్నిబట్టి భైరవకవి నభీష్ట దైవంగ ఈ కృతిలో కేవలం శ్రీరంగనాధునిమాత్రం సపరివారంగ స్తుతించాడు. ఇది కేవలం కృతిభర్త ప్రీతికొరకు రచించిన స్తుత్యాదికం కాదు. అలాగేఅయిఉంటే మొదటి ఐదు పద్యాల్లో కృతిభర్తకు క్షేమాలు ఇష్టార్థాలు ఇవ్వాలని అయా పద్యాలలో స్తుతించిన వారిని కోరిఉండేవాడు. పై పద్యాల్లో కేవలం అభీష్ట దైవస్తుతి భావననే అగుపిస్తుంది. కనుక భైరవకవి వైష్ణవ సంప్రదాయాన్ని ఎరిగినవాడని అందువల్ల ఈ కావ్యం విశిష్టాద్వైత సమన్వయంగా రచింపబడి ఉంటుందని తెలుస్తుంది.

## 5. 4. ఆశ్వాస సంఖ్య :

కవులు తమ గ్రంథాలను సామాన్యంగా ప్రతిపాద్య విషయానుగుణంగనో, మత సంబంధ గ్రంధాలయితే ఆ మత సంప్రదాయానుసారంగనో గ్రంథ విభాగాన్ని చేయటం ప్రసిద్ధం.

శ్రీరంగ మహత్త్వము విశిష్టాద్వైత మత సంబంధి. విశిష్టాద్వైతులు పాంచరాత్రాగమాన్ని అనుసరిస్తారు. శ్రీరంగ క్షేత్రములోను భైరవుని కాలాన పాంచరాత్రాగమమే అనుసరింపబడేది. భగవద్రామానుజుల వారి కాలం నుండి నేటివరకున్నూ శ్రీరంగంలో పాంచరాత్రాగమమే పాటింపబడుతుంది.

పాంచరాత్రాగమానికి నిర్వచనం : నారాయణముఖోద్గీతం, చతుర్వేద సమన్వితం అయిన పాంచరాత్ర మహోపనిషత్తును నారదుడు ఋషులకు విన్పించాడని భారత శాంతిపర్వం చెప్తుంది. "శ్రీవిష్ణువు తన పంచాయుధముల యంశములవల్ల జనించిన ఔపగాయన శాండిల్య మౌంజాయన కౌశిక భరద్వాజులకు వేర్వేరుగా ఐదురాత్రులీ శాస్త్రముపదేశించుటం జేసి యిది పాంచరాత్రమైనదని యీశ్వర సంహిత. ఇతర శాస్త్రములైదు గొప్పవియైనను దీనివద్ద రాత్రులవలె ప్రకాశ హీనములగుటచే నిది పాంచరాత్రమైనదని పద్మ సంహిత. శబ్దాది పంచ విషయములలో లేక పంచమహాభూతములో యనబడు నైదురాత్రులు దేని తేజస్సున నణగునో యట్టి యజ్ఞాన నాశకమైనది పాంచరాత్రమని విష్ణుసంహిత. ఐదురాత్రులు విష్ణువ్రతమాచరించు భక్తులు పంచరాత్రులు. వారికి విహితమైన శాస్త్రము పాంచరాత్రము అని శక్తి సంగమ తంత్రము *1" రాత్రిశబ్దం జ్ఞానవచనం. జ్ఞానం పంచవిధాలు. అందువల్ల ఈ వైష్ణవాగమం పాంచరాత్రమని పిలువబడుతోందని కూడ అంటారు. సాంఖ్య యోగాలు, వేదాలు, అరణ్యకాలు అనే నాలుగు జ్ఞానశాఖలు కూడ పరస్పరం అంగభూతాలై ఏకమై మొత్తముమీద ఆ నాలుగు శాస్త్రాలు వీటి ఏకరూపమైన శాస్త్రం కలిసిపాంచరాత్రం అనిపించుకుంటుందని మహాభారత మోక్షధర్మంలో వివరింపబడింది. జ్ఞానయోగం మొదలైన వాటినిగురించి శ్రీరంగ మహత్త్వంలో తెలుపబడింది. దానికి సంబంధించిదీ అయిన పాంచరాత్రాగమం కూడ ప్రస్తావితం. *2 శ్రీరంగ క్షేత్రంలో శ్రీరంగనాథు కి పాంచరాత్రాగమ విధానప్రగనే అర్చనలు మొదలైనవి నిర్వహింపబడుతున్నాయి. శ్రీమన్మహావిష్ణువు ఆయుధాలు అయిదు. ఇవన్నీదృష్టిలో ఉంచుకుని భైరవకవి శ్రీరంగమహత్త్వమును విశిష్టాద్వైత సమన్వయంగ ఐదు ఆశ్వాసాలుగా విభజన జరిగిఉంటుందనటంలో ఔచిత్యం ఉంది. *3

---

*1. సంస్కృత వాఙ్మయ చరిత్ర, లౌకిక వాఙ్మయము తృతీయాధ్యాయము
కర్త: మల్లాది సూర్యనారాయణశాస్త్రి.
ప్రచురణ : ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.

*2 శ్రీరంగ మహత్త్వము 4–237

*3 కావేరీనది పంచగంగల్లో ఒకటి. కావేరీ వర్ణనం శ్రీరంగ మహత్త్వంలో ఉంది. శ్రీరంగ మహత్త్వము పంచాశ్వాస పరిమితికలది. పంచగంగలివి

కావేరీ తుంగభద్రా చ కృష్ణవేణిచ గౌతమీ
భాగీరథీచ విఖ్యాతః పంచగంగా ప్రకీర్తితా॥

## 5. స్తుతులు :

కృత్యారంభంలో వైష్ణవ సంప్రదాయానుగుణంగ శ్రీరంగనాథుని స్తుతి ుంచి తర్వాత శేషాహి వైనతేయ విష్వక్సేన పరమ భాగవతస్తుతులు న్నాయి. శ్రీరంగనాథుని స్తుత్యాత్మక దండకం ఈ కృతిలో అత్యద్భుతంగ ంపబడింది. సందర్భోచితంగ వర్ణనాత్మకంగ కావ్యంఅంతట శ్రీరంగనాథుని హిమలు మొదలైనవి తెలియజేసేపద్యాలు చోటుచేసుకున్నాయి. మచ్చుకు- ంద చందన చంద్రికా పాండురంబగు కుండలిరాజ పర్యంకంబున బవ్వ ంచి సముచిత మణిశిఖర విరాజిత రాజతాచల సంగతి గనుపట్టు నీలమే ంబు చందంబున నందంబై పద్మరాగ ప్రభాటోప వికంకట ముకుట సంగ ంబగు నుత్తమాంగంబును, యంగీకృత భక్తజనానుగ్రహంబగు శ్రీరంగ జ దివ్యమంగళ విగ్రహం బాపాద మస్తకంబును" – (శ్రీరంగ 4–61) త్యాదిగా వర్ణింపబడింది.

పరమేశ్వరు నిత్యనిరతిశయ నిరుపమ నిరవధిక లావణ్య సౌందర్య కుమార్య చాతుర్య స్థైర్య గాంభీర్య సౌశీల్య వాత్సల్య తేజః ప్రభాసౌభాగ్య హార్ద దయాద్యనంత కల్యాణ గుణములు– (శ్రీరంగ 1–196) అభివర్ణింప డినవి. "...ముకుంద పాదయుగళ సంస్మరణ మొక్కటే సర్వరక్షణోపా ను"మని కవి చాటిచెప్పి–"ముకుంద పాదయుగళ పంకజ సంస్మరణంబు క్క నెయ్యదియు సముద్ధరింప నసమర్థంబు"లని చెప్పాడు. ఇవన్నీ విశిష్టా ద్వైతమత ధర్మాలు.

భగవద్వర్ణనం పాదాల నుండి మస్తకం వరకు చేయటం సంప్రదాయం నగా ముందుగా పాదవర్ణనం ఆ తర్వాత క్రమంగా మస్తకం వరకు వర్ణించ ం. ఈ సంప్రదాయాన్ని స్పష్టంచేసె విశిష్టాద్వైత వైష్ణవ గ్రంథాలు ఎన్నో న్నాయి. మచ్చుకు– తిరుప్పాణాళ్వారులు (వీరికి మునివాహనుడు అని కూడ పేరు. వీరు లోకసారంగ మునిని వాహనంగా, కలిగిఉండిరి) శ్రీరంగ నాథుని దర్శించినపుడు పాయించిన "అమలనాదిపిరాన్" అనే ద్రవిడ ప్రబం ధంలో శ్రీరంగనాథుడు ఆపాద మస్తకంగా వర్ణింపబడ్డాడు.

"శ్లో. ఆపాద చూడమను భూయ హరిం శయానం
మధ్యేకవేర దుహితుర్ముదితాన్తరాత్మా
అద్రష్టృతాం నయనయోర్విష యాంతరాణాం
యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్॥

పాశురం: కాట్టవే కణ్డపాతమ్ కమల నల్లాడై యున్ది
తేట్టరు ముతరపన్దమ్ తిరుమార్వు కణ్డమ్ శెవ్వాయ్
వాట్టామిల్ కణ్గళ్ మేనిముని యేత్తిని పుకున్దు
పాట్టినాల్ కణ్డువాళుమ్ పాణర్తాళ్ పరవినోమే॥

(వివరణ : శ్రీలోక సారంగ మహాముని తిరుప్పాణాళ్వారులను భుజముపై నెక్కించుకొని శ్రీరంగనాథుని వద్దకు కొంపోయెను. అపుడు వారు స్వామివారి పాదారవిందములను, పట్టు పుట్టమును. బ్రహ్మకుత్పత్తి స్థానమగు నాభికమలమును, రత్నఖచితమగు బంగారు పట్టెమొలత్రాటిని, లక్ష్మీదేవి నివసించి వక్షస్థలమును, కంఠమును, ప్రవాళాధరమును, అమ్లానకమల నేత్రములను తనివితీర సేవించరి. ఇట్టి దివ్యమంగళ విగ్రహమును ఏకాంత ముని అనుభవించి యుజ్జీవించు తిరుప్పాణాళ్వారుల శ్రీచరణములకు సాష్టాంగ దండ ప్రణామముల నాచరించినాము) *1"

వీటినిబట్టి శ్రీరంగనాథుడు తిరుప్పాణాళ్వారులచేత ఆపాద మస్తకం వర్ణించబడెనని తెలుస్తూంది. "అమలనాదిపిరాన్" 11 పాశురముల గ్రంథము ఇందులో శ్రీరంగనాథుడు ఆపాద మస్తకంగ అభివర్ణించబడ్డాడు. దీనిని వేదాంత దేశికులవారు "భగవద్ధ్యానసోపానమ్" అనే పేరుతో సంస్కృతీకరించాడు.

శ్లో, సతతం సగతో రమాసఖం
మనసా రంగశయం విభావయన్।
చరణాది కిరీట వర్ణనై
ర్దశ పద్యైః కృతి రంగిణః — భగవద్ధ్యాన సోపానమ్

---

*1 అమలనాదిపిరాన్ సవ్యాఖ్య శ్రీగోదాగ్రంథమాల–ముసునూరు 1979.

విశిష్టాద్వైత మత ప్రబోధికులయిన తిరుప్పాణాళ్వారులు మరియు వేదాంత దేశికులు రచించిన విధంగానే భైరవకవి కూడ ఈ కృతిలో శ్రీరంగ నాధుని వర్ణించే సందర్భాన అపాదమస్తకంగ అభివర్ణించాడు. వేదాంత దేశికుల వారి కుమారుడు వరదాచార్యులు రాచకొండ సంస్థానాన్ని సందర్శించిన వారు కనుక దేశికులవారి భగద్ధ్యాన సోపానాన్ని భైరవకవి ఎరిగి ఉంటాడు. ఆ ప్రభావం భైరవుని శ్రీరంగనాథ వర్ణనంపై ఉంటుంది. భైరవుడు శ్రీరంగ నాధుని ఆపాదమస్తకంగ అభివర్ణించిన భాగాలు మచ్చుకు—

"దండకం, ...సరోజ ధ్వజచ్ఛత్ర చక్రాది చిహ్నైః పదైరంకితాభ్యాం ప్రభాసంపదాభ్యాం మనోజ్ఞం స్వరామ్నాయ మంజీర పాళీక సత్పద్మరాగ ప్రకాశావృతాం సం తటిన్నూతనద్యోతి ధౌతాంబరాంచత్కటి మండలాబద్ధ కాంచీ కలాపం సుధావర్త గంభీర సుస్నిగ్ధనాభి ప్రభూతాయత శ్వేత పద్మాభిరామం లసత్కౌస్తుభ శ్యామల శ్రీతులస్యామిళద్వైజ యన్తీసమేతోరు వక్షస్థలీకం వరానర్ఘ కేయూర వజ్రోర్మి కాద్యైః పరిభ్రాజితాజాను బాహుప్రకాండం రమాలింగనోత్కీర్ణ రత్నాంగదాంక క్రమైరుల్ల సత్కంబు కంఠ ప్రదేశం శరచ్చంద్ర బింబ ప్రసన్న స్మితాస్యం లసత్కుండలాలోక చంచత్కపోలం పరం పక్వ బింబ ప్రభా పాటలోష్ఠం దరద్యోతితస్వచ్ఛ దంతాంశుజాలం నవామోది నిశ్వాసనాసా విలాసం దివాజృంభితాంభోజ దీర్ఘావలోకం సలీలానతభ్రూ విలాసం సుఫాలం చలత్కుంచితానీల సత్కుంతలాంతం సముద్భాసి కోటీర చారూత్త మాంగం సమస్తైక సౌందర్య సంపన్నిధానం..."—శ్రీరంగ 1–197.

"వచనం : ...కెందమ్మి విరుల సిరుల గరువంపు జెన్నునకు వన్నెయొసంగు కెంజాయల జాల రంజిల్లుచు జక్రచామర తామరస కులిశ పద్మ ఝష కలశాది రేఖలంగల తలంబుల మెరసి మెరుగుం జుక్కల చందంబునకు నూరుపు నెరపు నఖమణి రమణీయంబులై, నమదమరేంద్ర బృంద మందార మాలికా పరిమళపరంప రావాసితంబులై వాసవధనుర్లీలా విలాసంబునకు వాసిపుగిలి వివిధమణిద్యుతి వ్యతికర మంజులంబులగు మంజీరంబుల బొలుపుమీరి శుక సనకాది యోగీంద్ర ధ్యాన గమ్యంబులై రమ్యంబులగు

చరణంబులును వృత్తాను పూర్వంబులు నపూర్వ సౌభాగ్య యోగ్యంబులై నిగనిగనిగుడు భంగి నెగడుకొను చిరుతొడలును గ్రొత్త మెఱుగు మొత్తంబులు చిత్తగింపంబొరలెత్తిన నునుబస నెసఁగు నసిత కదళికా కాండంబు ననుకారంబగు నూరువులును నవకర్ణికా కుసుమ సుషమా విశేషంబు నభినయించు నభినవపీత పరిధాన పరివృతంబై కనత్కనక కింకిణీ కలిత లలిత మేఖలా వలయంబగు నితంబంబును మిన్నేటి బొటియగు నేటిసుడి వడువున శోభిల్లు నాభీ సరోవరంబున దిరంబగు వెలిదమ్మిబోని ముఖసరోజ సౌరభంబుగ్రోల జాగి తేటితెగ బాగుగ నభిరామంబగు రోమావళియుం దసరి వళిత్రయ సుందరమై కరతల గ్రహణ సాధ్యంబగు మధ్యంబును సరస శృంగార లీలావిలాస సముల్లాసినియగు వనజవాసినికి నప్రయత్న రత్నదర్పణంబన బ్రశస్తంబగు కౌస్తుభంబునకు నుచితస్థలంబై సంతాన దంతురితాంతర తరుణ తులసీదళాదామ సురభితంబై కుంకుమ కర్పూర దర్పసార సుగంధి గంధసారాను లేపితంబై శ్రీవత్స లక్షణోప లక్షితంబులగు వక్షః పరిణాహంబును సముజ్వల వజ్ర కంకణాంగద భద్రముద్రికా శోభితంబులై కటి కిరీట పార్శ్వవిన్యస్తంబులగు హస్తంబులును సారానురాగ సాగరకన్యకా కరకంకణ పదాంకితంబై జిగిదొలకు శంఖంబుల పొంకంబునకు బింకంబు దలకొలుపుచు నప్రయత్న రత్నగ్రైవేయక బంధురమగు కంధరంబును దళతళబొలయు తళుకుంలుగల తళుకులం దాపించిన దీపించు కెంపుల బెంపారు మండలంబులోలయు గండ మండలంబులును బరిపక్వబింబశోభా సౌఖ్యంబు నతకరించుమధురాధరంబును సుధారసంబున బదనుగొని తలలెత్తు ముత్యంపుమొలకల పొలుపున దొలుపెసగు దశన కాంతులు గలిసి వెలయ నెలనవ్వువెన్నెలల జెలువుమిగిలి సత్ప్రసన్నతా సదనంబగు వదన చంద్ర బింబంబును సమున్మీలిత నీల తిల కుసుమ సముల్లాసంబు నుల్లసించుచు సురభి నిశ్వాస మారుతంబున దిశలు వాసించు నాసికయును, వాసరావసర సముల్లసిత సితారవింద దళ విశాలంబులై తొంగలి రెప్పల కప్పున నొప్పారి కరుణారస పాత్రంబులగు నేత్రంబులును

నిజ విక్షేపమాత్ర విలాస సంపాదితా శేష నిలింప మంగళంబగు నాతన భ్రూలతా యుగళంబును లలిత లావణ్య రసలవంబులన నమరు చెమట చిత్తడి గరంగు హరినీలగిరి శిఖరంబునుంబోలె బద్మరాగ ప్రభాటోప వికంకట ముకుట సంగతంబగు నుత్తమాంగంబును గలిగి యంగీకృత భక్తజనాను గ్రహంబగు శ్రీరంగరాజ దివ్యమంగళ విగ్రహం బాపాద మస్తకంబును విస్మ యస్మిత నయనారవిందుండై సందర్శించుచు..." — శ్రీరంగ 4-223

పై వచనం తర్వాత ఉండే సీసపద్యం కూడ శ్రీరంగనాథుని ఆపాద మస్తకంగ వర్ణించింది.

వైష్ణవ సంబంధిత ఇతరస్తుతులు: మహావిష్ణువు పంచాయుధాల్లో ఒకటి అయిన సుదర్శన చక్రాన్ని కృత్యాదిలో స్తుతించకపోయినా సందర్భోచితంగ కృతిలో సుదర్శన చక్రాన్ని వర్ణించాడు భైరవకవి. చక్ర పెరుమాళ్ల వర్ణనం ఇలా ఉంది—

సీ. ప్రళయ మార్తాండ మండల చండతర సము
ద్భూతభూరి ప్రభాపుంజమగుచు
ఘన సహస్రార నిర్గత మహోగ్రానల
జ్వాలావలీఢ దిగ్వలయమగుచు
సహజతేజో విశేష క్షణాంతర్భూత
సర్వదివ్యాస్త్ర విస్తారమగుచు
గఠిన నిర్ఘాత సంఘాత భీషణ ఘోష
నిర్భిన్న రాక్షసీ గర్భమగుచు

తే. సకల శుకముఖ్య మునియోగి జనసమగ్ర
మహిత నిగమార్థ సంస్తూయ మానమగుచు
వచ్చె మానస వేగమై వనజగర్భ
దాస భయకర్శనంబు సుదర్శనంబు ... శ్రీరంగ 2-102

కృత్యాదిలో విష్వక్సేన స్తుతిఉంది, మరల సందర్భోచితంగ కృతిలో విష్వక్సేన వర్ణనం ఉంది—

కం. స్రుత కనక కషణ సుషమా-ప్రతిమాన మనోజ్ఞపీత పరిధాను విభా
జిత బాలభాను ద్రిభువన-వితతేంధన చిత్రభాను విష్వక్సేనున్
— శ్రీరంగ 4-221

చం. కనుగొని భక్తిపూర్వకముగా నతుడై......— శ్రీరంగ 4-222

## 5. 6. రహస్యత్రయం :

విశిష్టాద్వైతంలో రహస్యత్రయానికి విశిష్టస్థానం ఉంది. తిరుమంత్రం, ద్వయం, చరమ శ్లోకం అనేవి రహస్యత్రయం. సకల వేదాంత సారార్థాన్ని ప్రతిపాదించటంచేత పరమ గూఢంగ ఉంతటంచేత వీటిని రహస్యాలని అంటారు. ఇవన్నీ ఒకదానితో ఒకటి సంబంధం కలిగి ఉన్నాయి. రహస్యత్రయాన్ని అంటే తిరుమంత్ర ద్వయ చరమ శ్లోకాల్ని కైతవకవి శ్రీరంగ మహత్త్వంలో పేర్కొన్నాడు. వాటిని వరుసగా పరిశీలించాలి—

## 5. 6. 1. తిరుమంత్రం :

భగవన్మంత్రాలు అనేకం. అవి వ్యాపకాలు, అవ్యాపకాలు అని రెండు రకాలు. అవ్యాపకాలకంటె వ్యాపకాలు శ్రేష్ఠాలు. వాటిలో వ్యాపకాలయిన నారాయణ మంత్రం చాలా శ్రేష్టమైంది. "తిరుమంత్రమును వేదములు ఋషులు ఆళ్వారులు ఆదరించినది. ఈ మంత్రము సకల కోరికలనిచ్చును. అదియే ఉపాయమునునై యున్నది. ఇది శేషత్వమును, పారతంత్ర్యమును, కైంకర్యమును దెలుపును. ఇది నరునకు చిత్తశుద్ధిని గలిగించి భక్తిజ్ఞానముల నొసంగును. దీని అధిదేవత నారాయణుడు. అన్ని మంత్రములు దేహము చేతనే ఫలముకాగా తిరుమంత్రమున ఆత్మచేతనే ఫలమగును *1" "ఓం నమో నారాయణాయ" అనేది తిరుమంత్రం. ఇందులో ఎనిమిది అక్షరాలున్నాయి. కనుక దీనికి అష్టాక్షరి మంత్రం అనిపేరు. ఇక్ష్వాకు మహారాజుకు వశిష్ఠుడు అష్టాక్షర మంత్ర చింతన పరాయణుడవై ఉండమని (శ్రీరంగ మహత్త్వములో) బోధిస్తాడు.

---

*1 విశిష్టాద్వైత పూర్వాపర సారసుధ-(పుట 68)
రచన : కే. నరసింహచార్యులు.

మ. పరమేశుం బురుషోత్తముం బరు గృపాపాథోధి నారాయణున్
హరి జిత్తంబున నిల్చి నిత్యము ప్రణామాభ్యర్చనాది క్రియా
పరతం గార్యము దీర్చు మట్లయిన బాపశ్రేణి బోదోలి త
త్పరమ స్థానము బొందే దెంతయును గోప్యం బేనెరింగించెదన్
— శ్రీరంగ 3–285

పై పద్యంలో పురుషోత్తమ భక్తిని చెప్తూ చివరన "గోప్యం బేనెరింగించి తిన్" అన్నాడు. ఆ గోప్యం ద్వయమంత్రం. ద్వయమంత్రం గోప్యం కనుక శ్రీరవకవి ద్వయమంత్రాన్ని పద్యంలోకూడ గోప్యంగానే చెప్పాడు.

## 5. 6. 3. చరమ శ్లోకం :

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

"శోకావిష్టుడైన యర్జునునిజూచి తచ్ఛోక నివృత్త్యర్థమై యిక దీనిపైన నుపాయము లేదని చెప్పునట్టి చరమోపాయమును విశదపరచినందున దీనికి చరమ శ్లోకమని పేరుకలిగినది. *1"

చరమ శ్లోకంలో మొదటి పాదంలోని ఆరుపదాలు శేషభూతుడు చేయ వలసిన పనిని తెల్పుతాయి. శేషి పనిని రెండోపాదం తెలియజేస్తుంది. అను రాగంవల్ల కల్గిన ఉపాయం శీఘ్రగతిగా ఫలితానికి వస్తుంది.

"ధర్మమనగా ఇష్టమైన ఫలమునకు సాధనమై యుండునది. ప్రాకృత శరీరముచే అనుభవింపబడు సాధనములేకాక భగవత్ప్రాప్తి అనుసాధనముకూడ అగును. ఇవి వేద ఉపనిషత్తులచే చెప్పబడిన కర్మజ్ఞాన భక్త్యాదులు. వీటి నన్నింటిని సవాసనగా విడువనగును. ఏలయన కర్మాదులు ఉపాయము లేకుండ ప్రతిబంధకములుగూడ అగుచున్నవి. అందుచే "ల్యప్" ప్రత్యయ ముచేత ఇతర ఉపాయములను విడిచి భగవంతునినే ఆశ్రయింపుమనుటచే

---

*1 ముముక్షుప్పడి–రహస్యత్రయమ్–పుట 80. ఆంధ్రవ్యాఖ్య : గట్టుపల్లి శేషాచార్యులు శశిలేఖా ముద్రాక్షరశాల–చెన్నపురి 1917

ఉ. దక్షుడవై జగజ్జన హితంబుగ నిప్పుడు బూని శ్రీమద
ష్టాక్షర మంత్ర చింతన పరాయణ చిత్తుడవై భజింపు మ
బ్జాక్షు బయః పయోధి తనయా భినయాలస చారుచంచల
ద్వీక్షణ చంద్రికా రుచుల వేడుకజొక్కు చకోర వల్లభున్
— శ్రీరంగ 2-18

వశిష్ఠుడు ఇక్ష్వాకుడికి శ్రీమదష్టాక్షర మంత్ర చింతన పరాయణుడవై హరిని భజింపమని చెప్పాడు. భైరవకవి అష్టాక్షర మంత్రాన్ని "శ్రీమదష్టాక్షర" అని పేర్కొన్నాడు. దీనివల్ల అష్టాక్షర మంత్ర వైశిష్ట్యాన్ని భైరవకవి విశిష్టాద్వైతులచేత తెలుసుకుని ఉంటాడు. రహస్యత్రయంలో మొదటిది అయిన తిరుమంత్రాన్ని భైరవకవి వశిష్టునిద్వారా ఇక్ష్వాకునికి ఉపదేశించాడు. ఇదంతయు విశిష్టాద్వైత ప్రభావమే,

## 5. 6. 2. ద్వయం :

విశిష్టాద్వైతుల్లో శ్రీవైష్ణవులుసమాశ్రయణం చేయించుకునటం తప్పనిసరి సమాశ్రయణం అయినవారు భాగవతోత్తముల సన్నిధానంలో తీర్థ ప్రసాదాదులను సేవించేందుకు అర్హులవుతారు. ద్వయ మంత్రోపదేశాన్ని పొందుతారు. ద్వయానికి మంత్ర రత్నం అనిపేరు, "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే-శ్రీమతే నారాయణాయనమః" అనేది ద్వయమంత్రాలు. ఈమంత్రానికి అకించనత్వం, అనన్యగతిత్వం కలవారు అధికారులు. "ఇందు లక్ష్మి పురుషకారము వలన భగవత్ప్రాప్తి కలుగు విధము వివరింపబడినది. లక్ష్మి సర్వేశ్వరి, మాతృస్థాన మలంకరించును. చేతనునకు తల్లి. నారాయణునకు భార్యయగుటచే చేతనుని రక్షింపుమని భర్తకు దయగలుగునటుల చెప్పును. కావున చేతనుడు శ్రీలక్ష్మి నారాయణుల నిద్దరను ఉద్దేశించియే ప్రార్థింపవలయును. *1" ద్వయ మంత్రాన్ని జపించటంవల్ల అనుభవిస్తేనేతీరే ప్రారబ్దం కూడ నశిస్తుంది. ఈ ద్వయమంత్రం అత్యంత గోప్యమైంది. శ్రీరంగమహత్త్వంలోద్వయ మంత్రం ప్రస్తావితం—

*1 శ్రీవిశిష్టాద్వైత పూర్వాపరసారసుధ-పుట 70-71
రచన : కే. నరసింహాచార్యులు.

ధర్మము భగవంతుడే యగుచున్నాడు. మాః అనునది పరమాత్మయొక్క వాత్సల్య స్వామిత్వ సౌశీల్య సౌలభ్యముల దెలుపును. త్వాయున అజ్ఞుడవై అశక్తుడవైన నీవు నన్నే ఉపాయముగా జేసికొనిన సకల పాపముల నుండి నిన్ను (మోక్షయిష్యామి) విడిపించగలను. అనగా జీవుడు తన పనిని తాను నెరవేర్చినగాని భగవంతుని అనుగ్రహము రాదని భావము. అందుచే (మా శుచః) నీవు శోకింప నిమిత్తము లేదు. ఇందు పరమాత్మ ఉపాయాంతరముల దెలుపుట దొంగ పశువునకు గుదికర్రకట్టి విడిచినటుల అహంకార మమకారాదులచే గర్వము నశించి స్వరూప జ్ఞానము కలుగజేయుట కనవలయును.

రామానుజ సిద్ధాంతము ననుసరించి యిందు ఉపాయములుగ చెప్పబడిన వానిని విడుపుమన్నచో వానియందు ఉపాయబుద్ధిని విడువమనియు సంసారమును విడువమనినచో దానియందు స్వకీయ బుద్ధిని విడిచి తదీయత్వ బుద్ధి ఉంచుమని సంప్రదాయ రహస్యమైయున్నది. *1"

శ్రీరంగ మహత్త్వములో భైరవకవి శ్రీహరిచేత విభీషణునికి చరమశ్లోకానువాద రూపమగు పద్యాన్ని చెప్పిస్తాడు. ఆ పద్యం ఇది—

అ.వె. ధర్మములను సకల కర్మఫలంబులు
పరిహసించి శరణు బొందుమునన్ను
నదియె నీకు మోక్షపద పదప్రాప్తికి
నతి రహస్యమైన యట్టి మతము — శ్రీరంగ 2-190

ఇలా అష్టాక్షరమంత్ర, ద్వయమంత్ర, చరమశ్లోకాలు అనబడే రహస్యత్రయం శ్రీరంగ మహత్త్వంతో సమన్వయమౌతున్నాయి. రహస్యత్రయ తత్త్వాన్ని ఎరిగిన మహాత్ములతో ఎల్లప్పుడు కూడి ఉండాలని భగవద్రామానుజుల ఉవాచ. "2

---

*1 విశిష్టాద్వైత పూర్వాపరసారసుధ–కే. నరసింహాచార్యులు,

*2 శ్రీమద్రామానుజ చరిత్రము–కర్త–సరస్వతి రంగాచార్యులు. యంప్రస్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాల మద్రాసు–(1903)

## 5. 7. ఆచార్య శిష్య సంబంధం :

ఆచార్యులవారికి విశిష్టాద్వైతంలో విశిష్టస్థానం ఉంది. ఆచార్యులవారిని గురించి రామానుజులవారు శిష్యులకు ఇలా ధర్మోపదేశం చేశారు.— "గురువునకు వైష్ణవులకును భక్తితో నెల్లప్పుడు కైంకర్యము చేయవలయును. పూర్వాచార్యులు చెప్పెడి వాక్యముల నమ్మవలయును. ఆచార్యులవారిచేత జ్ఞానమును గలవాడై విషయాదులకు వశుడు కారాదు.1" ఈ విధంగా విశిష్టాద్వైతంలో గురువుకు (ఆచార్యులవారికి) ప్రముఖస్థానం ఇవ్వబడింది. శ్రీరంగ మహత్త్వములోని ఈ క్రింది పద్యం ఆచార్యశిష్య సంబంధాన్ని వ్యక్తపరుస్తూ ఆచార్యసన్నిధిలో అంతేవాసి ఎంతక్రమ శిక్షణగ ఉండాలో తెలుపుతూ విశిష్టాద్వైత ధర్మాన్ని చాటుతుంది—

కం గురు సముచిత శయనాసన-వరవాద్య ప్రముఖ గేహవర్గము జడుడై
చరణమున నాక్రమించిన-నరుఁడరుగు ననేకఘోర నారకములకున్
— శ్రీరంగ 3-267

విశిష్టాద్వైతులు ఆచార్యాభిమానాన్ని పంచమోపాయం అంటారు. తనను రక్షించే సమర్థుడు పరమ దయాకరుడు అగు పరమభాగవతుడి అభిమానాన్ని ఆశ్రయించి సకల ప్రవృత్తి నివృత్తుల్లోనూ ఆచార్యునకు పరతంత్రుడై ఉండటం ఆచార్యాభిమానం అనబడును. ఆచార్యుడు శిష్యుని దైన్యాన్ని స్వీయదైన్యంగ భావించి ఉపాయానుష్ఠానం చేసి రక్షించేందుకు సమర్థుడౌతాడు. కనుక ఆచార్యులకంటె అధికులు లేరు మధుర కవి అళ్వారులు తమ ఆచార్యులగు నమ్మాళ్వారులను, గోష్ఠీపూర్ణులు (తిరుకొట్యూరునంబి) తమ ఆచార్యులయిన యామునాచార్యుల పృష్ఠాన్ని ధ్యానించి ముక్తినిపొందారు అలాంటి ఆచార్యులవారికి ఏమాత్రం అపచారం చేయరాదు. దీనిని పై పద్యం తెలియజేస్తుంది.

## 5. 8. దివ్య (ద్రవిడ) ప్రబంధాను సంధానం :

*2 శ్రీమద్రామానుజ చరిత్రము-కర్త-సరస్వతి. రంగాచార్యులు

ఆళ్వారులు రచించిన ద్రవిడ ప్రబంధాలను దివ్య ప్రబంధాలంటారు. ర్థమంతకూడ దివ్యప్రబంధ గతార్థం. అందువల్ల విశిష్టాద్వైతులు ద్రవిడ ంధ సంకలనమైన నాలాయిర దివ్యప్రబంధాన్ని అనుసంధిస్తారు. ద్రవిడ సంస్కృత వేదాలకు ప్రాముఖ్యం ఇవ్వటంవల్ల విశిష్టాద్వైత వైష్ణవులు ఉభయ ాంతులు అని పిలువబడిరి. విశిష్టాద్వైతంలో తెంగల, వడగల సంప్రదా ాలున్నాయి. తెంగలవారుముఖ్యంగ ద్రవిడ ప్రబంధాలను అనుసంధిస్తారు. గలవారు సంస్కృత వేదాన్ని అనుసరిస్తారు. శ్రీరంగ క్షేత్రంలో ప్రాచీన ం నుండి నేటివరకుకూడ తెంగల సంప్రదాయానుసారంగ ద్రవిడ ప్రబం లను పాడటం జరుగుతోంది. ఈ తెంగల విశిష్టాద్వైత సంప్రదాయాన్ని ివకవి శ్రీరంగ మహత్త్వంలో ఇలా తెలిపాడు—

"వ. ... .. సమతాళ పదక్రమ బంధురంబులగు నాసింధుర వరదు ముదాంకితంబులైన ప్రబంధంబులు పాడదొడంగె నపుడు కర్ణామృతాయ ానంబగు గంధర్వ రాగంబు నాకర్ణించి......" — శ్రీరంగ 3-295

## 9. హరివాసర ఉపవాసం :

ఏకాదశికి హరివాసరం అనిపేరు. ఏకాదశితిథి విష్ణువుకు ప్రీతికర ంది. విశిష్టాద్వైతులగు పరమవైష్ణవులు హరివాసర ఉపవాసాన్ని ముఖ్యంగ చరిస్తారు. పరమ వైష్ణవుడు విశిష్టాద్వైతి అయిన శ్రీకృష్ణ దేవరాయలవారు ముక్తమాల్యద రచనకు పూర్వం తనకువచ్చిన స్వప్నవృత్తాంతాన్ని కావ్యాన ర్ణిస్తూ "శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్రమధుమధను సేవింపబోయి హరివా రోపవాసం బచ్చట గావింప నప్పుణ్యరాత్ర చతుర్థయామంబున" (1–11) ని వ్రాశాడు. దీనికి వేదం వేంకటరాయశాస్త్రిగారు "హరివాసరోపవాసము = కాదశినిట్టు" అని సంజీవనీ వ్యాఖ్యలో అర్థం వ్రాశారు. శ్రీరంగమహత్త్వము పంచమాశ్వాసం 102వ పద్యం నుండి 149వ పద్యం వరకు ఏకాదశీ ద్వాదశీ దివసములను గురించి వాటి మాహాత్మ్యాన్నిగురించి విపులంగ వర్ణింపబడింది. మచ్చుకు కొన్ని పద్యాలు—

సీ. పటు ఘోరపాతక పటల మహారణ్య
చటుల సముజ్జ్వల జ్వలన కీల
దుర్వార దారుణ దుష్కృత సంఘాత
మేఘ సంవర్త సమీరణంబు
భూరి భీషణపాప పుంజ సముత్తుంగ
భూమి భృన్నిశిత దంభోళి ధార
దుస్సహదురిత సందోహ నిరంతర
ధ్వాంత ప్రచండ మార్తాండ హేతి

గీ. క్రూర కల్మష కుంభి కంఠీరవంబు
భీకరా ఘౌఘ పవన కుంభీనసంబు
కుటిల కిల్బిష పాథోధి కుంభసూతి
భాసురంబైన శ్రీవిష్ణువాసరంబు — శ్రీరంగ 5–103

కం. ధృతినచ్యుత దిన నిష్ఠా-శ్రితులగు రుక్మాంగ దాంబరీషాదులు స
న్నుతి గనిరి గావె మునుశా-శ్వత కీర్తుల పరమ భాగవతులందెల్లన్
— శ్రీరంగ 5–104

శ్లో. ఏకాదశామహం కించి దనశ్నన్ పురుషోత్తమ।
భోక్ష్యేహని పరె శ్రీమన్ పాహిమాం శరణాగతమ్॥
— శ్రీరంగ 5–104

వ. ... ఇట్లు ఉపవసించి... మరునాడు కృతస్నానుండై కాల్యోకరణీయంబులు దీర్చి యచ్యుతారాధనానంతరంబున గురువందనంబాచరించి శ్రీమదష్టాక్షరాను సంధాన నిష్ఠాగరిష్ఠులగు భాగవత శ్రేష్ఠుల నభీష్ట మృష్టాన్నంబులఁ బరితుష్టినొందించి వారికందరకు జందన మాల్యాంబరాభరణాదులాదరంబునఁ దనకుగల కొలందినిచ్చి... వ్రతసమాప్తి సేయునతండు సప్తగోత్రంబుల నుద్ధరించి యక్షయానంద పరంబగు వైష్ణవ సదనంబునొందు.
— శ్రీరంగ 5–111

## 5·10. అర్చాస్వరూపం :

విశిష్టాద్వైతంలో అర్చాస్వరూపానికి అత్యంత ప్రాముఖ్యం ఉంది. భగవత్సాన్నిధ్యాన్ని పొందేందుకు కఠోర తపోయజ్ఞాలు చేసేదానికన్న అర్చాస్వరూప సమర్చనమే మిక్కిలి సులభమైనది. భక్త వాత్సల్య గుణాలవాలుడు అగు భగవానుడు భక్తులందు అనుగ్రహం కలవాడై భక్తులచేత నిర్దేశింపబడిన బింబాలలో దివ్యసాన్నిధ్యాన్ని కల్పించుకుని వేంచేసిఉండే స్వరూపమే అర్చాస్వరూపం. "అర్చాత్మన్యేవ సర్వేషా మధికారో నిరంకుశః" అన్నట్లు అర్చాస్వరూపాన్ని దర్శించి పూజించుకునేందుకు అందరికీ అధికారం ఉంది. అర్చాస్వరూపాలు నాలుగువిధాలు. అవి: 1 స్వయంవ్యక్తాలు: పుణ్యక్షేత్రాల్లో పెరుమాళ్లు స్వయంగ వెలసిన అర్చామూర్తులు, 2 దివ్యాలు: దేవతలచేత ప్రతిష్ఠితాలు, 3 సైద్ధవాలు: మంత్ర సిద్ధులగు మహర్షులు మొదలగువారిచేత ప్రతిష్ఠితమైనవి 4 మానుషాలు: భక్తులగు మానవులు ప్రతిష్ఠించినవి. ఈ అర్చాస్వరూపాలను వాటివాటి ప్రాశస్త్యాలను గురించి శ్రీరంగ మహత్త్వములో విశిష్టాద్వైత సంప్రదాయానుగుణంగ చెప్పబడింది. అట్టివాటికి మచ్చుకు—

"వ. ... అర్చావతారంబులు స్వయంవ్యక్త దివ్యసైద్ధమానుషంబులన చతుర్విధంబుల మెరయు నందు శ్రీరంగ శ్రీముష్ణ శ్రీవేంకటాచల సాలగ్రామ నైమిశ తోతాద్రి పుష్కర నారాయణాశ్రమంబులను నీయెనిమిది స్థలంబులం గల మదీయ మూర్తులు స్వయం వ్యక్తంబులు హస్తిగిరి వృషపర్వత చక్రతీర్థాది ప్రశస్తదేశంబులు భవధర్మ శతమఖ దేవత ప్రతిష్ఠితంబులైన యవి దివ్యంబులు భృగుతీర్థ మందరక్షేత్ర చిత్రకూట ప్రభృతి పుణ్యస్థలంబులు భృగుమరీచి మతంగముని సిద్ధసంస్థాపితంబులైనయవి సైద్ధవంబులు విశిష్టాగమోక్త ప్రకృష్ట శుభలక్షణ లక్షితంబులయి శుచిద్రవ్య రచితంబులయిన యవి మనుష్య స్థాపితంబులై యున్నయవి మానుషంబులు. వీనిలో స్వయంవ్యక్తంబులై యున్నయవి వికృతి మయంబులై యున్నను జాజ్వాతి శయంబునను బింబాభి రూప్యంబునను బ్రసన్నుండనై సాన్నిధ్యంబు వహింతు. మత్ప్రభావంబున నీస్వయం వ్యక్తాదులకు ద్వైతేర్థ (?) పాదయోజన మాత్ర క్షేత్రంబు పరమ పవిత్రంబునై యతిశయిల్లు"

— శ్రీరంగ 1–206

"వ. ప్రతిమారాధనంబు జేసి యొకవాసరంబు లేకయున్న మహా దోషంబు సంభవించు బ్రాయశ్చిత్తంబును వలయు నారునెల లెడపడిన బునః ప్రతిష్ఠావనంబు కర్తవ్యంబు తత్ప్రసాద కైంకర్యాదులొదవిన ప్రతివిధానం బవశ్య కర్తవ్యంబని తప్పరవేదులెన్ను దుర్నియమంబులన్నియు దివ్యసైద్ధ మాను షార్చనముల యందగాని భుక్తిముక్తి నిధానండైన స్వయంవ్యక్త ప్రధానంబైన శ్రీరంగంబునలేదు" — శ్రీరంగ 2–106

"తే.గీ. దారుధాతు శిలా నిర్మితంబులైన
యట్టి హరిబింబములను ధరాధినాథ
దివ్యదేశంబు లెరుగు మద్దేవుడందు
నిత్యసన్నిహితాత్ముడై నిలుచుగాన — శ్రీరంగ 4–126

అర్చామూర్తి స్వరూప విషయికములు అగు విశిష్టాద్వైత సంప్రదాయాలను ఈ విధంగ భైరవకవి శ్రీరంగమహత్త్వములో ప్రస్తావించాడు. విశిష్టాద్వైత సిద్ధాంతాలలోని పరస్వరూప, వ్యూహరూప, విభవ స్వరూప, అంతర్యామి, అర్చావతారాలు అనేవాటిలో భైరవకవి అర్చావతార వైశిష్ట్యాన్ని పెరీతిగ ప్రస్తావించి వివరించాడు.

వ్యూహరూపం : వ్యూహరూపం నాలువిధాలని విశిష్టాద్వైతం చెప్తుంది అవి వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ రూపాలు. వాసుదేవుడు అన్నిటికి కారణమైనవాడు. పదార్థాలన్నీకూడా వాసుదేవాంశాలే. జ్ఞాన, శక్తి, బల, ఆధిపత్య, వీర్య ప్రకాశాలు అనే షడ్గుణాలచేత వాసుదేవుడు పరిపూర్ణుడు. ఇతడు క్షేత్రజ్ఞుడు. ఇతనిని గాఢంగానమ్మి కర్మచేస్తే జీవుడు సఫలుడౌతాడు. ఇతడేఆత్మ. ఇతనిలో స్వరూపహాని లేక కైంకర్యపరుడై ఉండుటే మోక్షం అనబడుతుంది. ఇక సంకర్షణుడు వాసుదేవుని నుండి పుట్టాడు. ఇతడు జీవాధిపతి: ఇతనికి ఆద్యంతాలు లేవు. బుద్ధి జ్ఞాన బలాదికం చేత సంహారం చేస్తాడు. పంచభూతాలు, ఇంద్రియాలు, మనసు సంకర్షణునిలో ఇమిడి ఉంటాయి. సాత్వికాహంకారంవల్ల జనించాడు. ఇతడు మనసాధిపతి. ఐశ్వర్య వీర్య గుణాలతోకూడి సృష్టి ధర్మాలను చేస్తాడు. శక్తి తేజస్సులతో కూడిన వాడు. అహంకారాధిపతి అయిన అనిరుద్ధుడు ప్రద్యుమ్నుని నుండి కలిగాడు.

ఇది విశిష్టాద్వైత సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని విశిష్టాద్వైత సంప్రదాయాను సారంగ భైరవక వి వ్యూహరూపాన్ని శ్రీరంగ మహత్త్వములో సంక్షిప్తంగా చెప్పాడు. (శ్రీరంగ 4–124), వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్ర ప్రభావాన్ని గురించికూడ శ్రీరంగ మహత్త్వములో చెప్పబడింది.

వేదాంత దేశికులవారు "పాంచరాత్ర రక్షా" అనే విశిష్టాద్వైత గ్రంథంలో శ్రీవైష్ణవుల పంచకాల విధులను చెప్తూ ఇలా వ్రాశాడు.

శ్లో. ద్వాదశాక్షర తత్త్వజ్ఞ శ్చతుర్వ్యూహ విభాగవత్
అచ్ఛిద్ర పంచకాలజ్ఞ స్సతు భాగవతస్మృతః॥
— జయాఖ్య సంహిత

చతుర్వ్యూహ విభాగజ్ఞః పంచకాల పరాయణః
ద్వాదశాక్షర నిష్ఠోయ స్సవై భాగవతోత్తమః॥
— శాండిల్య వచనమ్

పాంచరాత్రాగమంలోని అహిర్బుధ్న్య సంహిత 62వ అధ్యాయంలో (విష్ణు నారాయణ వాసుదేవ మంత్రార్థనిరూపణమ్) 59 నుండి 86 వరకుగల శ్లోకాల్లో వాసుదేవ శబ్దాన్ని విపరించి వాసుదేవ మంత్రం చెప్పబడింది. పాంచరాత్రాగ మమైన పద్మసంహిత 24వ అధ్యాయంలో ద్వాదశాక్షర కల్పం ఉంది. ఇలా విశిష్టాద్వైత మతగ్రంథాల్లో ప్రముఖ్యంగ చెప్పబడిన ద్వాదశాక్షర మంత్ర మహిమ శ్రీరంగ మహత్త్వములో చెప్పబడింది. "ఓం నమో భగవతే వాసుదే వాయ" అనేది ద్వాదశాక్షర మంత్రం.

మ. నరులైనన్ సురలైన దైత్యవరులైనన్ సన్నుత ద్వాదశా
క్షర మంత్రైక పరాయణత్వమున నన్ సద్భక్తి సేవించినం
బరమైశ్వర్య సమగ్ర భోగ వితతిం బ్రాపించి సర్వోత్తర
స్థిర వైకుంఠ పదంబు జెందుదురు ప్రీతిం గర్మనిర్ముక్తులై
— శ్రీరంగ 1–211

## 5.11. పాంచరాత్రాగమ ప్రశంస :

విశిష్టాద్వైతులు పాంచరాత్రాగమాన్ని అనుసరిస్తారు. శ్రీరంగ మహత్త్వములో పాంచరాత్రాగమ ప్రశంస ఉంది. శ్రీరంగ క్షేత్రం పాంచరాత్రాగమ ప్రాధాన్యం కలది. కనుక శ్రీరంగ మహత్త్వములో కూడ పాంచరాత్రాగమం ప్రస్తావించబడింది. భగవానుడు ఈ క్రింది వాక్యాలను పలికాడు.

కం. ఏనరుడు పంచకాల విధానంబున నన్ను శాశ్వతము బూజించున్
వానికి నొసగుదు నమృత-స్థానమనిన నెన్నదేల తక్కిన పదముల్
— శ్రీరంగ 1-202

మరియు చతుర్థాశ్వాసంలోని ఈ క్రింది వచనంలోను పాంచరాత్రాగమ ప్రస్తావనం ఉంది—

వ. పాంచరాత్రాగమ ప్రపంచిత విధానంబున సావధానమానసుండై
యా భోగి తల్పు ననల్ప భవ్య దివ్యోపచారంబుల బూజించి
— శ్రీరంగ 4-137

## 5. 12. సాత్త్విక ధర్మ ప్రశంస :

విశిష్టాద్వైతంలో సాత్త్విక ధర్మానికి సముచిత స్థానం ఉంది. అట్టిసాత్త్విక ధర్మ ప్రశంస ఈ కృతిలో చేయబడింది—

"సకల ధర్మంబులందును సాత్త్వికంబు పరమధర్మం బిదియవలంబించి చరియించు నిర్మలాత్ములు మనోవాక్కాయ కర్మంబుల బరాత్ములగునెల్ల వారికి గురువులు" — శ్రీరంగ 3-268

శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యం, మూర్తి పూజాధికం, భాగవత ధర్మం, రహస్యత్రయ ప్రస్తావనం, వ్యూహస్వరూపం మొదలయిన విశిష్టాద్వైత సంప్రదాయానుగుణ వర్ణనలు శ్రీరంగ మహత్త్వములో చోటుచేసు కున్నాయి. కనుక భైరవకవి శైవుడై ఉండికూడ వైష్ణవద్వేషిగాక వైష్ణవ సంప్రదాయాలను ఎరిగి శ్రీరంగ మహత్త్వమును విశిష్టాద్వైత సమన్వయంగ రచించాడు.

విశిష్టాద్వైత ధర్మాలను సంప్రదాయాలను తెలిపే మరికొన్ని ఉదాహరణలు—

ఉ. అంచిత రంగ మండల మహాత్మ్యము వైష్ణవకోటి కింపు రె
ట్టించ లిఖించి యిచ్చిన బఠించిన విన్న ధరించినన్ జనుల్
సంచిత పుణ్యులై సకల సంపదలన్ వెనుపొంది కీర్తి ది
పించి సుఖించి పొందుదురు ప్రీతి ముకుంద పదస్థితిన్ దుదిన్
— శ్రీరంగ 1–134

సీ. దేవ తిర్యగ్జన స్థావరాత్మకభువ
నావలి లీలార్థమై రచింతు
నవి చేతనించుటకై సమస్తమునందు
జీవరూపమున వసించి యుందు
గర్మంబులకు లోనుగాక భూతావలి
బ్రసరింపజేయుదు బహు విధముల
దడను గ్రహార్థమాత్మ గతుండనై యుండి
జ్ఞాన రూపమున విజ్ఞానమడతు

గీ. తల్లిగతి హితకారినై తనరితిలల
దైలమును బోలె వ్యాపించి తమ్ముగూడి
యున్ననైనను సురలు నాయోజ యిట్టి
దని యెరుంగరు విపుల మోహాంధులగుచు — శ్రీరంగ 1-204

సీ. హరికి మ్రొక్కగ షడ్గుణైశ్వర్య సంపన్ను
నకు శాంతునకు బరునకు బరాత్ము
నకు నగణిత తేజునకు బరమేష్ఠ్యాత్ము
నకు బరమేశ్వరులకు ననంత
నిరుపమ భూత్యైక నిధికి బరాపరే
శునకు నచింత్య రూపునకు నాది
కర్తకు విశ్వభోక్తకు నక్షయానంద
మూర్తికి నిత్యతృప్తునకు నిత్య

గీ. శుద్ధునకు నీక దేవయీ సురపతియును
హరుడు నేను జరాచరోత్కరము నీవ
జగములన్నియు నీయందు సంభవించి
నీవ రక్షింపగా మను నీతజాక్ష — శ్రీరంగ 2-209

పై పద్యంలో భగవంతుడు విశిష్టాద్వైత సిద్ధాంతాలనుగుణముగ వర్ణింప బడ్డాడు.

తే. విష్ణు శక్త్యభిష్టమై విశ్వజగము
నొగి ప్రవర్తించు గాకున్న నుడిగిమఱుగు
నాత్మ దనుబాసి బోయిన యట్టి కుణప
మఱరి చేష్టింపజాలని యవ్విధమున — శ్రీరంగ 3-28

సీ. నిత్యు డక్షరు డాత్మ నిశ్చలు డవిది
సచ్చిదానంద భాస్వత్స్వరూపి
తతగుణాత్మకము నిత్యము సర్వకారణ
మును భూతకారణమును దనర్చి
పతగు నీ రెంటిలోపలి తారతమ్యంబు
నరసి చూచిన మహదంతరంబు
ప్రకట తేజస్తమః పటలంబునకు బోలె
బరగు వీనికి పరస్పర విరోధ

గీ. మమల మగునాత్మ ప్రకృతి సంగమముజేసి
కర్మ వశుడై స్వతంత్రుడుగాక పొందు
నమర దేహాదులందు దుఃఖమును సుఖము
గాన కర్మక్షయము సేత కార్యమనఘ — శ్రీరంగ 5-122

## 5.13. శ్రీరంగమహత్త్వములోని కథలు-విశిష్టాద్వైత దృక్పథం:

చోరుని కథ :-

శ్రీరంగ మహత్త్వములో చతుర్థాశ్వాసంలో చోరునికథ ఉంది. చోరుడు దారులుకొట్టి ధనాన్ని దోచేవాడు. అతడు ఒక బ్రాహ్మణుడు చెప్పిన తెరువున

శ్రీరంగాన్ని చేరి రంగనాధుని దర్శించి అక్కడి భూతవరులకు అనుచరుడ య్యాడు. ఎంతో పాపిష్టి అయిన ఆ చోరుడు శ్రీరంగనాధుని గురించిన సంభాషణంవల్ల దర్శనంవల్ల రంగనాధుని అనుచరులలో ఒకడయ్యాడు. ఆళ్వారులలో తిరుమంగై యాళ్వారులు కూడ చోరుడే. అయినాకూడా అతడు రంగనాధుని భక్తుడు. కనుక పరమపూజ్యుడయ్యాడు. ఆళ్వారులలో ఒకడయ్యాడు చోరుడుకూడ పాపిఅయిఉండి రంగనాధుని దర్శనంవల్ల రంగేశ భూతవరులకు అనుచరుడయ్యాడు, ఎంతటి పాపి అయినాకూడ వైష్ణవ సంభాషణం దర్శనం మొదలైనవాటివల్ల పూతుడు ఔతాడనె విశిష్టాద్వైత దృక్పథం ఈ చోరునికథలో వ్యక్తమౌతుంది.

చిత్రసేనునికథ :— ఇంద్రసఖుడైన చిత్రసేనుడు అనే గంధర్వుడు సురాపానమత్తుడై తోటివారితో గగనవీధిలో వెళుతూ శ్రీరంగ విమానచ్ఛాయను లంఘిస్తాడు, అందువల్ల అతడుచ్యుతుడై తేజోహీనుడై పడిపోతాడు. ఈకథలో భగవద్రామానుజులవారు చెప్పిన ధర్మాలు సమన్వయం ఔతాయి. ఆ ధర్మ సూత్రాలు ఇవి— "విష్ణువు సన్నిధి యందును వైష్ణవ సన్నిధి యందును కాళ్ళుసాచుకొని యుండరాదు. ఇతిగాక విష్ణువుయొక్కయు వైష్ణవులయొక్క యునింటి తట్టును కాళ్ళుసాచుకొని నిద్రపోగూడదు. వైష్ణవులయొక్క దేహచ్ఛాయను ఎప్పటికిని దాటరాదు. తన దేహచ్ఛాయ స్పర్శయును వారి దేహచ్ఛాయకు కలిగింపరాదు. వైష్ణవం ఇలాంటి ధర్మ నియమాలను కలిగి అనాదినుండి ప్రవర్తిల్లింది. చిత్రసేనుని కథ ఈ ధర్మనియమంతో సమన్వయమౌతుంది.

చిక్లితుని కథ :— పూర్వం చిక్లితుడు అనే విప్రుడు విష్ణువునుగురించి ఘోరతపస్సు ఆచరిస్తాడు. విష్ణువు ప్రత్యక్షమౌతాడు. చిక్లితుడు "వేదపఠనం చేసే కోరిక ఉంది. ఆ వరాన్ని ఇవ్వ"మని వేడుకుంటాడు. అందుకు విష్ణువు "భూసురా! వేదాలన్నికూడ పారము ముట్టగా ఎరుగునట్లు నీకు వరమిచ్చాను. కాని విద్యాధి దేవత అయిన సరస్వతిని సేవించు. ఆమెనీకు సమస్తం అనుగ్రహిస్తుంది." అని చెప్పి విష్ణువు అంతర్ధానుడు ఔతాడు. ఆ తర్వాత అతడు సరస్వతిని ఆరాధించి ప్రత్యక్షం చేసుకుంటాడు, అమె అతని కోరికను అడిగి అక్కడ ఉండే నాలుగు పక్షులను చూపి ఇవి ఇప్పుడు నాముందర ఉమ్మి

వేసిన దానిని నమలమని చెప్తుంది, అతడు అలాగే ఉచ్ఛిష్టాన్ని గ్రహించి అభీష్టాన్ని పొందుతాడు. "సర్వపాప హరమును పావనమునైన విష్ణువు ప్రసాదమునకు నెంగిలి దోషమునుగూడ దలపరాదు" అని రామానుజులవారి జీవిత ఘట్టాలు ఉపదేశిస్తున్నాయి. ఇలాంటి విశిష్టాద్వైత ధర్మసూత్రం చిక్లితుని కథయందు సమన్వయమౌతుంది. విష్ణువు—సరస్వతి—పక్షులు—ఉచ్ఛిష్ఠం ఇలా అది విష్ణు ప్రసాదం, విష్ణువరం.

ఇలా శ్రీరంగ మహత్త్వములోని కథలు విశిష్టాద్వైత ధర్మాలతో చక్కగా సమన్వయమౌతున్నాయి.

ఫలితాంశం : భైరవకవి రాచకొండ సంస్థానంవాడు. రాచకొండ సంస్థానం వేదాంత దేశికుల కుమారుని వలన విశిష్టాద్వైత ప్రభావానికి గురిఅయిన ప్రాంతం. భైరవకవి ఆ ప్రాంతంవాడు కనుక భైరవకవిపై కూడ విశిష్టాద్వైత ప్రభావం ఉంటుంది. శ్రీరంగ మహత్త్వము వైష్ణవ కావ్యం. శ్రీరంగ మహత్త్వ కృతిభర్త వైష్ణవుడు. కనుక శ్రీరంగ మహత్త్వము విశిష్టాద్వైత సమన్వయంగ రచింపబడినది.

—)( సమాప్తం )(—



# సంప్రదించిన గ్రంథాలు

## తెలుగు :

అమలనాదిపిరాన్ (తెలుగువ్యాఖ్య) : శ్రీగోదాగ్రంథమాల ముసునూరు 1979

ఆంధ్రకవితరంగిణి (4,5,10 సంపుటాలు): చాగంటి శేషయ్య హిందూధర్మ శాస్త్రగ్రంథనిలయము కపిలేశ్వరము

ఆంధ్రకవి సప్తశతి : బులుసు వేంకటరమణయ్య వెల్డన్‌ప్రెస్–మద్రాసు 1956

ఆంధ్రకవులచరిత్రము (ప్రథమభాగం): కందుకూరి వీరేశలింగం మనోరమా ముద్రాక్షరశాల రాజమహేంద్రవరము 1917

ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము : చెలమచెర్ల రంగాచార్యులు శివాజీ ప్రెస్, సికింద్రాబాదు 1967

ఆంధ్ర భాగవత విమర్శ : డా॥ ప్రసాదరాయకులపతి

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము, కే. వేంకటనారాయణరావు వావిళ్ల ప్రచురణ. మద్రాసు 1936.

ఆంధ్ర వాఙ్మయ సూచిక : కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు ఆంధ్రపత్రిక కార్యాలయము మద్రాసు 1929

ఆంధ్ర మహాభారతము : కవిత్రయము. వావిళ్ల ప్రచురణ

ఆంధ్రమహాభారతము-ఛందః శిల్పము : పాటిబండ మాధవశర్మ

ఆంధ్రసాహిత్యము చమత్కారవైభవము: పొన్నికంటి హనుమంతరావు మారుతిబుక్‌డిపో, గుంటూరు 1982

ఆముక్తమాల్యదా కావ్య సౌందర్యము : డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు మలయమారుత ప్రచురణలు తిరుపతి 1971

ఆళ్వారుల దివ్య వైభవము : తిరువాయిపాటి రాఘవయ్య తి. తి. దేవస్థానము తిరుపతి 1980.

ఏకాదశీ మాహాత్మ్యము : ప్రౌఢకవి మల్లయామాత్య. శ్రీనికేతన ముద్రాక్షరశాల చెన్నపట్టణము 1899

ఋతు సంహిత : మేడవరం వేంకట నారాయణశర్మ 1966

కథలు-గాథలు (ద్వితీయభాగం) : తిరుపతి వేంకటకవులు, వేంకటేశ్వర పబ్లికేషన్స్ కడియము 1959

కవిగజాంకుశము : భైరవకవి (1)వావిళ్ల ప్రచురణ 1950

(2) శ్రీరంగమహత్త్వమున అనుబంధముగ ప్రచురితమైనది ఆం.సా. అకాడమీ హైదరాబాదు-1979.

కవి జనాశ్రయము : మల్లియరేచన.

కవి సమయములు : డా॥ ఇరివింటి కృష్ణమూర్తి యువభారతి, సికింద్రాబాదు 1987

కుమార సంభవము : నన్నెచోడ కవిరాజు, తెలుగు విశ్వ విద్యాలయ ప్రచురణ 1987

గీరతము : తిరుపతి వేంకటకవులు, వేంకటేశ్వర పబ్లికేషన్స్ కడియము-1954

గుణరత్నకోశము (సువర్ణకుంచికవ్యాఖ్య): తిరుమలై నల్లాన్ రామకృష్ణ అయ్యంగార్, శింగంచెట్టి యతీంద్రులుచెట్టి చారిటీసు: మద్రాసు-1957

ఘటికాచల మాహాత్మ్యము : తెనాలి రామకృష్ణకవి, ఆం సా. అకాడమి. హైదరాబాదు ద్వి.ము. 1969

ఛందో దర్పణము : అనంతామాత్యుడు, వావిళ్లప్రచురణ

చరిత్రకెక్కని చరితార్థులు : డా॥ బి. రామరాజు 1985

జైమినిభారతము-సంశోధనాత్మక పరిశీలనము : డా॥ ముదిగొండ వీరేశలింగం 1983.

తిరునామములు-సమగ్ర పరిశీలనము : డా॥ కిడాంబి నరసింహాచార్య

తిరుపతి క్షేత్ర చరిత్ర : తాంపల్లి నాగభూషణం

తెలుగుకవుల సంస్కృత ప్రయోగాలు : డా॥ జాస్తి సూర్యనారాయణ. 1981

తెలుగు కావ్యావతారికలు : జి. నాగయ్య వేంకట్రామ అండ్ కో, విజయవాడ 1968.

తెలుగులో చిత్రకవిత్వము : డా॥గాదే ధర్మేశ్వరరావు, రాజ్యలక్ష్మి పబ్లిషర్స్, అమరావతి-1986.

తెలుగుదండకవాఙ్మయము (అముద్రితం): వైద్యం వేంకటేశ్వరాచార్యులు కర్నూలు-1986.

లుగు భాషలో ఛందోరీతులు : రావూరి దొరసామిశర్మ 1962

లుగులో వైష్ణవక్షేత్ర మాహాత్మ్యకావ్యములు: డా॥ వి. కళావతి.
శ్యామలా పబ్లిషర్స్-తిరుపతి 1988.

వ్యసూరి హృదయము : మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లు
తెనాలి-1982.

ివాలయములు తత్త్వవేత్తలు : వి.టి. శేషాచార్యులు తి.తి. దేవస్థానం
తిరుపతి-1985.

ివనాథ చరిత్ర : గౌరన, ఆం.సా. అకాడమి
హైదరాబాదు-1984.

నృసింహ పురాణము : ఎఱ్ఱన. ఆం.సా. అకాడమి.
హైదరాబాదు-1967.

పద్మపురాణము : కామినేని మల్లారెడ్డి, దోమకొండ
సంస్థాన ప్రభువులచే ప్రచురితము.

పాండురంగ మాహాత్మ్యము : తెనాలి రామకృష్ణకవి

పూర్వాచార్య చరిత్రము : మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లు.

పోతన : నిడుదవోలు వేంకటరావు
నేషనల్ బుక్‌ట్రస్టు 1962

ప్రకృతికాంత : డా॥ రేవూరి అనంత పద్మనాభరావు
కడప-1977.

ప్రథమాంధ్ర మహాపురాణము ప్రబంధ
కథామూలము : డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం 1973.

ప్రబంధమణి భూషణము : సం॥ నిడుదవోలు వేంకటరావు
ఆం.సా. అకాడమి. హైదరాబాదు 1971

ప్రబంధ రత్నావళి : సం॥ వేటూరి ప్రభాకరశాస్త్రి
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు 1976

బాల వ్యాకరణము : పరవస్తు చిన్నయసూరి

భాగవతము : బమ్మెర పోతన వావిళ్ల ప్రచురణ

భాస్కర రామాయణము : భాస్కరాదులు ఆం.ప్ర.సాహిత్య
అకాడమి-1969.

ముముక్షుప్పడి-సాంద్ర ద్రావిత వ్యాఖ్యానము : కందాళై శేషాచార్యులు, వేదాంత ముద్రాక్షరశాల మద్రాసు-1927
యయాతి చరిత్రము : పొన్నికంటి తెలగన్న. వావిళ్ల ప్రచురణ, మద్రాసు.
రత్నపరీక్ష : భైరవకవి వావిళ్లప్రచురణ,మద్రాసు
రాచకొండ చరిత్ర : శేరాల సత్యనారాయణశర్మ విజయభారతి నిలయం-నల్లగొండ 1970
లక్షణ శిరోమణి : పొత్తపి వెంకటరమణ కవి ఆంప్ర.సా. అకాదమి, హైదరాబాదు-1979
లక్షణసార సంగ్రహము : చిత్రకవి పెద్దనార్యుడు, ఆం.సాహిత్య పరిషత్తు, కాకినాడ-1940.
వసుచరిత్రము. సవ్యాఖ్య : రామరాజ భూషణుడు వావిళ్ల ప్రచురణ-మద్రాసు.
వాసిష్ఠ రామాయణము : మడికి సింగన్న
విజ్ఞాన సర్వస్వము (4,7 సం) : తెలుగు భాషా సమితి ప్రచురణ
విశిష్టాద్వైత పూర్వాపర సారసుధ : కే. నరసింహాచార్యులు
వైష్ణవాంధ్ర వాఙ్మయము : వేటూరి అనంతమూర్తి 1986
శ్రీకాళహస్తి మాహాత్మ్యము : ధూర్జటి. వెంకట్రామ అండ్ కో విజయవాడ-1961
శ్రీపాంచరాత్రం : చామర్తి కూర్మాచార్యులు తి.తి.దేవస్థానము, తిరుపతి-1988
శ్రీమద్భాగవతాను శీలనము : డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి
శ్రీమద్రామానుజ చరిత్రము : సరస్వతి రంగాచార్యులు మద్రాసు-1903.
శ్రీరంగ మహత్త్వము : భైరవకవి (1) పరిష్కర్త: మానవల్లి రామకృష్ణకవి జ్యోతిష్మతి ముద్రాక్షరశాల చెన్నపురి 1912. (2) సం॥ శ్రీరంగాచార్య ఆం.ప్ర.సా. అకాదమి హైదరాబాదు-1979. (3) తాళపత్ర

ప్రతి (అసమగ్రము) నెం: 7633. శ్రీవెంకటేశ్వర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము తిరుపతి. (4) కాగితపు లిఖిత ప్రతి (అసమగ్రం)

Vol $\frac{207}{20}$ 46[illegible]4 & $\frac{205}{20}$ 4634 ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారము కాకినాడ.

శ్రీరంగ మాహాత్మ్యము : విజయరంగ చొక్కనాథ నాయకుడు, SVORI తిరుపతి-1988.

శ్రీ విష్వక్సేన పూజా విధానము : ప్రకాశకులు: శ్రీరామానుజ వాణి సీతానగరం. 1988

సకల నీతి సమ్మతము : మడికిసింగన ఆం.ప్ర.సా. అకాడమి హైదరాబాదు 1970

సమగ్ర ఆంధ్రసాహిత్యము 1-10 సంపుటాలు: ఆరుద్ర (పునర్ముద్రణ) ప్రజాశక్తి బుక్‌హౌస్ విజయవాడ.

సంస్కృత వాఙ్మయచరిత్ర (లౌకిక వాఙ్మయము): మల్లాది సూర్యనారాయణశాస్త్రి ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు.

సులక్షణసారము : లింగమగుంట తిమ్మకవి,

సూర్యరాయాంధ్ర నిఘంటువు : ఆం.ప్ర.సా. అకాడమి హైదరాబాదు

స్తోత్ర రత్నములు : తి.తి. దేవస్థానము, తిరుపతి 1969

హరివంశము : ఎఱ్ఱన

హరిశ్చంద్రో పాఖ్యానము : గౌరన ఆం.ప్ర.సా. అకాడమి హైదరాబాదు 1967

హిందూ మత ప్రవేశిక : డా॥ కే. సీతురామేశ్వరదత్త తి.తి. దేవస్థానము, తిరుపతి 1985

## సంస్కృతము :

గరుడ పురాణమ్ (16 అధ్యాయములు) : వావిళ్ల ప్రచురణ 1951

గరుడ పురాణమ్ (108 ,, ) : విఖ్యాతతరంగిణీ ముద్రాక్షరశాల మైసూరు-1895

చంద్రాలోకమ్ (సవ్యాఖ్య ) : జయదేవకవి

మేఘదూత (మల్లినాథ వ్యాఖ్య) : కాళిదాసు

విశ్వగుణా దర్శచమ్పూ : వేంకటాధ్వరి వావిళ్లప్రచురణ 1935

సువృత్త తిలకం : క్షేమేంద్రుడు